Kitab-us-Soum (Telugu)

# كتابُ الصّوم

(مشكوٰة المصَابيح)

# ఆత్మ ప్రక్షాళనం

# రోజా

## (మిష్కాతుల్ మసాబీహ్)

రచన

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మ)

సంకలనం

హాఫీజుర్రహ్మాన్ అహ్సన్

తెలుగు అనువాదం

సయ్యద్ హుసైన్

# విషయ సూచిక


సంకలనకర్త మనవి 11
మిష్కాతుల్ మసాబీహ్ 14
తొలి పలుకులు 17
**ఉపవాసాల పుస్తకం 21**
రమజాన్ – పుణ్యాల వసంత రుతువు 21
ఉపవాసులకు స్వర్గంలో ఒక ద్వారం ప్రత్యేకించబడింది 24
పాపాలన్నింటి మన్నింపు సాధనం 25
రోజా ప్రతిఫలానికి ఎలాంటి హద్దూ లేదు 27
రోజా శ్రేష్ఠత, గొప్పదనం అసాధారణమైనది 28
ఉపవాసి కొరకు రెండు ఆనంద ఘడియలు 28
రోజా చెడులను ఎదుర్కొనే డాలు వంటిది 30
నరకం నుంచి విముక్తినొందే మాసం 31
షైతాన్ ఎందుకు బంధించబడతాడు? 32
రమజాన్ పిలుపు 32
నరకాగ్ని నుంచి విడుదలయ్యేవారు 33
వెయ్యి నెలలకన్నా శ్రేష్ఠమైన రాత్రి 33
ఈ రేయిలోని మేలుకు దూరంగా వున్నవాడు నిష్ఫలుడే అయ్యాడు 35
రోజా, ఖుర్ఆన్ దైవదాసుని కొరకు సిఫారసు చేస్తాయి 36
లైలతుల్ ఖద్ర్ (ఘనమైన రేయి)ని పోగొట్టుకుంటే సర్వాన్నీ పోగొట్టుకున్నట్లే 37
కారుణ్యం, క్షమాభిక్ష, మోక్షాల మాసం 39
రమజాన్ కాలంలో ఈ తేడా ఎందుకు? 42
రమజాన్‌లో సహనానికి జరిగినంత అభ్యాసం మరే సందర్భంలోనూ జరగదు 43
రమజాన్ మాసంలో ప్రవక్త (స) గారి ప్రేమకు, దాతృత్వానికి రెండు ఉదాహరణలు 47
స్వర్గం ఒక రమజాన్ తరువాత మరో రమజాన్ వచ్చే వరకు ఎడతెగకుండా ముస్తాబు చేయబడుతుంది 49

రమజాన్ చివరి రాత్రి ముస్లిం సమాజానికి క్షమాభిక్ష లభిస్తుంది 50

**చంద్ర దర్శన అధ్యాయం** **52**

రమజాన్ ప్రారంభం, ముగింపు నెలవంక దర్శనంతో ముడిపడి ఉంది 52

షాబాన్ 29 నాడు నెలవంక కన్పించకపోతే
షాబాన్ నెల 30 రోజులుగా పూర్తిచేయండి 54

ఇస్లామీయ ధార్మిక ఆరాధనలకై చాంద్రమానాన్ని
పాటించడంలో వున్న యుక్తి 56

రమజాన్, జిల్‌హజ్జహ్ (పుణ్యం, ఘనతల రీత్యా) ఏనాడూ కొరత లేనివి 60

రమజాన్ నెలకు ఒకటి లేదా రెండు రోజుల ముందు
ఉపవాసం ఉండకూడదు 60

షాబాన్ నెల సగం గడిచాక రోజాలు ఉండరాదు 63

రమజాన్ కొరకు షాబాన్ నెలపొడుపును చూసేందుకు ఆదేశం 63

దైవప్రవక్త (స) షాబాన్ మరియు రమజాన్ ఉపవాసాలను
ఎడతెగకుండా పాటించేవారు 64

అనుమానంతో రోజాను పాటించటం ధర్మసమ్మతం కాదు 65

నెలవంక దర్శనానికి మోమిన్ (విశ్వాసి) సాక్ష్యమే ఎన్నదగినది 66

రమజాన్ నెలవంక విషయమై ఒక్క ముస్లిం సాక్ష్యం సరిపోతుంది 69

దైవప్రవక్త (స) షాబాన్ నెల తేదీలను తెలుసుకునేందుకు
ఏర్పాట్లు చేసేవారు 70

ఒక నెల గడువు రెండవ నెల చంద్రుడు కన్పించే వరకు ఉంటుంది 71

**అధ్యాయం** **74**

సహరీ చేయటంలో శుభం 74

ఇస్లామీయ ఆరాధనల ఉద్దేశం - శిక్షణ, ఆత్మశుద్ధి 75

ఇస్లాంలో ఆరాధనల ఉద్దేశం పూర్తిగా భిన్నం 75

సహరీ భుజించటంలో గల శుభం? 76

గంధవహులు - ముస్లింల ఉపవాసాలలో భేదం 77

ఇఫ్తార్ తొందరగా చేయటంలో మేలు ఉంది 77

ఇస్లాం చెడును ఆరంభంలోనే నిరోధిస్తుంది 78

రోజా విరమణకు సరియైన సమయం 79

ఎడతెగకుండా రోజా ఉండటం ధర్మసమ్మతం కాదు 80

రోజా పాటించటానికి సంకల్పం తప్పనిసరి 81
సహరీ సమయంలో ఒకింత సడలింపు ఉంది 82
ఇఫ్తార్‌లో తొందరపడేవారు అల్లాహ్‌కు ప్రీతిపాత్రులు 84
ఇఫ్తార్ కొరకు శ్రేష్ఠమైన వస్తువులు 84
ఇఫ్తార్ చేయించేవారికి లభించే పుణ్యం 85
ఇఫ్తార్ వేళ చేయాల్సిన మంచి దుఆలు 86
ఇఫ్తార్‌లో తాత్సారం చేయటం యూదులు, క్రైస్తవుల విధానం 88
ఇఫ్తార్ చేయటంలో, నమాజ్ ఆచరించటంలో
తొందరపడటం సున్నత్ 90
సహరీ ఆహారం శుభకరమైనది 92
ఉత్తమమైన సహరీ ఖర్జూరం 93
**రోజా పరిరక్షణ కోసం ... 94**
రోజా ఉద్దేశ్యం తఖ్వా (దైవభీతి) తప్ప పస్తులుండటం కాదు 95
అబద్ధంపై ఆచరించటమంటే అర్థం ఏమిటి? 95
రోజా స్థితిలో భార్యతో కలిసిమెలసి వుండే హద్దులు 96
లైంగిక అశుద్ధావస్థలోనూ రోజా ప్రారంభించవచ్చు 97
ఇహ్రామ్ ధరించిన స్థితిలో, రోజా స్థితిలో పచ్నా
(దేహం నుండి చెడురక్తం తీయటానికి) వేయటానికి అనుమతి 98
మరచిపోయి తినటం, త్రాగటం వలన రోజా భంగం కాదు 99
బుద్ధిపూర్వకంగా రోజాను భంగం చేసినదాని కప్ఫారా (పరిహారం) 100
రోజా స్థితిలో భార్యతో కలసిమెలసి ఉండటం గురించి 104
దానంతట అదే వాంతి అయినప్పుడు రోజా భంగం కాదు 106
వాంతి అయినట్లయితే నఫిల్ రోజాను విరమించుకోవాలి 106
రోజా స్థితిలో మిస్వాక్ చేయటం అభిలషణీయమే 107
రోజా స్థితిలో సుర్మా పెట్టవచ్చా? 107
రోజాలోని తీవ్రతను తగ్గించటానికి స్నానం చేయటం,
తలపై నీళ్ళు చల్లుకోవటం సమ్మతమే 108
రోజాలో వున్నప్పుడు పచ్నాలు (శరీరంలో చెడురక్తాన్ని
బయటికి తీసే పద్ధతి) వేయించటం 109

జీవితాంతం ఉండే రోజాలు, రమజాన్‌లోని ఒక్క రోజాకు
కూడా సాటిరావు 110

అసలు ఉద్దేశం రోజా బాహ్యరూపం కాదు, కావలసింది
దాని వాస్తవ ఊపిరి 111

మూడు చర్యల వల్ల రోజా భంగం కాదు 113

రోజాలో పచ్నాలు వేయించుకోవటానికి షరీఅత్ రీత్యా తగు కారణం 114

రోజాలో పచ్నాలు వేయించే విషయంలో హజ్రత్ అబ్దుల్లాహ్
బిన్ ఉమర్ (రజి) గారి ఆచరణ 115

పుక్కిలించిన పిదప ఉమ్మిని మింగటం, ఏదైనా చెట్టు బంక లేదా గుగ్గిలం
చెట్టు బంక వగైరా నమలటం గురించి సమస్య 115

**పయాణీకుని రోజా** **118**

ప్రయాణంలో ఉన్నప్పుడు రోజా పాటించినా, లేక
పాటించకపోయినా రెండూ అనుమతించబడినవే 118

ప్రయాణంలో రోజా పాటించేవారు, పాటించనివారు ఒకరింకొకరిపై
అభ్యంతరం తెలుపరాదు 120

భరించశక్యం కాకపోతే ప్రయాణంలో రోజా పాటించవద్దు 121

ప్రయాణం కష్టమని తోచినప్పుడు రోజా పాటించకపోవటమే శ్రేయస్కరం 122

గత్యంతరం లేని పరిస్థితుల్లో రోజా ముందుగానే
విడవటానికి అనుమతి వుంది 124

ప్రయాణీకుడు, పాలు త్రాపించే స్త్రీ, గర్భవతికి రోజా
విడిచిపెట్టే అనుమతి ఉంది 126

ప్రయాణంలో కష్టాలు ఎదురవకపోతే రోజా పాటించాలి 127

మక్కా విజయం నాటి ప్రయాణంలో ప్రవక్త (స) ఇఫ్తార్ చేసిన సంఘటన 129

ప్రయాణంలో (క్లిష్టతర పరిస్థితి ఎదురయ్యే అనుమానముంటే)
రోజా వుండటం భావ్యం కాదు 130

ప్రయాణంలో రోజా విడిచిపెట్టే అనుమతి అల్లాహ్‌చే ప్రసాదించబడిన
ఒక వెసులుబాటు 131

**ఖజా అధ్యాయం** **133**

రమజాన్ ఖజా రోజాలను షాబాన్ నెల మొదటి పదిహేను
రోజుల చివర్లో కూడా పాటించవచ్చు 133

నఫిల్, ఖజా రోజాలు పాటించే ముందు భార్య, భర్త అనుమతి తీసుకోవాలి 134
బహిష్టు అయిన స్త్రీ రోజాను ఖజా చేసుకోవటం తప్పనిసరి అవుతుంది, కాని నమాజులను కాదు 135
మరణించిన మనిషికి చెందిన ఖజా రోజాలు అతని సంరక్షకుని బాధ్యతగా మారతాయా? 137
మరణించిన వ్యక్తి ఖజా రోజాలకు బదులుగా నిరుపేదలకు భోజనం పెట్టే విషయం 138
ఎవరైనా ఒక వ్యక్తి ఇతరులకు బదులు రోజా పాటించటం గానీ, ఇంకా నమాజ్ ఆచరించటం గానీ చేయలేదు 139
**స్వచ్ఛంద రోజాల అధ్యాయం 141**
ప్రవక్త (స) అన్ని నెలలకన్నా ఎక్కువగా నఫిల్ రోజాలను షాబాన్ నెలలో పాటించేవారు 141
రమజాన్‌లో తప్ప దైవప్రవక్త (స) ఇతర నెలల్లో పూర్తి నెల రోజులు రోజా పాటించేవారు కారు 143
షాబాన్ నెల చివరి రెండు రోజుల ఉపవాసం గురించి 143
ముహర్రం నెలలోని రోజాలు ఇంకా తహజ్జుద్ నమాజ్ ప్రాశస్త్యం 145
ఆషూరా (ముహర్రం 10వ తేదీ) రోజాలోని శ్రేష్ఠత 148
ఆషూరాతో పాటు 9 లేదా 11వ తేదీ ఉపవాసాన్ని కూడా కలుపుకోవాలి 149
అరఫా (జిల్‌హజ్జహ్ 9వ తేదీ) రోజా గురించి 150
ప్రవక్త (స) జిల్ హజ్జహ్ నెలలోని మొదటి పది రోజుల ఉపవాసాన్ని ఎన్నడూ పాటించలేదు 151
నఫిల్ రోజాలు పాటించే మస్నూన్ పద్ధతి 152
సోమవారం నాటి రోజా ప్రాశస్త్యం 157
ప్రతి నెలా మూడు రోజులు నఫిల్ రోజాలు పాటించడం ప్రవక్త (స) సంప్రదాయం 158
రమజాన్ రోజాలతో పాటు షవ్వాల్ నెల ఆరు రోజుల రోజా పాటించిన వ్యక్తి ఎల్లప్పుడు రోజా పాటించిన వానితో సమానం 159
ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్‌హా నాడు ఎలాంటి రోజా లేదు 159
అయ్యామె తష్రీఖ్‌లో రోజా పాటించటం సముచితం కాదు 160

జుమా రోజును ఉపవాసం కొరకు ప్రత్యేకించుకోవటం సమ్మతం కాదు 161

శుక్రవారం రాత్రిని జాగరణకు, పగటిని
రోజా పాటించడానికి ప్రత్యేకించుకోవటం సముచితం కాదు 162

దైవమార్గంలో ఒక రోజు రోజా పాటించటం వల్ల అసాధారణ
పుణ్యం ప్రాప్తిస్తుంది 165

నఫిల్ ఆరాధనల్లో మధ్యేమార్గం 167

సోమ, గురువారాల నఫిల్ రోజాల శ్రేష్ఠత 171

సోమవారం, గురువారం రోజుల శ్రేష్ఠత 172

ప్రతి నెల 13, 14, 15వ తేదీల్లో రోజా ఉండే సూచన 172

ప్రవక్త (స) ప్రతి నెలా ప్రారంభంలో మూడు రోజుల
ఉపవాసం పాటించేవారు 173

నఫిల్ రోజాల విషయంలో ప్రవక్త (స) మరో పద్ధతి 175

నఫిల్ రోజాల విషయమై హజ్రత్ ఉమ్మె సలమా (ర.అ)కు
ప్రవక్త (స) హితవు 176

ఏ వ్యక్తి సదా రోజా పాటించినట్లు? 177

అరఫాత్ మైదానంలో అరఫా నాటి రోజా పాటించటం సముచితం కాదు 179

శనివారం రోజు రోజా పాటించటం సముచితం కాదు 180

దైవమార్గంలో ఒక రోజు రోజాకు కూడా అసాధారణ పుణ్యం 181

చలికాలంలోని రోజా తేరగా లభించిన 'ప్రాప్తి' 182

ఆషూరా (ముహర్రం 10వ తేదీ) నాటి రోజా హజ్రత్
మూసా (అ) గారి సంప్రదాయం 183

దైవప్రవక్త (స) తరచూ శని, ఆదివారాలు రోజా పాటించడంలోని విజ్ఞత 184

రమజాన్ రోజాలను ఫర్జ్ గావించబడక ముందు మహాప్రవక్త (స)
ఆషూరా నాటి రోజాను పాటించమని తాకీదు చేసేవారు 185

నాలుగు పనులను ప్రవక్త (స) ఎన్నడూ విడనాడలేదు 186

ప్రవక్త (స) "అయ్యామె బైజ్" రోజాలను ప్రత్యేకంగా పాటించేవారు 187

రోజా శరీరం తాలూకు జకాత్ 188

సోమవారం, గురువారం నాటి నఫిల్ రోజాల శ్రేష్ఠత 189

దైవప్రీతి కొరకు ఒక రోజు రోజా పాటించిన దాని శ్రేష్ఠత 191

**అధ్యాయం** **193**
నఫిల్ రోజాలో వేళకంటే ముందు ఇఫ్తార్ చేసే విషయంలో
ప్రవక్త (స) గారి రెండు ఆచరణలు 193
నఫిల్ రోజాను ఖజా చేసుకోవటం 194
భోజనానికి ఎవరైనా ఆహ్వానిస్తే అంగీకరించటం మంచి పద్ధతి 195
నఫిల్ రోజా పాటిస్తున్నప్పుడు నిర్ణీత సమయానికి
ముందే ఇఫ్తార్ చేయవచ్చు 196
నఫిల్ రోజాను ఖజా చేయటం 198
నఫిల్ రోజా పాటించేవారి శ్రేష్ఠత 199
నఫిల్ రోజాకు లభించే పుణ్యం 200
**లైలతుల్ ఖద్ర్ (ఘనమైన రేయి) అధ్యాయం** **202**
లైలతుల్ ఖద్ర్ రమజాన్ చివరి దశకంలోని బేసి రాత్రులలో ఉంది 202
లైలతుల్ ఖద్ర్ విషయంలో గౌరవనీయులైన సహాబా (రజి) కన్న కల 203
లైలతుల్ ఖద్రను రమజాన్ చివరి దశకంలోని
బేసి రాత్రుల్లో వెదకాలని హితవు 205
లైలతుల్ ఖద్రను వెదకటానికి ప్రవక్త (స) పూర్తి రమజాన్ మాసం
ఏతికాఫ్‌లో గడిపిన సంఘటన 206
రమజాన్ 27వ రాత్రినే లైలతుల్ ఖద్ర్ కావచ్చు అన్న
విషయమై ఓ ఉల్లేఖనం 209
చివరి దశకంలో దైవప్రవక్త (స) ఆరాధనలు పాటించటంలో
చూపే శ్రద్ధాసక్తులు 211
రమజాన్ చివరి దశకంలో ప్రవక్త (స) ఆరాధనలు 211
లైలతుల్ ఖద్ర్ దుఆ 211
లైలతుల్ ఖద్రను రమజాన్ చివరి దశకంలోని బేసి
రాత్రుల్లో వెదకాలని హితవు 212
లైలతుల్ ఖద్ర్ ప్రతి రమజాన్‌లో ఉంటుంది 212
హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉనైస్ గారికి ప్రతి నెలా 23వ తేదీ రాత్రి
మస్జిద్-యె-నబవీలో గడిపేందుకు హితవు 213
ప్రవక్త (స)గారికి మొదటి లైలతుల్ ఖద్ర్ విషయం ముందు తెలుపబడింది 214
తనకు విధేయులైన దాసులపై అల్లాహ్ గర్విస్తాడు 215

**ఏతెకాఫ్ అధ్యాయం** **217**

ఏతెకాఫ్‌లో దైవప్రవక్త (స) గారి సంప్రదాయం 217
రమజాన్‌లో ప్రవక్త (స) ఎడతెగని దానధర్మాలు,
జిబ్రీల్ (అ)తో పాటు ఖుర్‌ఆన్ పారాయణం 218
జిబ్రీల్ (అ) ప్రతి సంవత్సరం రమజాన్‌లో ప్రవక్త (స)కు
ఖుర్‌ఆన్ విన్పించేవారు 219
ఎంతో అవసరమైతే తప్ప ఏతెకాఫ్ పాటిస్తున్న సమయంలో
ప్రవక్త (స) ఇంటిలోకి వెళ్లేవారు కాదు 220
అజ్ఞానంలో ఏదైనా మంచి పనికి మొక్కుకుంటే దాన్ని పూర్తిచేయాలి 221
ప్రవక్త (స) ఫజ్ర్ నమాజ్ చదివి తను ఏతెకాఫ్ కూర్చొనే
స్థలంలో ప్రవేశించేవారు 222
ప్రవక్త (స) రమజాన్ చివరి దశకంలో సదా ఏతెకాఫ్ పాటించేవారు 223
ఏతెకాఫ్ స్థితిలో ఉన్నప్పుడు రోగిని పరామర్శించే మస్నూన్ పద్ధతి 224
ఏతెకాఫ్ స్థితిలో వారించబడిన పనులు, ఇంకా ఏతెకాఫ్‌కు
రెండు షరతులు 225
ప్రవక్త (స) గారి ఏతెకాఫ్ పాటించే స్థల విషయం 226
మోతకిఫ్ ఖాతాలో వ్రాయబడే పుణ్యాలు 227

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# సంకలనకర్త మనవి

نَحْمَدُهٗ وَنُصَلِّیْ عَلٰی رَسُوْلِهِ الْكَرِيْمِ وَعَلٰی اٰلِهٖ وَاَصْحَابِهٖ اَجْمَعِيْنَ

**నహ్మదుహూ వ నుసల్లిఅలా రసూలిహిల్ కరీమి వ అలా ఆలిహీ వ అస్హాబిహీ అజ్మయీన్**

క్రీ.శ. 1967 చివర్లో మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ (రహ్మా) గారి సప్తాహిక హదీసు పాఠాల్ని ఒకచోట సంకలనం చేసి లాహోర్ నుంచి వెలువడే "ఆయిన్" వారపత్రికలో ప్రచురించడం ప్రారంభించినప్పుడు అవి ఎంతోమందికి నచ్చాయి. మౌలానా గారి ధార్మిక మూలధనమయిన వివేకం, విజ్ఞతలను అభిమానించే అనేకమంది పాఠకులు దీన్ని తమ చిరకాల వాంఛ నెరవేరే సాధనంగా భావించారు. ఇంకా దీన్ని పుస్తక రూపంలో ప్రచురించాలని పదే పదే కోరడం జరిగింది. ఆపై ఈ పుస్తకం పూర్తయిన తరువాత నేను ఇలా వ్రాయడం జరిగింది:

> "ఆయిన్" పత్రికలో గౌరవనీయులైన మౌలానా గారి హదీసు పాఠాల పరంపర మొదలయ్యాక పాఠకులు ఇంకా మిత్రులు ఈ అధ్యాయం పూర్తయిన వెంటనే, దీన్ని పుస్తకరూపంలో ప్రచురించే ఏర్పాటు చేయాలని, తద్వారా ఇలాంటి మహత్తర కూర్పు ప్రవక్త (స)ని అమితంగా ప్రేమించే వారి వరకు చేరుకుంటుందని వారు అభిప్రాయపడ్డారు. స్వయంగా నేను కూడా ఇలాంటి ఓ కూర్పును మౌలానా గారి సన్నిధిలో సమర్పించాలని భావించేవాణ్ణి. ఎందుకంటే మౌలానాగారి పరిశీలన తరువాత, వారి అనుమతితో పుస్తకరూపం ఇవ్వాలని కూడా తలచేవాణ్ణి. కాని ఇలాంటి తృష్ణగల వారు ఇంకా ఒక సంవత్సర కాలం పాటు వేచి ఉండాల్సి వస్తుందని భావిస్తున్నాను. ఎందుకంటే మొట్టమొదట ప్రస్తుతమున్న హదీసు పాఠాల మూలప్రతులు ఇంకా వాటి అనుబంధ అంశాలను సంపూర్ణంగా పరిశీలించి వాటిని ప్రచురణకు యోగ్యమైనవిగా చేయాలి. మౌలానా గారి ఉద్దేశ్యం కూడా ఇదేను. రెండవ విషయం, మౌలానా గారు "తఫ్హీముల్ ఖుర్ఆన్"

కార్యభారంలో నిమగ్నులై ఉండటం చేత వారు మరో పరిశోధనపైన గాని, రచనా వ్యాసంగంపైన గాని దృష్టి సారించలేకపోతున్నారు. తఫ్‌హీముల్ ఖుర్ఆన్ పూర్తవటమే ఓ బృహత్తర కార్యం అనే విషయం మనకు అవగతమవ్వాలి. ఈ పని పూర్తికావటం మౌలానా గారికీ మనకు కూడా ఎంతో ప్రియమయినది.

కాబట్టి మౌలానాగారు ఈ హదీసు కృతికై సమయాన్ని కేటాయించే వరకూ నిరీక్షించటమే ఉత్తమం. ఈలోగా పత్రికలో అచ్చయిన వాటిని ఓ చోట కూర్చి భద్రపరచటమే నా వంతు కర్తవ్యమని, ఆపై దైవచిత్తమైతే, మౌలానా గారికి సమయం చిక్కినప్పుడు దీన్ని పరిశీలించి ప్రచురించాలి అని భావించాను. *('ఆయిన్' 1968 జులై 7)*

ఆపై పరిస్థితులు ఎలా పరిణమించాయంటే ఈ పని పూర్తి కావటం అనిశ్చితంగా మారింది. దీని ఒక కారణం ఏమిటంటే 'తఫ్‌హీముల్ ఖుర్ఆన్' పని కొరకు మౌలానా గారు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవటం, వీటికి తోడు మౌలానా గారి అనారోగ్యం కూడా మరో కారణమయ్యింది. వైద్యం కొరకు చాలాకాలం వరకు ఆయన గారి రచనా వ్యాపకం, రాజకీయ వ్యాపకం ఆగిపోయాయి. ఈ పరిస్థితుల ప్రభావం వల్ల ఈ పని నిత్యం ఆగుతూనే పోయింది. ఆపై గడచిన సంవత్సరం 1971 జులైలో కూర్పు చేసిన ఈ గ్రంథాన్ని పరిశీలించవలసినదిగా మౌలానా గారికి మనవి చేసుకున్నాను. కాని ఆయన గారు తన అశక్తతను వ్యక్తం చేశారు. అయితే ఆయన గారు నాకు అనుమతినిస్తూ బాగా కష్టపడి పని చేయమని, ఇంకా రెండు విషయాల పట్ల శ్రద్ధ వహిస్తూ పుస్తకాన్ని ప్రచురించాలని హితవు గరిపారు.

మొట్టమొదట ఈ పుస్తకంలో ప్రచురితమయ్యే హదీసు పాఠాల్ని సాధారణంగా ధార్మిక పాఠశాలల్లో విద్యార్థులకు బోధించే హదీసుల్లా భావించకూడదు. ఇవి వారానికోసారి బోధించడానికి సాధారణ ప్రజల ప్రయోజనార్థం కూర్పు చేయబడ్డాయి. ఇంకా శ్రోతల మానసిక స్థితులను, సందర్భాలను దృష్టిలో ఉంచుకొని వీటిని వివరించడం జరిగింది.

రెండవ విషయం మౌలానాగారు ఈ పుస్తకాన్ని వ్రాయలేదు, కాని టేపురికార్డు చేసిన మౌలానా గారి పాఠాలకు లిఖితరూపం ఇవ్వటం జరిగింది.

ఈ పుస్తకాన్ని పరిశీలించి, ప్రచురణకు యోగ్యంగా చేయడానికి తగినవారు ఎవరంటే స్వయంగా మౌలానాగారే. లేదా ఈ సున్నితమయిన కార్యభారాన్ని మోయడానికి జ్ఞానపరంగా ఖుర్ఆన్ హదీసులతో పాటు అతి సూక్ష్మమైన ఫిఖా అంశాలు తెలిసివున్న వారు దీనికి అర్హులు. అలాంటివారే ఇలాంటి అమూల్యమైన

హదీసుల సారాంశాన్ని మరింతగా విడమరచి చెప్పగలరు. కాని పరిస్థితుల ప్రభావం వల్ల కఠినమయిన ఈ విధిని నిర్వర్తించే బాధ్యతను ఎలాంటి ధార్మిక జ్ఞానం లేదా సాహితీ సంపదలేని నాలాంటి అనర్హుడే స్వీకరించవలసి వచ్చింది.

ఇలా ఓ వైపు ఈ జ్ఞానలేమి వల్ల ఈ పని ముందుకు సాగనీయకుండా ఆపుతూ వచ్చింది; మరోవైపు ఎలాగైనా ఈ గొప్ప పని చేస్తే పరలోక సాఫల్యం లభిస్తుందనే తపన ప్రోద్బలం చేసేది. ఈ విధమైన దైవ చింతనా భావంతో ఈ పనిని సాధ్యమైనంత మేరకు చేస్తూ వుండేవాణ్ణి. కాబట్టి కేవలం దైవ కృపవల్లనే ఇది పాఠకుల ముందు పుస్తక రూపంలో వచ్చింది. నా ఇహపరాలు సఫలం కావాలని పరమోన్నత ప్రభువును ఈ సందర్భంగా వేడుకుంటున్నాను. ఆమీన్.

మౌలానా గారి ఇతర ధార్మిక జ్ఞాన సంపద వలెనే ప్రియప్రవక్త (స) గారి ఈ హదీసు పుష్ప సంచయనాన్ని కూడా దైవదాసుల సన్మార్గానికి తోడ్పడేలా చేయాలని గొప్పవాడైన అల్లాహ్‌ను వేడుకుంటున్నాను. ఇంకా ఈ పుస్తకం మౌలానా గారి మంచి రచనల్లో ఒకటిగా వెలుగొందుతుందని ఆశిస్తున్నాను.

ఇందులో ఏమైనా లోపాలుంటే తెలియజేసి మేలు చేస్తే, వాటిని మలి ముద్రణలో సరిచేసి ప్రచురిస్తామని ఈ సందర్భంగా విజ్ఞులైన పాఠకులతో మనవి చేస్తున్నాను.

మీ ముందున్న ఈ గ్రంథం ప్రఖ్యాత హదీసు గ్రంథం **'మిష్కాతుల్ మసాబీహ్'**లోని **"కితాబుస్సౌమ్"** వ్యాఖ్యానాన్ని ఆధారంగా చేసుకుని సంకలనం చేయటం జరిగిందన్న విషయాన్ని పాఠకులకు తెలుపటం సముచితమని భావిస్తున్నాము. అయితే సంకలనకర్త హదీసుకు తగిన విధంగా శీర్షికలను పెట్టారని గ్రహించగోర్తాను.

చివర్లో ప్రియమిత్రులు 'ఆయిన్' సంపాదకులైన జనాబ్ ముజఫ్ఫర్ బేగ్ గారి అమూల్యమైన తోడ్పాటుకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ హదీసులను ఆయన తన ప్రఖ్యాత పత్రిక 'ఆయిన్'లో ప్రచురించే అవకాశాన్నిచ్చారు. నిజానికి ఈ హదీసుల సంకలనానికి, ప్రచురణకు ఆయన తోడ్పాటే గనక లేకుంటే నేను ఈ కార్యానికి పూనుకునే సంకల్పమే చేసేవాణ్ణి కాను. **అల్లాహ్ ఆయనకు ఇహపరాల మేళ్లను ప్రసాదించుగాక!**

ജ്വ

# మిష్కాతుల్ మసాబీహ్

ఇప్పుడు మీ ముందున్న ఈ పుస్తకం ప్రఖ్యాత హదీసు సంచయనం 'మిష్కాతుల్ మసాబీహ్' గ్రంథంలోని ఒక భాగం 'కితాబుస్సౌమ్'కు వివరణ. ఈ సందర్భంగా మిష్కాత్ గ్రంథాన్ని సంక్షిప్తంగా పరిచయం చేయటం భావ్యమను కుంటున్నాము.

హిజ్రీ 8వ శతాబ్దానికి చెందిన గొప్ప ఫిఖహ్‌వేత్త హదీసు పండితులైన వలియుద్దీన్ ముహమ్మద్ బిన్ అబ్దుల్లాహ్ తబ్రేజీ (రహ్మా) (విచారకరమైన విషయం ఏమిటంటే వీరి జనన మరణాల తేదీలు తెలియలేదు. అయితే ఈయనగారు మిష్కాత్ రచయిత అని, హిజ్రీ 737లో దీన్ని పూర్తిగావించారని తెలిసింది) గారి ఓ సరిక్రొత్త ప్రక్రియతో కూడిన రచన ఇది. దీని మూలాధారం ప్రఖ్యాత హదీసువేత్త, వ్యాఖ్యానకర్త, ఫిఖహ్‌వేత్త ఇమామ్ బగవి (రహ్మా) ('ముహియుస్సున్నహ్' – అబూ ముహమ్మద్ అల్ హుసైన్ బిన్ మసూద్ అల్ ఫవ్వాద్ అల్ బగవియ్యి (మరణం 516 హిజ్రీ) గారి హదీసు సంకలనం "మసాబీహుస్సున్నహ్." దీన్ని మరింతగా సంస్కరించి, మరిన్ని హదీసుల్ని చేర్చి 'మిష్కాతుల్ మసాబీహ్'గా సంకలనం చేయటం జరిగింది.

అల్లామా తబ్రేజీ (రహ్మా) గారి "మిష్కాతుల్ మసాబీహ్" ఓ నూతన ప్రక్రియతో కూడుకున్న రచన. ఈ గ్రంథాన్ని ప్రఖ్యాత గురువులు అల్లామా హుసైన్ బిన్ అబ్దుల్లా తయ్యిబీ (రహ్మా) (మరణం హిజ్రీ 743) గారి సలహో, ఆజ్ఞ మేర సంకలనం చేశారు. ఈ గ్రంథం సంకలనమయిన పిదప వారి గురువుగారు దీనికి "అల్ కాషిఫు అన్ హఖాయిఖిస్సునన్" పేరుతో వ్యాఖ్యానం వ్రాశారు.

మిష్కాతుల్ మసాబీహ్ ప్రత్యేకతను, అవసరాన్ని తెలుసుకోవటానికి ఇమామ్ బగవీ (రహ్మా) గారి "మసాబీహుస్సున్నహ్" ప్రత్యేకతలపై దృష్టి సారించటం అవసరం.

(1) 'మసాబీహుస్సున్నహ్'లో హదీసులను ఫిఖహ్ (ధర్మశాస్త్రం) అధ్యాయాల ప్రకారం సంకలనం చేయటం జరిగింది. ప్రతి అధ్యాయాన్ని రెండు

భాగాలుగా విభజించారు. ఒక భాగంలో ఇమామ్ బుఖారీ (రహ్మ), ఇమామ్ ముస్లిం (రహ్మ) హదీసులను, రెండవ భాగంలో అబూ దావూద్ (రహ్మ), తిర్మిజీ (రహ్మ), నసాయి (రహ్మ), ఇబ్నుమాజా (రహ్మ), బైహఖీ (రహ్మ) ఇంకా దారె ఖుత్‌నీ (రహ్మ) తదితరులు ఉల్లేఖించిన హదీసులను పేర్కొన్నారు.

(2) మసాబీహ్ రచయిత ఉల్లేఖనకర్తల పేర్లు, సంబంధిత గ్రంథాల పేర్లు, హదీసు ఆధారాలను పేర్కొనలేదు. దీనివలన హదీసు విద్యార్థులకు వాటి మూలాలను, వాటి ప్రామాణికతను, వాటి స్థానాదులను, తరహాను పేర్కొనటం కష్టంగా పరిణమించేది.

## 'మసాబీహిస్సున్నహ్', 'మిష్కాతుల్ మసాబీహ్'ల మధ్య వ్యత్యాసం

(1) మిష్కాత్ గ్రంథకర్త 'మసాబీహిస్సున్నహ్'లోని రెండు ప్రకరణల తరువాత మూడవ ప్రకరణాన్ని కూడా చేర్చారు. హదీసుల ఎంపిక చేయటంలో సిహాహ్ సిత్తాహ్ (బుఖారీ, ముస్లిం, నసాయి, అబూదావూద్, తిర్మిజీ, ఇబ్నుమాజా) కాక, 'షోబుల్ ఈమాన్', 'బైహఖీ', 'ముస్నద్ ఇమాం అహ్మద్', 'ముస్నద్ రజైన్' (రహ్మ)లను కూడా దృష్టిలో ఉంచుకోవటం జరిగింది. ఈ విధంగా విషయానికి తగ్గట్టు చాలా ప్రముఖమైన హదీసులు ఈ గ్రంథంలో చేర్చబడ్డాయి. మసాబీహ్ గ్రంథంలో హదీసుల సంఖ్య 4434, మిష్కాత్ గ్రంథంలో వీటి సంఖ్య 5945కి చేరుకుంది.

మిష్కాతుల్ మసాబీహ్ యావత్ ప్రామాణిక హదీసు గ్రంథాల సంక్షిప్త గ్రంథమైనప్పటికీ సత్యతా పూర్వకమైన సమగ్ర సంకలన గ్రంథం. ఇలాంటి ప్రత్యేకతలుండబట్టే హదీసు విద్యార్థులు, ఉలమాలు (విద్వాంసులు), సామాన్య ముస్లిముల్లో ఇది బాగా ఆదరణకు నోచుకుంది. ఈ గ్రంథం వివిధ ఫిఖహ్ అభిమతాలు కలిగిన ధార్మిక కేంద్రాల్లో కూడా ఎంతగానో ప్రాచుర్యం పొందింది. ధార్మిక పాఠశాలల్లో దీన్ని పాఠ్యాంశంగా చేర్చడం జరిగింది. ఇది ఎంతగా ప్రాచుర్యం పొందిందంటే అరబీ, ఉర్దూ, ఇంకా వేరే అనేక భాషల్లో దీని వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. హదీసు గ్రంథాల్లో 'సహీహైన్' తరువాత ఈ గ్రంథానికే ప్రాచుర్యం లభించింది.

అరబీ వ్యాఖ్యానాల్లో అల్లామా అత్ తయ్యిబీ(రహ్మ) వ్యాఖ్యానం (దీని ప్రస్తావన ఇంతకు మునుపే వచ్చింది) **'మిర్ఖాతుల్ మఫాతీహ్'** (ముల్లా అలీ

ఖారీ – రహ్మ), **'లమ్ఆత్'** (షేఖ్ అబ్దుల్ హఖ్ ముహద్దిస్ దెహల్వీ – రహ్మ), **'అత్తాలీఖుస్సబీహ్'** (మౌలానా ముహమ్మద్ ఇద్రీస్ కాంథహల్వీ), ఇంకా **'మిన్‌హాజుల్ మిష్కాత్'** (అబ్దుల్ అజీజ్ అల్ బహరీ – రహ్మ) ముఖ్యమైనవి. ఫార్సీలో షేఖ్ అబ్దుల్ హఖ్ ముహద్దిస్ దెహల్వీ (రహ్మ) వ్యాఖ్యానం **'అషిఅతుల్ లమ్ఆత్'** ప్రసిద్ధిగాంచింది. దాని ఉర్దూ వ్యాఖ్యానం నేడు అరుదైన గ్రంథం. ఇంకా మౌలానా ఖుతుబుద్దీన్ (రహ్మ) గారి **'మజాహిరె హఖ్'** కూడా ప్రస్తావించదగినదే. ఇంకా 1809లో ఒక ఇంగ్లీషు అనువాదం కూడా ప్రచురించబడింది.

**'మిష్కాతుల్ మసాబీహ్'**కు చెందిన వివిధ అంశాలు పాకిస్తాన్‌లోని అనేక విద్యాసంస్థల్లో పాఠ్యాంశాల్లో ఓ భాగంగా వున్నాయి.

– సంకలనకర్త

# తొలి పలుకులు

## శుభప్రదమైన రమజాన్

తఖ్వా (నిష్ఠాగరిష్ఠతకి), దాస్యానికి ఇంకా కృతజ్ఞతా భావానికి దేవుని పాఠ్య ప్రణాళిక.

يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا كُتِبَ عَلَيْكُمُ الصِّيَامُ كَمَا كُتِبَ عَلَى الَّذِينَ
مِن قَبْلِكُمْ لَعَلَّكُمْ تَتَّقُونَ ۝ (البقرہ : ١٨٣)

**అనువాదం : విశ్వసించిన ఓ ప్రజలారా! ఉపవాసం మీకు విధిగా నిర్ణయించ బడింది - ఏ విధంగా మీకు పూర్వం ప్రవక్తలను అనుసరించే వారికి కూడ విధించబడిందో. దీనివల్ల మీలో భయభక్తులు జనించే అవకాశం ఉంది.** (అల్ బఖర : 183)

(1) రమజాన్ ఉపవాసాలు ప్రవక్త (స) హిజ్రత్ చేసిన 18 నెలల తరువాత విధి గావించబడ్డాయి. ఖిబ్లా మార్పు ఆజ్ఞ దీనికంటే రెండు లేక రెండున్నర నెలల ముందు వచ్చింది. రమజాన్ ఉపవాసాల విధివిధానాలు, ఖుర్ఆన్ హదీసులు, ముస్లిమ్ సముదాయం ఈ మూడింటి ద్వారా రూఢీ చేయబడ్డాయి. పైన పేర్కొన్న ఆయత్‌లో రమజాన్ రోజాల ఆదేశాలు ఇవ్వబడుతూ "కుతిబ అలైకుము స్సియాము" అని పేర్కొనటం జరిగింది. **"కుతిబ"** అనే పదం 'విధి' గావించ డానికి సూచించబడుతుంది. ఖుర్ఆన్ ఆధారంగా రుజువయ్యే విషయం ఏమిటంటే రమజాన్ ఉపవాసాలు విధిగా నిర్ణయించబడ్డాయి. ఆపై ప్రవక్త (స) సెలవిచ్చినట్లు,

بُنِيَ الْإِسْلَامُ عَلَىٰ خَمْسٍ شَهَادَةِ
أَنْ لَا إِلٰهَ إِلَّا اللّٰهُ وَأَنَّ مُحَمَّدًا رَسُولُ اللّٰهِ وَإِقَامِ الصَّلٰوةِ وَإِيتَاءِ
الزَّكٰوةِ وَحَجِّ الْبَيْتِ وَصَوْمِ رَمَضَانَ

**అనువాదం : ఇస్లాం ఐదు మూల స్తంభాలపై ఆధారపడి ఉంది :**

1. అల్లాహ్ తప్ప మరొక ఆరాధ్యుడు లేడు, ముహమ్మద్ (స) ఆయన ప్రవక్త అని సాక్ష్యమివ్వటం.
2. నమాజ్‌ను స్థాపించడం.
3. జకాత్ చెల్లించటం.
4. దేవుని గృహం కాబాకు వెళ్ళి హజ్జ్ విధిని నెరవేర్చటం.
5. రమజాన్ ఉపవాసాలుండటం.

ఈ హదీసు ద్వారా తెలిసిందేమంటే రోజా కేవలం విధియే కాదు, అది ఇస్లాం మూలస్తంభాల్లో ఒకటి.

(2) ఇస్లాం ఇతర ఆదేశాల వలె రోజాలు కూడా క్రమంగా విధితమయ్యాయి. ప్రారంభంలో ప్రవక్త (స) ప్రతి నెలా కేవలం మూడు రోజులు రోజా పాటించమని సెలవిచ్చారు. అయితే ఇవి విధిగావించబడలేదు. ఆపై హిజ్రీ 2వ సంవత్సరం ఈ రోజాల ఆదేశం ఖుర్ఆన్ ద్వారా వెలువడింది. అయితే రోజాలు పాటించే శక్తి ఉన్నప్పటికీ రోజాలు వుండనివారు ప్రతి రోజాకు బదులు ఒక నిరుపేదకు భోజనం పెట్టాలనే అనుమతి ప్రారంభంలో ఇవ్వబడింది. ఆపై రెండవ ఆదేశం వెలువడ్డాక అంతకు ముందు ఆదేశాలు రద్దు చేయబడ్డాయి. అయితే రోగగ్రస్తులు, ప్రయాణీకులు, గర్భవతులు, బిడ్డలకు పాలుపట్టే స్త్రీలు, శక్తిహీనులైన వృద్ధులు ఈ ఆదేశం నుండి మినహాయించబడ్డారు. (ఖుర్ఆన్ అవగాహనం, మొదటి సంపుటం, పేజి : 141, 2.అల్ బఖర :ఆయత్-183, 184)

(3) బఖరా సూరాలోనే మరో సందర్భంలో రోజా ఉద్దేశ్యాన్ని ఇలా తెలుపడం జరిగింది :

وَلِتُكَبِّرُوا اللّٰهَ عَلٰى مَا هَدٰىكُمْ وَلَعَلَّكُمْ تَشْكُرُوْنَ ○

అనువాదం: **మీరు అల్లాహ్ ఔన్నత్యాన్ని కొనియాడటానికీ, ఆయనకు మీరు కృతజ్ఞతలు తెలుపుకోవటానికీ ఈ పద్ధతి తెలుపబడుతోంది.**

(అల్ బఖర : 185)

తెలిసిందేమిటంటే రమజాన్ రోజాలను కేవలం దాస్యం కొరకో లేదా నిష్ఠాగరిష్ఠ జీవితం కొరకో నిర్ణయించటం జరగలేదు. పైగా దీనిని గొప్ప మార్గోపదేశ

وَتُغَلُّ فِيهِ مَرَدَةُ الشَّيَاطِينِ، لِلّٰهِ فِيهِ لَيْلَةٌ خَيْرٌ
مِنْ أَلْفِ شَهْرٍ، مَنْ حُرِمَ خَيْرَهَا فَقَدْ حُرِمَ. (رواه أحمد والنسائي)

**6. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : మీపై శుభప్రదమైన రమజాన్ నెల వచ్చింది. ఇందులో మీపైన రోజాలు విధి గావించబడ్డాయి. ఇందులో స్వర్గద్వారాలు తెరచుకోబడతాయి, నరకద్వారాలు మూయబడతాయి. ఇంకా తలబిరుసు షైతానులు బంధించబడతారు. ఇందులో అల్లాహ్ తరఫున ఒక రాత్రి వుంది, అది వెయ్యి నెలలకన్నా శ్రేష్ఠమైనది. ఈ రాత్రి శుభాలకు దూరమయినవాడు అభాగ్యుడు. (అహ్మద్, నసాయి)**

ఈ హదీసు కూడా ప్రవక్త (స) ప్రసంగాలలోనిదే. శుభాలు నిండిన రమజాన్ మాసం ప్రారంభమవగానే ప్రవక్త (స) తన సహచరులకు ఈ మాసంలోని శుభాలను, ప్రత్యేకతలను వివరించేవారు. ఇందులో మొట్టమొదట రమజాన్ ఎన్నో శుభాలతో నిండిన మాసమని తెలుపటం జరిగింది. ఈ నెలలోని రోజాలు ముస్లిం సమాజానికి విధి గావించబడ్డాయి.

బర్కత్ పదం అసలు అర్థం 'వృద్ధి', 'వికాసం'. రమజాన్ మాసాన్ని శుభాల మాసమని ఎందుకనబడిందంటే ఇందులో మేళ్ళు వృద్ధి, వికాసాలు పొందుతాయి. సత్కార్యాలు అధికమవుతాయి. దీనికి ప్రతిగా దుష్కార్యాలు పెరిగిపోయేబదులు క్షీణించిపోతాయి. వాటి వృద్ధి నిలిచిపోతుంది.

సెలవిచ్చిన రెండవ మాట ఏమిటంటే, ఈ నెలలో ఒక రాత్రి వున్నది - అది వెయ్యి నెలలకన్నా శ్రేష్ఠమైనది.

దీని ఉద్దేశం 'లైలతుల్ ఖద్ర్'. అంటే ఈ రాత్రిలో ఖుర్ఆన్ అవతరించింది. ఇదే విషయాన్ని ఖుర్ఆన్‌లో సెలవియ్యటం జరిగింది :

إِنَّا أَنْزَلْنَاهُ فِي لَيْلَةِ الْقَدْرِ ۝ وَمَا أَدْرَاكَ مَا لَيْلَةُ
الْقَدْرِ ۝ لَيْلَةُ الْقَدْرِ خَيْرٌ مِنْ أَلْفِ شَهْرٍ ۝

**ఇన్నా అన్‌జల్‌నాహు ఫీ లైలతిల్ ఖద్ర్. వమా అద్రాక మా లైలతుల్ ఖద్ర్. లైలతుల్ ఖద్రి ఖైరుమ్ మిన్ అల్ఫి షహ్ర్.**

భావం : మేము దీని (ఖుర్ఆన్)ని ఘనమైన రాత్రియందు అవతరింపజేశాము.

ఒక ప్రకటనకర్త నిల్చొని ఇలా పిలుపునిస్తాడని దీని అర్థంకాదు. దీని ఉద్దేశం అల్లాహ్ ఆదేశాలను పాటించేవారు రమజాన్ ప్రారంభం కాగానే ఇక పుణ్యాలు సంపాదించుకునే, చెడులను త్యజించే కాలం వచ్చేసిందని తలుస్తారన్న మాట. రమజాన్ నెల పొడుపు అయ్యిందని ప్రకటించగానే, ఉపవాసి "ఓ మంచిని కాంక్షించేవాడా! ముందుకు సాగు, పుణ్యాలను జుర్రుకునే సమయం ఇదే, పుణ్యాలతో నీ జోలెను నింపుకునే కాలం మొదలయ్యింద"న్న విషయాలను తన మనసులో నాటుకుంటాడు. ఇంకా "దుష్కార్యాల తలంపుగలవాడా! ఆగిపో, నీవు ఆగిపోవలసిన తరుణమిదే. ఎందుకంటే ఈ సమయంలో నీవు చేసే సాధారణ దుష్కార్యం కూడా పెద్ద దుష్కార్యంగా పరిగణించటం జరుగుతుంది, దానికి విరుద్ధంగా నీవు చేసే మామూలు సత్కార్యం కూడా అనేక రెట్లు వృద్ధీ వికాసాలు పొందుతుంది. కాబట్టి నీవు ఇక దుష్కార్యాలకు దూరంగా ఉండటం శ్రేయస్కరం" అని సంకల్పించుకుంటాడు.

## నరకాగ్ని నుంచి విడుదలయ్యేవారు

◆ ఇంకా ఏమని సెలవియ్యబడిందంటే, రమజాన్‌లో అనేకమంది అల్లాహ్ దాసులు నరకాగ్ని నుంచి విడుదలవుతారు.

'అతీఖ్' అంటే స్వతంత్రుడైన వ్యక్తి అని అర్థం. ఇలా సెలవిచ్చిన దానికి అర్థమేమంటే, అనేకమంది దాసులు ఈ కాలంలో తమ సత్కార్యాల ఫలితంగా నరకాగ్ని నుంచి విడుదల గావించబడతారు. కాబట్టి ప్రతి ఒక్కరూ తాము కూడా ఇలాంటి దాసుల్లో ఒకరుగా పరిగణించబడటానికి ఏ మేరకు ప్రయత్నిస్తున్నామని ఆలోచించాలి.

## ఇలా ప్రతి రాత్రి జరుగుతుంది

దీని భావమేమిటంటే, పవిత్ర రమజాన్ శుభాలు, ప్రత్యేకతలు దాని మొదటి రాత్రి నుంచే ప్రస్ఫుటమై, నెలలోని ప్రతి రాత్రి ఇలాగే ఎడతెగకుండా ప్రకాశిస్తూనే వుంటాయి.

మూడవ భాగం

## వెయ్యి నెలలకన్నా శ్రేష్ఠమైన రాత్రి

٦- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ:
أَتَاكُمْ رَمَضَانُ، شَهْرٌ مُبَارَكٌ، فَرَضَ اللهُ عَلَيْكُمْ صِيَامَهُ،
تُفْتَحُ فِيْهِ أَبْوَابُ السَّمَاءِ وَتُغْلَقُ فِيْهِ أَبْوَابُ الْجَحِيْمِ

అనుగ్రహ భాగ్యానికి గాను కృతజ్ఞతలు తెలిపే అవకాశంగా కూడా పేర్కొనటం జరిగింది. అది మనకు ఖుర్‌ఆన్ రూపంలో ప్రసాదించటం జరిగింది. వాస్తవానికి ఒక విజ్ఞుడైన మనిషి తనకు చేయబడిన సహాయానికిగాను, తనకు దీన్ని ప్రదానం చేసిన విధాతకు కృతజ్ఞతలు తెలుపుకోవటానికి మరింతగా కృషి చేస్తాడు. ఖుర్‌ఆన్ మనకు ప్రసాదించటంలోని ఉద్దేశ్యం ఏమిటంటే దైవాభీష్టాన్ని చూరగొనే మార్గం ఇదేనని గ్రహించి, దానిపై నడుస్తూ పరుల్ని కూడా ఆ మార్గంపై నడిచేలా చేయటం మన కర్తవ్యం. ఈ ఉద్దేశ్యం కొరకు మనల్ని తయారుచేసేదే ఈ రోజా. ఖుర్‌ఆన్ అవతరించిన నెలలో మన ఉపవాసం, దైవారాధన కొరకే కాదు, ఇంకా కేవలం మన నైతిక శిక్షణ కొరకే కాదు, వీటన్నింటితో పాటు ఈ అనుగ్రహ భాగ్యమైన ఖుర్‌ఆన్ అవతరణకు ప్రతిగా కృతజ్ఞతలు తెలుపడమే అసలు లక్ష్యం కావాలి.

అపస్మారక స్థితిలో ఉన్న రోగికి ఇక చివరి పరీక్షగా అతని ముక్కుకు ముందు అద్దం ఉంచుతారు. అద్దంపై ఏదైనా దుమ్ము, ధూళి పేరుకున్నట్లయితే ఇంకా ప్రాణం మిగిలే వుందని గ్రహిస్తారు. అలా కానట్లయితే ఇక అతని జీవితంపై పెట్టుకున్న చివరి ఆశలు కూడా ఆవిరి అయినట్లే. అదేవిధంగా ముస్లిమ్‌ల ఏదైనా బస్తీని పరీక్షించాలంటే రమజాన్ నెలలో దాని స్థితిని గమనించండి. ఒకవేళ ఆ నెలలో ఆ బస్తీవాసుల్లో ఏ కొద్దిపాటి నిష్టాగరిష్ఠత, దైవభీతి, మంచిని పెంపొందించే చైతన్యమయినా కనిపిస్తే ఆ బస్తీ ఇంకా బ్రతికే వుందని గ్రహించాలి. ఒకవేళ ఆ నెలలో కూడా మంచిని పెంపొందించే వాతావరణం కన్పించక, పాపకార్యాలు యథాతథంగా కొనసాగుతూ, ఇస్లామీయ భావన చచ్చిపోయినట్లయితే, 'ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్' అనండి. ఆపై అక్కడి ముస్లింలు శ్వాసపీల్చుకునే అవకాశమే మిగలలేదని భావించాలి.

– సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ

# كِتَابُ الصَّوْمِ

# ఉపవాసాల పుస్తకం

మొదటి భాగం

## రమజాన్ – సత్కార్యాల వసంత రుతువు

١- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: إِذَا دَخَلَ رَمَضَانُ فُتِحَتْ أَبْوَابُ السَّمَاءِ وَفِي رِوَايَةٍ فُتِحَتْ أَبْوَابُ الْجَنَّةِ وَغُلِّقَتْ أَبْوَابُ جَهَنَّمَ وَسُلْسِلَتِ الشَّيَاطِينُ وَفِي رِوَايَةٍ فُتِحَتْ أَبْوَابُ الرَّحْمَةِ (مُتَّفَقٌ عَلَيْهِ)

**1. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : రమజాన్ మాసం వచ్చిందంటే ఆకాశద్వారాలు తెరువబడతాయి (మరో ఉల్లేఖనం ప్రకారం స్వర్గద్వారాలు తెరవబడతాయని వుంది). ఇంకా నరకద్వారాలు మూయబడతాయి; షైతానులు బంధించబడతారు." మరో ఉల్లేఖనంలో కారుణ్య ద్వారాలు తెరవబడతాయని పేర్కొనబడింది.▲ (ముత్తఫకున్ అలైహ్▲▲)**

రమజాన్ నెల ప్రారంభంలో ప్రజలకు హితవు గరపటానికి మహాప్రవక్త (స) ప్రసంగించేవారు. ఇలాంటి వాటిలో ఒక ప్రసంగం : ఇక్కడ ప్రవక్త (స) గారి ప్రసంగంలోని నిజ సారాన్ని గ్రహించటానికి మనం మనసులో గుర్తుంచుకోవలసిన

---

▲ *దీని వలన తెలిసేదేమంటే, ఒక్కోసారి ప్రవక్త (స) 'అబ్‌వాబుస్సమాయి' అన్న వచనాలు ప్రయోగించేవారు, మరొకప్పుడు 'అబ్‌వాబుల్ జన్నహ్' మరోసారి 'అబ్‌వాబురహ్మాహ్' అని పలికేవారు. అయితే అన్నిటి ఉద్దేశ్యం ఒక్కటే.*

▲▲ ముత్తఫకున్ అలైహ్ అంటే ఇమామ్ బుఖారీ మరియు ఇమామ్ ముస్లిం ఇద్దరూ పొందుపరచిన హదీసు అని భావం

విషయం ఏమిటంటే ఇక్కడ శ్రోతలు ఎలాంటి ముస్లింలంటే వీరికంటే సత్యవంతులు, దృఢ విశ్వాసం కలవారు ఈ మానవ చరిత్రలో కానరారు. ప్రవక్త (స) సాధారణంగా తమ జుమా ప్రసంగాలలోనే ఈ హితవులు గరిపేవారు. ఆ సందర్భంలో మస్జిద్ నబవీ (స)లో హాజరయిన ముస్లింలు తమ విశ్వాసంలో బలహీనులని, విధేయత చూపించేవారు కారని అనుమానించటానికి వీలేలేదు. కాబట్టి వారు ఈ హితవుల పట్ల పూర్తిగా నిజ విశ్వాసం గలవారు, సద్వర్తనులు, నిష్ఠగలవారు. దైవానికి భయపడుతూ జీవితాన్ని గడిపేవారు. ఆయన ఆదేశాలనుసారం విధేయులై జీవించేవారు. ఇలాంటి వారితో సెలవియ్యబడిందేమిటంటే, రమజాన్ నెల ప్రారంభమైందంటే ఆకాశం (స్వర్గం లేదా కారుణ్యం) యొక్క ద్వారాలు తెరవబడతాయి. దీని అసలు ఉద్దేశ్యమేమిటంటే శ్రోతలు రమజాన్ నెల వచ్చిన పిదప సాధ్యమైనంతగా సత్కార్యాలు సంపాదించుకోవాలి, స్వర్గపు ద్వారాలన్నీ మీ కొరకు తెరవబడ్డాయి. సదఖా దానధర్మాల ద్వారం గుండా ప్రవేశించగోరితే సదఖా, దానధర్మాలు చేసి స్వర్గంలో ప్రవేశించండి. ఒకవేళ రోజా ద్వారం గుండా ప్రవేశించగోరితే రోజా ద్వారం గుండా ప్రవేశించండి, లేదా ఖుర్ఆన్ పారాయణ ద్వారం గుండా ప్రవేశించగోరితే ఆ విధంగా ప్రవేశించండి, చెడుల నుంచి దూరంగా వుంటూ ఆ విధంగా ప్రవేశించగోరితే అలానే చేయండి, మొత్తంమీద స్వర్గంలో ప్రవేశించడానికి మీ కోసం ద్వారాలు తెరవబడే వున్నాయి. ఇకపై మీరు స్వర్గ ప్రవేశార్హులుగా రూపొందడం మీ వంతు కర్తవ్యం.

◆ **ఇంకా నరక ద్వారాలు మూసివేయబడతాయని సెలవియ్యడం జరిగింది :**

దీని ఉద్దేశ్యం ఏమిటంటే రమజాన్‌లో సాధారణంగా ఒక మనిషి వేరే రోజుల్లో చేసే చెడు పనులకు దూరంగా మసలుకుంటాడు. కాబట్టి ఓ మంచి ముస్లిం రమజాన్ వాతావరణ పుణ్యమా అని చెడుల నుంచి దూరంగా ఉండే ఆస్కారముంటుంది. ఈ విధంగా నరకద్వారాలు అతని కొరకు మూసివేయబడతాయి.

◆ **మూడో విషయం ఏమంటే షైతానులు బంధింపబడతారని చెప్పడం జరిగింది:**

ఈ మాటల ఉద్దేశం ఏమిటంటే పవిత్ర రమజాన్ మాసంలో సత్కార్యాలు పెంపొందించబడి, షైతాన్ చేష్టలకు అడ్డుకట్ట వేయటం జరుగుతుంది. ఎందుకంటే యావన్మంది ముస్లింలు ఒకేసారి ఉపవాసాలను పాటించటం మూలంగా అల్లాహ్ వైపునకు మరలే వాతావరణం ఏర్పడుతుంది, ఇది ఇతర దినాల్లో కన్పించదు. కాబట్టి రమజాన్ నెల ఎలాంటిదంటే మనిషిలో దేవుని వైపు మొగ్గు చూపే లక్షణం ఎడతెగకుండా ఉంటుంది. ఎందుకంటే ఓ మనిషి పన్నెండు, పద్నాలుగు గంటలు రోజా ఉన్నప్పుడు

నిత్యం అతని మనసులో తాను దైవాభీష్టాన్ని చూరగొనేందుకు రోజాలో వున్నాననే విషయం అనుక్షణం మనసులో మెదలుతూ వుంటుంది. తనకు ఆకలేసినప్పుడు, దప్పికవేసిప్పుడు వెంటనే అతనికి రోజాలో వున్నానన్న విషయం గుర్తుకు వస్తుంది. అందువలన అతను వెంటనే వీటికి దూరంగా వుంటాడు. ఈ విధంగా మొత్తం రమజాన్ మాసం అతని మనసు దేవుని వైపే మొగ్గుతూ వుంటుంది. అతను ఇఫ్తార్ చేసినప్పుడు, ఇప్పటి వరకు నా ప్రభువు నన్ను బంధించివుంచాడు, ఇక నన్ను ఆయన అనుమతించాడు కాబట్టి రోజా విరమిస్తున్నాను అని తలపోస్తాడు. పిదప భోజనం చేశాక తరావీహ్ నమాజ్‌కు వెళ్తాడు, మళ్ళీ అతను దేవుని వైపు మరలి వెళ్ళాడు. ఈ విధంగా 24 గంటలూ అతను దేవుని వైపు మరలివుంటాడు. ఇలా ఒక్క మనిషి మాత్రమే చేయడు, పూర్తి సముదాయం ఈ విధంగానే ఆచరిస్తుంది. దీనివలన అర్ధమయ్యేదేమిటంటే రమజాన్ వరాల వసంతం. వర్షాకాలంలో ప్రతిదీ పచ్చగా మారినట్లు, ఈ మాసంలో సత్కార్యాలు పెంపొందించబడటానికి అనేక అవకాశాలు ఏర్పడతాయి. మనిషి ఆధ్యాత్మికంగా ఎంతగా అభివృద్ధిచెందాలంటే అంతగా వృద్ధిచెందుతాడు. ఎందుకంటే ఈ మాసంలో ఒక మనిషి చేసే సత్కార్యం మరో మనిషికి ఊతంగా ఉంటుంది. ఆ విధంగా అతను సహాయకుడుగా మారతాడు. ఇతర దినాల్లో రోజా వుంటే – రోజా ఉండటం ఎంత కష్టమోనన్న విషయం మనిషికి తెలిసివస్తుంది. ఎందుకంటే అతనికి సహాయకుడుగా ఏ మనిషీ కనిపించడు. కానీ రమజాన్‌లో పరిస్థితి వేరుగా వుంటుంది. అప్పుడు పూర్తి సమాజమే రోజాలో వుంటుంది. ఈ విధంగా ఒక్క మనిషికి లక్షల మంది ద్వారా పటిష్ఠత చేకూరుతుంది. ఈ కారణంగానే రమజాన్‌లో మనిషి ఆధ్యాత్మిక వికాసానికి, శీల నిర్మాణానికి, శీల సంస్కరణకు అనేక అవకాశాలు దొరుకుతాయి. ఇప్పటికే మీరు గమనించేవుంటారు – రమజాన్‌లో ఎవరైనా తిట్లకు దిగితే వెంటనే ఇతరులు కలుగజేసుకొని “ఏమయ్యా, రమజాన్‌లో ఇదేం ప్రవర్తన” అని అతన్ని మందలిస్తారు. దీనర్థం సమాజం మొత్తానికి ఇప్పటి వరకు తెలుసు, రమజాన్ మాసంలో ఎలా గౌరవప్రదంగా, జాగ్రత్తగా మెలగాలో అన్న విషయం. దీనినిబట్టి మనం ఊహించవచ్చు–హృదయాల్లో ఎలాంటి భావనలుంటాయోనన్నది.

ఇదేవిధంగా రమజాన్‌లో స్వర్గద్వారాలు తెరచుకొని ఉంటాయని, నరకద్వారాలు మూయబడతాయని, షైతానులు బంధించబడతారని పేర్కొనటం జరిగింది. అయితే ఈ విషయం సద్గుణ సంపన్నత కలిగిన ముస్లిం సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని మాత్రమే పేర్కొనబడింది. అంతేగాని, ఈ రోజుల్లో కూడా ఎవరైనా ఒకరు బహుదైవారాధన, ఇంకా ఇతర చెడు పనుల్లో మునిగివుంటే అతని కొరకు

మొత్తం నరకద్వారాలు తెరచుకొని ఉంటాయి, ఇంకా స్వర్గ ద్వారాలు మూయబడ తాయి.

## ఉపవాసులకు స్వర్గంలోని ఒక ద్వారం ప్రత్యేకించబడింది

٢- عَنْ سَهْلِ بْنِ سَعْدٍ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ: فِي الْجَنَّةِ ثَمَانِيَةُ أَبْوَابٍ مِنْهَا بَابٌ يُسَمَّى
الرَّيَّانَ لَا يَدْخُلُهُ إِلَّا الصَّائِمُونَ (مُتَّفَقٌ عَلَيْهِ)

**2. హజ్రత్ సహ్ల్ బిన్ సఅద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (స) సెలవిచ్చారు : స్వర్గానికి ఎనిమిది ద్వారాలున్నాయి. వీటిలో ఒక ద్వారాన్ని 'రయ్యాన్" అని అంటారు. ఈ ద్వారం గుండా కేవలం ఉపవాసాలుం దేవారు మాత్రమే ప్రవేశించగలరు. (ముత్తఫకున్ అలైహి)**

"రయ్యాన్" పదాన్ని "రియ్యి" నుంచి గ్రహించడమయింది. దీని అర్థం దప్పిక తీర్చడం, నీరు సరఫరా చేయడం. రయ్యాన్ అంటే దప్పిక తీర్చేద్వారమని అర్థం.

స్వర్గద్వారాలంటే అర్థం బాహ్యంలో కన్పించే గొప్ప సత్కార్యాలని అర్థం, వీటివలన మనిషి స్వర్గ ప్రవేశానికి అర్హుడవుతాడు. ఉదాహరణకు ఒక మనిషి దాత, దానశీలుడు, దైవమార్గంలో ఖర్చు చేసేవాడై ఉంటాడు. అతను వేరితర సత్కార్యాలు కూడా చేస్తున్నాడు, రోజాలు కూడా ఉంటున్నాడు, నమాజ్ కూడా ఆచరిస్తున్నాడు. కాని ప్రధానంగా బహిర్గతంగా కన్పించే సత్కార్యం, దేనివల్లనైతే అతనికి గుర్తింపు లభించిందో అది దైవమార్గంలో తాను చేసిన ఖర్చు (ఇన్ఫాక్ ఫీ సబీలిల్లాహ్) వల్లనే. అందుకని అతను **'ఇన్ఫాక్ ఫీ సబీలిల్లాహ్'** ద్వారం ద్వారా స్వర్గంలో ప్రవేశిస్తాడు. మరోవ్యక్తి ఆచరణలో దైవమార్గంలో పోరాటం చేసే లక్షణం అతనిలో ప్రధానంగా వుంటుంది. కాబట్టి అతను **'ముజాహిదీన్ ఫీ సబీలిల్లాహ్'** మార్గం ద్వారా స్వర్గంలో ప్రవేశిస్తాడు. ఈ విధంగా వివిధ వ్యక్తులు తాము అత్యధికంగా ఆచరించి గుర్తించబడే ఆచరణ ద్వారానే స్వర్గంలో ప్రవేశం పొందుతారు. మరోమాటలో చెప్పాలంటే ప్రపంచంలో సత్కార్యాలు లెక్కకు మించి వున్నాయి. ఈ సత్కార్యాలను విభజిస్తే ఎనిమిది ద్వారాలుగా విభజించబడతాయి. ఈ ఎనిమిది ద్వారాలగుండా ఎవరు దేనిద్వారా ప్రవేశానికి అర్హుడో దానిద్వారా స్వర్గంలో ప్రవేశిస్తాడు.

ఇక్కడ ప్రస్తావించిన "రయ్యాన్" ద్వారం గుండా కేవలం ఉపవాసి మాత్రమే స్వర్గంలో ప్రవేశిస్తాడు. దీని అర్థం ఏమిటంటే, రోజా అయితే యావన్మంది ముస్లింలు పాటిస్తారు, కాని కొందరు ఎక్కువగా రోజాలు పాటిస్తారు, కాబట్టి వారికి ప్రతిఫలం తప్పకుండా లభించాలి. వీరు శ్రద్ధగా రోజాలు పాటించి అల్లాహ్‌ను ప్రీతిపాత్రునిగా చేసే ప్రయత్నం చేస్తారు. కాబట్టి ఈ ద్వారం అలాంటి వారి కొరకు ప్రత్యేకించటం జరిగింది.

## పాపాలన్నింటి మన్నింపు సాధనం

٣- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ صَامَ رَمَضَانَ إِيْمَانًا وَّاحْتِسَابًا غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ وَمَنْ قَامَ رَمَضَانَ إِيْمَانًا وَّاحْتِسَابًا غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ وَمَنْ قَامَ لَيْلَةَ الْقَدْرِ إِيْمَانًا وَّاحْتِسَابًا غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ - (مُتَّفَقٌ عَلَيْهِ)

**3. హజ్రత్ అబూహురైరా (రజి) ద్వారా ఉల్లేఖనం-ప్రవక్త (స) సెలవిచ్చారు: సంపూర్ణ విశ్వాసంతో, పుణ్యఫలాపేక్షతో ఎవరైతే రమజాన్ రోజాలను పాటిస్తాడో అతని పూర్వపాపాలన్నీ మన్నించివేయబడతాయి. ఇంకా ఎవరైతే పూర్తి విశ్వాసంతో, పుణ్యఫలాపేక్షతో రమజాన్ రాత్రుల్లో దైవా రాధనలో గడుపుతాడో అతని వలన జరిగిన పూర్వ పాపాలన్నీ మన్నించి వేయటం జరుగుతుంది. ఇంకా ఎవరైతే లైలతుల్ ఖద్ర్ (ఘనమయిన రేయి) యందు పూర్ణ విశ్వాసంతో, పుణ్యఫలాపేక్షతో జాగరణ చేస్తాడో, అతని వలన జరిగిన పూర్వపు పాపాలన్నీ క్షమించివేయబడతాయి.**

**(ముత్తఫకున్ అలైహ్)**

**'ఎహ్‌తెసాబ్'** అంటే ఒక వ్యక్తి తాను చేసే పుణ్యకార్యాలన్నింటినీ కేవలం అల్లాహ్ కొరకే చేస్తూ, కేవలం ఆయన ప్రీతి పొందటానికే ఆచరించటం.

ఈ హదీసులో పాపపరిహారాల గురించి విన్పించబడిన శుభవార్త ఉద్దేశం అల్లాహ్ ఆదేశాలకు అనుక్షణం వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ, పరలోకంలో జవాబుదారీ తనం గురించి నిర్భయులుగా వున్నవారికి అలా చేయమని లైసెన్స్ ఇచ్చినట్లు ఎంతమాత్రం కాదు - చూడబ్బాయీ, రమజాన్‌లో రోజాలు పాటించు, తరావీహ్

చదువుకో, లైలతుల్ ఖద్ర్‌లో ఆరాధన చేసుకో, అప్పుడు నీ లెక్క సాఫీ అవుతుంది. ఇక మిగతా పదకొండు నెలల్లో నీ ఇష్టమొచ్చినట్లు చేసుకుంటూ వుండు. లంచాలు తిను, ప్రజల హక్కులు కొల్లగొట్టు, ఎలాంటి దౌర్జన్యాన్నయినా, జులుంనయినా చేయి, ఆపై రమజాన్‌లో ఆరాధనకై నిల్చో, రోజాలు పాటించు, నమాజులు చదువుకో, ఆపై పూర్వపు పాపాలన్నీ క్షమించబడతాయి అని దీని భావం కానేకాదు.

ఈ హదీసును పఠిస్తున్నప్పుడు మన దృష్టిలో ఎవరి గురించి ఇలా అనబడు తుందో అవగతమవ్వాలి. ఈ విషయాన్ని ముందే వివరించటమయ్యింది. ఈ హదీసులో ప్రస్తావితులెవరంటే నిత్యం నిష్ఠాగరిష్ఠ జీవితాన్ని గడిపే ప్రయత్నం చేసే సజ్జనులు, దైవభీతిపరులు, శిష్టశీల సంపన్నులు మాత్రమే. ఇలాంటి వారు మరుపు వలన ఏదైనా పాపకార్యం, పొరపాటు జరిగినట్లయితే వారు ఇతరుల్లా తప్పుచేసి కూడా దానిపై మొండిగా వాదించే వ్యక్తుల్లాంటివారు కారు. ఈ వ్యక్తులు భిన్నమైనవారు. ఇలాంటి సన్మార్గగాముల వలన ఏదైనా తప్పు, పాపం జరిగిందంటే అది మానవమాత్రులవడం చేతనే. ఇలాంటి సందర్భాల్లో వారు పశ్చాత్తాపంతో కుమిలిపోతారు. ఒకవేళ అనుకోకుండా మానవ సహజ దౌర్బల్యం చేత పొరపాటు జరిగినా దానిపై పశ్చాత్తాపభావంతో కుమిలిపోతూ సన్మార్గాన్ని అలవరచుకునే ప్రయత్నం చేస్తారు. ఇదే వారి పశ్చాత్తాపంగా మారుతుంది. ఒక వ్యక్తి వలన ఏదైనా పాపకార్యం జరిగి దాన్ని అతను మరచిపోయాడు. ఆపై నమాజ్ చేసినట్లయితే అతని లెక్క నుంచి ఆ పాపకార్యాన్ని తీసివేయటం జరుగుతుంది. అసలు పశ్చాత్తాపం అంటే ఒక వ్యక్తి వలన ఏదైనా పొరపాటు జరిగి తరువాత అది అతనికి గుర్తుకు వచ్చి దానిపై అతను ప్రభువు వైపునకు మరలినట్లయితే అదే అతని పశ్చాత్తాపం. అదెలాగంటే ఒక నౌకరు ఒక తప్పు వలన తన యజమాని నుంచి దూరమయిపోతాడు. దానిపై అతను క్షమాపణ వేడుకుంటాడు. ఒకసారి నౌకరు చేత జరిగిన పొరపాటు వలన యజమాని అతన్ని దూరం చేసుకోడు. క్షమాపణ వేడుకున్న నౌకరును క్షమించి మళ్ళీ ఉద్యోగంలో చేర్చుకుంటాడు. వెనుకటి మాదిరిగా ఆ నౌకరు కూడా నమ్మకంతో సేవాభావంతో మెలగుతాడు.

తన దాసులైన మానవులతో కూడా అల్లాహ్ ఇలాగే చేస్తాడు. మూలతః దాసుడు అల్లాహ్ పట్ల విధేయత చూపేవాడైనట్లయితే, తెలిసీ తలబిరుసుతనంతో తప్పుచేసే ఉద్దేశ్యం లేనట్లయితే, పొరపాటుగా దాసుడు ఏదైనా తప్పుచేసి ఆపై అల్లాహ్ సమక్షంలో నమాజ్ కొరకు నిల్చుంటే అల్లాహ్ అతన్ని నిరాశపరచడు. ఎందుకంటే దాసుని ఆచరణ ద్వారా తెలిసిందేమంటే తప్పులతో ఎదురుదెబ్బ తిన్నప్పటికీ

మళ్ళీ అల్లాహ్ వైపు పశ్చాత్తాపంతో మరలాడు కాని, తిరుగుబాటు చేయలేదు. దీని ఆధారంగానే చెప్పబడిందేమిటంటే ఒక వ్యక్తి, సంపూర్ణ విశ్వాసంతో, పుణ్యఫలాపేక్షతో రోజా వున్నట్లయితే పూర్వపు పాపాలన్నీ పరిహరించబడతాయి. రమజాన్‌లో రాత్రిళ్ళు దైవారాధనలో నిల్చున్నా కూడా అది పాపపరిహారంగా మారుతుంది. అదేవిధంగా లైలతుల్ ఖద్ర్ నాడు ఆరాధన చేసినా ఈ ఆచరణ కూడా తన పాపాల మన్నింపునకు ఆస్కారంగా మారే అవకాశం ఉంది.

## రోజా ప్రతిఫలానికి ఎలాంటి హద్దూ లేదు

۴- عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ
وَسَلَّمَ : کُلُّ عَمَلِ ابْنِ آدَمَ یُضَاعَفُ الْحَسَنَةُ بِعَشْرِ
اَمْثَالِهَا اِلٰی سَبْعِ مِائَةِ ضِعْفٍ قَالَ اللّٰهُ تَعَالٰی اِلَّا الصَّوْمَ
فَاِنَّهٗ لِیْ وَاَنَا اَجْزِیْ بِهٖ، یَدَعُ شَهْوَتَهٗ وَطَعَامَهٗ
مِنْ اَجْلِیْ لِلصَّائِمِ فَرْحَتَانِ فَرْحَةٌ عِنْدَ فِطْرِهٖ وَفَرْحَةٌ
عِنْدَ لِقَاءِ رَبِّهٖ وَلَخُلُوْفُ فَمِ الصَّائِمِ اَطْیَبُ عِنْدَ
اللّٰهِ مِنْ رِیْحِ الْمِسْكِ وَالصِّیَامُ جُنَّةٌ وَّاِذَا کَانَ
یَوْمُ صَوْمِ اَحَدِکُمْ فَلَا یَرْفُثْ وَلَا یَصْخَبْ فَاِنْ
سَابَّهٗ اَحَدٌ اَوْ قَاتَلَهٗ فَلْیَقُلْ اِنِّیْ امْرُءٌ صَائِمٌ۔
(مُتَّفَقٌ عَلَیْهِ)

**4.** హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఆదం సుతుని ప్రతి సత్కార్యం అతని కొరకు ఎన్నో రెట్లు పెంచబడుతుంది. కడకు ఒక సత్కార్యం పదిరెట్లు పెంచి ఇవ్వటం జరుగుతుంది, ఆ పదింతలనే **700** రెట్లకు పెంచి ఇవ్వటం జరుగుతుంది. అయితే అల్లాహ్ సెలవిస్తున్నాడు : రోజా విషయం దీనికి భిన్నమైనది. ఎందుకంటే అది నా కొరకు ఉంచబడింది. అది నేనే. కాబట్టి దాని ప్రతిఫలం కూడా నేనే ఇస్తాను. ఉపవాసి తన శారీరక సుఖాలను, అన్నపానీయాలను నా కోసం త్యజిస్తాడు. ఉపవాసికి రెండు సమయాలు ఆనందదాయకమైనవి. ఒకటి ఇఫ్తార్ వేళ, రెండవది తన ప్రభువును

**కలుసుకునే వేళ. ఉపవాసి నోటి నుంచి వచ్చే వాసన అల్లాహ్‌కు కస్తూరి సువాసనకన్నా మిన్నగా ప్రీతికరం. రోజా డాలు లాంటిది. మీలో ఎవరైనా రోజా వున్నప్పుడు తమ నోటి ద్వారా చెడు మాట్లాడరాదు, హింసా దౌర్జన్యాలు జరపరాదు. ఒకవేళ ఎవరైనా తన పట్ల తిట్లు, దూషణకు దిగితే 'సోదరా! నేను రోజాలో వున్నాన'ని మృదువుగా చెప్పేయాలి. (ముత్తఫకున్ అలైహ్)**

ఇతర పుణ్యకార్యాలైతే పది నుంచి 700 రెట్లకు పెంచి ఇవ్వబడతాయని చెప్పటం జరిగింది, కాని రోజా గురించి, అవి నా కోసం పాటించబడ్డాయి, వాటి ప్రతిఫలాన్ని నేనే ప్రసాదిస్తానని అల్లాహ్ సెలవిస్తున్నాడు. దీని భావం ఇతర సత్కార్యాలు అల్లాహ్ కోసం కావని ఎంతమాత్రం కాదు. వాటి ప్రతిఫలం ఎటూ ఇవ్వబడుతుంది. ఇక్కడ ప్రస్తావించినట్లు దీని భావం ఏమిటంటే అవి అల్లాహ్ కోసం ప్రత్యేకం. కాబట్టి ఆయన కోరినంతగా ప్రతిఫలం ప్రసాదిస్తాడన్నమాట. ఇతర సత్కార్యాల పుణ్యాలు 700 రెట్ల వరకు పెంచి ఇవ్వటం జరుగుతుందని, దీనికి బదులుగా రోజా విషయమై అల్లాహ్ తన ఇష్టానుసారం దాని ప్రతిఫలాన్ని ఇస్తానని సెలవిస్తున్నాడని భావం. అంటే రోజా ప్రతిఫలంలో ఎలాంటి హద్దూ నిర్ధారితమై లేదు. అల్లాహ్ తాను తలచినంత మేరకు ప్రసాదిస్తాడన్నమాట.

## రోజా శ్రేష్ఠత, గొప్పదనం అసాధారణమైనది

అసలు విషయం ఏమిటంటే, ఇతర సత్కార్యాల్ని మనిషి బహిర్గతంగా ఆచరిస్తాడు. ఉదాహరణకు నమాజ్ ఒక బాహ్యాచరణ. నమాజ్ ఆచరించే వ్యక్తి నిల్చుంటాడు, కూర్చుంటాడు, రుకూ, సజ్దాలు చేస్తాడు. ఈ విధంగా ఇది కనిపించే ఆచరణ. హజ్, జకాత్ ఆచరణలు కూడా అంతే. కానీ రోజా వీటికి పూర్తిగా భిన్నమైనది. ఇది బాహ్యాపరంగా కనిపించని ఆచరణ. ఇది తన ప్రభువైన అల్లాహ్‌కు తనకు మాత్రమే తెలుసు. రెండవ కోణంలో ఇది అల్లాహ్ ఆదేశాలను గోప్యంగా శిరసావహించాల్సిన ఆచరణ. ఉదాహరణకు తినటం, త్రాగటం మానుకోవాలి, అదేవిధంగా ఇతర వారించబడిన పనులకు దూరంగా ఉండాలి. ఈ గోప్యమైన ఆచరణ స్వయంగా మనిషికీ లేక దైవానికే తెలుసన్నమాట. మూడో వ్యక్తికి ఇది ఏ విధంగానూ తెలిసే అవకాశం లేదు – ఈ గోప్యాచరణ ఉపవాసి చేశాడా లేదా అన్న

వాస్తవానికి ఈ కాంతి మీ ఆరాధనల్లో కురుస్తుంది. దేవుని యందు మీకున్న నిష్ఠాగరిష్ఠతల్లో, భక్తి తత్పరతలో, పుణ్యఫలాపేక్షతో మీరు చేసే సత్కార్యాల్లో, ఆరాధనల్లో, మీరు చూపే శ్రద్ధాసక్తుల్లో, ఇలా మీరు చేసే ప్రతి ఒక్క కార్యంలో ఆ కాంతి కురుస్తూనే వుంటుంది.

## కారుణ్యం, క్షమాభిక్ష, మోక్షాల మాసం

٩- عَنْ سَلْمَانَ الْفَارِسِيِّ قَالَ خَطَبَنَا رَسُوْلُ اللهِ
صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فِيْ آخِرِ يَوْمٍ مِّنْ شَعْبَانَ
فَقَالَ : يَا أَيُّهَا النَّاسُ قَدْ أَظَلَّكُمْ شَهْرٌ عَظِيْمٌ، شَهْرٌ
مُبَارَكٌ، شَهْرٌ فِيْهِ لَيْلَةٌ خَيْرٌ مِّنْ أَلْفِ شَهْرٍ. جَعَلَ
اللهُ صِيَامَهُ فَرِيْضَةً وَقِيَامَ لَيْلِهِ تَطَوُّعًا مَنْ
تَقَرَّبَ فِيْهِ بِخَصْلَةٍ مِّنَ الْخَيْرِ كَانَ كَمَنْ أَدّٰى فَرِيْضَةً
فِيْمَا سِوَاهُ وَمَنْ أَدّٰى فَرِيْضَةً فِيْهِ كَانَ كَمَنْ أَدّٰى
سَبْعِيْنَ فَرِيْضَةً فِيْمَا سِوَاهُ وَهُوَ شَهْرُ الصَّبْرِ
وَالصَّبْرُ ثَوَابُهُ الْجَنَّةُ وَشَهْرُ الْمُوَاسَاةِ وَشَهْرٌ يُّزَادُ
فِيْهِ رِزْقُ الْمُؤْمِنِ، مَنْ فَطَّرَ فِيْهِ صَائِمًا كَانَ لَهٗ
مَغْفِرَةً لِّذُنُوْبِهٖ وَعِتْقَ رَقَبَتِهٖ مِنَ النَّارِ
وَكَانَ لَهٗ مِثْلُ أَجْرِهٖ مِنْ غَيْرِ أَنْ يَّنْتَقِصَ مِنْ أَجْرِهٖ
شَيْءٌ. قُلْنَا يَا رَسُوْلَ اللهِ لَيْسَ كُلُّنَا نَجِدُ مَا نُفَطِّرُ
بِهِ الصَّائِمَ فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
يُعْطِي اللهُ هٰذَا الثَّوَابَ مَنْ فَطَّرَ صَائِمًا عَلٰى مَذْقَةِ
لَبَنٍ أَوْ تَمْرَةٍ أَوْ شَرْبَةٍ مِّنْ مَّاءٍ وَمَنْ أَشْبَعَ
صَائِمًا سَقَاهُ اللهُ مِنْ حَوْضِيْ شَرْبَةً لَا يَظْمَأُ حَتّٰى
يَدْخُلَ الْجَنَّةَ، وَهُوَ شَهْرٌ أَوَّلُهٗ رَحْمَةٌ وَأَوْسَطُهٗ
مَغْفِرَةٌ وَآخِرُهٗ عِتْقٌ مِّنَ النَّارِ. وَمَنْ خَفَّفَ عَنْ
مَمْلُوْكِهٖ فِيْهِ غَفَرَ اللهُ لَهٗ وَأَعْتَقَهٗ مِنَ النَّارِ (رواه البيهقي)

**9.** హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) షాబాన్ నెలలోని చివరి తేదీన ప్రసంగిస్తూ ఇలా అన్నారు : ప్రజలారా! మీపై ఓ గొప్ప నెల అవతరించబోతోంది. అది అనంత శుభాల మాసం. ఈ నెలలో ఓ రేయి దాగి వుంది, అది వేయి నెలలకన్నా ఘనమైనది. అల్లాహ్ దాని (ఈ మాసం) రోజాలను మీకు విధిగావించాడు. ఆ నెలలోని రాత్రిళ్ళ ఆరాధనను అదనపు ఆరాధనలుగా పరిగణించాడు. ఈ మాసంలో ఎవరైనా ఓ సత్కార్యం చేసి అల్లాహ్ సామీప్యతను పొందే ప్రయత్నం చేసినట్టైతే అతను ఇతర దినాల్లో ఓ విధిగావించబడిన కార్యాన్ని నెరవేర్చి దాని ప్రతిఫలాన్ని పొందినవానితో సమానమవుతాడు (అంటే ఫర్జ్ కార్యనిర్వహణకు సమానమయిన పుణ్యం ప్రాప్తమవుతుంది). ఈ నెలలో ఒక విధిని నిర్వహిస్తే అతనికి **70** రెట్లకు సమానమైన పుణ్యం లభిస్తుంది. రమజాన్ సహనం వహించవలసిన నెల. సహనానికి ప్రతిఫలం స్వర్గప్రాప్తి. ఇది ఒండొకరి పట్ల సానుభూతితో మెలగవలసిన నెల. ఈ మాసంలో విశ్వాసి జీవనోపాధిలో శుభం (సమృద్ధి) ప్రసాదించ బడుతుంది. ఈ నెలలో ఎవరైనా ఒక ఉపవాసికి ఇఫ్తార్ చేయిస్తే, అంటే అన్న పానీయాలను సమకూరిస్తే అది అతని పాపాల మన్నింపుగా మారుతుంది, ఇంకా అతని మెడను నరకాగ్ని యాతన నుంచి కాపాడబడ టానికి కారణభూతమవుతుంది, ఇంకా ఒక ఉపవాసికి లభించే పుణ్యంతో సమానమయిన పుణ్యం అతనికి లభిస్తుంది, ఉపవాసి పుణ్యంలో ఎలాంటి కొరతా చేయబడదు. హజ్రత్ సల్మాన్ (రజి) ఇంకా అన్నారు : మేము (అంటే సహచరులు) 'ఓ దైవప్రవక్తా (స)! మాలో ఎవరికీ ఒక ఉపవాసికి రోజా విరమణ చేయించే శక్తి లేకపోతేనో?' అని విన్నవించు కోగా, ప్రవక్త (స) సెలవిచ్చారు : "ఓ ఉపవాసికి ఎవరైనా పాలతో ఉపవాస విరమణ చేయించినా, లేదా ఒక ఖర్జూరం తినిపించినా లేదా ఒక గ్రుక్కెడు నీరు త్రాపించినా ఆ వ్యక్తికి కూడా అల్లాహ్ దాని పుణ్యాన్ని ప్రసాదిస్తాడు, ఇంకా ఎవరైనా ఒక ఉపవాసికి కడుపు నిండా అన్నం తినిపిస్తే అతనికి నా సెలయేరు నుంచి నీరు త్రాపిస్తాడు, (ఈ సెలయేరు నీరు త్రాగిన పిదప అతనికి ఇక దప్పికయే వుండదు), చివరికి అతను స్వర్గంలో ప్రవేశిస్తాడు." ఈ నెల ఎలాంటిదంటే, దీని ప్రారంభంలో

- ఉపవాసి నోటి వాసన కస్తూరికన్నా మిన్నగా పరిమళాన్ని వెదజల్లుతుందని సెలవియ్యడం జరిగింది. ఎవరయినాసరే తన నోటిని, పళ్లను ఎంతగా పరిశుభ్రపరచినా రోజుకు 12 లేక 14 గంటల పాటు తినటం, త్రాగటం మానివేసిన కారణాన నోటి ద్వారా ఒక రకమయిన దుర్వాసన వస్తుంది. అందువలన ఉపవాసి నోటిద్వారా వెలువడే అలాంటి దుర్వాసన పట్ల అసహ్యించుకోరాదు. ఎందుకంటే ఇలాంటి వాసననే అల్లాహ్ కస్తూరికన్నా మిన్నయైన పరిమళంగా పరిగణించాడు.

## రోజా చెడులను ఎదుర్కొనే డాలు వంటిది

- రోజా డాలు లాంటిదని సెలవియ్యడం జరిగింది. కనుక మీలో ఎవరయినా ఉపవాసం వున్నప్పుడు దుర్భాషలాడకూడదు, దౌర్జన్యం చేయరాదు.

రోజా డాలు వంటిదని ఎందుకు చెప్పబడిందంటే, అది మనిషిని చెడుల నుండి రక్షిస్తుంది. శత్రువు వేటునుండి కాపాడుకోవటానికి డాలును అడ్డంగా పెట్టి రక్షణ పొందినట్లు, రోజాలో వున్నప్పుడు మనం ఏదైనా చెడు కార్యాచరణకు పూనుకోవాల్సిన దుస్థితి ఏర్పడితే, వెంటనే ఉపవాసి తాను రోజాలో వున్నానని గ్రహించి దాన్నుంచి దూరమైపోతాడు. కాబట్టి ఈ సందర్భంలో తన రోజా తనకు డాలులాగా ఉపకరించినట్లుగా పరిగణించాలి. ఈ డాలును ఏ విధంగా పటిష్ఠంగా, సహాయకారిగా చేయాలంటే మనిషి రోజాలో వున్నప్పుడు స్వయంగా ఎవరితోనూ దూషణలకు, తగాదాకు దిగరాదు. ఇది డాలు చేసే మొదటి సహాయం. ఇక రెండవ కోణం ఏమిటంటే, ఎవరైనా తనతో తగాదాకు వస్తే, మిత్రమా! నేను మాత్రం అలా చేయను అని సున్నితంగా చెప్పాలి. ఇకపై ఆ డాలు మనిషిని ప్రతి చెడు కార్యాన్నుంచి ఆపే పటిష్ఠమైన ఆయుధంగా తయారవుతుంది.

ఒకవేళ ఎవరయినా రోజాలు వుండి కూడా ఎవరితోనయినా పోట్లాటకు దిగితే తనకు చెడుల నుండి రక్షణగా వుండే డాలులో ఓ బీటను లేక పగులును వేసినట్లే. ఒకవేళ ఎవరయినా తనతో కోట్లాటకు వస్తే, ఉపవాసి కూడా దానికి దీటుగా చొక్కా చేతుల్ని పైకి మడచి కోట్లాటకు సంసిద్ధుడైతే దాని అర్థం తన డాలును తానే విరచిపారేశాడన్నమాట! ఇక అతను తమలపాకుతో ఇట్టంటే, ఇతను తలుపు చెక్కతో ఇట్లన్నట్లుగా మారుతుంది పరిస్థితి. అయితే ఓ మనిషి ఈ రోజాను డాలులా ఉపయోగించినట్లయితే అది అతనిని నిజంగానే చెడుల నుండి రక్షిస్తుంది.

విషయం. ఉదాహరణకు ఒక మనిషి రహస్యంగా తిని, త్రాగితే ఈ విషయం ఎవరికీ తెలియదు. అంటే రోజాను భంగపరచి కూడా తాను రోజాలో వున్నానని బుకాయిస్తే ఎవరికీ తెలిసిరాదు. అప్పుడు ఏ మూడో వ్యక్తి కూడా అతను రోజాలో వున్నాడో లేదో అన్న విషయాన్ని రూఢీగా చెప్పలేదు – ఒకవేళ తాను రోజాలో వున్నానని చెప్పినా, లేనని చెప్పినా తనకు మాత్రమే తెలుసు. అందువల్లనే రోజా విషయం దాసునికి, దైవానికి మాత్రమే తెలుసు. ఈ కారణంగానే ఇది బాహ్యాపరంగా కన్పించే ఆచరణ కాదు. ఒక వ్యక్తి ప్రపంచానికి చూపించటానికి తాను రోజాలో వున్నానని చెప్పవచ్చు. వాస్తవానికి అందులో బాహ్యాచరణ ఏమాత్రం లేదు. అతను అల్లాహ్‌ను మోసం చేయలేడు. అందుకనే అల్లాహ్ రోజా నా కోసం ప్రత్యేకించబడింది. وَاَنَا اَجْزِيْ بِهٖ **"వ అనా అజ్‌జీబిహీ"** కాబట్టి నేనే దాని ప్రతిఫలం ఇస్తానని సెలవిచ్చాడు.

దీని భావం, అల్లాహ్ రోజా ప్రతిఫలాన్ని లెక్కలేనంతగా ఇస్తాడు. మనిషి ఎంతగా దీక్షతో, నిష్టాగరిష్టతో, తఖ్వాతో రోజా వుంటూ, దానిద్వారా ఆధ్యాత్మికంగా, ధార్మికంగా ప్రయోజనాన్ని పొందుతూ వుంటాడో అంతగా వాటి ప్రతిఫలం పొందుతాడు. మిగతా రోజుల్లో కూడా అదే ఆచరణ స్థిరంగావుంటే అల్లాహ్ అందులో అంతగానే వృద్ధీవికాసాలను ప్రసాదిస్తాడు.

అల్లాహ్ దృష్టిలో ఈ రోజా గురించి వున్న అసామాన్య గౌరవాదరణలకు మరో కారణం ఏమిటంటే, ఉపవాసి అల్లాహ్ కోసమే తన లైంగిక వాంఛను, అన్నపానీయాలను త్యజిస్తాడు. అందువల్లనే అల్లాహ్ అతన్ని పరలోకంలో లెక్కకు మించిన ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు.

## ఉపవాసి కొరకు రెండు ఆనంద ఘడియలు

- ఉపవాసి రెండు సందర్భాల్లో సంతోషపడతాడు. ఒకటి, ఉపవాస విరమణ వేళ, రెండవది తన ప్రభువైన అల్లాహ్‌ను కలుసుకునే సమయంలో.

దీని అర్థం, ఉపవాస దీక్ష విరమణ సందర్భంలో ఉపవాసికి లభించే సంతోషం ఇఫ్తార్‌తోనే అంతమవదు. పైగా అతను తన ప్రభువును కలుసుకున్నప్పుడు అంతకన్నా ఎక్కువ సంతోషమే ప్రాప్తమవుతుంది. తాను ఇహలోకంలో చేసివచ్చిన సదాచరణకు ఆయన సన్నిధిలో ఎంత గొప్ప ప్రతిఫలం లభించిందో కూడా అతనికి తెలిసివస్తుంది.

## షైతాన్ ఎందుకు బంధించబడతాడు?

రమజాన్ నెల ప్రారంభమవగానే విశ్వాసి అయిన సజ్జనుడు మామూలు రోజుల్లో లేని ప్రతిబంధకాల్ని తన మనోవాంఛలపై విధించుకుంటాడు. ఉదాహరణకు మామూలు రోజుల్లో అతనికి ధర్మసమ్మతమైన నీరు రమజాన్‌లో అతనికి 12 నుంచి 14 గంటల వరకు హరామ్ (నిషిద్ధం) అయిపోతుంది. మామూలు రోజుల్లో అతనికి అనుమతించబడిన హలాల్ (ధర్మసమ్మతం) అయిన ఆహారం రమజాన్‌లో అనేక గంటల పాటు అతనికి నిషిద్ధమైపోతుంది. తెలిసేదేమంటే, ఒక విశ్వాసికి మామూలు రోజుల్లో లేని ప్రతిబంధకాలు రమజాన్ నెలలో అతని మనోవాంఛలు, శారీరక వాంఛలు, స్వేచ్ఛలపై ఏర్పడతాయి. అప్పుడు విశ్వాసి కట్టుబాట్లకు తలొగ్గి వాటిలో బంధితుడవుతాడు. ఒకవేళ విశ్వాసి మనోకాంక్షలకు దాసుడై, షరీఅత్‌ను పాటించకున్నట్లయితే తనలో వున్న షైతాన్ బంధించబడలేదని, చట్టం సాక్షిగా వాడు స్వేచ్ఛగా తిరుగుతూ తన పని తాను చేసుకుంటూ పోతున్నాడని భావించాలి. కాబట్టి ఇక మీరే గ్రహించండి, ఒక వ్యక్తి షరీఅత్ విధించిన కట్టుబాట్లను ఏ క్షణం నుంచి పాటిస్తాడో ఆ క్షణం నుంచే అతను తన షైతాన్‌ను గొలుసులతో బంధితునిగా చేశాడని అర్థం. ఎప్పుడైతే అతను తనపై షరీఅత్ నిబంధనల్ని విధించుకున్నాడో అప్పుడు రెండోవైపు తన కోసం స్వర్గద్వారాలు తెరచుకున్నాయన్నమాట. షైతాన్‌లు బంధించబడతాయంటే, నరకద్వారాలు మూయబడతాయంటే, స్వర్గద్వారాలు తెరచుకుంటాయంటే అర్థం ఇదే. ఇలాంటి ఆచరణలు విశ్వాసులు, సజ్జనులు నివసించేచోట వికసించి వెలుగొందుతాయి. అంతేగాని ప్రపంచంలో వున్న షైతాన్‌లందరూ బంధించబడతారని దీని భావం కాదు. ఆ మాటకొస్తే నేడు ముస్లింల బస్తీల్లో కూడా షైతాన్‌లు యధేచ్ఛగా తిరుగుతున్నాయి. ముస్లిములయి వుండి కూడా షరీఅత్ కట్టుబాట్లకు విరుద్ధంగా నడుచున్నట్లయితే, వారి షైతాన్ స్వేచ్ఛగా తిరుగాడటమే కాదు, వారిపై తన అధికారం చెలాయిస్తున్నాడన్నమాట. తన మనోకాంక్షలపైన కట్టుబాట్లను విధించుకుని, అల్లాహ్ ఆదేశానుసారం నడుచుకున్న వ్యక్తి యొక్క షైతాన్ మాత్రమే బంధించబడినట్లు లెక్క.

## రమజాన్ పిలుపు

- ప్రకటనకర్త 'మేలును కాంక్షించేవాడా! ముందుకు సాగు, చెడు చేసే తలంపు గలవాడా! ఇక ఆగిపో' అని ప్రకటించటం జరుగుతుందని సెలవియ్యడం జరిగింది.

రెండవ భాగం

## నరకం నుంచి విముక్తి నొందే మాసం

٥۔عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ
وَسَلَّمَ: اِذَا كَانَ اَوَّلُ لَیْلَةٍ مِنْ شَهْرِ رَمَضَانَ صُفِّدَتِ
الشَّیَاطِیْنُ وَمَرَدَةُ الْجِنِّ وَغُلِّقَتْ اَبْوَابُ النَّارِ فَلَمْ
یُفْتَحْ مِنْهَا بَابٌ وَّفُتِحَتْ اَبْوَابُ الْجَنَّةِ فَلَمْ یُغْلَقْ
مِنْهَا بَابٌ وَّیُنَادِیْ مُنَادٍ یَّا بَاغِیَ الْخَیْرِ
اَقْبِلْ وَیَا بَاغِیَ الشَّرِّ اَقْصِرْ، وَلِلّٰهِ عُتَقَاءُ
مِنَ النَّارِ وَذٰلِكَ كُلَّ لَیْلَةٍ۔ (رَوَاهُ التِّرْمِذِیُّ وَابْنُ مَاجَه)

5. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : రమజాన్ నెల మొదటి రాత్రి ప్రవేశించగానే దుష్కార్యాలను ప్రేరేపింపజేయడానికి సంసిద్ధులైన షైతానులు, జిన్నులు బంధించబడతారు. నరక ద్వారాలు మూసివేయబడతాయి, వీటిలో ఏ ద్వారమూ తెరవబడదు. ఇంకా స్వర్గద్వారాలు తెరవబడతాయి, అందులోని ఏ ద్వారమూ మూసివేయబడదు. ఆపై ప్రకటన కర్త ఇలా ప్రకటిస్తాడు - మేలును కాంక్షించేవాడా! ముందుకు సాగిపో. చెడులను ఆశించేవాడా! ఆగిపో. మీలో ఎంతోమంది అల్లాహ్ తరఫు నుండి నరక జ్వాలల నుండి రక్షణ పొందుతారు. ఇలా ప్రతి రాత్రి జరుగుతుంది.

(తిర్మిజీ, ఇబ్నెమాజా)

ఇస్లామీయ క్యాలెండర్ చాంద్రమానంపై ఆధారపడివుంది. చాంద్రమాసాలు చంద్రోదయంతో ప్రారంభమవుతాయి. అందుకని ఇస్లాంలో ప్రతి నెలా రాత్రితో ప్రారంభమవుతుంది. అందువల్ల రమజాన్ నెల చంద్రుణ్ణి చూసిన పిదప ప్రారంభమవుతుంది. ఈ కారణంగానే ఇక్కడ రమజాన్ మాసంలోని మొదటి రాత్రి నుద్దేశించి సెలవియ్యటం జరిగింది - ఇందులో షైతానులను, ఇంకా చెడులను, హింసను వ్యాపింపజేసే జిన్నులను బంధించటం జరుగుతుందని. రమజాన్ ప్రత్యేకతలతో పాటు ఈ విషయం కూడా మన దృష్టిలో వుండాలి. అదేమిటంటే, ఈ రమజాన్ వెలుగు, శుభాలు మొత్తం ప్రపంచంలో వుండదు. ఈ వాతావరణం కేవలం ముస్లిములు, సజ్జనులు నివసించే ప్రాంతాల్లోనే నెలకొంటుంది.

ఆ ఘనమైన రాత్రి ఏమిటో మీకు తెలుసా? ఆ ఘనమైన రాత్రి వెయ్యి నెలలకంటే కూడా ఎంతో శ్రేష్ఠమైనది.

వాస్తవం ఏమిటంటే, ఖుర్‌ఆన్ అవతరణ మానవాళి కొరకు గొప్ప మేలుతో కూడుకొని ఉంది. మానవుని కొరకు ఇంతకన్నా గొప్ప వరం, మేలు మరొకటి వుండజాలదు. అందుకనే ఖుర్‌ఆన్ అవతరించిన రాత్రి వెయ్యి నెలలకంటే ఎక్కువ శ్రేష్ఠమైనదని సెలవియ్యటం జరిగింది. మరో అర్థంలో చెప్పాలంటే ఈ ఒక్క రాత్రిలో ప్రసాదించిన శ్రేష్ఠత, మేలు మొత్తం మానవ చరిత్రలోనే వెయ్యి నెలల్లో ఇలాంటి శ్రేష్ఠత ప్రసాదించబడలేదు. వెయ్యి నెలలు అంటే ఖచ్చితంగా వెయ్యి అని లెక్క లేదు. ఇది దీనికన్నా ఎన్నో రెట్లు అధికమైందని ఉద్దేశం. కాబట్టి శ్రేష్ఠత దృష్ట్యా ఇది వెయ్యి నెలలకన్నా మిన్న. అల్లాహ్ ఆరాధనలో భక్తి శ్రద్ధలను నిలిపిన వ్యక్తి ఎంతో గొప్ప మేలును పొందినట్లేనని లెఖ్క. ఎందుకంటే ఈ రేయి దాసుడు అల్లాహ్‌కు ఎంతో చేరువయిపోతాడు. దీనికి రుజువు ఏమిటంటే, ఈ రేయి ప్రత్యేకత ఏమిటో దాసునికి తెలుసు. ఈ రేయిన అల్లాహ్ మనుజ జాతిపైన ఎంతగా మేలు చేశాడంటే తన వాణిని అవతరింపజేశాడు. అందువలన ఈ రేయి అల్లాహ్‌ను ఆరాధించిన వ్యక్తి ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకున్నాడన్నమాట. ఇలా చేసి ఖుర్‌ఆన్ పట్ల తన హృదయంలో వున్న గౌరవాదరణలను తనకు తాను నిరూపించుకున్నాడన్నమాట.

## ఈ రేయిలోని మేలుకు దూరంగా వున్నవాడు నిష్ఫలుడే అయ్యాడు

దీని అర్థం ఏమిటంటే ఒకవేళ ఎవరైనా ఒక వ్యక్తి ఈ రేయి ఆరాధనలో గడపలేదంటే ఈ రేయిలో అల్లాహ్ అవతరింపజేసిన ఖుర్‌ఆన్ యొక్క గొప్ప మేలు, శ్రేష్ఠత పట్ల అతనికి స్పృహే లేదన్నమాట. అలాంటి స్పృహే అతనిలో వున్నట్లయితే ఈ రేయి అతను ఆరాధనలో నిలబడి "ఓ అల్లాహ్! ఘనత, శుభాలు నిండిన ఖుర్‌ఆన్ అవతరింపజేసి నాకు ఎంతో సహాయం చేశావని" కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. ఇంకా 'నీవు నాకు తినటానికి ఆహారాన్ని, తొడగటానికి వస్త్రాలను ప్రసాదించావు. కాని నీ అసలైన కరుణానుగ్రహాల సహాయం ఏమంటే నీవు నాకు సన్మార్గాన్ని ప్రసాదించావు, నిజధర్మం వెలుగును ప్రసాదించావు. చీకట్లలో తచ్చాడకుండా నన్ను కాపాడావు, ఇంకా వాస్తవ జ్ఞానజ్యోతిని ఇచ్చావు, కాబట్టే దాని ద్వారా నేను రుజుమార్గాన నడిచి నీ ప్రీతిని పొందే భాగ్యానికి నోచుకునే యోగ్యుడనయ్యాను' అని విన్నవించుకుంటాడు. ఆ విధంగా ఎవరిలోనైతే ఈ అనుగ్రహభాగ్యం పట్ల స్పృహ కలుగుతుందో అతను ఈ రేయి అల్లాహ్ ఆరాధనలో గడుపుతాడు.

అందులోని శుభాలను ఆస్వాదిస్తాడు. శాయశక్తులా వాటిని జుర్రుకుంటాడు. ఒకవేళ ఎవరయినా ఈ రేయి కృతజ్ఞతాపూర్వకంగా అల్లాహ్ సన్నిధిలో ఆరాధనకు నిల్చోకపోతే ఈ రేయి శుభాలకు అతను దూరమయినట్లే. వాస్తవానికి అతను గొప్ప మేలుకు దూరమైన దౌర్భాగ్యుడని దీని భావం.

## రోజా, ఖుర్‌ఆన్ దైవదాసుని కొరకు సిఫారసు చేస్తాయి

۷- عَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرٍو اَنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: اَلصِّيَامُ وَالْقُرْاٰنُ يَشْفَعَانِ لِلْعَبْدِ، يَقُوْلُ الصِّيَامُ اَىْ رَبِّ اِنِّىْ مَنَعْتُهُ الطَّعَامَ وَالشَّهَوَاتِ بِالنَّهَارِ فَشَفِّعْنِىْ فِيْهِ، وَيَقُوْلُ الْقُرْاٰنُ مَنَعْتُهُ النَّوْمَ بِاللَّيْلِ فَشَفِّعْنِىْ فِيْهِ فَيُشَفَّعَانِ.

(رواه البيهقى)

7. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : రోజా మరియు ఖుర్‌ఆన్ దాసుని కొరకు సిఫారసు చేస్తాయి. రోజా అంటుంది : 'ఓ ప్రభూ! నేను ఇతన్ని రోజంతా అన్నపానీయాల నుండి, లైంగిక వాంఛల నుండి దూరంగా వుంచాను. కాబట్టి నీవు ఇతని విషయంలో నా సిఫారసును స్వీకరించు.' ఇంకా ఖుర్‌ఆన్ ఇలా అంటుంది – 'ప్రభూ! నేను ఇతన్ని రాత్రుల్లో విశ్రాంతికి దూరం చేశాను, కాబట్టి ఇతని పట్ల నా సిఫారసు ఆమోదించు.' అంతే, రెంటి సిఫారసూ ఆమోదించబడుతుంది. (బైహఖీ)

దీని అర్థం, రోజా, ఖుర్‌ఆన్‌లు ప్రాణమున్న జీవులు కాదు – అవి నిలబడి ఈ విధంగా మాట్లాడటానికి. దీని ఉద్దేశం ఏమిటంటే, ఉపవాసాలుండే ఒక వ్యక్తి, అలాగే ఖుర్‌ఆన్ పఠించే వ్యక్తి నిజానికి వారంతట వారే సిఫారసుకు అర్హులవుతారు. అల్లాహ్ సమక్షంలో రోజాను ప్రత్యక్షపరచినప్పుడు దానితో పాటు దాని సిఫారసు కూడా ప్రత్యక్షమవుతుంది. అప్పుడది అల్లాహ్‌తో అంటుంది – ఈ దాసుడు నీ కోసం అన్నపానీయాలను మానుకున్నాడు. ఇతను రహస్యంగా దాగి తింటం, త్రాగటం ఇంకా ఇతర కోరికలను కూడా తీర్చుకునేవాడే, కాని ఇతను అలా

చేయలేదు. రోజంతా ఈ దాసుడు అన్నపానీయాలపైన, ఇతర కోరికలపైన నీ కట్టుబాట్లను భరించాడు. కాబట్టి ఇతని తప్పులను మన్నించు.

అదేవిధంగా ఒక వ్యక్తి రాత్రుల్లో ఖుర్‌ఆన్ పారాయణం చేస్తాడు. ఖుర్‌ఆన్ అల్లాహ్ సమక్షంలో హాజరవటం కూడా దానంతటదే సిఫారసుకు తార్కాణం అన్నమాట. ఆ సిఫారసు ఇలా వుంటుంది – ఈ వ్యక్తి రోజంతా ఉపవాసం వుండి అలసిపోయి కూడా నీ ప్రీతి కొరకు నమాజ్‌లో నిల్చొని ఖుర్‌ఆన్ పారాయణం చేశాడు, కాబట్టి ఇతని తప్పుల్ని క్షమించు.

ప్రళయదినం నాడు దైవప్రవక్త (స) విశ్వాసులకు, సజ్జనుల కొరకు సిఫారసు చేసినట్లే, స్వయంగా మనిషి యొక్క మంచి ఆచరణలు కూడా అతని కొరకు సిఫారసు చేస్తాయి. మనిషి ఆచరణలు అల్లాహ్ సమక్షంలో హాజరై, ఈ మనిషి ఫలానా మంచి పనులు చేసివచ్చాడు, కాబట్టి ఇతన్ని మన్నించు, ఇతని తప్పిదాల పట్ల చూపోపు వహించు అని అంటాయి.

మహాప్రవక్త (స) వారి ఈ ఉల్లేఖనాన్నిబట్టి అల్లాహ్ తన దాసుని విషయంలో రోజా మరియు ఖుర్‌ఆన్‌ల సిఫారసులను స్వీకరిస్తాడు.

## లైలతుల్ ఖద్ర్ (ఘనమైన రేయి)ని పోగొట్టుకుంటే సర్వాన్నీ పోగొట్టుకున్నట్లే

٨- عَنْ أَنَسِ بْنِ مَالِكٍ قَالَ دَخَلَ رَمَضَانُ فَقَالَ رَسُوْلُ
اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ هٰذَا الشَّهْرَ قَدْ
حَضَرَكُمْ وَفِيْهِ لَيْلَةٌ خَيْرٌ مِّنْ أَلْفِ شَهْرٍ. مَنْ حُرِمَهَا
فَقَدْ حُرِمَ الْخَيْرَ كُلَّهُ، وَلَا يُحْرَمُ خَيْرَهَا إِلَّا كُلُّ مَحْرُوْمٍ
(رَوَاهُ ابْنُ مَاجَه)

8. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) గారి ఉల్లేఖనం:రమజాన్ నెల ప్రారంభం కాగానే దైవప్రవక్త (స) సెలవిచ్చారు:ఈ నెల మీపై ఆసన్నమయ్యింది, ఇందులో ఒక రేయి ఉన్నది, అది వెయ్యి నెలలకంటే శ్రేష్ఠమయినది. దీన్ని పోగొట్టుకున్నవాడు అన్ని మేళ్ళనూ పోగొట్టుకున్నట్లే. దీని మేళ్లను కేవలం స్వతహా దురదృష్టవంతుడే పోగొట్టుకుంటాడు. (ఇబ్నెమాజా)

ఈ సందర్భంగా లైలతుల్ ఖద్ర్ ఏ రోజు రాత్రిలో వుందన్న విషయాన్ని అర్థం చేసుకోవాలి. ప్రవక్త (స) తెలిపిన దాని ప్రకారం అది రమజాన్ మాసంలోని చివరి దశకంలో ఉంది. అంటే అది 21వ రాత్రి కావచ్చుగానీ, 22వ రాత్రి కాదు, అలాగే 23వ రాత్రి కావచ్చుగానీ 24వ రాత్రి కాదు. మొత్తంమీద అది చివరి దశకంలోని బేసి రాత్రి. ఈ విషయాన్ని తెలిపిన తరువాత అది ఖచ్చితంగా ఏ రాత్రి అనే విషయాన్ని తెలుపకుండా వదలివేయటం జరిగింది. సాధారణంగా ప్రజలు లైలతుల్ ఖద్ర్ 27వ రాత్రి కావచ్చు అనే నమ్మకం కలిగివున్నారు. కాని అది 27వ రాత్రి మాత్రమే అని గట్టిగా చెప్పలేము. అయితే అది చివరి దశకంలోని ఏదో ఒక బేసి రాత్రి అని మాత్రం గట్టి నమ్మకంతో చెప్పవచ్చు.

అయితే లైలతుల్ ఖద్ర్ ఇదమిత్థంగా ఇదేనని చెప్పకపోవటంలో కూడా విజ్ఞత దాగివుంది. ఎందుకంటే మనిషి ప్రతి బేసి రాత్రి దైవ సన్నిధిలో నిలబడి దానిని పొందే ప్రయత్నం చేస్తాడనే యుక్తి ఇందులో దాగివుంది. ఒకవేళ ఈ రాత్రుల్లో మనిషి దేన్ని అభిలషిస్తున్నాడో అది అతనికి లభ్యమైతే, దాని తరువాత కూడా కొన్ని రాత్రులు దైవారాధనలో గడిపినట్లయితే అది అతని పుణ్యాల్లో మరింత పెంపుదలకు కారణభూతమవుతుంది.

ఈ సందర్భంగా గ్రహించాల్సిన మరో విషయం ఏమిటంటే, ప్రపంచంలో రమజాన్ తేదీలు ఎప్పుడూ ఒకేవిధంగా ఉండవు, అవి మార్పులకు గురవుతూ ఉంటాయి. అందువలన ఎవరైనా ఓ మనిషికి ఆ రాత్రి లభించింది అని గట్టిగా చెప్పడం కష్టమైన విషయం. సత్యాభిలాషి అయిన మనిషి దాని కొరకు ప్రతి రాత్రి వెదకాల్సిన అవసరముంది. రమజాన్‌లోని చివరి దశకం ఏతెకాఫ్ కొరకు నిర్ణయించబడింది. ఇందులో కూడా ఓ పరమార్థం దాగివుంది. ఒక ప్రక్క అతనికి ఏతెకాఫ్ పుణ్యమూ దొరుకుతుంది. మరోవంక ఏతెకాఫ్‌లో వున్న మనిషి తన బేసి రాత్రులన్నీ ఆరాధనలో గడుపుతాడు. కాబట్టి ఏదో ఓ రాత్రి అతనికి ఈ లైలతుల్ ఖద్ర్ తప్పకుండా దొరికే ఆస్కారమూ వుంటుంది.

కొన్ని ప్రాంతాల్లో కొంతమంది ప్రజలు దీని భావాన్ని మరోరకంగా కూడా గ్రహించారు. అదేమిటంటే, ఈ రాత్రి బయటికి వచ్చి చూస్తే వాతావరణంలో ప్రశాంతత, నిర్మలత నెలకొనివుంటుంది. దాని భావం ఆ రాత్రి లైలతుల్ ఖద్ర్ లభించినట్లేనని తలపోశారు. కాకపోతే ఆ రోజు వాతావరణంలో కాంతి కురుస్తుందన్న విషయం రూఢీ కావలసి వుంది. అయితే ఇలాంటి భావన వాస్తవ విరుద్ధమైనది. కాంతి అయితే ఆ రాత్రి కురుస్తుంది. అయితే అది ఆ ఒక్క రాత్రే కాదు, రమజాన్‌లో ప్రతిరోజు రాత్రీ కాంతి కురుస్తూనే వుంటుంది. కాకపోతే దాన్ని చూసే కళ్ళు కావాలి.

**కారుణ్యం వుంది, మధ్యస్థంలో క్షమాభిక్ష వుంది, చివర్లో నరకం నుంచి విముక్తి వుంది. ఈ నెలలో ఎవరైనా (యజమాని) తన సేవకునితో తేలికైన పని చేయిస్తే అల్లాహ్ ఆ యజమానిని క్షమించి నరకాగ్ని నుంచి విముక్తి నొసగుతాడు." (బైహఖీ)**

ఈ హదీసు ద్వారా తెలిసేదేమంటే (ఇంతకు ముందు కూడా ఇదే విషయాన్ని చెప్పటం జరిగింది) మహాప్రవక్త (స) రమజాన్ శుభాల గురించి ఇంకా ఉపవాసాల హితవులను గురించి సాధారణంగా షాబాన్ నెలలోని జుమా ప్రసంగాలలో లేదా ఇతర ధార్మిక సమావేశాలలో విశదపరచేవారు. రమజాన్ నెలలోని ప్రసంగాలలో కూడా రమజాన్ ఉపవాసాల హితవులను ప్రబోధించేవారు. అయితే ఆయన (స) రమజాన్ ప్రారంభం కాకముందే షాబాన్ నెలలోనే రమజాన్ శుభాల గురించి పాటించాల్సిన నియమాలను విడమరచి చెప్పేవారు.

దైవప్రవక్త (స) ఓ ప్రసంగంలో ఇలా సెలవిచ్చారు :

❖ **ప్రజలారా! మీపై ఓ శుభకరమైన, మాన్యత కలిగిన నెల రాబోతోంది.**

రమజాన్ నెలలో శుభాభివృద్ధులు, మాన్యత లభిస్తాయంటే ఉద్దేశం దాని రోజుల్లో, గంటల్లో, నిముషాల్లో, క్షణాల్లో ప్రతి మనిషికీ ఇట్టే దాని శుభాభివృద్ధులు వాటంతటవే లభిస్తాయని దాని అర్థం కాదు. దాని అసలు ఉద్దేశం ఏమిటంటే ఈ నెలలో అల్లాహ్ లెక్కలేనన్ని పుణ్యాలను, శుభాలను సంపాయించుకునే అవకాశాన్ని మీకు కల్పిస్తాడు. ఈ నెలలో ఒక మనిషి ఎంత ఎక్కువ ఆరాధనలు చేసి, పుణ్యాలను సంపాదించుకుంటాడో అంతగానే అతని ఆధ్యాత్మిక జీవితంలో పరిణతి చేకూరుతుంది. ఇందులో శుభాలు, మాన్యతలు వున్నాయన్న దాని ఉద్దేశం వాటిని ఎక్కువగా పొందే అవకాశాన్ని మీకు కల్పించబడిందన్నమాట.

❖ **ఈ నెలలో ఓ రేయి వుంది - అది వెయ్యి నెలలకన్నా శ్రేష్ఠమైనది.**

దీని ఉద్దేశం "లైలతుల్ ఖద్ర్" (ఘనమైన రేయి) అన్నమాట - ఈ రాత్రిలోనే అల్లాహ్ దివ్య ఖుర్ఆన్‌ను అవతరింపజేశాడు. ఇది వేయి నెలలకంటే ఘనమైనది అన్నదాని భావం ఏమిటంటే, మానవజాతికి ఈ రేయిన చేకూరినంత మేలు మరెప్పుడూ లభించదని అర్థం.

❖ **అల్లాహ్ రమజాన్ రోజాలను విధిగావించాడు. ఇంకా దాని రాత్రులలో ఆరాధనలు చేయటాన్ని అదనపు (నఫిల్) ఆరాధనలుగా ఖరారు చేశాడు.**

**'తతవ్వూ'** అంటే మనిషి తన మనఃపూర్వకంగా, స్వచ్ఛందంగా (Voluntarily) నెరవేర్చే పని అన్నమాట – అది అతనికి విధి గావించబడకపోయినాసరే.

రమజాన్ పగటి ఉపవాసాలను విధిగాను, రాత్రి జాగరణను నఫిల్‌గాను నిర్ణయించడం జరిగింది. ఫర్జ్, నఫిల్ ఆరాధనలు రెంటినీ ఒకేచోట చేర్చటం జరిగింది. విధి (ఫర్జ్) గావించబడిన వాటి ప్రయోజనాలు వేరుగా వున్నాయి. ఇంకా మనిషి తన ఇష్టానుసారం, ఎలాంటి బలవంతం, వత్తిడి లేకుండా నిర్వర్తించే కార్యాల పుణ్యాలు వేరుగా వున్నాయి. దైవారాధన చేయటం ద్వారా చేకూరే లాభాలు వేరుగా వున్నాయి. ఒక మనిషి తన విధిని నిర్వర్తిస్తే అతను ఓ రకమైన బహుమానానికి అర్హుడవుతాడు. తనకు విధిగా చేయబడని దాన్ని, తన ఇష్టపూర్వకంగా చేస్తే దానికి ప్రతిగా అతను ఎన్నో బహుమతుల స్వీకృతికి అర్హుడవుతాడు. రెండవ విషయం ఏమిటంటే అతనికి అదనపు ప్రతిఫలం లభిస్తుంది. దీనివల్ల తెలిసిందేమంటే ఈ నెలలో రెండు రకాల అవకాశాలు కల్పించబడ్డాయి. ఒకటి, విధి నిర్వహణ, దానికి నిర్ణయించబడిన ప్రతిఫలానికి అర్హత లభించింది. రెండవది, మీ ఇష్టాయిష్టాలకు వదలివేయబడినది. దైవసామీప్యాన్ని, ప్రీతిని పొందాలంటే రాత్రివేళ దైవారాధనలో జాగరణ చేసి మరిన్ని బహుమతులు పొందవచ్చు. ఇది మాన్యత కలిగిన నెలలోని శుభాల గురించిన విశదీకరణ.

దీని పిదప సెలవియ్యబడింది : ఎవరైనా ఒక వ్యక్తి ఈ నెలలో ఒక పుణ్యాన్ని నిర్వర్తించి అల్లాహ్ సామీప్యతకు చేరుకునే ప్రయత్నం చేస్తే, వేరే రోజుల్లో విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చిన పుణ్యానికి సమానమైన ప్రతిఫలం అతనికి ఇవ్వటం జరుగుతుంది. ఇంకా ఈ నెలలో ఎవరయినా ఒక విధిని నిర్వర్తిస్తే ఇతర రోజుల్లో నిర్వర్తించిన 70 విధులు దానికి సమానం.

ఇక్కడ **'ఫరీజహ్'** కు బదులు **'ఖస్లతున్ మినల్ ఖైర్'** అన్న పదాలు ఉపయోగించబడ్డాయి. వీటిద్వారా దానంతట అది 'అదనపు పుణ్యం' అని అర్థం వస్తుంది. అంటే, ఈ నెలలో ఎవరైనా ఓ వ్యక్తి అదనంగా ఏదైనా పుణ్యాన్ని నిర్వర్తిస్తే, ఇతర దినాల్లో విధిని నిర్వర్తించిన దానికి సమానమైన పుణ్యం లభిస్తుంది.

## రమజాన్ కాలంలో ఈ తేడా ఎందుకు?

ఇతర దినాలకు, రమజాన్ రోజులకు తేడా ఎందుకంటే మామూలు రోజుల్లో మనిషి చాలామటుకు విధి నిర్వహణనైనా, ఆరాధనలనైనా వ్యక్తిగతంగా నిర్వర్తిస్తాడు.

అయితే రమజాన్ నెలను సామూహికంగా మొత్తం సమాజం కొరకే పుణ్యకార్యాల వసంతంగా నిర్ణయించడం జరిగింది. మొత్తం సముదాయం ఒకేసారి ఉపవాసాలను పాటిస్తుంది, విరమిస్తుంది. అలాగే అందరూ ఒకే సమయంలో వెళ్ళి తరావీహ్ నమాజ్, ఇంకా ఇతర ఆరాధనలు నిర్వర్తిస్తారు. ఈ విధంగా పూర్తి సముదాయంలో పుణ్యకార్యాల నిర్వర్తనకు ఒక సాధారణ వాతావరణం ఏర్పడుతుంది. అందువలన ఆ కాలంలో పుణ్యాలు బాగా పుష్పించి, ఫలదీకరిస్తాయి – ఏ విధంగానైతే వర్ష రుతువులో సస్యం బాగా పెరిగి పుష్పించి ఫలవంతమవుతుందో. కాబట్టి రమజాన్ మాసంలో ఒక వ్యక్తి చేసిన పుణ్యకార్యంతో పాటు ఇతరుల పుణ్యాలు కూడా చేరి అవి వికాసమొందుతాయి. రమజాన్ సాధారణంగా వరాల మాసం. కాబట్టి ఈ కాలంలో అల్లాహ్ అనుగ్రహాలు, శుభాలు, కారుణ్యాలు సర్వ సాధారణంగా వృద్ధివికాసం పొందుతాయి. ఒక వ్యక్తి నఫిల్ నమాజ్‌లు చేసినా, ఎవరికైనా ఏదైనా సహాయం చేసినా, దానధర్మాలు చేసినా, ఇతర రోజుల్లో నిర్వర్తించిన విధ్యుక్త ధర్మాలకు లభించినంత పుణ్యం లభిస్తుంది. అదేవిధంగా రమజాన్‌లో ఒక విధిని నిర్వర్తిస్తే అది జకాత్‌నయినా, నమాజ్ లేక రోజా అయినా అది ఇతర రోజుల్లో చేసిన 70 రెట్ల జకాత్ చెల్లింపునకు, 70 రెట్ల నమాజ్‌లకు, 70 రెట్ల రోజాలకు సమానంగా పుణ్యం లభిస్తుంది.

**'సబ్‌ర్'** పదానికి అరబీ నిఘంటువు ప్రకారం కట్టి పడేయటం, నిలువరించటం అని అర్థం. ఈ సందర్భంగా 'సబ్‌ర్' అన్న దానికి అర్థం అల్లాహ్ ఆదేశాలకు వ్యతిరేకంగా నడచుకోకుండా, అల్లాహ్ విధేయతా పరిధిని దాటిపోకుండా మనిషి తనకు తాను కట్టి పడేసుకోవటం, మనస్సును నిగ్రహించుకోవటం, నిలువరించటం అన్నమాట.

**సహనానికి ప్రతిఫలం స్వర్గం.** ఒక వ్యక్తి స్వర్గాన్ని పొందాడంటే దానికి కారణం, అతను తన మనసును ఎంతగా అదుపు చేశాడంటే, అది తన మనోవాంఛలను ఇట్టే వదలిపెట్టలేదన్నమాట, ఇంకా దానిని దైవప్రీతిని చూరగొనేలా తయారు చేశాడన్నమాట.

## రమజాన్‌లో సహనానికి జరిగినంత అభ్యాసం మరే సందర్భంలోనూ జరగదు

రమజాన్‌లో 24 గంటలూ మనిషి సహనం అలవడేలా అభ్యాసం చేస్తాడు. సహరీ వేళ అతను లేచే పరిస్థితిలో వుండడు, అయినా లేస్తాడు, అది తినే సమయం కాదు, అయినా తన మనస్సునుద్దేశించి 'నీ ప్రభువు తరఫున నిర్దేశించబడిన తినేవేళ

ఇది. కాబట్టి నీవు తినాలి, లేకుంటే రోజంతా నీవు పస్తులుండాల్సి వస్తుంది' అనంటాడు. ఈ విధంగా అల్లాహ్ ఆదేశాలను శిరసావహిస్తూ తన మనస్సును అదుపు చేసే పగ్గాలు తన చేతిలో వుంటాయన్నమాట. అలా లేకుంటే మనోపగ్గాలు తననే అదుపు చేస్తాయి. ఆపై అల్లాహ్ ఆజ్ఞ మేరకు తినటం, త్రాగటం మానేస్తాడు. తరువాత తన చేతులు తినటానికిగానీ, త్రాగటానికి గానీ ముందుకు రావు. రోజంతా ఎలాంటి పరిస్థితికి లోనైనాసరే మనసు అదుపు తప్పకుండా చూసుకుంటాడు. ఇక అల్లాహ్ ఆజ్ఞ అయినవెంటనే ఇఫ్తార్ చేస్తాడు. దాసుడు ఇఫ్తార్ వేళ తొందరపడితే అది అల్లాహ్‌కు ఎంతో ప్రీతికరమని తెలిపే హదీసు ముస్ముందు రాబోతోంది. దీని అర్థం ఏమిటంటే ఒక ఉపవాసి కేవలం దైవాజ్ఞమేరకే ఇంత వరకు ఆగిపోయాడన్న మాట. లేకుంటే, అతనికి ఎంతగా ఆకలివేస్తుందంటే అతను తినటంలో, త్రాగడంలో ఒక్క క్షణకాలం కూడా ఆలస్యం చేసేవాడు కాదు.

ఈ పద్ధతి ప్రకారమే మీకు నిగ్రహం, సహనం అబ్బేలా మీ మనసును అదుపుచేసే అభ్యాసం చేయించబడుతుంది. ఈ సహనం కారణంగానే మీకు స్వర్గప్రాప్తి కలుగుతుంది. ఈ సహన సంపద ద్వారానే మీరు మీ మనసుపై అదుపును సాధిస్తారు, అల్లాహ్ ఆదేశాల విముఖతకు దూరంగా వుంటూ ప్రతి సమయంలోనూ ఆయనకు విధేయులై జీవించటాన్నే మీరు లక్ష్యంగా పెట్టుకున్నారు.

### ❖ ఈ నెల పరస్పరం సానుభూతి చూపే నెల అని సెలవియ్యటం జరిగింది

**'మువాసాత్'** అంటే ఒకరికి మరొకరు సుఖదుఃఖాల్లో సహాయకారులుగా మారటం. రమజాన్‌లో **"షహ్‌రుల్ మవాసాత్"** కు ఉద్దేశం ఇదే. ఈ నెలలో ఒకరు మరొకరి పట్ల సానుభూతిపరులుగా, సహాయకులుగా మారటానికి తర్ఫీదు నివ్వటం జరుగుతుంది. ఒక వ్యక్తికి స్వయంగా ఆకలేసినప్పుడుగాని, ఇతరుల ఆకలి బాధ ఎలా వుంటుందో తెలిసిరాదు.

### ❖ ఈ నెలలో విశ్వాసి ఉపాధిలో వృద్ధీ వికాసాలివ్వబడతాయి

రమజాన్ మాసంలో లెక్కకట్టి లేదా తూచి తన ఆదాయం లేదా తన జీతం ఏ మేరకు పెరిగిందోనన్న విషయాన్ని ఏ వ్యక్తీ చెప్పలేడు, కాని అనుభవంలోకి వచ్చిన విషయం ఏమిటంటే, రమజాన్‌లో లక్షలు, కోట్ల మంది ముస్లింలు ఈ మాసంలో తిని, త్రాగినట్లుగా ఇతర రోజుల్లో వారికి ఇలాంటి ఆహారం దొరకదు. దీనిద్వారా తెలిసేదేమిటంటే తప్పనిసరిగా అల్లాహ్ ఈ నెలలో విశ్వాసుల ఆహార పానీయాల్లో వృద్ధిని, శుభాన్ని కలుగజేస్తాడు.

ఇంకా సెలవియ్యబడిందేమంటే, ఎవరైనా ఒక ఉపవాసికి ఇఫ్తార్ చేయించి నట్లయితే, అది అతని క్షమాభిక్షకు, నరకం నుంచి విముక్తికి కారణమవుతుంది. ఒక ఉపవాసికి లభించిన పుణ్యానికి సమానమైన పుణ్యం ఆ వ్యక్తికి కూడా లభిస్తుంది – మరోవైపున ఉపవాసి పుణ్యంలో ఎలాంటి కొరతా చేయబడదు. ఉపవాసి పుణ్యాల్లో కోత విధించి ఇఫ్తార్ చేయించిన వ్యక్తికి పుణ్యాలు ప్రసాదించటానికి అల్లాహ్ కరుణానుగ్రహాల్లో ఎలాంటి కొరత, లోటూ లేదు. ఉపవాసికి ఎంత పుణ్యమైతే లభిస్తుందో, ఇఫ్తార్ చేయించిన వ్యక్తికి కూడా అంతే పుణ్యాన్ని అల్లాహ్ తన వద్ద నుంచి ప్రసాదిస్తాడు.

బాగా గుర్తుంచుకోండి – తాము చేయించిన ఇఫ్తార్ గొప్పదనాన్ని చాటి చెప్పుకోవటానికి, ప్రజలకు చూపటానికి లేదా ఈ వ్యక్తి ఎంత ఐశ్వర్యవంతుడండి, తన సంపదను దైవమార్గంలో ఇట్టే ఖర్చుపెడుతున్నాడుగదా! అని ప్రజలు చెప్పుకోవాలన్న ఉద్దేశ్యంతో చేయించిన ఇఫ్తార్‌కు ఈ పుణ్యాలు దక్కవు. ఇక్కడ ప్రస్తావించిన ఇఫ్తార్ పుణ్యం కేవలం దైవ ప్రసన్నతను పొందే ఉద్దేశ్యంతో చేయించిన దానికే లభిస్తుంది. ఇంకా బాగా తిని, త్రాగే స్థోమత కలిగిన వారికి ఇఫ్తార్ చేయించేకన్నా సరియైన ఇఫ్తార్ కూడా చేసే స్థోమత లేని పేద ప్రజలకు ఇఫ్తార్ చేయించడం ఎక్కువ పుణ్యప్రదం.

పై పంక్తుల్లో దైవప్రవక్త (స) సెలవిచ్చిన విషయాల పిదప హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి) ఇంకా ఇలా తెలుపుతున్నారు : ప్రవక్త (స)తో – 'ఓ ప్రవక్తా! మాలో ప్రతి ఒక్కరికీ ఇతరులకు ఇఫ్తార్ చేయించేంత స్థోమత లేద'ని సహచరులు విన్నవించుకోగా, దానిపై ప్రవక్త (స) "ఒక ఉపవాసికి పాలు త్రాగించినా, ఒక ఖర్జూరాన్ని ఇచ్చినా లేదా కనీసం ఒక గుక్కెడు మంచినీళ్ల త్రాగించినాసరే వారికీ పుణ్యం లభిస్తుంద"ని సెలవిచ్చారు. అంటే ఇఫ్తార్ భారీగా చేయిస్తేనే పుణ్యం లభించదు. కేవలం రోజాను విరమింపజేయిస్తేనే చాలు – చూడటానికి అది అతి సాధారణ ఇఫ్తార్ అయినాసరే.

❖ **ఎవరైనా ఒక ఉపవాసికి కడుపు నిండా అన్నం తినిపిస్తే ఆ వ్యక్తికి అల్లాహ్ నా సెలయేరు నుంచి నీరు త్రాపిస్తాడు. ఆపై స్వర్గ ప్రవేశం చేసేంతవరకు అతనికి దాహం వేయదు అని సెలవియ్యబడింది.**

హదీసుల్లో తెలిపినట్లు హష్ర్ మైదానంలో ఒక సెలయేరు వుంటుంది, దాన్నే "కౌసర్" అని అంటారు. ఆ సెలయేరు ప్రవక్త (స) పర్యవేక్షణలో వుంటుంది. ప్రవక్త (స) ఎవరికైతే ఆ నీరు త్రాపించదలుస్తారో వారే ఆ నీరు త్రాగగలరు.

అంతేగాని మరో వ్యక్తికి ఆ అవకాశం లభించదు. ఆ సెలయేరు తప్ప నీరు త్రాగటానికి ఆ మైదానంలో మరో సెలయేరు ఏదీ వుండదు. అర్హులైన వారికే నీరు త్రాగేందుకు దైవప్రవక్త (స) అనుమతినిస్తారు, అలా అనుమతించబడిన వారే మున్ముందు స్వర్గంలో ప్రవేశిస్తారు. కాబట్టి ఎవరైతే ఓ ఉపవాసికి కడుపునిండా భోజనం పెడతాడో అతను హష్ర్ మైదానంలో కౌసర్ సెలయేరు నీరు త్రాగగలడు, తరువాత స్వర్గంలో కూడా ప్రవేశించగలడు.

హదీసుల ద్వారా తెలిసే విషయం ఏమిటంటే – హష్ర్ మైదానంలో ఒక్క దేవుని నీడ తప్ప మరే నీడా లభించదు. ఆ నీడ కేవలం సజ్జనులైన వారికే లభిస్తుంది. దుష్టులకు ఆ నీడ లభించదు. ఇక మీరే ఆలోచించండి – అల్లాహ్ నీడ తప్ప మరే నీడా వుండని హష్ర్ మైదానంలో ఉపవాసికి కడుపు నిండా అన్నంపెట్టిన వ్యక్తికి మాత్రమే ఆ సెలయేరు నుంచి నీరు త్రాపించబడుతుంది.

### ❖ ఈ నెల ప్రారంభంలో కారుణ్యం, మధ్యస్థంలో క్షమాపణ ఇంకా చివర్లో నరకం నుంచి విముక్తి లభిస్తుంది

అంటే, మీరు ఇటు ఈ నెల ఆరంభం నుంచి ఉపవాసం మొదలెట్టగానే మరో వైపు నుంచి మీపై అల్లాహ్ కారుణ్యం కురవటం మొదలవుతుంది. ఆపై రమజాన్ మధ్యస్థానికి చేరుకోగానే అల్లాహ్ మీ తప్పులను మన్నించి మిమ్మల్ని క్షమిస్తాడు. ఈ విధంగా ఇక రమజాన్ చివరి దశ చేరుకొని చివరి రోజా పూర్తి చేసుకోగానే మీకు నరక యాతన నుంచి విముక్తి లభిస్తుంది.

చివరి రోజా పూర్తయిన వెంటనే, మీకు నరకం నుంచి విముక్తి లభించగానే ఇక మీరు మీ ఇష్టానుసారం ప్రవర్తిస్తూ ఏదిబడితే అది చేయవచ్చు, మిమ్మల్ని అడగటం జరగదన్నది దీని అర్థం కాదు. బాధాకరమయిన విషయమేమంటే, కొంతమంది రమజాన్ నెల పూర్తయిన వెంటనే ఆ నెలలో తమపై విధించుకున్న కట్టుబాట్లనన్నింటినీ త్రెంచివేస్తారు. అంతే, పండుగ నాడే అంటే షవ్వాల్ మొదటి తేదీనాడే సినిమా చూడటానికి వెళ్తారు, ఇంకాస్త ముందుకెళ్ళి నాట్యగానాలను ఆస్వాదిస్తారు. ఆపై కొద్దోగొప్పో జూదం కూడా ఆడ్తారు. ఇలా ఎవరైనా ఓ వ్యక్తి ఆచరిస్తే అతను ఇటు భయానక నరకం నుంచి విముక్తి పొందాడో లేదో మరో వైపు వెంటనే దానిలోకి దూకే తయారీ కూడా చేసుకున్నాడన్నమాట. స్పష్టంగా తెలిసేదేమంటే హృదయంలో ఏ కొద్దిపాటి సత్సంకల్పం, దైవభీతి వున్నవాడైనా ఇలా ప్రవర్తించడు.

- **రమజాన్ నెలలో తన నౌకర్ల ద్వారా తేలికపాటి పనులు చేయించుకుంటే అలాంటి వారికి అల్లాహ్ నరకం నుంచి విముక్తి కలిగిస్తాడు.**

రమజాన్ నెలలో తాను రోజాలో వున్నట్లే తన వద్ద పనిచేసే నౌకరు కూడా ఉపవాసంలో ఉన్నాడని తెలుసుకోవాలి. రమజాన్ నెలలో తన సేవకుడు ఉపవాసంలో లేడని భావిస్తూ, మామూలు రోజుల్లోలాగా అతనిచేత పనిచేయించకూడదు. ఇది సజ్జనులైన వారికి ఎంతమాత్రం శోభించదు. రోజాలోవున్న కారణంగా మీలో నిస్సత్తువ ఏర్పడినట్లే నౌకరుకు కూడా నిస్సత్తువ ఏర్పడుతుంది. కాబట్టి ఎవరైతే రమజాన్ నెలలో తమ సేవకుల ద్వారా తేలికపాటి పనులు చేయిస్తారో వారికి అల్లాహ్ నరకం నుంచి విముక్తి ప్రసాదిస్తాడు.

నేటి కాలంలో కొంతమంది వ్యక్తులు తమ అధీనంలోవున్న వారిచేత రమజాన్ నెలలో మామూలు రోజులకన్నా ఎక్కువగా పనులు చేయిస్తారు. పైగా తమ ప్రవర్తన ద్వారా "మంచిది, నీవు కూడా రోజా పాటించే దుస్సాహసానికి ఒడిగట్టావన్నమాట! ఇక చూసుకో, నీకు దీని శిక్షగా మామూలు రోజులకన్నా నీవు రెట్టింపు పని చేయాలి. అంటే మా చెప్పుచేతల్లో, మా నీడలో వున్న నీవు రోజా వుండే ధైర్యం చేస్తావా?" అన్నట్లు వ్యవహరిస్తారు. కాని ప్రవక్త (స) గారి సర్వవిదితమైన హితవు ఇలా ఉంది: (ఇక్కడ 'మమ్లూక్' అన్న పదం వాడబడింది, 'ఖాదిమ్' అని లేదు). "రమజాన్ మాసంలో అలాంటి వారిచేత తేలికైన పనిచేయించండి. వారి పట్ల దయాభావంతో ప్రవర్తించండి, వారికి సౌకర్యాలు కల్పించండి. దీనికి ప్రతిగా మీకు అల్లాహ్ వద్ద లభించే ప్రతిఫలం ఏమంటే ఆయన మిమ్మల్ని నరకం నుంచి విముక్తినొసగుతాడు."

## రమజాన్ మాసంలో ప్రవక్త (స) గారి ప్రేమకు, దాతృత్వానికి రెండు ఉదాహరణలు

١٠- عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ كَانَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ إِذَا دَخَلَ شَهْرُ رَمَضَانَ أَطْلَقَ كُلَّ
أَسِيْرٍ وَأَعْطَى كُلَّ سَائِلٍ (رواه البيهقي في شعب الإيمان)

**10.** **హ్రజత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఉల్లేఖనం : రమజాన్ నెల రాగానే దైవప్రవక్త (స) నిర్బంధంలో ఉన్న ప్రతి ఒక్కరినీ విడుదల చేసేవారు. ప్రతి అర్థించేవానికి ఎంతో కొంత ప్రదానం చేసేవారు. (బైహఖీ)**

దైవప్రవక్త (స) గారి వాత్సల్యం, దయార్ద్ర హృదయం, మృదుత్వం, వితరణ, క్షమాగుణం, దాతృత్వం మామూలు రోజుల్లో ఉండనే ఉంది. ఈ గుణాలన్నీ ఆయన కారుణ్య స్వభావంలోని అంశాలే. అయితే పవిత్ర రమజాన్ రాగానే ఇవన్నీ ఇంకా ఎక్కువయ్యేవి. ఈ రోజుల్లో ఆయన (స) తన మామూలుకన్నా ఎన్నో రెట్లు ఎక్కువగా అల్లాహ్ వైపునకు మరలేవారు, దైవప్రేమను ఇంకా ఎక్కువగా ఆశించేవారు. అందువలన ఆయన పుణ్యాలు కూడా సాధారణ రోజులకన్నా ఎక్కువయ్యేవి. స్వయంగా ఆయన (స) సెలవిచ్చారు – మామూలు రోజుల్లో విధ్యుక్త ధర్మం నెరవేరిస్తే ఎంత పుణ్యం లభిస్తుందో దానికి సమానమైన పుణ్యం రమజాన్‌లో నఫిల్ నెరవేరిస్తేనే లభిస్తుంది. కాబట్టి ఆయన (స) రమజాన్‌లో ఎక్కువగా పుణ్యాల కొరకు చాలా తీవ్రంగా పరిశ్రమించేవారు. ఇక్కడ ప్రవక్త (స) ఆచరణలోని రెండింటిని ఉదాహరణగా పేర్కొంటున్నాం. అందులో ఒకటి ఖైదీలను విడుదల చేయటం, రెండవది అర్థించిన వారికి లేదనకుండా ఇవ్వటం.

**"రమజాన్ మాసంలో దైవప్రవక్త (స) ఖైదీలను విడుదల చేసేవారు."** దీనిపై హదీసువేత్తల మధ్య వాదోపవాదాలు మొదలయ్యాయి. ఉదాహరణకు ఒక వ్యక్తి ఏదైనా నేరానికిగాను చెరసాల పాలైతే రమజాన్ నెల కారణంగా అలాంటి వ్యక్తిని శిక్షించకుండా విడుదల చేయించటం ఎంతవరకు న్యాయం? ఈ కారణంగా ఎన్నో రకాల వివరణలు, వ్యాఖ్యానాలు చేయబడ్డాయి. కొంతమంది హదీసువేత్తల అభిప్రాయంలో వీరు యుద్ధంలో పట్టుబడ్డ ఖైదీలు. మరికొంతమంది ఉద్దేశం ప్రకారం తాము చెల్లించాల్సిన రుణం కారణంగా పట్టుబడ్డవారు. ఈ విధంగా దీనిపై పరిపరి విధాలుగా వ్యాఖ్యానించారు. ఆలోచిస్తే దీనికి మరో అర్థం కూడా వస్తుంది. ఉదాహరణకు నేటి కాలంలో ఒక ఖైదీని పెరోల్ (Parole) పైన వదలివేస్తారు. అంటే ఖైదీని పూచీకత్తుపైన వదలివేయటం అన్నమాట. ఖైదీ తన గడువుకాలం పూర్తయిన మీదట తిరిగి వస్తాడన్న నమ్మకంతోనే అతన్ని వదలివేస్తారు. ఆనాటి సమాజం ఎలా వుండేదంటే, ఒక ఖైదీని విడుదల చేస్తే అతను పరారై తిరిగి వెళ్ళకపోతే మరలా తనను ఎవరు పట్టుకుంటారు? అన్న ఆలోచన కూడా అతనికి కలిగేది కాదు. ఆ ప్రజలు ఎలాంటి వారంటే వారి ద్వారా ఏదైనా తప్పు జరిగితే, స్వయంగా వారే వచ్చి దాన్ని ఒప్పుకునేవారు. ఇంకా తమను శిక్షించి పరిశుద్ధపరచాలని ప్రాధేయపడేవారు. పైన పేర్కొన్న ప్రవక్త (స) ఆచరణకు మరో ఉద్దేశం ఇది కూడా

కావచ్చు - వారు చేసిన నేరం క్షమార్హమైనది కానట్లయితే వారు కనీసం రమజాన్ నెలలో తమ తమ ఇళ్ళల్లో గడుపుతారన్న ఉద్దేశంతో విడుదల చేసి ఉంటారు - వల్లాహు ఆలము బిస్సవాబ్ - నిజం దైవానికే తెలుసు.

## స్వర్గం ఒక రమజాన్ తరువాత మరో రమజాన్ వచ్చే వరకు ఎడతెగ కుండా ముస్తాబు చేయబడుతుంది

١١- عَنِ ابْنِ عُمَرَ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ اِنَّ الْجَنَّةَ تُزَخْرَفُ لِرَمَضَانَ مِنْ رَاْسِ
الْحَوْلِ اِلٰى حَوْلٍ قَابِلٍ، قَالَ فَاِذَا كَانَ اَوَّلُ يَوْمٍ
مِنْ رَمَضَانَ هَبَّتْ رِيْحٌ تَحْتَ الْعَرْشِ مِنْ
وَرَقِ الْجَنَّةِ عَلَى الْحُوْرِ الْعِيْنِ فَيَقُلْنَ يَا رَبِّ
اجْعَلْ لَنَا مِنْ عِبَادِكَ اَزْوَاجًا تَقَرُّبِهِمْ اَعْيُنُنَا
وَتَقَرَّ اَعْيُنُهُمْ بِنَا. (رواه البيهقي في شعب الايمان)

**11.** హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: స్వర్గం రమజాన్ కొరకు ఏడాది మొదలుకుని రాబోయే సంవత్సరం వరకు (అంటే ఒక రమజాన్ ముగియగానే మళ్ళీ వచ్చే రమజాన్ వరకు) అందంగా తీర్చిదిద్దబడుతుంది. రమజాన్ మొదటి రోజు రాగానే అర్ష్ క్రింద నుంచి ఒక రకమైన గాలి వీచటం మొదలై స్వర్గంలోని ఆకులగుండా ప్రసరించి సుందరాంగులైన స్వర్గ కన్యలపై వీస్తుంది. ఈ గాలి సోకగానే స్వర్గకన్యలు "ఓ దేవా! నీవు నీ (సజ్జనులైన) దాసుల్లో నుంచి మా కన్నులకు చల్లదనాన్ని చేకూర్చే భర్తలను మాకు ప్రసాదించు. మా ద్వారా వారి కన్నులు కూడా చల్లబడేలా చేయి" అని అంటారు. (బైహఖీ)

ఈ హదీసు ననుసరించి ప్రవక్త (స) విశ్వాసులకు హితవు గరిపిన విషయ మేమంటే "మీరు రమజాన్ మాసాన్ని అల్లాహ్ పట్ల సంపూర్ణ విధేయతతో, గాఢమైన అనుబంధంతో ఉపవాసాలను పాటిస్తూ, పుణ్యాలను సంపాదిస్తూ గడిపినట్లయితే ఈ స్వర్గ సౌఖ్యాలు మీ కోసం ఎదురుచూస్తుంటాయి."

## రమజాన్ చివరి రాత్రి ముస్లిం సమాజానికి క్షమాభిక్ష లభిస్తుంది

١٢- عَنْ أَبِي هُرَيْرَةَ عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
أَنَّهُ قَالَ يُغْفَرُ لِأُمَّتِهِ فِي آخِرِ لَيْلَةٍ فِي رَمَضَانَ،
قِيلَ يَا رَسُولَ اللهِ أَهِيَ لَيْلَةُ الْقَدْرِ قَالَ لَا وَلٰكِنَّ
الْعَامِلَ إِنَّمَا يُوَفَّى أَجْرَهُ إِذَا قَضَى عَمَلَهُ (رواه أحمد)

**12. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : రమజాన్ చివరి రాత్రిన నా అనుచర సమాజానికి క్షమాభిక్ష ప్రసాదించబడుతుంది. దానికి సహచరులు 'ఓ దైవప్రవక్తా (స)! అది లైలతుల్ ఖద్ర్ నాడా' అని విన్నవించుకోగా, ప్రవక్త (స) "లేదు, కూలివాడు తన పనిని ముగించగానే అతని కూలి చెల్లించటం జరుగుతుంది" అని సెలవిచ్చారు. (అహ్మద్)**

"రమజాన్ చివరి రాత్రి నా అనుచర సమాజానికి క్షమాభిక్ష" అన్న ప్రవక్త (స) గారి ఈ పలుకు విని సహచర గణానికి 'బహుశా అదే లైలతుల్ ఖద్ర్ అయివుంటుంద'ని ఆ రాత్రే ఇలా జరుగుతుందన్న ఆలోచన వచ్చి వుంటుంది. కాని దానికి ఆయన (స) "లైలతుల్ ఖద్ర్ అవటం చేత అలా జరగదు, ఇలా ఎందుకు జరుగుతుందంటే కూలివాడు తన పనిని ముగించిన పిదప అతని కూలీ చెల్లించబడటం జరుగుతుందని, నా అనుచర సమాజానికి లభించే కూలీ క్షమాభిక్ష రూపంలో ఉంటుందని" సెలవిచ్చారు.

అనుచర సమాజానికి క్షమాభిక్ష లభిస్తుందన్న దానికి అర్థం - రోజాలు పాటించకుండా, ఇతర ఆదేశాలను నెరవేర్చని వారికి కూడా క్షమాభిక్ష లభిస్తుందని ఎంతమాత్రం కాదు. క్షమాభిక్ష అనుచర సమాజంలో రోజాలు పాటించిన వారికి, దేవుని ఆదేశాలకు విధేయత చూపిన వారికి మాత్రమే లభిస్తుంది. ఆనాటి దైవప్రవక్త (స) అనుచర సమాజంలో వుండి కూడా రోజాలు పాటించనివారు ఎవరైనా ఉండేవారంటే నమ్మశక్యం కాదు. అప్పుడు పూర్తి సమాజం రోజాలు పాటించేది. రమజాన్ నెల మొత్తం దైవ విధేయతలో గడిపేది. దుష్కార్యాలన్నింటికీ దూరంగా ఉండేది. ఇంకా మామూలు రోజుల్లోకన్నా మిన్నగా పుణ్యాలు సంపాదించేది.

అందువల్లనే ఇక్కడ అలాంటి సమాజం గురించే చెప్పబడింది. అంతేగాని, దాని ఉద్దేశం రమజాన్ వచ్చినా తమ మార్గవిహీనతలో ఏమాత్రం తేడా చూపనివారు, ఇంకా ఎక్కువ తలబిరుసుతనంతో ప్రవర్తించేవారి గురించి కాదు. కొంతమంది రోజా ఉండటం అటుంచి, దానికి విరుద్ధంగా బహిరంగంగా, నిర్మొహమాటంగా తినటం, త్రాగటం చేస్తారు. ఇక రమజాన్ చివరి రాత్రిన ఇలాంటి వారికి క్షమాభిక్ష లభించే ప్రశ్నే ఏముందని? పైగా ఆ రాత్రిన వారికి వ్యతిరేకంగా నిర్ణయం గైకొనబడుతుంది.

꧁꧂

## بَابُ رُؤْيَةِ الْهِلَالِ

# చంద్ర దర్శన అధ్యాయం

ఈ అధ్యాయంలో నెలవంక దర్శనాన్ని ఏవిధంగా నిర్ణయిస్తారన్న విషయాన్ని తెలిపే హదీసులు పేర్కొనబడ్డాయి. అంటే షాబాన్ నెలవంకకు రమజాన్‌తో, రమజాన్ నెలవంకకు రోజాలతో, ఇంకా షవ్వాల్ నెలవంకకు పండుగతో గల సంబంధం ఎలాంటిదోనన్న విషయమన్నమాట.

మొదటి భాగం

## రమజాన్ ప్రారంభం, ముగింపు నెలవంక దర్శనంతో ముడిపడి ఉంది

١٣- عَنِ ابْنِ عُمَرَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: لَا تَصُومُوا حَتّٰى تَرَوُا الْهِلَالَ وَلَا تُفْطِرُوا حَتّٰى تَرَوْهُ فَإِنْ غُمَّ عَلَيْكُمْ فَاقْدُرُوا لَهُ
وَفِي رِوَايَةٍ قَالَ اَلشَّهْرُ تِسْعٌ وَعِشْرُونَ لَيْلَةً لَا تَصُومُوا حَتّٰى تَرَوْهُ فَإِنْ غُمَّ عَلَيْكُمْ فَأَكْمِلُوا الْعِدَّةَ ثَلَاثِيْنَ. (مُتَّفَقٌ عَلَيْهِ)

**13.** **హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు : రమజాన్ మాసం నెలవంకను చూడనంత వరకు రోజా పాటించకండి, ఇంకా షవ్వాల్ నెలవంకను చూడనంత వరకు ఇఫ్తార్ చేయకండి (అంటే రోజా విరమించకండి). మబ్బులు కమ్మిన కారణంగా నెలరాజు కనిపించకపోతే దానిపై అంచనా వేయండి – మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది – దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: ఆ నెల 29 రోజులదై వుంటే, రోజా ప్రారంభించకండి – అంటే రమజాన్ నెలవంకను చూడనంత వరకు. ఆకాశం నిర్మలంగా లేని కారణాన మీకు చంద్రదర్శనం కాకపోతే షాబాన్ నెల 30 రోజులు పూర్తి చేసుకోండి. (ముత్తఫకున్ అలైహ్)**

ఈ హదీసులో మొదటి మాటగా సెలవియ్యబడిందేమంటే రమజాన్ నెలవంకను చూడనంత వరకు రోజాలు ప్రారంభించకూడదు. **'లా తసూమూ'** అన్నదానికి అర్థం 'రోజాలు పాటించవద్దు' అని కాదు, దాని ఉద్దేశం రోజాలు ప్రారంభించకండి అని మాత్రమే. అంటే రమజాన్ చంద్రుణ్ణి చూడకుండా రమజాన్ ప్రారంభమయ్యిందని నిర్ణయించకండి. ఇంకా దాని అర్థం మీలోని ప్రతి ఒక్కరూ చంద్రుణ్ణి చూడాలన్నది కూడా కాదు. అసలు పదాలు **"హత్తా తరవ్"** అంటే మీరు చంద్రుణ్ణి దర్శించుకోండి లేక చూడండి అని అర్థం. మరో మాటలో చెప్పాలంటే ఏదైనా ఒక బస్తీలోని లేదా ప్రాంతంలోని ప్రజలు మామూలుగా నెలవంకను చూసినా సరిపోతుంది. అంతేగాని ప్రతి మనిషీ వ్యక్తిగతంగా నెలవంకను చూడాలన్నది దాని ఉద్దేశం కాదు. మామూలుగా కొందరు చూసినా ప్రతి మనిషీ చూసినట్లే లెఖ్ఖ.

నెలవంక దర్శనంపై ఇంతగా తాకీదు ఎందుకు చేయబడిందంటే, నెల పొడుపు రమజాన్ ప్రారంభానికి సంకేతం. మరే లెక్కా లేదు. క్యాలెండర్ లేక పంచాంగం లెక్క ప్రకారం నేడు షాబాన్ నెల పూర్తవుతుంది, నేడు రమజాన్ చంద్రోదయం కావాల్సిందేనని, అందుకని రమజాన్ ప్రారంభమయినట్టేనని ఇక ప్రకటన కూడా చేయమనటం సరికాదు. కాబట్టి రమజాన్ ప్రారంభానికి నెలవంక దర్శనం తప్పనిసరి. షవ్వాల్ నెల చంద్రుణ్ణి చూడనంత వరకు ఇఫ్తార్ చేయకండి అని సెలవియ్యటం జరిగింది. దీని ఉద్దేశం ఇఫ్తార్ చేసి రోజాను విరమించటం కాదు, రమజాన్ పూర్తయింది, షవ్వాల్ నెల చంద్రుడు కనిపించాడు, ఇక రోజాలు పూర్తయ్యాయి, రేపు ఈదుల్ ఫిత్ర్ పండుగ. అంటే రమజాన్ మాసం నెలపొడుపుతోనే ప్రారంభమై మళ్లీ నెలపొడుపుతోనే పరిసమాప్తమవుతుంది. నిర్ణయం నెలవంకతోనే వుందిగాని, మరే లెక్కతో కాదు.

ఆపైన ఆకాశం నిర్మలంగా లేని కారణంగా చంద్రుడు కనిపించకపోతే అంచనా ప్రకారం నిర్ణయం తీసుకోండి అని కూడా సెలవియ్యటం జరిగింది. "అంచనా వేసుకోండి" అన్న పదానికి అర్థం ఇతర ఉల్లేఖనాల ద్వారా స్పష్టం చేయబడింది. దాన్నే ఇలా వివరించటం జరిగింది : "నెల 29 రోజులదవుతుంది. నెలవంకను చూడనంత వరకు రోజా ప్రారంభించకండి. ఒకవేళ నెలవంక కన్పించకపోతే 30 రోజులు పూర్తిచేయండి." అంటే షాబాన్ 29 నాడు చంద్రుడు కనిపించకపోతే షాబాన్ నెల 30 రోజులుగా నిర్ణయించుకోండి. కాబట్టి రమజాన్ నెల ప్రకటనను ఏదో లెక్క ప్రకారం చేయరాదు. కొంతమంది "అంచనా వేసుకోండి"

అన్న పదాలకు, షాబాన్ నెల 30 రోజులు పూర్తయిన తరువాతనే రమజాన్ ప్రారంభమవుతుందని అర్థం తొడుగుతారు.

## షాబాన్ 29 నాడు నెలవంక కన్పించకపోతే షాబాన్ నెల 30 రోజులుగా పూర్తిచేయండి

١٤- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: صُوْمُوْا لِرُؤْيَتِهِ وَأَفْطِرُوْا لِرُؤْيَتِهِ فَإِنْ غُمَّ عَلَيْكُمْ فَأَكْمِلُوْا عِدَّةَ شَعْبَانَ ثَلَاثِيْنَ (مُتَّفَقٌ عَلَيْهِ)

**14. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనానుసారం దైవప్రవక్త (స) ఇలా హితవు గరిపారు : చంద్రుణ్ణి చూసి రోజాలుండటం ప్రారంభించండి, ఇంకా చంద్రుణ్ణి చూసే రోజాలను విరమించండి. ఒకవేళ ఆకాశం నిర్మలంగా లేని కారణాన చంద్రుణ్ణి మీరు చూడలేకపోతే షాబాన్ నెల 30 రోజులు పూర్తిచేయండి. (ముత్తఫకున్ అలైహ్)**

ఇక్కడ ఓ విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. అదేమిటంటే, ఇస్లాంలో ఆరాధనలకు సూర్యమానం ప్రకారం కాక, చాంద్రమానం ప్రకారం నెలలను లెక్కించటం జరుగుతుంది. దీని అర్థం అరబ్బులు సూర్యమానం ప్రకారం వారికి నెలల లెక్క తెలియదని కాదు. వారి సౌకర్యార్థం నెలలను చాంద్రమానం ప్రకారం లెక్కించేవారు. సూర్యమానం ప్రకారం కూడా అరబ్బులు నెలలను నిర్ణయించేవారని ఖుర్ఆన్ ద్వారా మనకు విదితమవుతుంది. అరబ్బు బహుదైవారాధకుల్లో 'నసీ' పద్ధతి చెలామణిలో ఉండేది. ఇది ఖుర్ఆన్‌లో నిర్ద్వంద్వంగా ఖండించబడింది : **"ఇన్నమా అన్నసియు జియాదతున్ ఫిల్ కుఫ్ర్"** – 'నసీ' అవిశ్వాసంలో ఒక అదనమైన అవిశ్వాసపు చేష్ట. (తౌబా:37). అరబ్బు దేశంలో 'నసీ'కి సంబంధించిన రెండు పద్ధతులు చెలామణిలో వుండేవి. యుద్ధాలు, మారణకాండలు, హత్యా ప్రతీకారం తీర్చుకోవటానికి, ఏదైనా నిషిద్ధ మాసాన్ని హలాల్ చేసుకునేవారు. దానికి బదులు ఏదైనా హలాల్ మాసాన్ని నిషిద్ధం చేసుకుని, నిషిద్ధ మాసం రోజులను పూరించేవారు. రెండో పద్ధతి ప్రకారం చాంద్రమాన సంవత్సరాన్ని పూరించటానికి సూర్యమాన సంవత్సరం ప్రకారం ఒక నెలను అదనంగా చేర్చేవారు – తద్వారా హజ్ ఎల్లప్పుడూ

ఒకే కాలంలో రావాలని. ఇంకా చాంద్రమానం ప్రకారం వివిధ కాలాల్లో హజ్ నెల వస్తే వాటిలోని ఇబ్బందుల్ని ఇట్టే తప్పించుకోవచ్చని వారు తలపోసేవారు. ఈ విధంగా 36 యేళ్ళపాటు హజ్జ్ తన అసలైన తేదీలలో గాక, ఇతర తేదీల్లో నిర్వహించబడేది. ఆపై 37వ యేట మాత్రం హజ్జ్ తన అసలైన తేదీ జిల్ హజ్జహ్ 9 - 10 తేదీల్లో నిర్వహించబడేది. హజ్జతుల్ విదా సందర్భంగా దైవప్రవక్త (స) తన ప్రసంగంలో ఈ విషయాన్నే సెలవిచ్చారు : "ఈ సంవత్సరం హజ్జ్ కాలం పరిభ్రమణం చెందుతూ తన అసలైన తేదీల్లో వచ్చింది. సృష్టికర్త నిర్ణయించిన అసలైన తేదీలు ఇవే."▲

దీనినిబట్టి అరబ్బులకు సూర్యమాన నెలల లెక్క తెలియకుండా లేదని రూఢీ అవుతుంది. అసలు విషయమేమంటే అల్లాహ్ తాను ఆదేశించిన విధుల నిర్వహణను సూర్యమానం ప్రకారం కాక, చాంద్రమానం ప్రకారం నిర్ణయించటానికి కారణం అందులో సంస్కరణ జరగాలనే. వాటిలో ఒకటేమంటే తన దాసులు అన్ని కాలాల్లోనూ తన ఆదేశ పాలనకు, విధేయతకు అలవాటు పడాలి. ఉదాహరణకు రమజాన్ ఒక్కోసారి వేసవిలో, మరోసారి వర్ష రుతువులో, ఇంకోసారి చలికాలంలో వస్తుంది. విశ్వసించినవారు ఈ అన్ని కాలాల్లోను రోజాలు పాటించి తమ విధేయతను చాటుకుంటారు, ఇంకా అత్యుత్తమ నడవడికకు శిక్షణ కూడా పొందుతారు. అదేవిధంగా హజ్జ్ కూడా చాంద్రమానం ప్రకారం వివిధ కాలాల్లో వస్తుంది. మంచీ, చెడు అన్ని పరిస్థితుల్లోనూ దైవదాసులు అల్లాహ్ ప్రీతిని పొందటానికి ప్రయాణించి దేవుని పరీక్షలో పూర్తిగా నెగ్గుకు వస్తారు. ఇంకా దైవదాస్యంలో పరిపూర్ణతను పొందుతారు.▲▲

ఇంకా ఇక్కడ మరోమాట కూడా గమనార్హమైనదే. ప్రపంచ మానవాళి అందరి కొరకు ప్రభవించిన ప్రపంచ ధర్మంలో రోజాలు, హజ్జ్ చాంద్రమానం ప్రకారం ఎందుకు నిర్ణయించబడ్డాయి? అని సందేహపడవచ్చు. ఏ నెల నిర్ణయించబడినా అది ప్రపంచ మానవాళి అందరికీ ఒకేలా వుండదు. ఒక్కోచోట అది వేసవి కాలం కావచ్చు, మరోచోట చలికాలం, ఇంకోచోట వర్షకాలం కావచ్చు, మరోచోట పొడి వాతావరణం, ఇంకోచోట పంటలు కోతకొచ్చే కాలంగాను, మరోచోట విత్తనాలు విత్తేకాలంగానూ ఉండవచ్చు.▲▲▲ అందుకని సూర్యమానం ప్రకారం కాక, చాంద్రమానం ప్రకారం నిర్ణయించడం తప్పనిసరి చేయటం జరిగింది. దీనివలన

▲ *ఖుర్ఆన్ అవగాహనం, సం. 3, తౌబా సూరా, పాదసూచి 37, పేజి 164, 165, 166.*

▲▲ *ఖుర్ఆన్ అవగాహనం, సం. 3, తౌబా సూరా, పాదసూచి 37, పేజి 164, 165, 166.*

▲▲▲ *ఖుర్ఆన్ అవగాహనం, సం. 3, తౌబా సూరా, పాదసూచి 37, పేజి 164, 165, 166.*

ప్రపంచంలోని ప్రతి ప్రాంతంలో నివసించే ప్రజలు ప్రతి కాలంలో ఈ ఆరాధనల్ని నెరవేర్చి ఉత్తమ నడవడితో పాటు ఆధ్యాత్మిక ప్రయోజనాలను పొందగలగాలన్నదే దీని ఉద్దేశం.

చాంద్రమానం ప్రకారం ఈ ఆరాధనలు నిర్ణయించటానికి కారణమేమిటన్న మరో సందేహం కూడా నివృత్తి చేయబడింది. అదేమిటంటే, ఇలా నిర్ణయించని పక్షంలో ప్రతి ముస్లిం గ్రహ, నక్షత్రాల జ్ఞానం తప్పనిసరిగా కలిగివుండాల్సి వచ్చేది. లేదా పంచాంగం అతని ధార్మిక అంశాల్లో ఒకటిగా నిర్ణయించబడేది. ఇది లేకుండా ధార్మిక విధుల నిర్వహణ కష్టంగా పరిణమించేది. అందువలన ప్రతి నెల పంచాంగం పేజీ తిరిగేసేబదులు, దేవుడు ఈ తేదీల లెఖ్ఖను నిర్ణయించాడు. మనిషి ఎడారి ప్రాంతాల్లో జీవనాన్ని కొనసాగిస్తున్నా, లేక కొండకోనల్లో కాలం గడుపుతున్నా అతను కూడా ఇప్పుడు రమజాన్ మాసం చంద్రుడు ఉదయించాడని తేలిగ్గా తెలుసుకోగలగాలి. ఇక రోజాలు పాటించాలని, లేక షవ్వాల్ మాసం నెలవంక కనిపించింది, ఇక ఈదుల్ ఫిత్ర్ చేసుకోవాలని తెలుసుకోగలగాలి.

చంద్రోదయ వేళ ఆకాశం తేటగా లేకున్నా లేక మబ్బులు క్రమ్ముకుని వున్నా రమజాన్ నెలను 30 రోజులకు పూర్తి చేసుకోవాలని నిర్ణయించబడింది. ఈ విధంగా 29వ తేదీనాడు చంద్రుడు కన్పించనప్పుడు ఆ సందిగ్ధతను ఇలా దూరం చేసుకోవాలి.

## ఇస్లామీయ ధార్మిక ఆరాధనలకై చాంద్రమానాన్ని పాటించడంలో వున్న యుక్తి

١٥- عَنِ ابْنِ عُمَرَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : إِنَّا أُمَّةٌ أُمِّيَّةٌ لَا نَكْتُبُ وَلَا نَحْسُبُ، اَلشَّهْرُ هٰكَذَا وَهٰكَذَا وَهٰكَذَا وَعَقَدَ الْإِبْهَامَ فِي الثَّالِثَةِ، ثُمَّ قَالَ اَلشَّهْرُ هٰكَذَا وَهٰكَذَا وَهٰكَذَا يَعْنِيْ تَمَامَ الثَّلَاثِيْنَ، يَعْنِيْ مَرَّةً تِسْعًا وَعِشْرِيْنَ وَمَرَّةً ثَلَاثِيْنَ. (مُتَّفَقٌ عَلَيْهِ)

15. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : మనది ఓ విద్యావిహీన సమాజం. వ్రాయనూలేము, తిథి నక్షత్రాల లెక్కనూ ఎరుగము. నెల ఇలా ఇలా ఉందని చెప్పి ఆయన (స) తన రెండు చేతులతో సైగ చేస్తూ రెండు

**చేతుల వ్రేళ్ళను చాపి ఉంచారు. ఆపైన మూడవసారి తన అంగుష్ఠాన్ని మూసివేశారు. (దాని ఉద్దేశం ఏమిటంటే నెలకు 29 రోజులుంటాయి). మళ్ళీ ఆయన (స) ఇలా సెలవిచ్చారు : నెలలు ఇలా ఇలా వుంటాయి అని, అంటే 30 రోజులుంటాయని చెప్పారు. ఈ విధంగా ఒకసారి ప్రవక్త (స) నెలకు 29 రోజులుంటాయని, మరోసారి 30 రోజులుంటా యని సెలవిచ్చారు. (ముత్తఫకున్ అలైహ్)**

అరబ్బులు సాధారణంగా వ్రేళ్ల పైన లెక్కపెట్టి ఎంచేవారు. పది అంకెలు లెక్కపెట్టాలంటే రెండు చేతుల వ్రేళ్లను లేపి సైగలతో లెక్కిస్తారు. నేటికీ మన నాట పల్లెల్లో నిరక్షరాస్యులైన ప్రజల అలవాటు ఇలాగే వుంటుంది. దీని అర్థం అరబీ భాషలో లెక్క వేయటానికి పదాలు లేవని కాదు. అరబ్బుల్లో ఈ అలవాటు పురాతన కాలం నుంచే వున్న కారణంగా, దైవప్రవక్త (స) చేతివ్రేళ్లతో సైగ చేస్తూ నెలకు ఒక్కోసారి 29 రోజులుంటాయని, మరోసారి 30 రోజులుంటాయని సెలవిచ్చారు. మహాప్రవక్త (స)తో తాము చదవను వ్రాయను రానివారమని, నక్షత్రాలు, రాశుల లెక్క తెలియని వారమని, తమ నిరక్షరాస్యత గురించి చెప్పటం జరిగింది. మనలో చదవను వ్రాయను వచ్చినవారు లేరనే చెప్పుకోవాలి. ఈ కారణంగా మన లెక్క పత్రం ద్వారా ఏ నెల ప్రారంభమైందో, మరే నెల సమాప్తమయ్యిందో చెప్పటం ఎలా సాధ్యం? ఈ విధంగా ప్రవక్త (స) చాంద్రమానం ప్రకారం నెల ప్రారంభం, పరిసమాప్తం ఆధారంగా నెలవంకను సంకేతంగా నిర్ణయించటం జరిగింది.

నేడు కొంతమందికి సైన్స్ పిచ్చి పట్టుకుంది. వాళ్ళంటారు – బాబూ ఇది సైన్స్ యుగం. దీనిద్వారా చంద్రోదయమయ్యిందో లేదో అన్న విషయాన్ని చాలా తేలిగ్గా తెలుసుకోవచ్చు. ఆకాశంపై చంద్రుడున్నా, వాతావరణం సరిగ్గా లేనందువల్ల అది కన్పించనప్పుడు దాన్ని పరికరముల సహాయంతో చూడవచ్చు. స్వయంగా ఖగోళశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం ద్వారా కూడా చంద్రోదయం అయ్యిందో లేదో అన్న విషయాన్ని తెలుసుకోవచ్చు. కాని ఒక విశ్వజనీన ధర్మం ఎప్పుడయినా కృత్రిమ పద్ధతులపై ఆధారపడదన్న విషయాన్ని వీళ్ళు గ్రహించరు. సహజసిద్ధమైన పద్ధతులపైనే అది ఆధారపడుతుంది. నేడు సాంకేతికాభివృద్ధి పట్ల శ్రద్ధాసక్తులు వున్నవారు సయితం ఈ సహజ పద్ధతుల ప్రభావంతో ధర్మంపై నడచుకోగలగాలి. ఇంకా నేటి అభివృద్ధి ఫలాలకు దూరంగా వున్నవారు, వీటి జ్ఞానం పట్ల స్పృహలేని సామాన్య ప్రజానీకం కూడా నికార్సయిన ముస్లిములుగా నడుచుకుంటూ సహజధర్మమైన, స్వతఃస్సిద్ధమైన విధానాలపైన తమ జీవితం గడపగలగాలి.

నెలవంక దర్శనం విషయంలో సాంకేతిక పద్ధతులు అవలంబించాలని అభిలషించేవారు మరో ఆధారాన్ని కూడా మన ముందుంచుతారు. అదేమంటే ఈ సాంకేతిక పద్ధతుల ద్వారా ముస్లింలందరూ తమ పండుగను కనీసం వారి మొత్తం దేశంలోనయినా ఒకే రోజున జరుపుకోవచ్చు. ఎందుకంటే ఈ పండుగయే ముస్లింల ఐక్యతకు ఒక సంకేతం. పైగా నెలవంక దర్శనంపైన వచ్చే వివాదాలు ముస్లింల ఐక్యతకు భంగం వాటిల్లచేస్తున్నాయి – వీరిలో మరికొంతమంది, ప్రపంచ ముస్లిం లందరి పండుగ ఒకే రోజు జరుపుకోవాలని కూడా అంటారు. కాని వాస్తవానికి, ఇలాంటి భావన లోపభూయిష్టమైనది. ధర్మావగాహన లేమి వల్లనే ఇలాంటి మాటలు అనబడతాయి. ఎక్కువగా ఇలాంటి మాటలను రమజాన్‌లో ఉపవాసాలను పాటించని వారే అంటారు. అయితే వీరికి పండుగ విషయంలో మాత్రం ఎక్కడలేని ఇస్లాం, ముస్లింల ఐక్యత గురించిన విచారం పుట్టుకొస్తుంది.

ప్రపంచ ముస్లింలందరూ పండుగను ఒకేరోజు జరుపుకోవాలనే వారి ఈ మాట వట్టి నిరర్థకమైన వాచాలత. ఎందుకంటే ప్రపంచం మొత్తంలో చంద్రోదయం ఒకేరోజు కావటం అసంభవమైన విషయం. ఇక పోతే ఓ దేశం లేదా దేశంలోని ఓ పెద్ద ప్రాంతంలో ముస్లింలందరూ ఒకే రోజు పండుగ జరుపుకోవాలన్న సమస్య; దీన్ని కూడా షరీఅత్‌పరంగా తప్పనిసరి చేయలేదు. వీలైతే ఒక దేశంలో షరీఅత్ శాసనాంగాన్ననుసరించి నెలవంక దర్శనం అయ్యిందన్న సమాచారాన్ని చేరవేసే సౌకర్యం వుంటే అలా జరుపుకోవటంలో ఎలాంటి అభ్యంతరం లేదు. కాని షరీఅత్ ఇలాగే కావాలని ఎన్నడూ అభిలషించదు, ఇంకా ఇది షరీఅత్ రీత్యా దుష్కార్యం కూడా కాదు. వివిధ ప్రాంతాల్లో వివిధ రోజుల్లో పండుగ జరగాలన్నది కూడా షరీఅత్ అభిమతం కాదు. దైవధర్మం సర్వమానవాళి కొరకు, సర్వకాలాలకు అనుసరణీయం. నేడు ప్రజలు రేడియోలు, టీ.వీ.ల ఆధారంగా అందరి పండుగా ఒకేరోజు జరగాలని అభిలషిస్తున్నారు. కాని నేటికి 60 లేక 70 యేళ్ళకు పూర్వం భారత ఉపఖండం విడిపోక ముందు, దాని ఏ ఒక్క ప్రాంతంలోనూ రమజాన్ పండుగ తాలూకు 29 వ తేదీనాడు చంద్రోదయం అయ్యిందన్న సమాచారాన్ని ముస్లింలందరికీ చేరవేయబడలేదు. ఒకవేళ పండుగ ఒకే రోజు జరగాలని షరీఅత్ తప్పనిసరి చేసినట్టైతే పూర్వ శతాబ్దాల్లో గతించిన ముస్లిం తరాలు ఏ విధంగా అమలు చేసి వుంటారు? మరి నేడు కూడా దీన్ని తప్పనిసరి చేసి పండుగ ఒకేరోజు జరపటం ఆచరణలో సాధ్యం కాని విషయం. ముస్లింలు కేవలం పెద్ద నగరాల్లో, పట్టణాల్లో నివసించరు. సుదూర గ్రామీణ ప్రాంతాల్లో కూడా వుంటారు. ఇంకా

ఎక్కువ శాతం ముస్లింలు అటవీ ప్రాంతాల్లో, కొండకోనల్లో కూడా నివసిస్తూవుంటారు. పండుగను ఒకే రోజు జరపాలని షరీఅత్ ఆదేశంగా నిర్ణయించటానికి దేశంలోని ముస్లింలందరికీ ఒకే రేడియో స్టేషన్ వుండటమే సరిపోదు. ప్రతి వారికీ, ఇంకా ప్రతి ఇంటా లేదా ముస్లింల ప్రతి చిన్నా, పెద్దా బస్తీలో ఒక రేడియో సెట్‌గాని, ట్రాన్సిస్టర్ గాని అవసరమైవుంటుంది. లేకపోతే వారు తమ షరీఅత్ విధుల్ని నెరవేర్చలేరు. ఇక ఈ పరికరాలు కూడా ధర్మంలో తప్పనిసరి అంశం కానున్నాయా? దేవుని షరీఅత్ ద్వారా జారీఅయిన నిబంధనల్ని తన విధి నిర్వహణలో ప్రతి ముస్లిం సర్వకాలాల్లోనూ సులువుగా ఆచరించగలడు. దేవుడు నమాజ్ వేళల్ని పాటించడానికి, తన ధర్మంలో అవి కూడా ఓ అంతర్భాగంగా మారడానికి ప్రతి ముస్లింకు గడియారాన్ని తప్పనిసరి చేయలేదు. దీనికి బదులు దేవుడు ప్రపంచం మొత్తంలో నమాజ్ వేళల్ని పాటించడానికి సూర్యోదయాన్ని, సూర్యాస్తమయాన్ని ఇంకా సూర్యుడు వాలిపోయే సమయాల్ని సూచనలుగా చేశాడు. వీటిని ప్రతి మనిషి, ప్రతిచోటా చూడగలడు. అలాగే రోజాలు ప్రారంభించడానికి, పరిసమాప్తం చేయడానికి యావత్ ప్రపంచం సులువుగా చూడగలగటానికి రమజాన్, షవ్వాల్‌ల నెలవంకలను సూచనలుగా నిర్ణయించాడు. ప్రతి ముస్లిం ప్రతి చోటా చంద్రుణ్ణి చూసి ఇప్పుడు రమజాన్ మొదలయ్యిందని, సమాప్తమయ్యిందని ఇట్టే తెలుసుకోగలడు. ఒకవేళ అతను పంచాంగం లెక్కను పాటించినట్లయితే, ఇక ప్రతి ముస్లింకు ఖగోళశాస్త్రాన్ని, జ్యోతిశ్శాస్త్రాన్ని విధిగా తెలుసుకోవాల్సిన అగత్యం ఏర్పడేది, లేదా పంచాంగం కూడా అతని ధర్మంలో ఓ అంశంగా మారేది, ఇంకా అది లేకుండా తన విధ్యుక్త ధర్మాలను పాటించలేకపోయేవాడు. పైగా అతను ఒకచోట అయిన చంద్రోదయం ఆధారంగా ప్రపంచం మొత్తంలో లేక పుడమిపైని ప్రతి ప్రాంతంలో, ఖండాలలో రోజాలు పాటించాలని లేక పరిసమాప్తం చేయాలని నిర్ణయించేవాడు. అలాగైతే నేటి ఆధునిక ప్రసార మాధ్యమాలు లేని పూర్వకాలంలో ముస్లింలు తమ ధర్మంపైన నడుచుకోవటం దుర్లభమయ్యేది. ఇక ఈ ఆధునిక మాధ్యమాల ఉనికి అమలులోకి వచ్చిన పిదప ముస్లింలపై ఓ పెద్ద ఆపదే వచ్చిపడేది. ఎందుకంటే అతనికి కూడు, గూడు, గుడ్డ లభ్యం కానప్పటికీ తన వద్దనయితే తప్పనిసరిగా ఓ ట్రాన్సిస్టర్ లేక టీ.వీ. ఉంచాల్సిన అగత్యం ఏర్పడేది.▲

---

▲ *"ఈదుల్ ఫిత్ర్' ఉపన్యాసం", పేజీ 18, 'ఐవానె అదబ్' ప్రచురణ, ఉర్దూ బాజార్, లాహోర్.*

### రమజాన్, జుల్‌హిజ్జహ్ (పుణ్యం, ఘనతల రీత్యా) ఏనాడూ కొరత లేనివి

١٦- عَنْ اَبِيْ بَكْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ، شَهْرَا عِيْدٍ لَا يَنْقُصَانِ، رَمَضَانُ
وَذُوالْحِجَّةِ - (مُتَّفَقٌ عَلَيْهِ)

**16. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) సెలవిచ్చారు, "పర్వదినాల రెండు నెలలు ఎన్నడూ కొరతలేనివి, అవి రమజాన్ నెల ఇంకా జుల్‌హిజ్జహ్ నెల". (ముత్తఫకున్ అలైహ్)**

రమజాన్‌ను పండుగ నెల అని ఎందుకనబడిందంటే దాని తరువాత వెంటనే పండుగ వస్తుంది. అందువలన ఈదుల్ ఫిత్ర్ సంబంధం రమజాన్‌తో ముడిపడి వుంది.

కొంతమంది ప్రవక్త (స) గారి ఈ హదీసును ఆధారంగా చేసుకొని ఈ రెండు నెలలు ఎప్పుడూ–ఏక కాలంలో–29 రోజులవిగా వుండవు అని అర్థం తీస్తారు. అయితే ఇదొక జ్ఞానహీన వ్యాఖ్యానం. రమజాన్, జుల్‌హిజ్జహ్ నెలలు ఒక సంవత్సరంలో 29 రోజులవిగా వుండే ఆస్కారం వుంది, వుంటాయి కూడా. ఈ హదీసు అసలు భావం ఏమిటంటే, నెలలు 29 రోజులవైనా లేక 30 రోజులవైనా, వాటి పుణ్యం, పవిత్రతల రీత్యా వాటిలో ఏమాత్రం కొరత ఏర్పడదు. రమజాన్ నెల 30 రోజులకు బదులు 29 రోజులదైతే దాని రోజాల పుణ్యఫలాల్లో ఏదైనా కొరత ఏర్పడుతుందన్నది దీని అర్థం కాదు (అంటే 29 రోజుల పుణ్యం 30 రోజుల పుణ్యం కన్నా తక్కువ అన్న భావంలో). ఇదేవిధంగా జుల్‌హిజ్జహ్ నెల 29 రోజులదైనా లేక 30 రోజులదైనా దాని మొదటి పది రోజుల ఘనత, పుణ్యఫలాల్లో ఏమాత్రం తరుగుదల ఏర్పడదు.

### రమజాన్ నెలకు ఒకటి లేదా రెండు రోజుల ముందు ఉపవాసం వుండకూడదు

١٧- عَنْ اَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى
اللهُ عَلَيْهِ وَسَلَّمَ : لَا يَتَقَدَّمَنَّ اَحَدُكُمْ رَمَضَانَ
بِصَوْمِ يَوْمٍ اَوْ يَوْمَيْنِ اِلَّا اَنْ يَكُوْنَ رَجُلٌ كَانَ يَصُوْمُ
صَوْمًا فَلْيَصُمْ ذٰلِكَ الْيَوْمَ - (مُتَّفَقٌ عَلَيْهِ)

**17. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : మీలో ఏ వ్యక్తీ రమజాన్ నెలకు ఒకటి లేదా రెండు రోజుల ముందు ఉపవాసాలు పాటించరాదు-సాధారణంగా ఒక వ్యక్తి ఆయా రోజుల్లో రోజాలు పాటించటం అలవాటుగా వుంటే తప్ప. అలాంటి వ్యక్తి మాత్రం ఆ రోజాలు పాటించవచ్చు. (ముత్తఫకున్ అలైహి)**

మున్ముందు షాబాన్ నెల సగం రోజులు గడిచాక ఎలాంటి రోజాలు పాటించరాదు అని ప్రవక్త (స) సెలవిచ్చిన హదీసు రాబోతోంది. ఇందులో రెండు హేతువులు లేక మర్మాలున్నాయి.

ఒకటి, రమజాన్‌కు ముందున్న రోజుల్లో ఉపవాసాల్ని పాటిస్తే మనిషిలో బలహీనత ఏర్పడుతుంది. ఫలితంగా అతనికి రమజాన్ రోజాలు పూర్తి చేయటం కష్టంగా పరిణమిస్తుంది. ఎవరికైనా రమజాన్ రోజాలే గాక నఫిల్ లేక ఖజా రోజాలు వుండే అనుభవముంటే వారికి తెలిసిపోతుంది – రమజాన్ నెలలోని 10 రోజాల కన్నా ఇతర దినాల్లోని ఒక్క రోజా కూడా మనిషిని నిస్సత్తువగా చేస్తుందని. దానిక్కారణం ఏమంటే రమజాన్‌లో పూర్తి సమాజం రోజాలు పాటిస్తుంది. అందుచేత ఒకరి రోజా మరొకరికి సహాయకారిగా మారుతుంది. ఈ కాలంలో రోజాలు పాటించే ఓ సాధారణ పరిస్థితి, వాతావరణం నెలకొని వుంటుంది. దీని ఫలితంగా మనిషి పూర్తి నెల చాలా తేలిగ్గా రోజాలు పాటిస్తాడు. రమజాన్ మాసంలో కాక ఇతర రోజుల్లో ఉపవాసముండే వ్యక్తి ఏకాకి అయిపోతాడు. తన చుట్టూ వున్న పూర్తి సమాజంలో వాతావరణం అతనికి అననుకూలంగా మారుతుంది. అందువలన అతనికి రోజాలు పాటించటం కష్టమనిపిస్తుంది. కాబట్టి అతను మామూలుకు భిన్నంగా తనకు తాను బలహీనునిగా భావిస్తాడు. అందువల్ల రమజాన్ కంటే ముందు రోజుల్లో ఏ వ్యక్తీ రోజాలు పాటించరాదని తాకీదు చేయబడింది.

రెండవ కారణంలోని పరమార్థం ఏమిటంటే ఇస్లామీయ షరీఅత్ విధిగా నిర్వహించాల్సిన వాటిలో హెచ్చుతగ్గులు చేయటాన్ని భరించదు. ఎందుకంటే రమజాన్ రోజాలు విధిగావించబడ్డాయి. అందుకని రమజాన్‌కు ముందు రోజుల్లో రోజా పాటిస్తే విధిగావించబడిన ఆరాధనల్లో అధికం చేసినట్లు భావించబడుతుంది. ఒక వ్యక్తికి రమజాన్ మాసపు 30 రోజాల పుణ్యం ఎటూ లభిస్తుంది, మరైతే ఒకటి అర రోజులు వీటిలో ఎందుకు అధికం చేయరాదని తలపోయవచ్చు. అలా భావించి అతను రమజాన్‌కు ముందు ఒకటి లేక రెండు రోజుల ముందు నుంచే రోజాలు పాటించడం మొదలెడతాడు. దీని అర్థం ఏమిటంటే, విధిగా చేసిన ఆరాధనల్లో

తనంతట తాను అధికం చేసుకోవాలని భావించాడు. దీన్నే బిద్అత్ (షరీఅత్‌లో లేనివాటిని కొత్తగా చేర్చుకోవటం)గా పరిగణించటం జరుగుతుంది. ఇది మార్గవిహీనతగా పేర్కొనబడింది, దాని ఫలితం నరకాగ్ని అని చెప్పబడింది. ఇలా గ్రంథవహులు, ఇంకా ముస్లింలు కూడా నానా విషయాలను, పద్ధతుల్ని పుణ్యాలుగా తలపోస్తూ వాటిని విధ్యుక్త ధర్మాల్లో కలపటం జరిగింది. అంతేగాక తమ మనసుల్లో వాటిని ఘనకార్యాలుగా పేర్కొంటూ, ప్రచారం చేశారు. పైగా వాటి నిర్వహణ విధ్యుక్త ధర్మాలకంటే కూడా మించిందని నిర్ణయించేశారు. చివరికి అవి దైవధర్మ శాస్త్రంలోని విధుల్లో ఓ అంశంగా మారిపోయాయి, ఆ అంశం కూడా అసలైన దానికన్నా మించిపోయి అదే ముఖ్యాంశంగా మారిపోయింది. అందుకనే ఇస్లామీయ షరీఅత్ నైజం ఏమిటంటే, అందులో నిర్ణయించిన అంశాలను తక్కువ చేయటం లేక ఎక్కువ చేయటం జరగదు. ఒకవేళ జుహ్ర్ నమాజ్‌లో 4 రకతులు ఫర్జ్‌గా నిర్ణయించబడినప్పుడు ఇక అందులో తక్కువ చేసి 3 రకతులుగా మార్చడమో లేక ఎక్కువ చేసి 5 రకతులుగా నిర్ణయించటమో చేసే హక్కు ఎవరికీ లేదు. అల్లాహ్ ఆదేశాల పట్ల విధేయత చూపటమే దాసుని విధ్యుక్త ధర్మం. ఒకవేళ ఎవరైనా తన తరఫున విధి విధానాల్లో ఎక్కువ చేసినట్లయితే వాస్తవానికి అది ఆరాధనగా భావించబడదు, అది ఒక చట్ట నిర్మాణం అవుతుంది. అమలులో వున్న చట్టం లభిలషించేదేమంటే, ఎక్కువ తక్కువలు చేయకుండా దాని ప్రకారం అమలు చేయాలన్నదే. అందులో ఎక్కువ తక్కువలు చేయటం పూర్తిగా అవిధేయతగా, పైగా కొన్ని సందర్భాల్లో దాన్ని కుఫ్ర్‌గా పరిగణించటం జరిగింది. నమాజ్‌లో ఇమామ్ ఫర్జ్ నమాజ్ ముగించిన వెంటనే దిశ మళ్ళి కూర్చోవటం అభిలషణీయం. ఇమామ్ నమాజ్ ముగించినప్పటికీ అలానే ఖిబ్లా అభిముఖంగా కూర్చోవటం కూడా నమాజ్‌లో అంతర్భాగం కాకూడదు. సామూహిక నమాజ్ ముగిసిన పిదప సున్నత్ నమాజ్‌లను విడి విడిగా చేసుకోవాలి. ఒకవేళ వీటిని సామూహికంగా నిర్వహిస్తే అవి కూడా ఫర్జ్ నమాజ్‌లో అంతర్భాగంగా మారే అవకాశం ఏర్పడుతుంది. కాని అలా చేయరాదు. అదేవిధంగా ఉపవాసాల కొరకు రమజాన్ నెలను నిర్ణయించినప్పుడు, ఎవరైనా వీటితో పాటు మరికొన్ని రోజులను కలుపుకొని రోజాలు పాటిస్తే అవి కూడా విధి విధానాల్లో అధికాంశాలుగా మారే అవకాశముంది.

ఇక్కడ సెలవియ్యబడిందేమంటే – اِلَّا يَكُوْنَ رَجُلٌ كَانَ يَصُوْمُ صَوْمًا...الخ **"ఇల్లా యకూన రజులున్ కాన యసూము సౌమన్ ...."** ఒకవేళ ఎవరయినా సాధారణంగా ఆ రోజు రోజా పాటించడం తన అలవాటుగా చేసుకుంటే అది అతనికి అనుమతించబడినట్లే. దాని అర్థం ఏమంటే ఒకవేళ ఓ వ్యక్తి నెలలోని చివరి తేదీల్లో నఫిల్ రోజాలు వుండే నియమం పెట్టుకుంటే లేక వారంలో ఏదో

ఒక రోజు నఫిల్ రోజా వుండేలా నియమం పెట్టుకుంటే – ఆ రోజు అనుకోకుండా రమజాన్‌కన్నా ముందు రోజుగా వచ్చివుంటే ఆ రోజు రోజా ఉండటంలో ఎలాంటి ఆక్షేపణ లేదు. ఎందుకంటే ఆ రోజాలను అతను తన మామూలు ఆచరణా నియమంగా పెట్టుకున్నాడు గనక.

రెండవ భాగం

## షాబాన్ నెల సగం గడిచాక రోజాలు ఉండరాదు

١٨- عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ
عَلَیْهِ وَسَلَّمَ، اِذَا انْتَصَفَ شَعْبَانُ فَلَا تَصُوْمُوْا۔
(رَوَاهُ اَبُوْدَاؤدَ وَالتِّرْمِذِیُّ وَابْنُ مَاجَه وَالدَّارِمِیُّ)

**18. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఉద్బోధించారు: షాబాన్ నెల సగం గడిచిపోయిందంటే, ఆపైన రోజా పాటించకండి. (అబూదావూద్, తిర్మిజీ, ఇబ్నెమాజా, దారిమీ)**

ఈ ఆదేశానికి విశదీకరణ ఇంతకు పూర్వమే వచ్చింది. ఇంకా దీనికి ఒక మినహాయింపు రూపం కూడా పేర్కొనటం జరిగింది. మరో వినాయింపు ఖజా (తప్పిపోయిన) రోజాల విషయంలో వుంది. దీని వివరణ, వ్యాఖ్యానం సందర్భాను సారం చేయటం జరుగుతుంది.

## రమజాన్ కొరకు షాబాన్ నెలపొడుపును చూసేందుకు ఆదేశం

١٩- عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى
اللهُ عَلَیْهِ وَسَلَّمَ: اَحْصُوْا هِلَالَ شَعْبَانَ
لِرَمَضَانَ۔ (رَوَاهُ التِّرْمِذِیُّ)

**19. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఈ విధంగా హితవు గరిపారు : రమజాన్ కొరకు షాబాన్ నెలవంకను చూసే ఏర్పాటు చేసుకోండి. (తిర్మిజీ)**

ఈ హితవును ఎందుకు ఇవ్వటం జరిగిందంటే ఒకవేళ షాబాన్ నెలవంకను

చూసే ఏర్పాటు చెయ్యకున్నట్లయితే ఆ రోజు షాబాన్ నెల తాలూకు ఏ తేదీ అన్నది తెలియకపోవచ్చు. అలా చేయకపోతే రమజాన్ ప్రారంభపు తేదీ నిర్ణయించుకోవటానికి కష్టంగా మారవచ్చు. ఎందుకంటే ఒకవేళ రమజాన్ ప్రారంభ తేదీ రోజు ఆకాశం నిర్మలంగా లేకపోయినందున చంద్రుడు కన్పించనట్లయితే ఆ రోజు షాబాన్ 29వ తేదీయా లేక 30వ తేదీయా అని నిర్ణయించటం కష్టంగా పరిణమించవచ్చు. ఒకవేళ షాబాన్ నెల చంద్రుణ్ణి చూసే ఏర్పాటు చేసుకునివుంటే, 29వ రోజు రమజాన్ నెల చంద్రుడు కన్పించనిపక్షంలో షాబాన్ నెల 30 రోజులు పూర్తిచేసుకోవాలి. ఒకవేళ ఆ రోజు షాబాన్ 30వ తేదీ అని తెలిస్తే ఆ రోజు చంద్రుడు కన్పించకపోయినా మరుసటి రోజు నుంచి ఇక రమజాన్ ప్రారంభమయి నట్లే లెఖ్ఖ. అందుకే రమజాన్ ప్రారంభ తేదీ నిర్ణయానికి షాబాన్ నెల చంద్రుణ్ణి చూసే ఏర్పాటు కూడా చేసుకోవాలి.

## దైవప్రవక్త (స) షాబాన్ మరియు రమజాన్ ఉపవాసాలను ఎడతెగ కుండా పాటించేవారు

٢٠- عَنْ أُمِّ سَلَمَةَ قَالَتْ مَا رَأَيْتُ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: يَصُومُ شَهْرَيْنِ مُتَتَابِعَيْنِ إِلَّا شَعْبَانَ وَرَمَضَانَ۔

(رَوَاهُ أَبُوْدَاوُدَ، وَالتِّرْمِذِيُّ وَالنَّسَائِيُّ وَابْنُ مَاجَهْ)

**20. హజ్రత్ ఉమ్మె సలమా (రజి.అన్‌హా) ఉల్లేఖించారు : "నేను దైవప్రవక్త (స)ను ఎన్నడూ వరుసగా రెండు నెలలు రోజాలు పాటిస్తున్న స్థితిలో చూడలేదు - అయితే షాబాన్ రమజాన్‌లలో తప్ప అలా జేసేవారు." (అబూదావూద్, తిర్మిజీ, నసాయి, ఇబ్నెమాజా)**

ఇంతకుముందే షాబాన్ నెల సగం గడిచాక రోజాలు పాటించటం నిషిద్ధం అన్న ప్రవక్త (స) హితవును పేర్కొనటం జరిగింది. అయితే ఈ హదీసు ద్వారా మనకు తెలిసే ప్రవక్త (స) ఆచరణ ఏమిటంటే, ఆయన తరచుగా (ఎల్లప్పుడూ కాదు) షాబాన్ ఇంకా రమజాన్ నెలల రోజాలను ఎడతెగకుండా పాటించేవారు. ఇది దైవప్రవక్త గారి ప్రత్యేకమైన ఆచరణ అని మనకు తెలుస్తోంది. ఇతరులెవరికీ ఇలా ఆచరించే అనుమతి లేదు. ప్రవక్త (స) గారి కొన్ని ఆచరణలు ఆయన (స)

కొరకు ప్రత్యేకం. ఇతరులెవరూ వాటిని పాటించటం అభిలషణీయం కాదు. లేదా వాటి ఆచరణ ఇతరులకు తప్పనిసరి కూడా కాదు. ఉదాహరణకు తహజ్జుద్ నమాజ్ ప్రవక్త (స) కొరకు తప్పనిసరి గావించబడింది. కాని ఇతరులకు ఇది తప్పనిసరి కాదు. ఇతరులెవరైనా ఈ నమాజ్ ఆచరిస్తే అది వారి కొరకు పుణ్యకారకం, లేకుంటే ఎలాంటి దోషం లేదు. ఇలాగే మరికొన్ని ఆచరణలున్నాయి – అవి కేవలం ప్రవక్త (స) గారి కొరకే ప్రత్యేకం. ఉదాహరణకు సాధారణ ముస్లింలు ఒకేసారి నలుగురు భార్యలకన్నా అధికంగా కలిగి ఉండకూడదు. కాని ప్రవక్త (స) గారికి దీనిపైన ఎలాంటి ఆంక్ష ఉండేది కాదు. స్వయంగా దివ్య ఖుర్ఆన్‌లో దీని విషయంలో ప్రవక్త (స) గారికి వినాయింపు ఇవ్వటం జరిగింది. అలాగే కొన్ని విషయాల్లో ప్రవక్త (స)కు వినాయింపు లేదు కాని సాధారణ ముస్లింలకు వుంది. ఉదాహరణకు గ్రంథవహులైన స్త్రీలతో సాధారణ ముస్లింలు వివాహం చేసుకోవచ్చు, కాని ప్రవక్త (స) గారికి ఈ అనుమతి లేదు. దీనివలన తెలిసేదేమంటే ప్రవక్త (స) గారికి కొన్ని ప్రత్యేకతలు ఇవ్వబడ్డాయి. ఆయన (స)తో మరెవరూ సాటిరాలేరు. ఇలాంటి ప్రత్యేకతల్లోనిదే ఇది – అంటే ఆయన (స) షాబాన్ నెల రోజాలను పాటించటం. కాని షాబాన్ నెల సగం రోజులు గడిచాక రోజాలు పాటించడానికి సాధారణ ముస్లింలకు అనుమతి లేదు.

## అనుమానంతో రోజాను పాటించటం ధర్మసమ్మతం కాదు

۲۱- عَنْ عَمَّارِ بْنِ يَاسِرٍ قَالَ مَنْ صَامَ الْيَوْمَ الَّذِي
يُشَكُّ فِيهِ فَقَدْ عَصَى أَبَا الْقَاسِمِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ۔

(رَوَاهُ أَبُو دَاوُدَ وَالتِّرْمِذِيُّ وَالنَّسَائِيُّ وَابْنُ مَاجَهْ وَالدَّارِمِيُّ)

**21. హజ్రత్ అమ్మార్ బిన్ యాసిర్ (రజి) ఉల్లేఖనం : ఎవరైనా ఒక వ్యక్తి ఒక రోజు రోజా పాటించాడు, కాని అందులో అతనికి అనుమానం ఏర్పడితే అతను అబుల్ కాసిమ్ (స) పట్ల అవిధేయత కనబరచిన వాడవుతాడు. (అబూదావూద్, తిర్మిజీ, ఇబ్నెమాజా, దారిమీ)**

ఇవి హజ్రత్ అమ్మార్ బిన్ యాసిర్ (రజి) గారి పలుకులు. తన మాటల్లో దీన్ని ప్రవక్త (స) గారి హితవుగా – అనుమానంగా వుంటే ఆ రోజు రోజా పాటించవద్దని పేర్కొనటం జరిగింది. "అనుమానపు రోజా" అంటే అర్థం 'ఈ రోజు రమజాన్ మొదలయ్యిందా లేదా' అని అనుమానపడటం అని అర్థం. ఉ

దాహరణకు, ఈ రోజు షాబాన్ నెల 29వ తేదీ. ఆకాశం నిర్మలంగా లేనందువల్ల చంద్రుడు కన్పించలేదు. అప్పుడు ఆ రోజు గురించి అనుమానం ఏర్పడింది - ఈ రోజు చంద్రోదయం అయ్యిందా లేదా అని. ఇక ఎవరైనా ఒక వ్యక్తి చంద్రోదయమైందని భావించి మరునాడు రోజాను పాటిస్తే అది తప్పు. ఎందుకంటే దీన్నే 'అనుమానపు రోజా' అని పేర్కొనటం జరిగింది. అలాంటి స్థితిలో రోజా ఉండటాన్ని వారించటం జరిగింది. దీని అర్థం ఏమిటంటే, ఆరాధన అనుమానం ఆధారంగా చేయరాదు, పూర్తి నమ్మకంతో చేయాలి. ఉదాహరణకు ఒక ప్రాంతం లేదా పట్టణవాసులైన కొంతమంది ప్రజలకు 'ఇక్కడ జుమా నమాజ్ చేయవచ్చా లేదా?' అన్న అనుమానం కలుగుతుంది. అప్పుడు వారు జుమా నమాజూ చదువుతారు, ఇంకా జుహ్రాలోని నాలుగు ఫర్జ్ రకతులూ చదువుతారు. దాని అర్థం వారి జుమా కూడా అనుమానమైందే, ఇంకా జొహర్‌లోని నాలుగు రకతుల ఫర్జ్ నమాజ్‌లూ అనుమానంలో పడిపోయాయి. ఇది సరియైన పద్ధతి కాదు. వారికి జుమా అవుతుందన్న నమ్మకముంటే కేవలం జుమా నమాజ్ చేస్తే సరిపోతుంది, జుహ్రాలోని 4 రకతుల ఫర్జ్ చదవరాదు. ఒకవేళ జుమా కాదు అని గట్టి నమ్మకముంటే 4 రకతుల ఫర్జ్ మాత్రమే చదవాలి, జుమా చదవరాదు. అనుమానంతో ఆరాధన చేయటం తప్పు. ఇలాంటిదే రమజాన్‌కు సంబంధించి ఈ రోజు రమజాన్ మొదలయ్యిందన్న గట్టి నమ్మకం కుదిరితేనే రమజాన్ రోజా పాటించాలి. అనుమానంతో రమజాన్ రోజా వుండటం సరిఅయింది కాదు. ఈ సందర్భంగా ఇంతకు ముందే హితవు గరపటం జరిగింది - ఒకవేళ షాబాన్ 29వ తేదీ నాడు నెలవంక కన్పించకపోతే షాబాన్ నెల 30 రోజులు పూర్తి చేసుకోవాలని.

## నెలవంక దర్శనానికి మోమిన్ (విశ్వాసి) సాక్ష్యమే ఎన్నదగినది

٢٢- عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ جَاءَ اَعْرَابِيٌّ اِلَى النَّبِيِّ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ اِنِّيْ رَاَيْتُ الْهِلَالَ
يَعْنِيْ هِلَالَ رَمَضَانَ فَقَالَ اَتَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا
اللّٰهُ قَالَ نَعَمْ، قَالَ اَتَشْهَدُ اَنَّ مُحَمَّدًا
رَّسُوْلُ اللّٰهِ قَالَ نَعَمْ، قَالَ يَا بِلَالُ اَذِّنْ
فِى النَّاسِ اَنْ يَّصُوْمُوْا غَدًا-

(رَوَاهُ اَبُوْدَاؤدَ وَالتِّرْمِذِيُّ وَالنَّسَائِيُّ وَابْنُ مَاجَهْ)

**22. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) కథనం : ఒకసారి ఒక పల్లెటూరి వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరై 'నేను చంద్రుణ్ణి చూశాను' అని పలికాడు. అంటే రమజాన్ నెలపొడుపు అన్నమాట. ఆయన (స) అతనితో : 'అల్లాహ్ తప్ప మరెవడూ దేవుడు కాడని నీవు సాక్ష్యం ఇస్తావా?' అని అడిగారు. దానికి ఆ వ్యక్తి 'అవును' అని అన్నాడు. దాని మీదట దైవప్రవక్త (స) హజ్రత్ బిలాల్ (రజి)ను ఉద్దేశించి "బిలాల్ (రజి), రేపటి నుంచి రోజాలు పాటించండి" అని ప్రజల్లో ప్రకటించండి" అని అన్నారు. (అబూదావూద్, తిర్మిజీ, నసాయి, ఇబ్నెమాజా)**

ఇది చాలా ముఖ్యమైన హదీసు. దీనిద్వారా అనేక సమస్యలకు సమాధానం దొరుకుతుంది.

మొట్టమొదటి విషయం ఏమిటంటే, ఆకాశం నిర్మలంగా లేనప్పుడు చంద్రోదయ సమస్య తలెత్తుతుంది. ఆకాశం నిర్మలంగా ఉన్నప్పుడు చంద్రోదయాన్ని చూడటం తేలికవుతుంది. దానిని, వేలు, లక్షల మంది చంద్రుణ్ని చూడగలుగుతారు. అప్పుడు సాక్ష్యం ఇచ్చే అవసరం వుండదు. ఆకాశం నిర్మలంగా ఉండి కూడా వేలమంది ఎంత ప్రయత్నించినా చంద్రుణ్ణి వీక్షించలేని సందర్భంలో ఒక వ్యక్తి వచ్చి చంద్రోదయం అయ్యిందని సాక్ష్యం పలికినా - వారెంతటి తఖ్వా, నిష్ఠాగరిష్ఠులైనప్పటికీ - వారి సాక్ష్యం అంగీకరించబడదు. ఎందుకంటే ఆకాశం నిర్మలంగా వున్నవేళ నలుగురైదుగురు వ్యక్తులు వచ్చి చంద్రోదయం అయ్యిందని సాక్ష్యం పలికినా వారి సాక్ష్యం అంగీకరించబడదు. ఆకాశంలోని ప్రతిదీ వీక్షించగలిగే స్థితిలో వున్న వేళ లక్షల మంది చూడలేని చంద్రుణ్ణి ఇద్దరు ముగ్గురు లేక ఐదు పది మంది చంద్రుణ్ణి చూశామని చెబితే ఎలా నమ్మశక్యమవుతుంది? అయితే ఆకాశం నిర్మలంగా లేనప్పుడు, మబ్బులు క్రమ్ముకుని ఉన్న వాతావరణంలో ఇద్దరు, ముగ్గురు వ్యక్తులు, తాము చంద్రుణ్ణి చూశామని చెబితే దీనిని పరిగణనలోకి తీసుకోవచ్చు. ఎందుకంటే ఎక్కడో కొంత సమయం పాటు మబ్బులు విడిపోయి చంద్రుడు కన్పించి ఉండవచ్చు. అలాంటప్పుడు అలా చెప్పిన వ్యక్తులు సత్యవంతులా కాదా, ఇంకా వారు నమాజ్ రోజాలు పాటించేవారా కాదా అన్న విషయాన్ని పరిగణనలోకి తీసుకోవాలి.▲

---

▲ ఖుత్బ-యె-ఈదుల్ ఫిత్ర్' - పేజీలు 5, 6.

రెండవ విషయం ఏమంటే చంద్రోదయం విషయంలో మొదటి దశలో పేర్కొన్న విషయమై సాక్ష్యం అవసరం అవుతుంది. రెండవ అంశం విషయమై కొంతమంది వ్యక్తులు చంద్రుణ్ణి చూశామని ఇచ్చిన సాక్ష్యం విషయంలో వెలువడిన సమాచారం సరిపోతుంది. ఒక పరపతిగల, నమ్మకమైన సంఘం లేక ఒక ముఫ్తీ లేక ఖాజీ ఈ సాక్ష్యాన్ని పరిగణనలోకి తీసుకొని, సంతృప్తిచెంది ఈ సమాచారాన్ని ప్రకటిస్తే ఇక ఆపై ప్రతి వ్యక్తీ చంద్రుణ్ణి చూసి సాక్ష్యాన్నివ్వాల్సిన అవసరం లేదు. సమాజ పెద్ద లేక ముఫ్తీ లేక ఖాజీ గారి ప్రకటన ఆధారంగా సైరన్ లేక నగారాలు మ్రోగితే లేక పట్టణంలో చంద్రుడు కన్పించాడన్న విషయమై చర్చలు జరిగినా సాధారణ వ్యక్తులకు ఇది సరిపోతుంది. ▲

మూడవ విషయం ఏమిటంటే, ఒక వ్యక్తి ఇచ్చిన సాక్ష్యం రమజాన్ నెల ప్రారంభ సమయానికి మాత్రమే, పండుగ నెలవంకకై కాదు. దైవప్రవక్త (స) రమజాన్ నెల చంద్రోదయం విషయమై మాత్రమే ఒక వ్యక్తి సాక్ష్యాన్ని అంగీకరించారు. అయితే పండుగ నెలవంక విషయమై కనీసం ఇద్దరు వ్యక్తుల సాక్ష్యం అవసరమని ఫిఖహ్‌వేత్తలు ఏకాభిప్రాయం వ్యక్తం చేశారు. ఈ విషయంలో ఒక వ్యక్తి సాక్ష్యం అంగీకరించబడదు. దీనిక్కారణం ప్రజల్లో పండుగ నెలవంక విషయంలో ఉన్నంత ఆతృత, రమజాన్ చంద్రుని విషయంలో ఉండదు. కాబట్టి పండుగ నెలవంక విషయంలో చాలా జాగ్రత్త అవసరం.

నాలుగవ విషయం ఏమంటే, సాక్ష్యం ఇచ్చే వ్యక్తి విశ్వాసియై ఉండాలి. నెలవంక దర్శనం గురించి సాక్ష్యం ఇచ్చిన పల్లెటూరి వ్యక్తి విశ్వాసియా కాదా అన్న విషయంలో కూడా దైవప్రవక్త (స) ఆరా తీశారు. ధార్మిక విషయాల్లో విశ్వసించని వ్యక్తుల సాక్ష్యం చెల్లదని చెప్పటం కూడా దీని మరో ఉద్దేశ్యం. ఏదైనా ధార్మిక విషయంలో తాను ఇచ్చిన సాక్ష్యం ఎంతటి నష్టాన్ని చేకూరుస్తుందో అన్న విషయం ఒక విశ్వసించని వ్యక్తికి ఎలా తెలుస్తుంది? దీనికి ప్రతిగా ఒక విశ్వాసి అయిన మనిషి దృష్టిలో నేడో రేపో రమజాన్ మొదలవుతుందా? లేదా అన్న విషయం ఎంతో ప్రాముఖ్యం కలిగి ఉంటుంది లేక రేపు పండుగ ఉన్నదా? లేదా? అన్న విషయం. ఒకవేళ రేపు పండుగైతే రోజా ఉండటం నిషిద్ధం, లేకపోతే రోజా విరమించటం కూడా నిషిద్ధం. ఈ సమస్య యావన్మంది ముస్లిములదైనప్పుడు ఒక ముస్లిం అయిన వ్యక్తి బాధ్యతా రహితునిగా ప్రవర్తించి ఇలాంటి ధార్మిక విషయంలో తప్పిదం ఎలా చేయగలడు?

---

▲ 'ఖుత్బ–యె–ఈదుల్ ఫిత్ర్' – పేజి *6, 7*

ఇక ఐదవ విషయం. దైవప్రవక్త (స) సమక్షంలో ఆ పల్లెవాసి తాను విశ్వసించిన వాణ్ణని చెప్పినప్పుడు ఆయన (స) ఈ విషయంలో అసలు ఈ వ్యక్తి పాపియా, దుర్మార్గుడా అని దర్యాప్తు చేయలేదు. ఆ వ్యక్తి ముస్లిమన్న విషయంపై సంతృప్తిచెంది అతని సాక్ష్యాన్ని పరిగణనలోకి తీసుకున్నారు. దీనిద్వారా తెలిసేదేమంటే ఒక వ్యక్తి పాపి అని రుజువు కానంత వరకు అతని సాక్ష్యాన్ని రద్దుచేయటం జరగదు. ఒక ముస్లిం విషయంలో ప్రారంభంలో అతని ఫాసిఖ్ (పాపి) అని తెలియలేదు, దీనిమీద దర్యాప్తు కూడా జరపబడలేదు. అయితే అతను పాపి అని తెలిస్తే ఇక అతని సాక్ష్యం అంగీకరించబడదు.

## రమజాన్ నెలవంక విషయమై ఒక్క ముస్లిం సాక్ష్యం సరిపోతుంది

۲۳- عَنِ ابْنِ عُمَرَ قَالَ تَرَاءَى النَّاسُ الْهِلَالَ فَاَخْبَرْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَنِّىْ رَاَيْتُهٗ فَصَامَ وَاَمَرَ النَّاسَ بِصِيَامِهٖ۔

(رَوَاهُ اَبُوْدَاؤدَ وَالدَّارِمِىُّ)

**23. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖనం : జనమంతా ఒక్కటై రమజాన్ నెలవంకను చూడటానికి ప్రయత్నం చేస్తున్నారు. అప్పుడు నేను దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరై 'నేను చంద్రుణ్ణి చూశాను' అని విన్నవించాను. దానిపై ప్రవక్త (స) రోజాలు ఉండాలన్న నిర్ణయం తీసుకుని, ఇక రమజాన్ రోజాలు ప్రారంభించమని ఆదేశమిచ్చారు. (అబూదావూద్, దారిమీ)**

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) విషయంలో ఆయన ముస్లిమని, ప్రవక్త (స) సహచరులని తెలుసు. అందువల్ల ఆయనతో 'నీవు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను విశ్వసించావా?' అని అడగటం జరగలేదు. కేవలం సాక్ష్యం పైననే రమజాన్ రోజాల నిర్ణయం గైకొనబడింది. ఈ హదీసు ద్వారా తెలిసేదేమంటే ఆకాశం నిర్మలంగా లేనప్పుడు రమజాన్ నెలవంక విషయంలో ఒక వ్యక్తి ఇచ్చే సాక్ష్యం సరిపోతుంది. స్వయంగా **'తరాఅన్నాసుల్ హిలాల్'** అనే పదాల ద్వారా తెలిసేదేమంటే, చాలామంది ప్రజలు చంద్రుణ్ణి చూసే ప్రయత్నం చేశారు. కాని ఆకాశం నిర్మలంగా లేనందువల్ల చంద్రుడు కనిపించలేదు. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) గారికి అది కనిపించింది. ఆపై ఆయన ప్రవక్త (స) సన్నిధికి వచ్చి, 'నేను చంద్రుణ్ణి చూశాను'

అని సాక్ష్యం పలికారు. పిదప ఆయన (స) రమజాన్ ఉపవాసాల విషయమై తన నిర్ణయం ప్రకటించారు.

ఈ విషయంలో సర్వసాధారణమైన, సంపూర్ణ ఆమోదం ఏమంటే, రమజాన్ నెలవంక విషయమై ఒక వ్యక్తి సాక్ష్యం అంగీకరించబడుతుందన్న విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. కొంతమంది ధర్మవేత్తల అభిప్రాయంలో రమజాన్ చంద్రోదయ విషయమై ఒకే వ్యక్తి సాక్ష్యం కూడా అంగీకరించబడుతుంది - అయితే అది ఆకాశం నిర్మలంగా లేనప్పుడు మాత్రమే. ఒకవేళ ఆకాశం నిర్మలంగా వుంటే అట్టి పరిస్థితిలో ఒక వ్యక్తి సాక్ష్యం సమ్మతం కాదు. ఈ పరిస్థితిలో చంద్రోదయ విషయమై అనేకమంది సాక్ష్యం అవసరమవుతుంది. ఇమామ్ మాలిక్ ఇంకా కొందరు ధర్మవేత్తల పంథా ప్రకారం కనీసం నమ్మకస్తులైన ఇద్దరు వ్యక్తుల సాక్ష్యం అత్యంతావశ్యకం. అయితే ప్రస్తుత హదీసు వీరి పంథాకు వ్యతిరేకంగా ఉంది. కొన్ని ఇతర హదీసుల ద్వారా వారి పంథాకు పటిష్ఠత చేకూరుతుంది. అయితే వారి ద్వారా కూడా ఒక వ్యక్తి ఇచ్చే సాక్ష్యం విషయమై ఎలాంటి ఆదేశమూ పరిగణనలోకి తీసుకోబడదు.

మూడవ భాగం

## దైవప్రవక్త (స) షాబాన్ నెల తేదీలను తెలుసుకునేందుకు ఏర్పాట్లు చేసేవారు

۲۴- عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ يَتَحَفَّظُ مِنْ شَعْبَانَ مَا لَا يَتَحَفَّظُ
مِنْ غَيْرِهٖ ثُمَّ يَصُوْمُ لِرُؤْيَةِ رَمَضَانَ فَإِنْ غُمَّ
عَلَيْهِ عَدَّ ثَلَاثِيْنَ يَوْمًا ثُمَّ صَامَ۔ (رواه ابوداؤد)

**24.** హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (స) ఇతర నెలలకన్నా షాబాన్ నెలను చాలా ఎక్కువగా కనిపెట్టుకుని ఉండేవారు. (అంటే వాటి తేదీలను తెలుసుకుంటూ వుండేవారు). ఆపై రమజాన్ నెలవంకను చూసి రోజాలు ఉండేవారు. ఒకవేళ ఆకాశం నిర్మలంగాలేని కారణంగా చంద్రుడు కన్పించకపోతే షాబాన్ నెల 30 రోజులు పూర్తిచేసి రోజాలు మొదలు పెట్టేవారు. (అబూదావూద్)

ఇంతకు ముందు వచ్చిన ఓ హదీసులో షాబాన్ నెల చంద్రుణ్ణి చూసే ఏర్పాటు చేయండి అన్న ప్రవక్త (స) గారి హదీసు వచ్చింది. ఇక్కడ హ్రజత్ ఆయిషా (రజి.అన్హా) గారి ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (స) ఇతర నెలల చంద్రోదయం పైన అంతగా శ్రద్ధ చూపేవారు కారు, కాని షాబాన్ నెల చంద్రోదయంపై ఎంతో శ్రద్ధ చూపేవారు. వాటి తేదీలను సరిగ్గా లెక్కించాలని సెలవిచ్చేవారు. ఒకవేళ ఆకాశం నిర్మలంగా లేనందువల్ల షాబాన్ నెల చంద్రుడు రజబ్ 29వ తేదీనాడు కన్పించకపోతే నెల పొడవునా దాన్ని గురించి పరిశోధించాలి – ఆ రోజు చంద్రోదయం అవుతుందా లేదా అన్న విషయం గురించి. ఈ విధంగా ప్రవక్త (స) కాలంలో షాబాన్ తేదీలను చాలా జాగ్రత్తగా గమనించేవారు – ఆ రోజు షాబాన్ 29వ తేదీయా లేక 30వ తేదీయా అనే విషయాన్ని.

## ఒక నెల గడువు రెండవ నెల చంద్రుడు కన్పించే వరకు ఉంటుంది

٢٥- عَنْ اَبِی الْبَخْتَرِیِّ قَالَ خَرَجْنَا لِلْعُمْرَةِ فَلَمَّا نَزَلْنَا بِبَطْنِ نَخْلَةَ تَرَائَیْنَا الْهِلَالَ فَقَالَ بَعْضُ الْقَوْمِ هُوَابْنُ ثَلَاثٍ وَقَالَ بَعْضُ الْقَوْمِ هُوَابْنُ لَیْلَتَیْنِ فَلَقِیْنَا ابْنَ عَبَّاسٍ فَقُلْنَا اِنَّا رَاَیْنَا الْهِلَالَ فَقَالَ بَعْضُ الْقَوْمِ هُوَابْنُ ثَلَاثٍ وَقَالَ بَعْضُ الْقَوْمِ هُوَابْنُ لَیْلَتَیْنِ فَقَالَ اَیَّ لَیْلَةٍ رَاَیْتُمُوْهُ قُلْنَا لَیْلَةَ كَذَا وَكَذَا، فَقَالَ اِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ مَدَّهٗ لِلرُّؤْیَةِ فَهُوَ لِلَیْلَةٍ رَاَیْتُمُوْهُ ـــ وَفِیْ رِوَایَةٍ عَنْهُ ـــ قَالَ اَهْلَلْنَا رَمَضَانَ وَنَحْنُ بِذَاتِ عِرْقٍ فَاَرْسَلْنَا رَجُلًا اِلَی ابْنِ عَبَّاسٍ یَسْئَلُهٗ، فَقَالَ ابْنُ عَبَّاسٍ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ : اِنَّ اللّٰهَ تَعَالٰی قَدْ اَمَدَّهٗ لِرُؤْیَتِهٖ فَاِنْ اُغْمِیَ عَلَیْكُمْ فَاَكْمِلُوا الْعِدَّةَ۔ (رَوَاهُ مُسْلِمٌ)

**25.** హ్రజత్ అబుల్ బఖ్తరీ (రహ్మ) ఇలా అన్నారు: మేము ఉమ్రా కొరకు

**మా పట్టణం నుండి బయలుదేరాము. (మార్గంలో) మేము 'బతనె నఖ్‌లా'▲ అనేచోట ఆగి, నెలవంకను చూసే ప్రయత్నం చేశాము. ఆ సందర్భంగా కొంతమంది 'ఇది మూడవ రాత్రి చంద్రుడు' అని అన్నారు, మరికొందరి దృష్టిలో అది రెండవ రాత్రి చంద్రునిలా పేర్కొనటం జరిగింది. ఆపై మేము (మక్కాకు చేరుకొని) హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి)ను కలిశాము. వారితో 'మేము చంద్రుణ్ణి చూశాం. కాని మాలో కొంతమంది అది మూడవ రాత్రి చంద్రుడని అంటే, మరికొందరు అది రెండవ రాత్రి చంద్రుడని అన్నారు' అని అన్నాము. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) 'మీరు ఏ రాత్రి చంద్రుణ్ణి చూశారు' అని అడిగారు. మేము ఫలానా రాత్రిన నెలవంకను చూశామని అన్నాము. దానిపై హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) "దైవప్రవక్త (స) నెల రోజుల గడువు, మరుసటి నెల చంద్రోదయం వరకు ఉంటుందని నిర్ణయించారు. కాబట్టి మీరు చూసిన చంద్రుడు ఆ రాత్రిన కన్పించినదే" అని అన్నారు. హజ్రత్ అబుల్ బఖ్తరీ (రహ్మా) గారి మరో ఉల్లేఖనం ఇలా ఉంది : 'మేము రమజాన్ చంద్రుణ్ణి చూశాము. అప్పుడు మేము 'జాతె ఇర్ఖ్'▲▲ అనే చోట వున్నాం. ఆపై మాలోని ఒక వ్యక్తిని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) వద్దకు పంపి (ప్రస్తావిత అంశంలోని భేదాభిప్రాయంపై) అడిగాము. దానిపై హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) దైవప్రవక్త (స) గారు సెలవిచ్చిన దాన్ని ఇలా ఉల్లేఖించారు : అల్లాహ్ నెలల గడువును మరుసటి నెల చంద్రోదయం వరకు నిర్ణయించాడు. ఒకవేళ ఆకాశం మబ్బులతో నిండివుండి చంద్రుడు కన్పించకపోతే, ఇక (రెండు నెలల్లోనూ) 30 రోజులు పూరించండి.**

హజ్రత్ అబుల్ బఖ్తరీ (రహ్మా) ఒక తాబయి (ప్రవక్త -స- సహచరుల కాలానికి చెందినవారు). ఆయన (రహ్మా) వినిపించిన ఈ సంఘటన ప్రవక్త (స) తరువాతి కాలానిది.

ఒకవేళ ఆకాశం మబ్బుగా ఉండి చంద్రోదయం గురించి ఒక నిర్ధారణకు రాలేకపోతే, మరునాడో లేక ఆ తరువాతి రోజో నెలవంక దర్శనంపై, నేడు కన్పిస్తున్న

---

▲ మక్కా మరియు తాయిఫ్‌ల మధ్యనున్న ఒక ప్రాంతం.

▲▲ 'బతనె నఖ్‌లా'కు దగ్గరగా వున్న ఒక ప్రదేశం.

ఈ చంద్రుడు రెండవ రాత్రిదని, లేక మూడవ రాత్రిదని జనుల్లో తర్జనభర్జనలు మొదలవుతాయి. దీనివలన మనసుల్లో రకరకాల అనుమానాలు జనిస్తాయి. అందువలన హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) దీన్ని ఆపటానికే ఈ విషయాన్ని వివరించాల్సి వచ్చింది : దైవప్రవక్త (స) నెల గడువును చంద్రోదయం వరకు నిర్ణయించారు. మరో ఉల్లేఖనంలో, 'అల్లాహ్ నెల గడువు కాలాన్ని చంద్రోదయం వరకు నిర్ణయించాడు' అని వుంది. అంటే ఒక నెల రెండవ నెల చంద్రుణ్ణి చూసిన తరువాత పూర్తవుతుంది. ఒకవేళ 29వ తేదీ చంద్రుడు కన్పించకపోతే, ఆ నెల 30 రోజులతో పూర్తి చేయాలి. కేవలం చంద్రుడి పరిమాణం అంటే సన్నగా లేక లావుగా వుందన్న అంశం ఆధారంగా ఆ తేదీని నిర్ణయించకూడదు. ఇలా చేయటం ఎన్నో అనుమానాలకు తావునిస్తుంది. కేవలం చంద్రోదయంపై మీరు నిర్ణయం తీసుకోవాలి, అంతేగాని ఊహలు, అంచనాలపై నిర్ణయం తీసుకోరాదు. అనవసరంగా కోరి కష్టాల్లో కూరుకుపోరాదు.

# بَابٌ

# అధ్యాయం

ఒకటవ భాగం

## సహరీ చేయటంలో శుభం

٢٦- عَنْ اَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: تَسَحَّرُوْا فَاِنَّ فِى السُّحُوْرِ بَرَكَةً۔
(مُتَّفَقٌ عَلَيْهِ)

**26. హజ్రత్ అనస్(రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు, సహరీ చేయండి, సహరీ తినటంలో శుభం ఉంది. (ముత్తఫకున్ అలైహి)**

ఇస్లాంలో నిర్ధారితమైవున్న ఆరాధనలకు, ప్రపంచ ఇతర మతాలలోని ఆరాధనలకు మధ్య ఒక సూత్రప్రాయమైన భేదముంది. ఈ భేదం వల్లనే వాటి ప్రయోజనాల్లో కూడా తేడా ఉంది.

ఆ మౌలిక తేడా ఏమంటే ఇతర మతధర్మాల్లో దాగివున్న భావన ప్రకారం మనిషి తన శరీరాన్ని బాధల్లో పడవేయడం ద్వారా ఆధ్యాత్మిక పురోభివృద్ధి సాధించగలడనీ, తద్వారానే అతను దైవానికి మరీ దగ్గరవుతాడని తలపోయటం జరిగింది. ఉదాహరణకు వారి దృష్టిలో ఆకలితో అలమటించి చావటం దేవునికి ప్రీతికరం, ఇదే మనిషిని దైవానికి చేరువ చేస్తుంది. ఇలాంటి భావనతోనే వారు అనేక ఇతర పనులు చేస్తారు. ఉదాహరణకు ఎవరో ఒకరు ఒక బావిలో తనకు తాను తలక్రిందుగా వ్రేలాడుతుంటాడు. మరొకడు దేశ దిమ్మరిగా తిరుగుతూ తన జీవనాన్ని కొనసాగిస్తాడు. రకరకాల జంతువులు అతన్ని కాటువేస్తుంటాయి. ఇంకా ఇలాంటివే ఇతర అనేక బాధల్లో మునిగిపోవటం వల్లనే దైవప్రీతిని పొందే ఉద్దేశంతో తమకు తాము కష్టాలపాల్జేసుకుంటారు. కాబట్టి వారి దృష్టిలో మనిషి తనకు తాను రకరకాల కష్టాలకు గురిచేసుకుని దేవుని ప్రేమలో, ఈ దాసునికెంత

ప్రీతి వుందో, తన స్వయాన్ని కూడా దహించుకోవటానికి తాను సిద్ధంగా వున్నాడని, దీనిద్వారా దేవునికి నమ్మకం కలుగజేయాలని ప్రయత్నిస్తుంటాడు – కాని ఇస్లామీయ ఆరాధనా దృక్పథం ప్రకారం ఇలాంటి భావనలు పూర్తిగా అజ్ఞానంతో కూడుకున్నవి.

## ఇస్లామీయ ఆరాధనల ఉద్దేశం – శిక్షణ, ఆత్మశుద్ధి

ఇస్లామీయ ఆరాధనలు వాస్తవానికి మనిషి శిక్షణకు నిర్ణయించబడ్డాయి. ఈ శిక్షణే మనిషిని దైవానికి చేరువచేస్తుంది. ఉదాహరణకు రోజా. రోజా అసలు ఉద్దేశం అల్లాహ్ కొరకు మనిషిని ఆకలితో అలమటించేలా చేయటం కాదు. ఇంకా ఈ బాధవలన (అల్లాహ్ క్షమించుగాక!) అల్లాహ్‌కు ఎలాంటి సంతోషం కలుగదు. మీరు రోజా వుండి అల్లాహ్ ఆదేశాల్లో ఒక దాన్ని పాలించి, ఆయన పట్ల విధేయతను ప్రకటించారన్నమాట. ఒక ప్రత్యేక సమయం వరకు మీరు తినవచ్చు, త్రాగవచ్చు. ఆపైన మీరు ఆయన ఆదేశించనంత వరకు ఓ ప్రత్యేక సమయం వరకు తినలేరు, త్రాగలేరు. ఈ విధంగా మీరు ఒక సమయం వరకు తిన్నారు, త్రాగారు, ఆపై ఆగిపోయారు. దీనర్థం మీరు అల్లాహ్ ఆదేశాలకు కట్టుబడి వున్నారు, మీరు అవిధేయులు కారు. ఏ సమయం వరకు తినవద్దని మీకు ఆయన ఆదేశించాడో అంతవరకు మీరు తినరు, అంటే మీకు ఆకలి ఎంతగా బాధించి మిమ్మల్ని నిస్సత్తులుగా జేసినా. ఈ విధంగా ఒక ప్రత్యేక సమయం వరకు మీరు తినటం, త్రాగటం మానేశారంటే దానర్థం మీరు ఆయనకు విధేయులయ్యారు. ఈ మీ విధేయతే అల్లాహ్‌కు నచ్చింది. ఈ విధేయత పేరే ఆరాధన. అంతేగాని, మీకు కష్టం కలిగించటం అల్లాహ్ ఉద్దేశం కాదు. అల్లాహ్ మీకు తినటానికి, త్రాగటానికి అనుమతినిచ్చినప్పుడు మీరు ఒక్కసారిగా స్వతంత్రులై ఇక మాకు తినటం, త్రాగటం అవసరం లేదు, మాకు అల్లాహ్ సాన్నిధ్యం కావాలి, అంటే అల్లాహ్‌కు పోటీగా నిలబడి ఇక మాలో ఎంత సామర్థ్యం వుందో (అల్లాహ్ క్షమించుగాక!) అని అనే ఆలోచన మీ ఊహకు కూడా అందదు–ఇక చూస్తాం మాపై మాకు ఎంత పట్టుందో అన్న చందంగా. ఇలాంటి వారిని అల్లాహ్ క్రైస్తవ సన్యాసులను శిక్షించిన విధంగా శిక్షిస్తాడు.

## ఇస్లాంలో ఆరాధనల ఉద్దేశం పూర్తిగా భిన్నం

ఇక్కడ మీకు ఇవ్వబడిన అనుమతి ద్వారా మీరు దాని ప్రయోజనం పొందాలి. దేవుడు ఇచ్చిన అనుమతుల ద్వారా మీరు లాభపడితేనే ఆయన సంతోషిస్తాడు. ఆయన నిర్ణయించిన హద్దుల్ని మీరు అతిక్రమించినప్పుడే మీ పట్ల ఆయన అప్రసన్నుడవుతాడు. ఆయన వారించిన చోట మీరు ఆయన ఆదేశాలను అతిక్రమిస్తే

అదే అతనికి కోపకారణమవుతుంది. అంతేకాని, ఆయన అనుమతించినప్పుడు మీరు సుష్టుగా మంచి భోజనం చేసినప్పుడు కాదు. మంచి భోజనం కూడా అల్లాహ్ ప్రసాదితమే కదా! అది కూడా మీ కోసమే సృజించబడింది. మీరు ఆయన వరప్రసాదాల పట్ల సంతుష్టులైతే, మీ పట్ల పరలోకంలో అది ఆయన అయిష్టతకు కారణం ఎలా అవుతుంది? కాబట్టి ఆయన ఆదేశించినప్పుడు ఆకలితో గడపాలి, ఆయన అనుమతించినప్పుడు తినాలి. ఇలాంటి ఉద్దేశంతోనే మన ఉపవాసాలకు, ఇతర ధర్మాల్లోని ఉపవాసాలకు మధ్య తేడా ఏర్పడుతుంది. ఈ భేదం ఆదిలోనూ, అంతంలోనూ రెండు చోట్లా స్పష్టంగా కన్పిస్తుంది.

గ్రంథవహుల రోజాలలో సహరీ చేయాలని లేదు. వారి ఉపవాసం సూర్యాస్తమయం తరువాత మొదలవుతుంది. వారు రాత్రి పూటనే తినటం, త్రాగటం పూర్తిచేసుకుంటారు. వారి ఆ ఉపవాసం రెండవ రోజు సూర్యాస్తమయం వరకు కొనసాగేది. కాని వారిలో అత్యధిక ధర్మనిష్ఠగల వారు రెండవ రోజు ఉపవాస విరమణ చేసిన వెంటనే మరుసటి రోజాను మొదలెట్టేవారు. వారిలో మరో దైవభక్తుడు ఒక్క బటానీ గింజతో ఉపవాసాన్ని విరమించి రెండవరోజు ఉపవాసాన్ని ప్రారంభించేవాడు. ఇంకా వారిలో మరికొంతమంది సంపూర్ణ సిద్ధహస్తులు రెండవ రోజు ఉపవాసాన్ని కూడా విరమించక మరుసటి రోజు ఉపవాసాన్ని మొదలెట్టేవారు. ఈ విధంగా నిరంతరం మూడేసి, నాలుగేసి రోజాలుండేవారు. అంటే ఎవరు ఎంత గొప్ప వైరాగ్యులో వారు తమ తమ ధర్మనిష్ఠతో తమ సంపూర్ణ సిద్ధహస్తతతను వ్యక్తం చేయటానికి చాలా నిడివైన రోజాను పాటించేవారు.

## సహరీ భుజించటంలో గల శుభం?

ఈ హదీసులో ప్రవక్త (స) "సహరీ భుజించటంలో శుభముంది" అని సెలవిచ్చారు. సహరీ భుజించటం వలన అల్లాహ్ ఆదేశపాలనలో మీకు సౌలభ్యముం టుంది. ఆయన ఆదేశం ఏమంటే, ఫజ్ర్ (ఉదయం) నుండి రోజా మొదలై సూర్యాస్తమయంతో పూర్తవుతుంది. ఇక రోజా మొదలవక ముందు అల్లాహ్ ఇచ్చిన అనుమతితో ప్రయోజనం పొంది తినటం, త్రాగటం చేయాలి. ఇలా తిని, త్రాగిందే మీకు రోజంతా పనికివస్తుంది. మీరు ఒకవేళ అలా చేయకుంటే మీలో తప్పక దుర్బలత ఏర్పడుతుంది. నెలంతా రోజాలుండాలని అల్లాహ్ ఆదేశముంది గనుక, ఏ వ్యక్తయినా తన శక్తి, స్థయిర్యాల ప్రకారం ఈ గడువు పూర్తవక ముందే శక్తిహీనుడై అల్లాహ్ ఆదేశాన్ని పాలించే స్థితిలో వుండకపోవచ్చు. ఈ కారణంగానే దైవప్రవక్త

(స) సహరీ భుజించాలని తాకీదు చేశారు. మీకు అనుమతించిన వేళ తిని త్రాగటం వలన, మీకు అనుమతించని సమయంలో దైవాజ్ఞాపాలనలో మీకు శక్తి లభిస్తుంది.

## గ్రంథవహులు - ముస్లింల ఉపవాసాలలో భేదం

٢٧- عَنْ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: فَصْلُ مَا بَيْنَ صِيَامِنَا وَصِيَامِ أَهْلِ الْكِتٰبِ أَكْلَةُ السَّحَرِ. (رَوَاهُ مُسْلِمٌ)

**27. హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్, దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారని పేర్కొన్నారు: "మనకు మరియు గ్రంథవహుల రోజాలకు మధ్య తేడా వుంది. అదే సహరీ భుజించటం." (ముస్లిం)**

గ్రంథవహుల రోజాలో సహరీ లేదు. కాగా, మన రోజా సహరీతో మొదలవుతుంది. ఇదే విషయం వారికి, మనకు మధ్య తేడాగా వుంటుంది. వారి ఉద్దేశం ప్రకారం రోజా అంటే స్వయంగా బాధకు లోనుచేసుకోవటం. కాని మన ఉద్దేశంలో రోజా దైవాజ్ఞాపాలనకు అలవాటు పడే ప్రక్రియ. మనం విధేయతను పాటిస్తూ దైవసామీప్యాన్ని అభిలషిస్తాము. కాని వారు దైవ సామీప్యం కొరకు దేవుడు ఆదేశించని పద్ధతుల ద్వారా తమను కష్టాలకు లోనుజేసుకుంటారు.

## ఇఫ్తార్ తొందరగా చేయటంలో మేలు ఉంది

٢٨- عَنْ سَهْلٍ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: لَا يَزَالُ النَّاسُ بِخَيْرٍ مَا عَجَّلُوا الْفِطْرَ. (مُتَّفَقٌ عَلَيْهِ)

**28. హజ్రత్ సహ్ల్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) సెలవిచ్చారు: ప్రజలు ఇఫ్తార్ చేయటంలో తొందరపడే వరకు క్షేమంగా ఉంటారు. (ముత్తఫకున్ అలైహి)**

యూదులు ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్న వేళ ఇఫ్తార్ చేస్తారు. ఇందులో కూడా ఎవరు ఇంకా ఆలస్యంగా ఉపవాసాన్ని విరమిస్తాడో అతను మరింత నిష్ఠాగరిష్టుడుగా, సంపూర్ణ సిద్ధి గల వానిగా ఎంచబడేవాడు. ఈ ప్రవర్తన వారి దృష్టిలో 'ఈ వ్యక్తి తినటానికి తొందరపడేవాడు కాడని, తన మనసుపై పూర్తి అధీనత

గలవాడని, ఇంకా రోజా విరమణ సమయం దాటిపోయినా రోజా విరమించలేద'ని గొప్పగా భావించబడేవాడు. ఇస్లాంలో ఇలాంటి బాహ్యాపరమైన నిష్ఠకు ఎలాంటి ప్రాధాన్యత లేదు. ఇస్లాం ఉద్దేశంలో అల్లాహ్ నిర్దేశించిన సమయం వరకు - ఎవరో తనను కట్టిపడేశారా అన్నట్లు - రోజా విరమణకు ఆగవలసిందే. అల్లాహ్ ఆదేశం, అనుమతి అయిన వెంటనే రోజా విరమణకై ఏర్పాటైన పదార్థాల వైపు పరుగెత్తండి. ఆపై వాటి ప్రయోజనాన్ని పొందటానికి తొందరపడండి. ఇలాంటి ఆచరణ అల్లాహ్‌కు మిక్కిలి ప్రీతికరమైనది. ఎందుకంటే ఈ దాసుడు ఆయన ఆజ్ఞానుసారం ఇప్పటి వరకు వేచి వున్నాడు. ఒకవేళ అల్లాహ్ ఆదేశం ప్రకారం ఆగాల్సిన అవసరం లేకుంటే వేచి వుండేవాడే కాదు. అల్లాహ్ అతన్ని కట్టిపడేశాడు కాబట్టే తన మనోవాంఛల్ని, ఆకలిదప్పుల్ని భరించాడు. ఇంకా ప్రతిదానిపై అదుపు సాధించగలిగాడు. ఆపై కట్టుబాటు సడలించిన వెంటనే పూర్తి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలతో తినటం, త్రాగటం మొదలెట్టాడు, ఇతర అవసరాలూ తీర్చుకున్నాడు. ఇలా చేయటం వల్లనే అల్లాహ్ ఇష్టపడతాడు. అందుకనే దైవప్రవక్త (స) సెలవిచ్చారు : "ప్రజలు ఇఫ్తార్ చేయటంలో తొందర పడేంతవరకు క్షేమంగా వుంటారు". ఒకవేళ ఇఫ్తార్ చేయటంలో ఆలస్యం చేసినట్లయితే, గ్రంథవహులు చిక్కుకున్న రోగంలోనే వారూ కూరుకుపోతారు.

## ఇస్లాం చెడును ఆరంభంలోనే నిరోధిస్తుంది

ఖుర్‌ఆన్, హదీసులను పరిశోధనా దృష్టితో అధ్యయనం చేసినవారికి ఈ విషయంలో ఇస్లాం దృక్పథం ఏమిటో అర్థమవుతుంది. ఒకవేళ ఏదైనా ప్రమాదకర మయిన వస్తువు బహుదూరాన పొంచివుందని తెలిసినప్పుడు ఒక విశ్వాసి అది సమీపానికి వచ్చినప్పుడు దాన్ని అడ్డుకోవచ్చులే అన్న ధీమాను వ్యక్తం చేయరాదు. దీనికి ప్రతిగా ఇస్లాం ప్రమాదం ఎక్కడ్నుంచైతే ఆరంభమయిందో అక్కడే దాన్ని నిలువరిస్తుంది. అది ఒక్క అడుగు కూడా ముందుకేయటానికి ఇష్టపడదు ఇస్లాం. ఇక సన్యాసత్వాన్నయితే ఇస్లాం గట్టిగా వ్యతిరేకిస్తుంది. రోజా విషయంలో ఈ రోగం ఎలా దాపురిస్తుందంటే, రోజా విరమణ సమయం అయిపోయింది, అయితే మీరు మరికాస్త ఆలస్యం చేసి దానిద్వారా మీ శరీరాన్ని మరింత శుష్కింపజేసి దాన్ని కష్టపెడితే దేవుడు అంతగానే మీ పట్ల సంతోషపడతాడని తలపోస్తారు. అందువల్లనే ఈ విషయంలో హెచ్చరించటం జరిగింది - ఇలా చేస్తే మీరు మేలుకు

దూరమవుతారు. అల్లాహ్ ప్రీతిని పొందే బదులు అది ఆయన ఆగ్రహానికి కారణమవుతుంది. అల్లాహ్ ప్రీతి అయితే ఆయన ఆదేశపాలనలో విధేయత చూపటంలో, ఆయన విధించిన నిబంధనల పట్ల సమ్మతి తెలుపుతూ ఆయన అనుమతించిన వాటి ద్వారా లాభం పొందటంలోనే వుంది. ఆయన హలాల్ చేసిన వాటిపట్ల మీరు పూర్తిగా సంతృప్తిచెందాలి. ఇంకా ఆయన హరామ్ చేసిన వాటి నుంచి దూరంగా వుండాలి. మీ తరపు నుంచి ఆయన ఆదేశాల పాలనలో ఎలాంటి లోపం రానీయకూడదు. విధేయత అంటే ఇదే, దీనివలన అల్లాహ్ మీరంటే ఇష్టపడతాడు. అందుకనే దైవప్రవక్త (స) సెలవిచ్చారు : "ప్రజలు ఇఫ్తార్ చేయటంలో తొందరపడే వరకు క్షేమంగా ఉంటారు. ఎందుకంటే అల్లాహ్ నిర్ణయించిన ఇఫ్తార్ వేళన ఇఫ్తార్ చేయటం ఆయనకు ప్రీతికరం, ఇందులోనే మీ మేలు ఉంది."

## రోజా విరమణకు సరియైన సమయం

٢٩- عَنْ عُمَرَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ
وَسَلَّمَ: إِذَا أَقْبَلَ اللَّيْلُ مِنْ هٰهُنَا وَأَدْبَرَ النَّهَارُ مِنْ
هٰهُنَا وَغَرَبَتِ الشَّمْسُ فَقَدْ أَفْطَرَ الصَّائِمُ۔ (مُتَّفَقٌ عَلَيْهِ)

**29. హజ్రత్ ఉమర్ (రజి) గారి ఉల్లేఖనం - దైవప్రవక్త (స) సెలవిచ్చారు : రాత్రి ఈ వైపు నుంచి రావటం మొదలై పగలు ఆ వైపు నుంచి తిరగటం మొదలై, ఆపై సూర్యుడు అస్తమించినప్పుడు ఉపవాసి రోజా విరమణకు సమయం అవుతుంది." (ముత్తఫకున్ అలైహ్)**

అంటే తూర్పు దిశ నుంచి రాత్రి చీకట్లు క్రమ్ముకోవటం మొదలై, రెండవ వైపు పశ్చిమ దిశ నుంచి సూర్యాస్తమయమయిందన్న సమాచారం వస్తుంది. మీరు చూస్తూ వుండగానే పగలు సమాప్తమయినప్పుడు అదే రోజా విరమణ సమయానికి సంకేతం. అప్పుడు వెంటనే మీరు ఉపవాస విరమణ చేయాలి.

ఒకవేళ రోజా విరమణ సమయం అయినప్పుడు, దానిపై మీరు రోజా విరమించాలా? వద్దా? అని ఆలోచిస్తే అది పొరపాటు. ఇది పూర్తిగా షరీఅత్ ఊపిరికి వ్యతిరేకం. ఇఫ్తార్ సమయం కాగానే వెంటనే ఏమాత్రం ఆలస్యం చేయకుండా రోజా విరమించాలి.

## ఎడతెగకుండా రోజా ఉండటం ధర్మసమ్మతం కాదు

٣٠ - عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ
وَسَلَّمَ عَنِ الْوِصَالِ فِي الصَّوْمِ فَقَالَ لَهُ رَجُلٌ إِنَّكَ
تُوَاصِلُ يَا رَسُولَ اللهِ قَالَ وَأَيُّكُمْ مِثْلِي إِنِّي أَبِيتُ
يُطْعِمُنِي رَبِّي وَيَسْقِينِي (مُتَّفَقٌ عَلَيْهِ)

**30. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) ఎడతెగకుండా రోజా వుండటాన్ని వారించారు. దీనిపై ఒక వ్యక్తి "ఓ దైవప్రవక్తా! మీరు కూడా ఎడతెగని రోజాలుంటారు కదా!" అని విన్నవించుకున్నాడు. తదుపరి ప్రవక్త (స) సెలవిచ్చారు : మీలో ఎవరు నాతో సమానమవుతారు? నేనైతే రాత్రివేళను ఎలా గడుపుతానంటే, రాత్రివేళ నా ప్రభువు నాకు తినిపిస్తాడు, త్రాపిస్తాడు."**

**(ముత్తఫకున్ అలైహి)**

ఈ హదీసులో ఒక ముఖ్యమయిన అంశాన్ని తెలుపటం జరిగింది. గ్రంథవహుల్లో రోజాలుండే వివిధ పద్ధతుల్లో ఎడతెగని రోజాలుండటం కూడా ఓ పద్ధతి. ఇందులో కూడా అనేక రకాలున్నాయి. ఒక పద్ధతి ఏమంటే, ఒక వ్యక్తి విధి(ఫర్జ్)గా వుండే రోజాలే కాకుండా నఫిల్ రోజాలను కూడా ఎలాంటి విరామం లేకుండా ఎడతెగకుండా, నెలల తరబడి రెండేసి నెలలు రోజాలు పాటిస్తాడు. గ్రంథవహుల్లో కొంతమంది ఇలా కూడా చేస్తారు, మరికొందరు కావాలని కూడా (సౌమె విసాల్) ఎడతెగని రోజాలుండేవారు. అల్లాహ్ చేత విధిగావించబడిన రోజాలే గాకుండా, మిగతా రోజుల్లో కూడా వారు ఉపవాసిగానే వుండేవారు. సౌమెవిసాల్ రెండో పద్ధతి ఏమంటే ఒక వ్యక్తి ఒక సహరీ తిని రెండవ సహరీ వరకు ఎడతెగని రోజా పాటిస్తాడు, మధ్యలో ఇఫ్తార్ చేయడు. కొన్ని సమయాల్లో రెండేసి, మూడేసి రోజులు ఉపవాసం వుంటాడు. గ్రంథవహుల్లో ఈ రెండు నవీన పోకడలు అమల్లో ఉండేవి. ఇస్లాం అనుయాయులకు దైవప్రవక్త (స) ఈ విసాలె సౌమ్ రోజాలను వారించారు. ఎందుకంటే ఇది గ్రంథవహుల పద్ధతి. అయితే ప్రవక్త (స) కూడా ఈ సౌమె విసాల్‌ను పాటిస్తారనే విషయం ఈ హదీసు ద్వారా తెలిసింది. దాని ఉద్దేశ్యం ఏమై వుంటుంది? దాని అర్థం ఆయన (స) ఒక సహరీ నుంచి మరో సహరీ వరకు

రోజా వుండేవారు. లేక ఎక్కువ కాలం వరకు ఎడతెగకుండా రోజాలు పాటించేవారు. నిరూపిత బలమైన ఆధారం ఏమిటంటే ప్రవక్త (స) ఒక సహరీ నుంచి మరో సహరీ వరకు రోజా పాటించేవారు కాదు, పైగా ఎడతెగని నఫిల్ రోజాలను పాటించేవారు. అయితే కొన్నిసార్లు చాలా కాలం వరకు ఎలాంటి రోజాలే పాటించేవారు కాదు.

**'సౌమె విసాల్'** పాటించటం దైవప్రవక్త (స) గారి ప్రత్యేకత. దీన్ని ఇతర ముస్లింలు అనుకరించటం సమ్మతం కాదు. స్వయంగా ప్రవక్త (స) "మీలో నా వంటివారు ఎవరు?" అని ప్రశ్నించారు.

రెండవ భాగం

## రోజా పాటించటానికి సంకల్పం తప్పనిసరి

٣١- عَنْ حَفْصَةَ قَالَتْ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ لَمْ يُجْمِعِ الصِّيَامَ قَبْلَ الْفَجْرِ فَلَا صِيَامَ لَهُ. (رَوَاهُ التِّرْمِذِيُّ وَأَبُوْدَاؤدَ وَالنَّسَائِيُّ وَالدَّارِمِيُّ)

**31. హజ్రత్ హఫ్సా (రజి.అన్హా) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : ఫజ్ర్ (ఉషోదయానికి పూర్వం) కంటే ముందు రోజా వుండేందుకు సంకల్పం చేసుకోకపోతే అది రోజాగా పరిగణించబడదు. (తిర్మిజీ, అబూదావూద్, నసాయి, దారిమీ)**

ఈ ఉల్లేఖనం ఉద్దేశం ఏమంటే, మీరు ఏదైనా ఆరాధన ఆరంభించారంటే అప్పుడు మీరు ఈ ఆరాధనను అల్లాహ్ కొరకు చేస్తున్నానని సంకల్పం చేసుకోవాలి. ఈ విధంగా ఎందుకు సెలవియ్యబడిందంటే మనిషి తింటూ త్రాగుతున్నప్పుడు ఆకలితో వుంటే లెక్కలోకి రాదు. అయితే ఆకలికి, ఉపవాసాలకు మధ్య తేడా కలిగించేది మీరు రోజా పాటిస్తున్న సమయంలో చేసుకున్న 'సంకల్పం' మాత్రమే. అదే ఆ రెంటినీ వేరుచేస్తుంది. ఆ సమయంలో అల్లాహ్ ఆరాధన పేరుతో రోజా సంకల్పం చేసుకొని తినటం, త్రాగటం మానేస్తారు. ఒకవేళ ఈ సంకల్పం మీరు చేయకపోతే బాహ్యాపరంగా రోజాకు, ఆకలితో ఉండటానికి మధ్య ఏమాత్రం తేడా లేదు.

రోజా (ఫజ్ర్) ఉషోదయపు వేళతో ప్రారంభమవుతుంది. అందుకని దైవప్రవక్త (స) సెలవిచ్చారు : "అల్లాహ్ కొరకు ఈ రోజు ఉపవాసం వుండాలని నిశ్చయించుకున్నా

నని సంకల్పం చేసుకోండి. అలా చేసుకోకపోతే దాని అర్థం మీరు పస్తులకు, రోజాలకు మధ్య ఏమాత్రం భేదం కనబరచలేదు."

అయినప్పటికినీ దీనర్థం అది కాదు – ఒక మనిషి ఉషోదయానికి ముందు రోజా సంకల్పం చేసుకోవటం మరచిపోయాడు, అంతమాత్రాన అతని రోజాయే భంగమైపోయినట్లు కాదు. దాని అసలు ఉద్దేశ్యమేమంటే మీరు రోజా వుంటున్నవేళ సంకల్పం చేసుకోవటం మరచిపోతే, తరువాత గుర్తుకు వచ్చినప్పుడు వెంటనే సంకల్పం చేసుకోవాలి. మీ సంకల్పం రోజాతో ముడిపడివుందని భావించుకోండి. మీరు సహరీ కొరకు లేచారంటే దాని అర్థం రోజా వుండాలనే సంకల్పం, ఉద్దేశంతోనే కదా. అందుకని రోజా సందర్భంలో మీ నోటి ద్వారా నేను ఈ రోజు అల్లాహ్ కొరకు రోజా వున్నానన్న సంకల్పపు పదాలు వెలువడకున్నా ఆ రోజా వృథా పోదు. అయితే షరీఅత్‌లో అసలు ప్రాముఖ్యం సంకల్పానికి ఇవ్వటం జరిగింది. మన ఆచరణల ప్రతిఫలం కూడా మన సంకల్పంపైనే ఆధారపడి వుంది కదా! అందుకని షరీఅత్ దృష్టిలో ఒక ఆచరణ మరో ఆచరణతో ఘనతను ప్రసాదించేది మనిషి యొక్క సంకల్పమే. ఈ కారణంగానే సెలవియ్యబడింది : మనిషి ఉషోదయానికి పూర్వమే నేను ఈ రోజు ఉపవాస దీక్షకు సంకల్పం చేసుకుంటున్నానని అనాలి. లేకపోతే బాహ్యపరంగా చూస్తే రోజాకు, పస్తులకు తేడా కన్పించదు.

## సహరీ సమయంలో ఒకింత సడలింపు ఉంది

٣٢- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ: إِذَا سَمِعَ النِّدَاءَ أَحَدُكُمْ وَالْإِنَاءُ فِي يَدِهٖ فَلَا
يَضَعْهُ حَتّٰى يَقْضِيَ حَاجَتَهٗ مِنْهُ- (رواه ابوداؤد)

**32. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఈ విధంగా సెలవిచ్చారు : మీలో ఎవరైనా అజాన్ వాక్యాల శబ్దం వింటే, ఆ వేళ మీ చేతిలో ఆహార పళ్ళెరముంటే మీ అవసరం పూర్తిచేసుకోనంత వరకు దానిని మీ చేతులతో క్రింద పెట్టకండి. (అబూదావూద్)**

దైవప్రవక్త (స) గారి కాలంలో నేటి నగారాలు లేక సైరన్‌లు మోగించబడేవి కావు అన్న విషయం మనకు విదితమవ్వాలి. అయితే అజాన్ పిలుపు విన్నప్పుడు

ఇక సహరీ సమయం ముగిసిందన్న విషయం ప్రజలకు తెలిసేది. ఒక్కొక్కప్పుడు వేసవి కాలంలో జనం ఆరుబయట పడుకున్నవేళ ఇక రోజా మొదలయ్యే సమయం అయిందా లేదా అన్న విషయాన్ని ప్రతి మనిషీ తెలుసుకోగలిగేవాడు. వర్షకాలంలో, చలికాలంలోనయితే ప్రజలు ఇళ్ళల్లోనే సహరీ చేయాల్సి వచ్చేది. ఇలాంటివేళ సహరీ సమయం అయ్యిందా లేదా అనే విషయాన్ని తెలుసుకోవటానికి ప్రజలంతా బయటికి రావలసిన అవసరం లేదు. అందుకనే సెలవియ్యబడింది : సహరీ వేళ మీ చెవులకు అజాన్ శబ్దం వినబడినప్పుడు ఒక మనిషి నీరు త్రాగుతున్నప్పుడు, మరొకడు తింటున్నాడు, ఆ వేళ అల్లాహు అక్బర్ అన్న శబ్దం విన్నంతనే వాటిని వదలిపెట్టాల్సిన అవసరం లేదు. అలాంటి వారికి ఆ స్థితిలో తమ అవసరం మేర త్రాగటానికి, తినటానికి అనుమతి నివ్వబడింది.

ఖుర్ఆన్, హదీసుల ద్వారా సహరీ వేళ పరిసమాప్తమయ్యే వేళలను వివరంగా తెలుపటం జరిగింది. వీటి ద్వారానూ ఇంకా సాధారణంగా రుజువయ్యేదేమంటే ఆ సమయం సెకండ్ల లెక్కతో చేయబడలేదు – ఒక సెకను ఇటు మొదలవటం లేక ఒక సెకను అటు గడవగానే సహరీ వేళ ముగిసిపోయిందని లెక్క కాదు. సహరీ వేళ సమాప్తమయ్యేది వేకువ జామునే. అదే ఓ పెద్ద సహజసిద్ధమైన సంకేతం. దీనివలన మనిషి వెంటనే తన ద్రుక్కులను తూర్పు దిక్కుకు పెడతాడు. తూర్పు నుంచి ధవళ రేఖలు వ్యాపిస్తూ కన్పిస్తాయి. ప్రారంభంలో ఒక రేఖ బయలుదేరి వస్తుంది, ఇక తెల్లవారబోతుందని, రాత్రి సమాప్తమయిందని సంకేతమిస్తుంది. దీనివలన తెలిసేదేమంటే తెల్లవారటమనే ప్రక్రియ ఒక సెకను కాలంలో సంభవించేది కాదు. రాత్రి ముగింపునకు, ఉషోదయానికి కొన్ని నిముషాల తేడా తప్పక ఉంటుంది. అందువలన మనిషి అజాన్ శబ్దాన్ని విన్నప్పుడు దాని అర్థం ఒక సెకనుకు ముందు సహరీ చేసే సమయం వున్నదని, ముఅజ్జిన్ సాహెబ్ నోటి నుండి 'అల్లాహ్' అనే పలుకులు వెలువడగానే ఇక ఆ సమయం ముగిసినట్లు కాదు. వెంట్రుకలో కూడా చర్మం వొలిచే ఇలాంటి మాటలు మాట్లాడటం సరికాదు. సరిఅయిన మాట ఏమంటే, అనుకోని సందర్భంలో ఎప్పుడన్నా మీరు నిద్రిస్తున్నప్పుడు ఎకాఎకిన మెలకువ వచ్చి, అప్పుడు మీరు కొన్ని ముద్దలు మాత్రమే తిన్నారు, వెంటనే సైరన్ మ్రోగింది, అంతమాత్రాన వెంటనే మీరు తినటం ఆపాలని, నోటి దగ్గరవున్న పాత్రను క్రింద పెట్టేయాలని దీనర్థం కాదు. తొందర తొందరగా మీరు తినగలిగినంత తిని, త్రాగగలిగినంత త్రాగాలి.

ఈ హదీసులో ఈ విషయాన్నే సెలవియ్యటం జరిగింది. మీరు అజాన్ విన్నప్పుడు, లేక సహరీ సమాప్తమయ్యిందని తెలిపే మరో ప్రకటన అవుతున్నప్పుడు మీ చేతిలో ఏదైనా ఆహారపదార్థం వుంటే దాన్ని క్రిందపెట్టకుండా మీ అవసరం పూర్తి చేసుకోవాలి.

అయినా, దీని అర్థం మనిషి ఈ అనుమతి ఆధారంగా ప్రయోజనం పొందే ఉద్దేశ్యంతో తింటూనే కూర్చోవాలన్నది కూడా కాదు. తొందరగా తన అవసరాన్ని పూర్తి చేసుకోవాలన్నదే దీని ఉద్దేశం.

## ఇఫ్తార్‌లో తొందరపడేవారు అల్లాహ్‌కు ప్రీతిపాత్రులు

٣٣- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ: قَالَ اللهُ تَعَالَىٰ أَحَبُّ عِبَادِي إِلَيَّ
أَعْجَلُهُمْ فِطْرًا. (رَوَاهُ التِّرْمِذِيُّ)

**33.** హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు – నా దాసుల్లో ఇఫ్తార్‌లో తొందరపడేవారు నాకు అత్యంత ప్రీతిపాత్రులు." (తిర్మిజీ)

## ఇఫ్తార్ కొరకు శ్రేష్ఠమయిన వస్తువులు

٣٤- عَنْ سَلْمَانَ بْنِ عَامِرٍ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ: إِذَا أَفْطَرَ أَحَدُكُمْ فَلْيُفْطِرْ عَلَىٰ تَمْرٍ
فَإِنَّهُ بَرَكَةٌ، فَإِنْ لَّمْ يَجِدْ فَلْيُفْطِرْ عَلَىٰ مَاءٍ فَإِنَّهُ
طَهُورٌ. (رَوَاهُ أَحْمَدُ وَالتِّرْمِذِيُّ وَأَبُوْدَاوُدَ وَابْنُ مَاجَه وَالدَّارِمِيُّ)

**34.** హజ్రత్ సల్మాన్ బిన్ ఆమిర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : మీలో ఎవరైనా ఇఫ్తార్ చేస్తే ఖర్జూరంతో చేయండి. ఎందుకంటే అందులో శుభం, శ్రేష్ఠత ఉంది. ఒకవేళ ఖర్జూరం దొరక్కపోతే అతను నీటితో ఇఫ్తార్ చేయాలి, ఎందుకంటే అది పవిత్రమైనది. (అహ్మద్, తిర్మిజీ, అబూదావూద్, ఇబ్నెమాజా, దారిమీ)

٣٥- عَنْ أَنَسٍ قَالَ كَانَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يُفْطِرُ قَبْلَ أَنْ يُصَلِّيَ عَلَى رُطَبَاتٍ، فَإِنْ لَمْ تَكُنْ رُطَبَاتٌ فَتُمَيْرَاتٌ فَإِنْ لَمْ تَكُنْ تُمَيْرَاتٌ حَسَا حَسَوَاتٍ مِنْ مَاءٍ. (رَوَاهُ التِّرْمِذِيُّ وَأَبُوْدَاوُدَ)

**35. హజ్రత్ అనస్ (రజి) ఇలా ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) అలవాటు ఏమిటంటే, మగ్‌రిబ్ నమాజ్ చేయక ముందు కొన్ని తాజా ఖర్జూరాలతో రోజాను విరమించేవారు. ఒకవేళ తాజా ఖర్జూరాలు దొరక్కపోతే ఎండిన ఖర్జూరాలతో ఇఫ్తార్ చేసేవారు. ఒకవేళ అవి కూడా దొరక్కపోతే కొన్ని నీళ్లు సేవించేవారు. (తిర్మిజీ, అబూదావూద్)**

దైవప్రవక్త (స) అలవాటు ఎలా ఉండేదంటే ఆయన ముందు రోజా విరమణ చేసేవారు, ఆపై నమాజ్ చేసేవారు. ఇఫ్తార్‌లో ఆయన సాధారణ నియమం ప్రకారం తాజా ఖర్జూరాలతో ఇఫ్తార్ చేసేవారు. తాజా ఖర్జూరాలు అంటే అప్పుడే చెట్టు నుంచి త్రెంచినవి కాదు. అంటే ఎండినవి కాక పండినవి అని అర్థం - ఇక్కడ మనం అలాంటి ఖర్జూరాలను వాడినట్లు అర్థం చేసుకోవాలి. ఒకవేళ అలాంటి ఖర్జూరాలు లభ్యం కాకపోతే ఎండు ఖర్జూరాలతో రోజా విరమించేవారు. ఒకవేళ అవి కూడా లభ్యం కాకపోతే ఒకట్రెండు నీటి గ్రుక్కలు త్రాగి ఇఫ్తార్ చేసేవారు.

## ఇఫ్తార్ చేయించేవారికి లభించే పుణ్యం

٣٦- عَنْ زَيْدِ بْنِ خَالِدٍ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ، مَنْ فَطَّرَ صَائِمًا أَوْ جَهَّزَ غَازِيًا فَلَهُ مِثْلُ أَجْرِهٖ (رَوَاهُ الْبَيْهَقِيُّ وَمُحْيِ السُّنَّةِ)

**36. హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : ఎవరైనా ఒక ఉపవాసికి ఇఫ్తార్ చేయించినా లేక ఒక యోధునికి జిహాద్ కొరకు సామాను సమకూర్చినా అతనికి ఉపవాసికి లభించే పుణ్యం, ఇంకా యోధునికి జిహాద్ చేయటం వలన లభించే పుణ్యం లభిస్తుంది. (బైహఖీ, మొహియిస్సున్నహ్)**

షరీఅత్ నిబంధన ఏమిటంటే, మేలు చేసే వారికి ఎటూ వారి ప్రతిఫలం దొరుకుతుంది, అయితే ఆ మేలు చేయటానికి మార్గాలను సుగమం చేసిన వానికి కూడా పుణ్యం లభిస్తుంది. హదీసులో **"అద్దల్లు అలల్ ఖైరి కఫాయిలిహీ"** (మేలు కొరకు మార్గదర్శకం చేసేవాడు కూడా మేలు చేసేవానితో సమానం) అని అనబడింది. మేలు చేసేవాని పుణ్యంలో నుంచి ఎలాంటి తగ్గుదల చేయకుండా, ఆ మేలు చేయటానికి మార్గం సుగమం చేసినవానికి, సౌలభ్యాలు సమకూర్చినవానికి కూడా పుణ్యం లభిస్తుంది, ఇంకా ఆ మేలు చేయడానికి సిఫారసు చేసినవానికి, సహాయం చేసిన వానికి కూడా వారి వారి పుణ్యం ప్రసాదించబడుతుంది.

ఒక ఉపవాసికి రోజా విరమణ చేయించటమనేది చూడటానికి అది ఒక మామూలు విషయంగా కన్పిస్తుంది. అయితే సెలవిచ్చినవిధంగా, అతనికి లభించే పుణ్యం మాత్రం ఎంతో విలువైనది. దానికి కారణం ఏమిటంటే మేలు కొరకు ప్రోత్సహించటం కూడా అల్లాహ్ దృష్టిలో ఎంతో విలువైన కార్యమే. ఎందుకంటే అది మంచి వ్యాపించటానికి సహాయకారి అవుతుంది. మానవ శ్రేయస్సుకు, మోక్షం కొరకు కావలసిన పని నెరవేరుతుంది, ధర్మం (దీన్) ఉద్దేశం కూడా అదే.

## ఇఫ్తార్ వేళ చేయాల్సిన మంచి దుఆలు

٣٧- عَنِ ابْنِ عُمَرَ قَالَ كَانَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا أَفْطَرَ قَالَ: ذَهَبَ الظَّمَأُ وَابْتَلَّتِ الْعُرُوقُ وَ وَثَبَتَ الْأَجْرُ إِنْ شَاءَ اللهُ. (رواه ابوداؤد)

**37. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) అలవాటు ఏమిటంటే ఆయన (స) రోజా విరమణ చేసినప్పుడు ఇలా సెలవిచ్చేవారు - దాహం తీరింది, నరాలు తడిబారాయి, అల్లాహ్ తలిస్తే పుణ్యప్రాప్తి కూడా తథ్యమే. (అబూదావూద్)**

రోజా విరమణ సమయంలో దైవప్రవక్త (స) గారు చేసిన అనేక దుఆ లున్నాయి. వాటిలో ఈ దుఆ కూడా ఒకటి. అంటే ప్రవక్త (స) రోజా విరమణ చేసే సమయంలో ఈ పదాలు పలికేవారు.

٣٨- عَنْ مُعَاذِ بْنِ زُهْرَةَ قَالَ إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ كَانَ إِذَا أَفْطَرَ قَالَ: اللّٰهُمَّ لَكَ صُمْتُ وَعَلَى رِزْقِكَ أَفْطَرْتُ. (رواه ابوداؤد مرسلاً)

**38. హజ్రత్ ముఆజ్ బిన్ జుహ్రా (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) ఇఫ్తార్ చేసినప్పుడు ఇలా సెలవిచ్చేవారు – ఓ అల్లాహ్! నీ కోసమే నేను రోజా వున్నాను. ఇంకా నీవు ప్రసాదించిన ఆహారంతోనే నేను ఇఫ్తార్ చేశాను. (అబూదావూద్)**

ఒక వ్యక్తి అల్లాహ్‌చే విధించబడిన ఏదైనా విధిని నిర్వర్తిస్తే ఆ పని దానంతట అదే ఎంతో విలువను సంతరించుకుంటుంది. ఆపై అతను పుణ్యఫలానికి అర్హుడవుతాడు. అయితే ఈ విధి నిర్వహణా కాలంలో అతనికి రెండు ఆచరణలు ఎదురవుతాయి. ఒకటి : ఈ విధిని అతను అజాగ్రత్తగా నిర్వర్తించటం, రెండవది: ఆ విధి నిర్వహణలో అతను ఎడతెగకుండా తన ప్రభువు పట్ల శ్రద్ధచూపుతూ ఆయన్ని స్మరిస్తూ ఉండటం. ఈ రెండు స్థితుల్లో పుణ్యం, గౌరవాల రీత్యా చాలా తేడా వుంది. ఒక వ్యక్తి ఏదైనా విధి నిర్వహణలో అల్లాహ్ పట్ల శ్రద్ధ చూపిస్తే అది అతని పుణ్యాన్ని ఎన్నో రెట్లు పెంచేస్తుంది. ఉదాహరణకు మీరు నమాజ్ కొరకు వుజూ చేస్తున్నారు, మీరు వుజూలో పరిశుభ్రం చేయాల్సిన అవయవాలన్నింటినీ సరిగ్గా శుభ్రం చేసుకోవాలి. ఇలా చేస్తే మీరు నమాజ్ చేయటానికి అర్హులయ్యారన్న మాట. ఇంకా వుజూ చేస్తున్న సమయంలోనూ మీరు అల్లాహ్‌ను స్మరిస్తూ చేసినట్లయితే దాని అర్థం మీరు వుజూ చేస్తున్నప్పుడు కూడా అల్లాహ్ పట్ల అశ్రద్ధగా లేరని తెలియజేస్తోంది. అప్పుడు మీరు చేసిన వుజూకు విలువ, గౌరవం వుంటుంది.

ఇదే ఉపమానం రోజాకు కూడా వర్తిస్తుంది. మీరు సహరీ సమయం సమాప్తం నుంచి ఇఫ్తార్ వరకు ఏమీ తినకుండా, త్రాగకుండా వున్నట్లయితే మీ రోజా పూర్తవుతుంది. ఇంకా ఈ రోజా సమయంలో మీరు అల్లాహ్‌ను స్మరిస్తూ వున్నట్లయితే దాని అర్థం మీరు రోజా విలువను, గౌరవాన్ని ఇంకా పుణ్యాన్ని పెంచుకున్నారన్న మాట. మరోవిధంగా చెప్పాలంటే రోజాలో అజాగ్రత్తగా కాలం వెళ్ళదీయటంలోను, ఇంకా ఆ సమయంలో అల్లాహ్‌ను స్మరిస్తూ వుండటంలోనూ ప్రతిఫలం రీత్యా, గౌరవం రీత్యా భూమ్యాకాశాలంత తేడా ఉంది. ఆపై రోజా ముగిసిన వెంటనే మీరు ఇఫ్తార్ చేయటానికి అర్హులవుతారు, ఖర్జూరంతోగాని, మరో పదార్థంతో గాని ఇఫ్తార్ చేయండి. ఇఫ్తార్ చేస్తున్నప్పుడు కూడా మీరు అల్లాహ్‌ను స్మరిస్తూ, ఓ అల్లాహ్! నేను నీ కోసమే రోజా వుంచాను, నీవు ప్రసాదించిన పదార్థాలతోనే ఇఫ్తార్ చేస్తున్నాను అని అన్నట్లయితే దీని వలన మీరు ఆకలి దప్పికల స్థితి (రోజా)లో కూడా అల్లాహ్ పట్ల అజాగ్రత్తగా లేరని, పైగా ఇఫ్తార్ చేస్తున్నప్పుడు కూడా అల్లాహ్‌ను విస్మరించలేదని తెలుస్తుంది. ఇలా మీరు ఈ రోజా పుణ్యఫలాన్ని అనేక రెట్లు పెంచేసుకున్నారన్నమాట.

దైవప్రవక్త (స) సంప్రదాయం కూడా ఇదే. దాన్నే ఆయన (స) ప్రజలకు ప్రబోధించారు : అల్లాహ్ యొక్క ఒక ఆరాధనను చేస్తూ ఇతర ఆరాధనలను కూడా కలుపుకున్నట్లయితే ఆ ఆరాధన పుణ్యఫలాలు, గౌరవం, విలువలు అనేక రెట్లు పెంచబడతాయి.

**మూడవ భాగం**

## ఇఫ్తార్‌లో తాత్సారం చేయటం యూదులు, క్రైస్తవుల విధానం

٣٩- عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّی اللهُ عَلَیْهِ وَسَلَّمَ : لَا یَزَالُ الدِّیْنُ ظَاهِرًا مَا عَجَّلَ النَّاسُ الْفِطْرَ لِاَنَّ الْیَهُوْدَ وَالنَّصَارٰی یُؤَخِّرُوْنَ۔

(رَوَاهُ اَبُوْدَاوُدَ وَابْنُ مَاجَه)

**39. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : ప్రజలు ఇఫ్తార్ చేయటంలో తొందర పడేంతవరకు ఈ ధర్మం ఆధిక్యతలో వుంటుంది. ఎందుకంటే యూదులు, క్రైస్తవులు ఇఫ్తార్ చేయటంలో ఆలస్యం చేస్తారు.**

**(అబూదావూద్, ఇబ్నెమాజా)**

దైవప్రవక్త (స) ఈ హదీసులో ఓ చిన్న మాట ద్వారా గొప్ప పరమార్థాలను వివరించారు.

రోజా విరమణలో తాత్సారం చేయటం, సహరీ భుజించకుండా ఎడతెగని రోజాలుండటం ఇవన్నీ యూదులు, క్రైస్తవులు పాటించే పద్ధతులు. వారి ఈ విధానమే క్రమేణా సన్యాసత్వానికి దారి తీసింది, ఇంకా వారు క్రియాత్మక జీవితం నుంచి పరారై ఏకాంత కుహరాల్లో జీవనం కొనసాగించటానికి ప్రోద్బలం చేసింది. కాని దేవుని ధర్మం ఉద్దేశం దీనికి పూర్తి భిన్నంగా వుంది. అల్లాహ్ ఉద్దేశ్యం ప్రకారం ఈ ప్రపంచం కేవలం మానవుల కొరకే సృష్టించబడింది. దీని సుఖాలు, సౌలభ్యాలు, ఏర్పాట్లు ఇంకా ఇతర వస్తు సామగ్రి యావత్తూ కేవలం మానవుని కొరకే వున్నాయి. అయితే మానవుని కర్తవ్యం ఏమిటంటే ఈ ప్రపంచంలోని సమస్త సామగ్రిని అల్లాహ్ నిర్దేశించిన హద్దులకు లోబడి ఏమాత్రం హద్దులు మీరకుండా వాటిని ఉపయోగించాలి. ఈ విధంగా ఒక ముస్లిం కర్తవ్యం, విధి ఏమంటే షరీఅత్ ఇచ్చిన సౌలభ్యాలను,

అనుమతులను సద్వినియోగం చేసుకుంటూ వాటి ప్రయోజనాల్ని పొందాలి. అయితే ఈ సౌలభ్యాల కొరకు నిర్ణయించబడిన హద్దులకు లోబడి ఉండాలి. సహరీ వేళ ముగిసిన తరువాత సూర్యాస్తమయం వరకు తినటం, త్రాగటానికి మీకు ఎలాంటి అవకాశం అనుమతి లేదు. ఆపై సూర్యాస్తమయం అయిన వెంటనే మీరు తినవచ్చు, త్రాగవచ్చు. దీనివలన తేటతెల్లమయ్యే విషయమేమిటంటే ఇఫ్తార్ చేయటంలో యూదులు, క్రైస్తవులు చేసే తాత్సారం సన్యాసత్వానికి దారితీసే ఒక మార్గంలా ఏర్పడుతుంది, దీనికి కారణం అల్లాహ్ పట్ల వారు ఏర్పరచుకున్న అనుమానమే. వారి ఉద్దేశంలో దేహాన్ని ఎంతగా బాధకు లోనుచేస్తే అంతగా వారి దేవుడు వారి పట్ల సంతోషపడతాడు. కాని ఇక్కడ మీ విధేయత, ఆరాధనలనే మీ నుంచి మీ ప్రభువు ఆశిస్తున్నాడు, దీన్నే ఆయన ఇష్టపడతాడు. అందుకని ఒకవేళ హలాల్ వస్తువైన నీళ్ళను మీ కోసం హరామ్ చేసినట్లయితే మీ పని కేవలం దాని వాడకం నుంచి దూరంగా ఉండటమే. అయితే దానిని మీకు హలాల్ చేసిన వెంటనే దాని ద్వారా ప్రయోజనాన్ని పొందాలి. అందుకనే దైవప్రవక్త (స) సెలవిచ్చారు : యూదులు, క్రైస్తవులకు వ్యతిరేకంగా ఇఫ్తార్‌లో తొందరపడేంత వరకు మీ ధర్మం ఆధిక్యతలో వుంటుంది. ఒకవేళ ఇఫ్తార్‌లో ఆలస్యం చేయటం మొదలెడితే దాని ఉద్దేశం ఇక మీరు ధర్మంలోని అసలైన ప్రాణవాయువును వృథా చేసి, సన్యాసత్వం దిశగా పయనమవుతున్నట్లు భావించబడుతుంది. ఈ విధంగా మీ సంప్రదాయాన్ని వదలి యూదులు, క్రైస్తవుల పద్ధతుల్ని ఆచరిస్తూ ఉంటే, ఇక మీ ధర్మం ఎలా ఆధిక్యం పొందుతుంది? ఒక ముస్లిం విధ్యుక్త ధర్మం ఏమిటంటే ఒక బోధనాంశం ఎక్కడైనా లభ్యమై అందులో యూదులు, క్రైస్తవుల ఆచార వ్యవహారాలు, సభ్యతా సంస్కృతులు గోచరిస్తే, వాటిలో ఏమాత్రం అనుమానం ఉన్నా వెంటనే వాటికి దూరంగా మెలగాలి. వారి బోధనలు పాటించటం స్వయంగా మన ధర్మానికి నష్టాన్ని చేకూర్చుకోవటమే అవుతుంది, ఆ తరువాత మీ ధర్మం దాని అసలైన రూపంలో మిగిలి ఉండదు. దాని ఫలితం ఎలా వుంటుందంటే ప్రారంభంలో మీరు వారి ఒక బోధనను పాటించటం మొదలెడితే ఇక రెండవ దానిపట్ల కూడా మొగ్గు చూపుతారు. క్రమంగా మీ పరిస్థితి ఎలా మారిపోతుందంటే మీలో ఒక నిజ ముస్లిమ్‌కు ఉండాల్సిన లక్షణాలు మిగిలి వుండవు. అందుకనే ఆదేశించడం జరిగింది : ఎక్కణ్నుంచైతే విచ్ఛిన్నత ప్రారంభమైందో అక్కడే ఆగిపోండి. ఒకవేళ ఇక్కడ ఆగకపోతే మీరు ఇక ముందుకు సాగిపోతూనే ఉంటారు. దీని ఆధారంగా ఇక్కడ అంత పెద్ద మాట సెలవియ్యబడింది – యూదులు, క్రైస్తవులకు భిన్నంగా మీరు ఇఫ్తార్‌లో తొందరపడేంత వరకు మీ ధర్మం ఆధిక్యతలో వుంటుందని.

**ఇఫ్తార్ చేయటంలో, నమాజ్ ఆచరించటంలో తొందరపడటం సున్నత్**

٤٠۔ عَنْ اَبِیْ عَطِیَّةَ قَالَ دَخَلْتُ اَنَا وَمَسْرُوْقٌ عَلٰی
عَائِشَةَ فَقُلْنَا یَا اُمَّ الْمُؤْمِنِیْنَ رَجُلَانِ مِنْ اَصْحَابِ
مُحَمَّدٍ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اَحَدُهُمَا یُعَجِّلُ
الْاِفْطَارَ وَیُعَجِّلُ الصَّلٰوةَ وَالْاٰخَرُ یُؤَخِّرُ الْاِفْطَارَ
وَیُؤَخِّرُ الصَّلٰوةَ قَالَتْ اَیُّهُمَا یُعَجِّلُ الْاِفْطَارَ وَ
یُعَجِّلُ الصَّلٰوةَ قُلْنَا عَبْدُ اللّٰهِ ابْنُ مَسْعُوْدٍ قَالَتْ
هٰكَذَا صَنَعَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
وَالْاٰخَرُ اَبُوْ مُوْسٰی ۔ (رَوَاهُ مُسْلِمٌ)

**40.** **హజ్రత్ అబూ అతియా (రహ్మ) కథనం : 'నేను మరియు మస్రూఖ్ కలిసి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారి వద్దకు వెళ్ళి విన్నవించుకున్నాం – ఓ విశ్వాసుల మాతృమూర్తి! సహాబాల్లో ఇద్దరు వ్యక్తులున్నారు. వారిలో ఒకరు ఇఫ్తార్‌లో, నమాజ్‌లో తొందర చేస్తారు. మరొకరు ఇఫ్తార్‌లో, నమాజ్‌లోనూ తాత్సారం చేస్తారు'. 'ఇఫ్తార్‌లో, నమాజ్‌లో రెంటిలోనూ ఎవరు తొందరపెడతారు?' అని విశ్వాసుల మాతృమూర్తి ఆరా తీయగా, 'అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్(రజి)' అని మేము విన్నవించుకున్నాం. అపై ఆమె (రజి.అన్హా) 'దైవప్రవక్త (స) కూడా ఇలాగే ఆచరించేవారు' అని చెప్పారు – రెండవ వ్యక్తి 'హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి).' (ముస్లిం)**

ఇక్కడ తాత్సారం చేయటం, తొందరపడటంలోని ఉద్దేశ్యాన్ని అర్థం చేసుకోవాలి.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) తొందరపడేవారంటే అర్థం, వారి ఆచరణ ఎలా ఉండేదంటే ఇఫ్తార్ వేళ అవగానే ఇఫ్తార్ చేసి వెంటనే నమాజ్ ఆచరించేవారు. కాని హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) పద్ధతి ఎలా ఉండేదంటే ఇఫ్తార్ వేళ అయిపోయిన తరువాత కూడా ఆయన దీనిపై నింపాదిగా ఆలోచించి నిర్ణయం తీసుకునేవారు. సూర్యాస్తమయం అయిన పిదప, ఏమాత్రం ఒకింత

కిరణాలు కన్పించినా, ఆయన ఖచ్చితంగా సూర్యాస్తమయమయిందా? అని అనుమానించేవారు. కాబట్టి ఈ విషయమై గట్టి నమ్మకం ఏర్పడటానికి కాస్తంత ఆలస్యం చేసే అవకాశముంది.

మొదటి సహాబి అంటే హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) సూర్యాస్తమయం అయిన వెంటనే రోజా విరమించి, వెంటనే నమాజ్ ఆచరించేవారు. కాని హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) రోజా విరమణలోనూ ఆలస్యం చేసేవారు, ఇంకా నమాజ్ చేయటానికి ముందు కూడా ఒకింత తాత్సారం చేసేవారు (ఈ లోపు ఏదో ఒకటి తిని త్రాగేవారు). దీని మరో కోణం ఏమిటంటే రోజా విరమణలో ఇతరుల కోసం వేచి వుండేవారు, ఆపై వారూ నమాజ్‌లో పాల్గొనాలని కొంతసేపు వేచి వుండేవారు.

ఈ తొందరపాటు - తాత్సారంలో ఒక విషయం కూడా గమనార్హమైనది. రెండు సందర్భాల్లోనూ సాధారణ ప్రజల కోసం కొంత సౌలభ్యం, సమయంలో కొంత నింపాదీ వుంది. ఉదాహరణకు, ఇఫ్తార్ పిదప మస్జిద్‌లో నమాజ్ తొందరగా చేసేమాటైతే ఆలస్యంగా వచ్చే వారికి సమయం మించిపోతుంది. అయితే ఇఫ్తార్ సమయంలో హాజరుగా వున్నవారు వారికోసం వేచి వుండాల్సి వస్తుంది. అయినప్పటికీ హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారు సెలవిచ్చిన దాని ప్రకారం ప్రవక్త (స) గారి ఆచరణ ఎలా ఉండేదంటే ఆయన (స) ఇఫ్తార్‌లోనూ, నమాజ్‌లోనూ వేగిరపడేవారు. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారి ఉవాచకు అర్థం "ఒకరు ఒప్పు, మరొకరు తప్పు" అని ఎంతమాత్రం కాదు. స్వయంగా ప్రవక్త (స) గారి ఆచరణ ఏమిటి? ఇంకా అందులో అభిలషణీయం ఏది? అన్నది తెలుపటమే హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారి ఉద్దేశం. అందువలన తెలుసుకోవలసిన విషయం ఏమంటే, హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) ఆచరణతో పాటు, హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) గారి ఆచరణకు కూడా షరీఅత్‌లో అవకాశం వుంది. ఎందుకంటే ఆయన (రజి) గారి ఆలస్యం యూదులు చేసే ఆలస్యం లాంటిది కాదు. ఇఫ్తార్ చేసే ముందు సూర్యాస్తమయం అయిందా లేదా అని ఆచితూచి నిర్ణయించుకునే అవకాశం వుంది అన్న విషయం గమనించదగినది. ఇక్కడ నిబంధన ఏమంటే ఇలాంటి వ్యక్తి తెలిసీ తాత్సారం చేయరాదు, ఇంకా సన్యాసత్వాన్ని అభిలషించే కోరిక వుండకూడదు.

## సహరీ ఆహారం శుభకరమైనది

۴۱- عَنِ الْعِرْبَاضِ بْنِ سَارِيَةَ قَالَ دَعَانِيْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِلَى السَّحُوْرِ فِيْ رَمَضَانَ فَقَالَ: هَلُمَّ اِلَى الْغَدَاءِ الْمُبَارَكِ -
(رَوَاهُ اَبُوْدَاؤدَ وَالنَّسَائِيْ)

**41. హజ్రత్ ఇర్‌బాజ్ బిన్ సారియా (రజి.అన్‌హు) కథనం : ఒకసారి రమజాన్‌లో దైవప్రవక్త (స) తనతో సహరీ భుజించటానికి నన్ను పిలుస్తూ 'రా, శుభకరమైన ఆహారం కొరకు' అని అన్నారు.**

**(అబూదావూద్, నసాయి)**

దైవప్రవక్త (స) గారి ఈ ప్రబోధనానుసారం సహరీ కేవలం సహరీ మాత్రమే కాదు, అది ఓ శుభకరమైన భోజనం.

సహరీ చేసి మరీ రోజా వుంటే అదేమి రోజా అని యూదులు తలపోసేవారు. కాని ఇస్లామీయ షరీఅత్‌లో ఇలాంటి భావనకు ఏమాత్రం అవకాశం లేదు. 'రోజా కేవలం పగలు మాత్రమే, రాత్రి సమయంలో రోజా లేదు' అని అల్లాహ్ నిర్ణయించాడు. దీనివలన తేటతెల్లంగా తెలిసేదేమంటే రాత్రివేళ తినటానికి, త్రాగటానికి పూర్తి స్వేచ్ఛ ఉంది, కాబట్టి ఈ స్వేచ్ఛను కాదని అనటం భావ్యం కాదు. రాత్రి సమయంలో మేల్కొని సహరీ భుజించటం ఒక శుభకర విషయం. దీనితోనే మనం రోజాను ప్రారంభిస్తాం. దీనిలో గల ఔచిత్యం ఏమిటంటే, రోజా ప్రారంభించటానికి ముందు ఏదైనా తినాలి. ఎందుకంటే పగలు పనిచేయటానికి, ఇతర పనుల నిర్వర్తనకై మనకు శక్తి కావాలి కదా! అలా కాకపోతే మనం ఆకలిదప్పులతో శక్తిహీనులుగా పడివుంటాం. దీన్ని ధర్మం అభిలషించదు. ధర్మం అభిలషించేది మనం అల్లాహ్ ఆదేశాలను పాటించటంతో పాటు పని చేయటానికి మనలో శక్తి కూడా ఉండాలన్నది. ఒక ముస్లిం అయిన కారణంగా మనపైవున్న విధులు, బాధ్యతలు మనం సక్రమంగా, సమంజసంగా నెరవేర్చగలగాలి, ఆరాధనకు భావం ఈ కార్యకారకమైన ప్రపంచంతో తెగత్రెంపులు చేసుకొని ఏకాకిగా కుహరాల్లో కూర్చోవాలన్నది కాదు. అసలు ఆరాధనకు వాస్తవమైన శిక్షణా తరగతి ఏమిటంటే మీరు ఆచరణాపూరితమైన జీవన క్రమంలో అల్లాహ్ ఆదేశాలను పాటిస్తూ జీవితం గడుపుతూ పరలోకంలో అల్లాహ్ ప్రీతిని పొంది సఫలీకృతులు కావాలి.

## ఉత్తమమైన సహరీ ఖర్జూరం

٤٢-عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ
عَلَیْهِ وَسَلَّمَ: نِعْمَ سَحُوْرُ الْمُؤْمِنِ التَّمْرُ۔
(رَوَاهُ اَبُوْدَاوُدَ)

**42. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) సెలవిచ్చారు : విశ్వాసికి ఉత్తమ సహరీ ఖర్జూరం. (అబూదావూద్)**

ఖర్జూరంలో మనిషికి కావలసిన సంపూర్ణ ఆహారం సమృద్ధిగా వుంది. మనిషి ఎలాంటి ఆహారం దొరక్కపోయినా, ఖర్జూరం లభిస్తే అదే అతనికి సరిపోతుంది. నేటి పరిశోధనల ప్రకారం మనిషి తన శక్తిని కాపాడుకోవటానికి ఆహారంలో ఎన్ని కాలరీలు కావాలో అవన్నీ ఖర్జూరంలో పుష్కలంగా వున్నాయి. దీని కారణంగా ఈ రోజుల్లో కూడా సైనికులకు ఎక్కడైనా ఎడారి ప్రాంతాల్లో దీర్ఘకాలం పాటు వుండాల్సివస్తే, అక్కడ ఆహార సరఫరా చేసే అవకాశం ఉండదు. అలాంటప్పుడు ఖర్జూరాల స్టాకు చాలినంతగా ఆ సైనికులకు సరఫరా చేయబడుతుంది. ఈ విధంగా నెలల తరబడి ఆహారం లభ్యం కాకపోయినా కేవలం ఖర్జూరంపైనే ఆధారపడి వుండవచ్చు.

ఖర్జూరపు ఈ లాభాల దృష్ట్యా, ఇంకా ఇది సంపూర్ణ ఆహారమైన కారణంగా దైవప్రవక్త (స) దీనిని ఉత్తమ ఆహారంగా నిర్ణయించారు. సహరీలో దీన్ని ఉపయోగించటం వలన చేకూరే ప్రయోజనం ఏమిటంటే, పగలల్లా మనిషి తన శక్తిని కోల్పోకుండా వుండేందుకు, తన విధులు నిర్వర్తించుకోవటానికి ఇది ఎంతగానో సహాయకారిగా ఉంటుంది.

بَابُ تَنْزِيهِ الصَّوْمِ

# రోజా పరిరక్షణ కోసం ...

ఈ అధ్యాయంలో రోజాను ఏ ఏ వస్తువులతో కాపాడాలన్న విషయం తెలుపడం జరిగింది. రోజాను పవిత్రంగా వుంచటానికి ఎలాంటి జాగ్రత్తలు అవసరమో సూచించడం జరిగింది. ఇంకా నిశితంగా రోజా సమయంలో వేటిని ఆచరించటం అభిలషణీయం, ఇంకా దేని ఫలితంగా రోజాకు ఎలాంటి భంగం వాటిల్లకుండా వుంటుందో వివరించడం జరిగింది.

ఈ హదీసు వ్యాఖ్యానం, వివరణల ద్వారా ముందు ఒక విషయం తేటతెల్లంగా తెలిసేదేమంటే వీటిని అధ్యయనం చేస్తున్నప్పుడు ఎలాంటి సంశయం, అనుమానం జనించరాదు.

వేటిని ఆచరిస్తే రోజాకు భంగం కలుగుతుంది, వేటితో కాదు, ఏ పని చేసే అనుమతి ఉంది, మరే పని చేయటానికి అనుమతి లేదు. ఈ బోధనలో చాలా సున్నితమైన సమస్యలూ ఎదురౌతాయి. ముఖ్యంగా మనిషి ఏకాంత జీవితానికి చెందిన సమస్యలు ఎదురవుతాయి. ఇది మనిషి జీవితానికి సంబంధించిన ఎలాంటి అంశమంటే దీన్నుంచి ఎవరూ బయటపడలేరన్న విషయం సర్వవిదితం. అందుకే రోజా స్థితిలో మనిషి తన జీవితంలో ఏ మేరకు వెళ్ళగలడన్నదానిపై సమస్య ఉత్పన్నమవుతుంది. ఈ సమస్యకు వివరణాత్మక సమాధానం ఇవ్వనట్లయితే మనిషి నిత్యం వ్యాకులతకు, చికాకు చింతలకు లోనవుతాడు. ఈ విషయమై అవగాహన, మార్గదర్శనం ఎలాంటి వ్యక్తుల ద్వారా లభిస్తుందంటే వారు దైవప్రవక్త (స) గారి దాంపత్య జీవితం గురించి తెలిసినవారై వుండాలి. పృచ్ఛకుల మార్గదర్శకం, హితవు కొరకు ఇది వినా మరోమార్గం లేదు. ప్రవక్త (స) గృహస్థ జీవితం, దాంపత్య జీవితం గురించి అతి సమీపం నుంచి తెలిసినవారు విశ్వాసుల మాతృమూర్తులు, ఆయన (స) ప్రియ సతీమణులే. ఈ విషయాలను తెలుసుకునే మార్గం ఇది వినా మరొకటి లేదు. ఆ విషయాలను ప్రవక్త (స) పవిత్ర సతీమణుల ద్వారా ముస్లింలకు మార్గదర్శకత్వాలుగా, హితవులుగా చేరవేయబడాలి. అల్లాహ్ మానవులందరికీ ప్రవక్త (స)ను మార్గదర్శిగా, హితైషిగా

పంపాడు. అలాంటి మహోన్నత ప్రవక్త (స) సతీమణులు ముస్లిం సమాజం మాతృమూర్తులుగా ఖరారు చేయబడ్డారు. ఈ కారణంగా వారి పట్ల గౌరవాదరణలతో మెలగవలసిన అవసరం ఉంది. అందుకే పూర్తి ముస్లిం సముదాయానికి హెచ్చరించటం జరిగింది – ఒకవేళ ఈ మాతృమూర్తుల తాలూకు మీ మనసులో ఏమాత్రం చెడుతలంపు కలిగినా అది మీ విశ్వాసాన్నే హరించివేస్తుందని.

మొదటి భాగం

## రోజా ఉద్దేశ్యం తఖ్వా (దైవభీతి) తప్ప పస్తులుండటం కాదు

۴۳۔ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ: مَنْ لَّمْ يَدَعْ قَوْلَ الزُّوْرِ وَالْعَمَلَ بِهِ فَلَيْسَ لِلّٰهِ
حَاجَةٌ فِي أَنْ يَّدَعَ طَعَامَهُ وَشَرَابَهُ (رَوَاهُ الْبُخَارِي)

**43. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : ఒకవేళ ఏ వ్యక్తి అయినా అబద్ధం చెప్పటాన్ని, దానిపై ఆచరించటాన్ని మానుకోకపోతే అతను ఆకలిదప్పులతో పడి వుండటం పట్ల అల్లాహ్‌కు ఏమాత్రం ఆసక్తి లేదు. (బుఖారీ)**

దీని అర్థం ఏమంటే, రోజాలో వున్నప్పుడు అబద్ధం చెప్పటం, దానిపై ఆచరించటం మానుకోకపోతే కేవలం అతను పస్తులున్నాడని భావం. అతని ఈ రోజాకు ఎలాంటి అర్థం లేదు. ఎందుకంటే రోజా ద్వారా మనిషిలో తఖ్వా (దైవభీతి), నిష్ఠాగరిష్టత, దేవుని యందు భీతి జనింపజేయటమే అసలు ఉద్దేశం. ఈ విధమైన ఆచరణ వలన ఇలాంటి సద్గుణాలను అతను తనలో జనింపజేసుకోనే లేదని దీని అర్థం.

## అబద్ధంపై ఆచరించటమంటే అర్థం ఏమిటి?

అబద్ధం చెప్పటంలోని ఆంతర్యం అయితే అర్థమయ్యింది. అయితే దానిపై అమలు చేయటంలోని ఆంతర్యాన్ని అర్థం చేసుకోవాలి.

అబద్ధం చెప్పటం ఒక హద్దుకు లోబడి ఉంది. కాని దానిపై ఆచరించటం దాదాపు అన్ని పాపాలకు మూలమవుతుంది.

ఉదాహరణకు ఒక మనిషి ఇతరుని సొమ్మును అన్యాయంగా తీసుకున్నాడను కోండి, దాని ఉద్దేశం అతను ఒక అబద్ధంపై అమలు చేశాడన్నమాట. సొమ్మయితే అతనిది కాదు, అయినా దాన్ని అతను తన సొమ్ముగా నిర్ణయించుకొని దానిని ఖబ్జా చేసినట్లయితే, అలాంటివాని ఈ దొంగతనం వాస్తవానికి ఒక అబద్ధం. పూర్తిగా అతను ఒక అబద్ధంపై అమలు చేశాడన్నమాట.

ఈ విధంగా ఒక వ్యక్తి ఎవరినైనా హత్యచేసినట్లయితే, అతను ఓ అబద్ధంపై అమలు చేసినట్లే. అతను తనకు తాను ఫలానా వ్యక్తి తన పట్ల తప్పుగా ప్రవర్తించాడుగాబట్టి అతన్ని హత్యచేయటం సబబే అని నిర్ణయించుకుని హత్య చేస్తాడు. వాస్తవానికి ఇలా చేయటం పట్ల అతనికి ఎలాంటి హక్కూ లేదు. కాని అతను అబద్ధంపై ఆచరించాడు. మీరు ఆలోచించినట్లయితే మనిషి చేసే పాపాలు, అవి చెడు మార్గంపైన నడుస్తూ దేవుని పట్ల చేసే అవిధేయత కానివ్వండి, లేక తోటి దైవదాసులపై చేసే దౌర్జన్యం కానివ్వండి, రెంటిలోనూ నిజానికి అవి ఓ అబద్ధంపై ఆధారపడి చేసినవే. దీని ఆధారంగానే ప్రవక్త (స) సెలవిచ్చారు : ఏ మనిషి అయినా రోజాలో వున్నప్పుడు అబద్ధం చెప్పడాన్ని, దానిపై ఆచరించటాన్ని మాననట్లయితే, అతను ఆకలిదప్పులతో పడివుండటం పట్ల అల్లాహ్‌కు ఏమాత్రం ఆసక్తి లేదు. ఎందుకంటే అతను రోజా యొక్క అసలైన ఉద్దేశాన్నే ఖూనీ చేశాడు.

అయితే ఇక్కడ ఓ మాటను అర్థం చేసుకోవాలి. అబద్ధం రోజాను భంగపరచే వాటిలో పరిగణించబడదు. ఒకానొక దానితో రోజా భంగమవుతుంది. మరొక దానితో రోజాలోని పరిశుద్ధతకు, నాణ్యతకు భంగం వాటిల్లుతుంది. ఉదాహరణకు కొన్ని నైతిక దురాచారాలున్నాయి, వాటి ద్వారా రోజా గౌరవ మర్యాదలకు, పవిత్రతలకు భంగం వాటిల్లుతుంది. కాని వాటివలన రోజా భంగం కాదు. ఇక్కడ సెలవిచ్చిందేమంటే ఇలాంటి రోజా అల్లాహ్‌కు ఏమాత్రం అవసరం లేదని. అంతేకాని అతని రోజా భంగమైందని చెప్పబడలేదు. సారాంశం ఏమిటంటే, అతను రోజా ఊపిరిని ఖూనీ చేశాడు, ఎందుకంటే అతను రోజాలో వున్నప్పుడు అబద్ధం చెప్పడం, దానిపై ఆచరించటం మానలేదు.

## రోజా స్థితిలో భార్యతో కలసిమెలసి వుండే హద్దులు

۴۴- عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ يُقَبِّلُ وَيُبَاشِرُ وَهُوَ صَائِمٌ
وَكَانَ أَمْلَكَكُمْ لِإِرْبِهِ- (مُتَّفَقٌ عَلَيْهِ)

**44. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) రోజా స్థితిలో తన సతీమణులతో కలుసుకునేవారు. ఇంకా ప్రవక్త (స) మీ అందరికంటే ఎక్కువగా తన మనోవాంఛలపై అదుపు కలిగి వుండేవారు. (ముత్తఫకున్ అలైహ్)**

దీని ఉద్దేశం ఏమిటంటే రోజా స్థితిలో వున్నప్పుడు లైంగిక సంబంధం తప్ప భార్యలతో కలవడం సమ్మతమే. ఇది అసలు నిబంధన. అయితే ఆపై హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) దీనిపై వివరణ ఇస్తూ, మనిషికి ఒక్క లైంగిక సంబంధం తప్ప తన భార్యతో మిగతా అన్ని రకాల కలయికలకు అనుమతి ఉన్నప్పటికీ ఇందులో కూడా ప్రమాదం పొంచివుంది. ఒకవేళ మనిషి తన మనోవాంఛలను అదుపు చేసుకోలేక తన వలన జరగరాని పని జరిగినట్లయితే అతని రోజా భంగమవుతుంది. అందువలన హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఏమన్నారంటే – ప్రవక్త (స) మీ అందరికన్నా ఎక్కువగా తన మనోవాంఛలపై అదుపు కలిగి వుండేవారు. అంటే మీలో ఎవరికైనా తనను తాను అదుపులో వుంచుకోగలిగే శక్తి వుంటే దీనిద్వారా అతను ప్రయోజనం పొందవచ్చు. అయితే ఎవరికైతే తన స్వయంపైనే అదుపు లేదో, అతను ఈ కలయికకు దూరంగా మెలగటమే ఉత్తమం.

మున్ముందు ఒక హదీసులో ఈ విషయమై స్వయంగా దైవప్రవక్త (స) గారి మరో వివరణ దొరుకుతుంది.

## లైంగిక అశుద్ధావస్థలోనూ రోజా ప్రారంభించవచ్చు

۴۵۔ عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُدْرِكُهُ الْفَجْرُ فِيْ رَمَضَانَ وَهُوَ جُنُبٌ مِنْ غَيْرِ حُلُمٍ فَيَغْتَسِلُ وَيَصُوْمُ۔
(مُتَّفَقٌ عَلَيْهِ)

**45. హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం : కొన్ని సందర్భాల్లో దైవప్రవక్త (స) లైంగిక అశుద్ధావస్థలో వున్నప్పుడు ఫజ్ర్ సమయం వచ్చేది. ఆ అశుద్ధావస్థ కూడా ఏదో స్వప్న స్ఖలనం వలన కాదు. ఆపై ఆయన (స) గుసుల్ చేసేవారు. అప్పుడు ఆయన రోజాలో వుండేవారు. (ముత్తఫకున్ అలైహ్)**

రమజాన్‌లో కొన్ని సమయాల్లో ఒక ప్రశ్న ఉదయిస్తుంది - ఒకవేళ మనిషి రాత్రివేళ రతిలో పాల్గొంటే సహరీ ముగియకపూర్వం (లేదా) రోజా మొదలవక ముందు గుసుల్ (స్నానం) చేయాలా లేదా సహరీ ముగిసినప్పటికీ, రోజా ప్రారంభం అయిన తరువాత కూడా గుసుల్ చేసుకోవచ్చా? ఈ ప్రశ్నకు జవాబు ఈ హదీసులో దొరుకుతుంది. హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం - కొన్ని సందర్భాల్లో దైవప్రవక్త (స) పైన కూడా ఫజ్ర్ వేళ వచ్చేసేది. రోజా సమయం కూడా మొదలయిన తరువాత ఆయన (స) గుసుల్ చేసేవారు. దానికి వివరణ కూడా ఇవ్వడం జరిగింది. అది స్వప్న స్ఖలనంలో జరిగిన అశుద్ధత వల్ల చేసిన గుసుల్ (స్నానం) కాదు.

దీనిద్వారా తెలిసేదేమంటే ఈ విధమైన స్థితిలో రోజా ప్రారంభించవచ్చు. దీనివలన రోజాకు ఎలాంటి భంగం వాటిల్లదు, కొరతా ఏర్పడదు.

ఇక మీరే ఆలోచించండి, ఒకవేళ హజ్రత్ ఆయిషా (ర.అ) గనక ఈ విషయాన్ని తెలుపనట్లయితే ముస్లిం సముదాయానికి ఇది ఎలా తెలిసేది? తెలియక పోతే వ్యక్తులు తమ ప్రైవేటు జీవితాల్లో ఎన్నో ఇబ్బందుల్ని, చిక్కుల్ని ఎదుర్కోవాల్సి వచ్చేది. మరోమాటలో చెప్పాలంటే ఇదంతా అల్లాహ్ కృప, కరుణానుగ్రహాలు. ఇంకా ఇది ప్రవక్త (స), ఆయన ఇంటివారల త్యాగమయ జీవితాల ఫలితం. వారు తమ జీవితంలోని ఇలాంటి సున్నిత అంశాలను కూడా ఎలాంటి దాపరికం లేకుండా ప్రజలకు తెలిపారు. పైగా వాటి తాలూకు అవసరమైన సమాచారాన్ని అందజేశారు - ప్రజలను తమ జీవితాల్లోని ఆ సందర్భాల్లో మార్గదర్శకత్వం దొరకాలని. వాస్తవానికి ఇదంతా దైవప్రవక్త (స), ఆయన పవిత్ర సతీమణుల గొప్ప త్యాగనిరతి ఫలితమే. నేడు కొంతమంది బుద్ధిలేనివారు హదీసులో ఇలాంటి విషయాలు ఎలా వచ్చాయని ఆక్షేపిస్తున్నారు. అలాంటి వారికి తెలిసిరావలసిన విషయం ఏమిటంటే - ఆ మాతృమూర్తులు (ర.అ) గనక ముస్లిం సముదాయానికి ఈ విషయాలు తెలుపనట్లయితే, వీటి తాలూకు ముస్లిం సమాజానికి మార్గదర్శకత్వం ఎక్కడి నుండి లభించేది? ఎలా లభించేది?

## ఇహ్రామ్ ధరించిన స్థితిలో, రోజా స్థితిలో పచ్నా (దేహం నుండి చెడురక్తం తీయటానికి) వేయటానికి అనుమతి

٤٦ - عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ إِنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ احْتَجَمَ وَهُوَ مُحْرِمٌ وَاحْتَجَمَ وَهُوَ صَائِمٌ. (مُتَّفَقٌ عَلَيْهِ)

**46. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) ఇహ్రామ్ ధరించిన స్థితిలో, ఇంకా రోజా ఉన్న స్థితిలో పచ్నాలు వేయించే వారు. (ముత్తఫకున్ అలైహ్)**

పూర్వకాలంలో ఇంకా నేడు కూడా వైద్య సంబంధమైన కొన్ని సందర్భాల్లో, పద్ధతుల్లో శరీరంలోని ఏదో ఒకచోట కత్తితో లేక సూదులతో సున్నితంగా పొడిచి గాయపరుస్తారు. ఫలితంగా ఆ గాయాల నుంచి రక్తం స్రవిస్తుంది, ఇంకా ఆ రక్తాన్ని కొమ్ముల (కప్పుల) ద్వారా పీల్చటం జరుగుతుంది. దీన్నే హిజామా (కప్పింగ్ మెథడ్) అంటారు. ఈ సందర్భంగా ఇహ్రామ్ స్థితిలో లేక రోజా స్థితిలో ఇలా చేయటం అభిలషణీయమా? కాదా? అన్న ప్రశ్న తలెత్తుతుంది. ఈ హదీసు ద్వారా మొట్టమొదట ఇహ్రామ్ స్థితిలో పచ్నాలు వేయవచ్చనే విషయం తెలుస్తోంది. అయితే పచ్నా వేయించినప్పుడు వెంట్రుకలు కత్తిరించరాదు. వెంట్రుకలు కత్తిరించటం జరిగితే ఇహ్రామ్‌కు భంగం వాటిల్లుతుంది. రెండో విషయం, రోజాలో వున్న స్థితిలో కూడా పచ్నాలు వేయవచ్చని తెలుస్తోంది. అయితే ఇందులో ఇహ్రామ్ స్థితిలో తీసుకునే జాగ్రత్తలు పాటించే అవసరం లేదు.

ఇక్కడ గుర్తుంచుకోవలసిన మరో విషయం ఏమిటంటే, పచ్నా వేయించుకునే విషయంలో హదీసువేత్తల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. ఈ విభేదాల ఆధారంగా ఇమామ్ అబూ హనీఫా (రహ్మ), ఇమామ్ మాలిక్ (రహ్మ) ఇంకా ఇమామ్ షాఫియీ (రహ్మ) దృష్టిలో పచ్నాలు వేయించుకోవటం వలన రోజాకు ఎలాంటి భంగం వాటిల్లదు. అయితే ఇమామ్ అహ్మద్ (రహ్మ) దృష్టిలో పచ్నాలు వేయించుకునే వ్యక్తి, పచ్నాలు వేసే వ్యక్తి ఇద్దరి రోజాకు భంగం వాటిల్లుతుంది. వారి తర్కం మున్ముందు రాబోయే హదీసు ఆధారంగా చేయబడింది. అయితే ప్రస్తుత హదీసులో హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) గారి మాటల ద్వారా స్పష్టంగా తెలిసిందేమంటే, స్వయంగా ప్రవక్త (స) రోజా స్థితిలో పచ్నాలు వేయించుకున్నారు. దీనివలన తెలిసిందేమంటే పచ్నాలు వేయించుకోవటం వల్ల రోజాకు భంగం వాటిల్లేమాటైతే ఆయన (స) ఇలా చేసేవారు కాదు.

## మరచిపోయి తినటం, త్రాగటం వలన రోజా భంగం కాదు

٤٧- عَنْ اَبِيْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى
اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ نَسِيَ وَهُوَصَائِمٌ
فَاَكَلَ اَوْشَرِبَ فَلْيُتِمَّ صَوْمَهٗ فَاِنَّمَا اَطْعَمَهُ
اللّٰهُ وَسَقَاهُ (مُتَّفَقٌ عَلَيْهِ)

**47.** హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : రోజా వున్న స్థితిలో ఎవరైనా వ్యక్తి మరచిపోయి తినటం, త్రాగటం చేస్తే, అతను తన రోజాను పూర్తి చేసుకోవాలి. ఎందుకంటే ఆ వ్యక్తికి అల్లాహ్‌యే తినిపించి, త్రాపించాడు.

**(ముత్తఫకున్ అలైహ్)**

ఒకవేళ ఒక వ్యక్తి ఎవరైనా, మరచిపోయి కడుపు నిండా తిన్నా, ఓ గ్లాసు నిండా నీరు త్రాగినా, లేదా మరేదయినా త్రాగినా అప్పుడు కూడా అతని రోజాకు భంగం వాటిల్లదు, అయితే అలాంటి స్థితిలో అతనికి తన రోజా గుర్తుకు వచ్చినట్లయితే వెంటనే ఆ చర్య నుంచి ఆగిపోవాలి. లేకపోతే ఆ స్థితిలో ఒక్క మెతుకయినా లేక ఒక బొట్టు నీరైనా అతని గొంతులో దిగితే అతని రోజాకు భంగం వాటిల్లుతుంది.

తెలిసిందేమంటే, మరచిపోయి, ఎవరైనా ఒక వ్యక్తి రోజాకు భంగం వాటిల్లే ఏ చర్యకైనా పాల్పడినా, అతని రోజాకు ఎలాంటి భంగం వాటిల్లదు. ఇలాంటి తప్పిదం జరిగినా అతను తన రోజాను పూర్తి చేసుకోవాలి తప్ప రోజాకు భంగం చేయకూడదు.

దీనిద్వారా విదితమయ్యే మరో నిబంధన ఏమంటే, మరుపు వల్ల జరిగిన తప్పిదం క్షమార్హం, షరీఅత్ ఈ సూత్రాన్ని అంగీకరిస్తుంది కూడా.

## బుద్ధిపూర్వకంగా రోజాను భంగం చేసినదాని కప్ఫారా (పరిహారం)

۴۸- عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ بَیْنَمَا نَحْنُ جُلُوْسٌ عِنْدَ
النَّبِیِّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ اِذْجَاءَهٗ رَجُلٌ
فَقَالَ یَارَسُوْلَ اللّٰهِ هَلَكْتُ، قَالَ مَالَكَ ، قَالَ
وَقَعْتُ عَلٰی امْرَاَتِیْ وَاَنَا صَائِمٌ، فَقَالَ رَسُوْلُ اللّٰهِ
صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ هَلْ تَجِدُ رَقَبَةً تُعْتِقُهَا ،
قَالَ لَا، قَالَ فَهَلْ تَسْتَطِیْعُ اَنْ تَصُوْمَ شَهْرَیْنِ
مُتَتَابِعَیْنِ، قَالَ لَا، قَالَ هَلْ تَجِدُ اِطْعَامَ سِتِّیْنَ
مِسْكِیْنًا ، قَالَ لَا، قَالَ اِجْلِسْ فَمَكَثَ النَّبِیُّ
صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ فَبَیْنَا نَحْنُ عَلٰی ذٰلِكَ اُتِیَ

النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ بِعَرَقٍ فِيْهِ تَمْرٌ
وَالْعَرَقُ الْمِكْتَلُ الضَّخْمُ، قَالَ أَيْنَ السَّائِلُ
قَالَ أَنَا، قَالَ خُذْ هٰذَا فَتَصَدَّقْ بِهٖ، فَقَالَ الرَّجُلُ
أَعَلٰى أَفْقَرَ مِنِّيْ يَا رَسُوْلَ اللهِ فَوَاللهِ مَا بَيْنَ
لَابَتَيْهَا ــــ يُرِيْدُ الْحَرَّتَيْنِ ــــ أَهْلُ بَيْتٍ أَفْقَرُ
مِنْ أَهْلِ بَيْتِيْ، فَضَحِكَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ
وَسَلَّمَ حَتّٰى بَدَتْ أَنْيَابُهٗ ثُمَّ قَالَ أَطْعِمْهُ أَهْلَكَ.

(مُتَّفَقٌ عَلَيْهِ)

**48.** హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం : ఒకసారి మేము దైవప్రవక్త (స) సన్నిధిలో కూర్చొని వున్నాం. అప్పుడు ఒక వ్యక్తి వచ్చి, 'దైవప్రవక్తా (స)! నేను నాశనమైపొయ్యాను' అన్నాడు. ప్రవక్త (స) 'నీకేమయింది' అని అడిగారు. 'నేను రోజాలో వున్నప్పుడు నా భార్యతో సంభోగించాను' అన్నాడావ్యక్తి. ఆపై ప్రవక్త (స) 'నీవు స్వేచ్ఛ నొసంగడానికి నీ దగ్గర ఎవరైనా బానిస ఉన్నాడా?' అని ఆరా తీశారు. ఆ వ్యక్తి 'లేదు' అన్నాడు. 'నీవు వరుసగా రెండు నెలల ఉపవాసం ఉండే శక్తి కలిగి వున్నావా?' అని ప్రవక్త (స) అడిగారు. అతను 'నేను అలా వుండలేను' అని అన్నాడు. ఆపై ప్రవక్త (స) 'పోనీ, అరవైమంది పేదలకు అన్నం పెట్టగలవా?' అని అడిగారు. 'ఇదీ చేయలేను' అని ఆ వ్యక్తి అన్నాడు. ఆయన (స) 'అయితే కూర్చో' అని చెప్పి కొంత సమయం గడిపారు. అలా కూర్చొని వుండగా దైవప్రవక్త (స) సన్నిధిలో ఖర్జూరాలతో నిండిన ఒక పెద్ద బుట్ట తేబడింది. ఆయన (స) 'సందేహపడిన ఆ వ్యక్తి ఎక్కడ?' అని ఆరాతీశారు. 'నేను ఇక్కడే వున్నా దైవప్రవక్తా!' అని అన్నాడావ్యక్తి. 'దీన్ని తీసుకెళ్ళి దానం చెయ్యి' అని ప్రవక్త (స) అన్నారు. (అంటే కఫ్ఫారా (పరిహారం)గా **60** మంది నిరుపేదలకు తినిపించు అన్నారు). దానికి ఆ వ్యక్తి, 'దైవప్రవక్తా! నాకంటే నిరుపేద అయిన వ్యక్తులకు తినిపించమంటారా? దేవుని మీద ఒట్టు, మదీనా నగరంలోని ఈ రెండు కొండల మధ్య నాకంటే నిరుపేద ఎవ్వడూ లేడు' అని విన్నవించు కున్నాడు. దీనిపై ప్రవక్త (స) పెద్దగా నవ్వేశారు. అలా నవ్వుతున్నప్పుడు

**ఆయన (స) గారి ముందు పల్లు కన్పించాయి. తరువాత ఆయన (స) 'సరే, ఇక వెళ్ళు, వీటిని తీసికెళ్లి నీ ఆలు బిడ్డలకే తినిపించు' అని సెలవిచ్చారు. (ముత్తఫకున్ అలైహ్)**

ఈ హదీసు ద్వారా అనేక అంశాలు సుబోధకమవుతున్నాయి :

ఒకవేళ ఎవరైనా ఒక వ్యక్తి తన మనసును అదుపులో వుంచుకోలేక బుద్ధిపూర్వకంగా రోజాను భంగపరచినట్లయితే దానికి పరిహారం ఏమిటన్నది ఒక విషయం - మొదటి పరిహారం (కప్ఫారా) బానిసను విముక్తం చేయటం; ఒకవేళ ఆ మనిషి కప్ఫారా చెల్లించే స్థోమత కలిగివుంటే అతను దీన్ని నిర్వర్తించాలి. ఒకవేళ దీనిని చెల్లించే స్థోమత కలిగిలేనట్లయితే అప్పుడు రెండవ కప్ఫారా - రెండు నెలల పాటు మధ్యలో ఎలాంటి నాగా లేకుండా - ఉపవాసాలు పాటించడం. దీని స్థోమత కూడా అతనికి లేనట్లయితే ఇక అతను 60 మంది నిరుపేదలకు అన్నం పెట్టాలి. 60 మంది నిరుపేదలకు అన్నం పెట్టటమంటే రెండు పూటలా కడుపునిండా తినిపించాలి. అది కూడా తాను ఏ ఆహారం తింటాడో అలాంటి ఆహారమే తినిపించాలి.

ఇంతవరకయితే ఈ సమస్యకు సాధారణ సమాధానం ఇవ్వబడింది. దీని తరువాత ఒక ప్రత్యేక విధానం కూడా మన ముందుకు వచ్చింది - ఒకవేళ పైన తెలిపిన పద్ధతుల్లో దేనినీ ఆచరించే స్థోమత లేకపోతే అతనికి ఇవ్వబడిన ఆదేశం ఏమిటన్నది? ఈ హదీసులో పృచ్ఛకుడు 'నేనైతే మూటిలో ఒక్క దానినైనా నెరవేర్చే స్థోమత కలిగి లేన'ని విన్నవించుకోగా, ప్రవక్త (స) తన దగ్గరకు జకాత్‌గా వచ్చిన ఆ ఖర్జూరాలను అతనికి దానంగా ఇచ్చారు. బైతుల్ మాల్ (ప్రభుత్వ ధనాగారం) నుంచి ఇలాంటి వ్యక్తులకు సహాయం చేయవచ్చన్న విషయం దీని ద్వారా విదితమయ్యింది. ఒకవేళ ఎవరైనా వ్యక్తి ఇలాంటి పాపానికి ఒడిగట్టి, ఇలాంటి పరిహారం చెల్లించే స్థోమత కలిగి లేనప్పుడు అలాంటి వ్యక్తికి రెండే మార్గాలున్నాయి. ఈ మూడు విధానాల్లో ఏదో ఒకదాని స్థోమత కలిగేంత వరకు అతను వేచి చూడాలి (ఈ వేచి చూడటంలో అతని వయస్సు మీరిపోయినాసరే). లేక ప్రభుత్వ ధనాగారాన్నుండైనా అతనికి సహాయం చేయటమో లేదా ధనవంతులైనా అతనికి తోడ్పాటు అందించటమో చేయాలి. జకాత్ సొమ్ము ఇలాంటి పద్దుల్లో కూడా ఖర్చు చెయ్యవచ్చని దీనిద్వారా తెలుస్తోంది - అప్పులు చెల్లించడానికి స్థోమత లేని వ్యక్తి రుణాన్ని వసూలైన జకాత్ సొమ్ము నుంచి చెల్లించినట్లు. ఒకవేళ బైతుల్ మాల్‌లో అంత సొమ్ము లేకపోతే, జకాత్ సొమ్ము ద్వారా ఇలాంటి సమస్యల్లో చిక్కుకున్న ముస్లిం సోదరుణ్ణి విముక్తం చెయ్యాలి.

ఫిఖావేత్తల మధ్య ఈ విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ కప్ఫారా (పైన తెలిపిన వివరాల ప్రకారం) భార్యతో సమాగమం చేసి రోజా భంగం చేసినందుకేనా? లేక ఒక వ్యక్తి రోజాలో వుండి బుద్ధిపూర్వకంగా తినటం, త్రాగటం చేసినప్పుడు కూడా ఇది వర్తిస్తుందా? ఫిఖావేత్తల ఒక వర్గం అభిప్రాయం ప్రకారం ఈ కప్ఫారా భార్యతో సంభోగించి రోజాను భంగపరచిన స్థితిలోనే వర్తిస్తుంది. రెండవ వర్గం అభిప్రాయంలో ఒక మనిషి బుద్ధిపూర్వకంగా ఏ పద్ధతి ప్రకారంగానైనా రోజాను భంగపరిస్తే కప్ఫారా తప్పనిసరి అవుతుంది. ఇమామ్ అబూ హనీఫా, ఇమామ్ మాలిక్ అభిప్రాయంలో రోజాను భంగం చేసిన అన్ని సందర్భాల్లోనూ ఈ పరిహారం (కప్ఫారా) చెల్లించబడాలి.

ఇక ముమ్ముందు ఈ హదీసులో ఎంతో ముఖ్యమయిన ఓ విషయం ముందుకు వస్తుంది. మదీనాలో తనకన్నా ఎక్కువ నిరుపేద మరొకరు లేరని ఆ పృచ్ఛకుడు విన్నవించుకోగా, దైవప్రవక్త (స) 'సరే మంచిది, వెళ్ళు, ఈ ఖర్జూరాలను తీసుకెళ్ళి నీ ఆలుబిడ్డలకు దానంగా ఇచ్చెయ్యి' అని సెలవిచ్చారు. ఈ సందర్భంగా కొంతమంది ఫిఖావేత్తల అభిప్రాయమేమంటే, ఈ వ్యవహారం కేవలం ఆ వ్యక్తి వరకే పరిమితం. అంతేగాని ఇతరులకు ఇది వర్తించదు అని. కాని నా ఉద్దేశ్యంలో (నిజం అల్లాహ్‌కే తెలుసు) అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త (స) ఏ వ్యవహారంలో సౌలభ్యాన్ని, వెసులుబాటును చేకూర్చారో అందులో కాఠిన్యాన్ని, సంకుచితత్వాన్ని కల్పించే హక్కు మరొకరికి లేదు. తినటానికే తిండి లేని వ్యక్తి చేతికి మీరు ధనాన్నిచ్చి, 'దీన్ని నిరుపేదల్లో పంచు' అని అంటే ఆ వ్యక్తి ఆ సొమ్మును తీసుకోవటానికి హక్కుదారుడు ఎందుకు కాడు అన్న సందేహం వస్తుంది. తన వద్ద తినటానికి కనీసం ఏదైనా వున్న వ్యక్తి మాత్రమే సదఖా (దానధర్మాలు) ఇవ్వగలడు. కాని ఈ రాత్రి నా బిడ్డలు ఏమి తింటారు అన్న బెంగతో ఉన్న వ్యక్తి ద్వారా మీరు 60 మంది నిరుపేదలకు అన్నం పెట్టించాలని భావిస్తున్నారు. ఇది ఆలోచించాల్సిన విషయం. నా జ్ఞాన పరిధి మేరకు షరీఅత్ ఉద్దేశం ఇదై వుండదు. వాస్తవమేమంటే దైవప్రవక్త (స) గారి ఈ ఆచరణ ద్వారా షరీఅత్‌కు సంబంధించిన ఒక షరీఅత్ విషయం అవగతమవుతోంది. ఆ మాటకొస్తే దైవప్రవక్త (స) గారి ప్రతి ఆచరణ ఏదో ఆవేశపూరితంగా చేసింది కాదు. ఆయన (స) ప్రతి ఆచరణా షరీఅత్ పరిధిలోనే వుంటుంది. అసలు దీనిలోని అసలైన భావనా ఊపిరి ఏమిటి? కాబట్టి ఎవరైనా వ్యక్తి చేత తప్పక కప్ఫారా చెల్లించాల్సిన తప్పిదం జరిగితే, అప్పుడు స్వయంగా అతనే దానస్వీకారయోగ్యుడైన పక్షంలో బైతుల్ మాల్ నుంచి అతనికి సహాయం చేయటం అభిలషణీయం. దీని

పద్ధతి ఏమిటంటే ఒకసారి ఆ సొమ్ముకు అతన్ని యజమానిగా చేసి ఆపై అతనితో 'దీనిని దానం చేసే హక్కు నీకుంది' అని అనాలి. అయితే 'ఒకవేళ ఈ దాన స్వీకృతికి నీవు కూడా అర్హుడివైతే దీన్ని నీవూ ఉపయోగించుకోవచ్చు' అని కూడా అతనితో చెప్పాలి. దైవప్రవక్త (స) గారి ఆచరణ ద్వారా ఇలా చేయటం సమ్మతమేనన్న మార్గదర్శకత్వం లభిస్తుంది.

## రెండవ భాగం

**49.▲ ..........**

## రోజా స్థితిలో భార్యతో కలసిమెలసి ఉండటం గురించి

٥٠- عَنْ اَبِیْ هُرَيْرَةَ اَنَّ رَجُلاً سَأَلَ النَّبِیَّ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ عَنِ الْمُبَاشَرَةِ لِلصَّائِمِ فَرَخَّصَ
لَهٗ وَاَتَاهُ آخَرُ فَسَأَلَهٗ فَنَهَاهُ، فَاِذَا الَّذِیْ
رَخَّصَ لَهٗ شَيْخٌ وَاِذَا الَّذِیْ نَهَاهُ شَابٌّ.
(رَوَاهُ اَبُوْدَاوٗدَ)

**50.** **హ|జత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరై 'ఉపవాసి అయిన ఒక వ్యక్తి తన భార్యతో కలిసే అనుమతి ఉందా?' అని ప్రశ్నించాడు. దైవప్రవక్త (స) అతనికి ఆ అనుమతినిచ్చారు. ఆపై మరో వ్యక్తి ఆయన (స) సన్నిధిలో హాజరై అతను కూడా ఇలాంటి ప్రశ్ననే అడిగాడు. దానికి ఆయన (స) ఆ వ్యక్తికి అనుమతినివ్వలేదు - మొదట ఆయన (స) అనుమతినిచ్చిన వ్యక్తి వయసుమీరినవాడు. అనుమతి ఇవ్వబడని రెండో వ్యక్తి యువకుడు. (అబూదావూద్)**

ఈ హదీసు మూలంలో భార్యతో కలవటం అని సూచించటానికి 'ముబాషరత్' అన్న పదం వాడబడింది. హదీసుల్లో ఈ పదం అనేకచోట్ల వచ్చింది. అరబీ భాష తెలియనివారు, ఉర్దూ ద్వారా అరబీని అర్థం చేసుకునేవారు ఈ పదాన్ని ఆసరాగా

---

▲ గౌరవనీయులైన మౌలానా గారు తన హదీసు పాఠంలో ఈ హదీసును వ్యాఖ్యానించలేదు.

తీసుకొని హదీసుకు వ్యతిరేకంగా ఓ తుఫానును లేవనెత్తుతారు - చూడండి, ఈ హదీసుల్లో ఎలాంటి తప్పుడు అంశాలను జమచేయటం జరిగిందో అని. ఇలాంటి వ్యక్తులు ఎలాంటి పరిశోధనా చేయకుండా ఈ విధమైన తుఫానును సృష్టిస్తూ వుంటారు. ఇదంతా తమ అజ్ఞానం కారణంగా ప్రవక్త (స) హదీసుకు వ్యతిరేకంగా దీనిని ఒక ఆయుధంగా చేసి వాడుకుంటూ ఉంటారు. వాళ్ళ అవగాహనా లేమికి అసలు మూలాధారం ఏమిటంటే ఉర్దూ భాషలో 'ముబాషరత్' అన్న పదం 'రతి జరపటం' అనే అర్థంలో వాడబడటమే. నిజానికి అరబీలో అలా లేదు.

**'ముబాషరహ్'** అనే పదం **'బాషర'** అనే ధాతువు నుంచి వచ్చింది. దీని అర్థం 'ఏదైనా పనిని స్వయంగా చేయటం' అని వస్తుంది. ఒక అరబ్బు వ్యక్తి 'చూడండి, ఫలానా పనిని ఇతరులపై పెట్టకుండా స్వయంగా మీరే చేయండి' అని చెప్పటానికి **'ఇఫ్ అల్‌హు ముబాషరతన్'** (అంటే ఈ పనిని స్వయంగా మీరే చేయండి) అని అంటాడు. లేదా అతను 'నేనే స్వయంగా అక్కడికి వెళ్లాను. ఎవరినీ పంపలేదు' అని అనటానికి **"జుహబ్‌తు ముబాషరతన్"** అంటాడు. ఇదేవిధంగా ఈ పదం ఒక స్త్రీ, ఒక పురుషుడు శారీరకంగా దగ్గరైనప్పుడు కూడా వాడబడుతుంది. అయితే దీని అర్థం లైంగికంగా కలుసుకున్నారన్నది ఎంతమాత్రం కాదు. ఇక్కడ కూడా అదే అర్థంలో వాడబడింది. కాబట్టి ప్రవక్త (స) సన్నిధిలో హాజరైన వ్యక్తి 'నేను రోజాలో వున్నప్పుడు నా భార్యతో కలవవచ్చా' అని విన్నవించుకున్నాడు. అలా ప్రశ్నించిన వ్యక్తి వయోవృద్ధుడు కాబట్టి అతనికి దైవప్రవక్త (స) అనుమతినిచ్చారు. ఇదే విషయమై ప్రశ్నించిన మరో వ్యక్తి యువకుడు కావటాన ప్రవక్త (స) అతనికి అనుమతినివ్వలేదు. వృద్ధుడు అయిన వ్యక్తి అతను నిగ్రహించుకోలేనంతగా లైంగిక ఉద్రేకం రాదన్న విషయం తెలిసిన విషయమే. అదే యువకుడైన వ్యక్తి తన వుద్రేకాన్ని అదుపులో పెట్టుకోలేకపోవచ్చు. అలాంటప్పుడు అతను రోజాను భంగపరచగలడు. ఫలితంగా అతను కష్టాల్లో పడతాడు. అందుకనే ఇలాంటి వ్యక్తి స్త్రీతో కలవకుండా దూరంగా మసలుకోవటంలోనే శ్రేయం దాగివుంది.

ఈ హదీసు ద్వారా తెలిసిన విషయం ఏమిటంటే ఇలాంటి చర్య (కలయిక) అనుమతించబడిందే. అయినప్పటికీ ఎవరైతే తనను తాను అదుపులో వుంచుకోలేడో అతను ఇలాంటి చర్యకు దూరంగానే వుండాలి. అయితే తనను నిగ్రహించుకునే శక్తి గల వ్యక్తి ఈ అవకాశం ద్వారా ప్రయోజనం పొందవచ్చు.

## దానంతట అదే వాంతి అయినప్పుడు రోజా భంగం కాదు

۵۱- عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ: مَنْ ذَرَعَهُ الْقَیْءُ وَهُوَ صَائِمٌ فَلَیْسَ عَلَیْهِ قَضَاءٌ وَمَنِ اسْتَقَاءَ عَمْدًا فَلْیَقْضِ ۔ (رَوَاهُ التِّرْمِذِیُّ وَاَبُوْدَاوُدَ وَابْنُ مَاجَةَ وَالدَّارِمِیُّ)

**51. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : రోజాలో వున్నవేళ దానంతట అదే వాంతి చేసుకున్న వ్యక్తి తన రోజాను ఖజా చేసుకోవలసిన అవసరం లేదు. అయితే బుద్ధిపూర్వకంగా వాంతి చేసుకున్న వ్యక్తి తన రోజాను ఖజా చేసుకోవాలి. (తిర్మిజీ, అబూదావూద్, ఇబ్నెమాజా, దారిమీ)**

ఏ వ్యక్తికయినా దానంతట అదే వాంతి అయితే దాని అర్థం బుద్ధిపూర్వకంగా అతను రోజాను భంగపరచలేదు. ఇది కూడా రోజాలో మరచిపోయి తిన్నవాడితో సమానం. మరచిపోయి ఎవరైనా వ్యక్తి కడుపు నిండా భుజించినప్పటికీ రోజా ఖజా కాదు. కావాలని చేసినప్పుడే అది ఖజా అవుతుంది. అదేవిధంగా ఎవరైనా వ్యక్తి ఉద్దేశ్యపూర్వకంగా వాంతి చేసుకున్నట్లయితే అతను రోజాను తప్పక ఖజా చేయాలి. ఒకవేళ ఎవరికైనా కడుపులో ఏదో తెలియని బాధ కారణంగా దానంతటదే వాంతి అయినట్లయితే, అది కొంచెమయినా లేక అనేకసార్లు అయినా అట్టి పరిస్థితిలో అతని రోజా భంగం కాదు.

## వాంతి అయినట్లయితే నఫిల్ రోజాను విరమించుకోవాలి

۵۲- عَنْ مَعْدَانَ بْنِ طَلْحَةَ اَنَّ اَبَا الدَّرْدَاءِ حَدَّثَنِیْ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ قَاءَ فَاَفْطَرَ قَالَ فَلَقِیْتُ ثَوْبَانَ فِیْ مَسْجِدِ دِمَشْقَ فَقُلْتُ اِنَّ اَبَا الدَّرْدَاءِ حَدَّثَنِیْ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ قَاءَ فَاَفْطَرَ قَالَ صَدَقَ وَاَنَا صَبَبْتُ لَهٗ وَضُوْءَهٗ۔

(رَوَاهُ اَبُوْدَاوُدَ وَالتِّرْمِذِیُّ وَالدَّارِمِیُّ)

**52.** జనాబ్ మఅదాన్ బిన్ తల్హా (రహ్మ) ఉల్లేఖించారు : హజ్రత్ అబుద్దర్‌దా (రజి) నాతో ఇలా అన్నారు–దైవప్రవక్త (స) వాంతి చేసుకున్నారు, తరువాత ఇఫ్తార్ చేసి రోజా విరమించారు. మఅదాన్ తన మాటను కొనసాగిస్తూ, డెమాస్కస్ మస్జిద్‌లో నేను, హజ్రత్ సౌబాన్(రజి)ని కలిసినప్పుడు నేను వారితో అన్నాను – హజ్రత్ అబుద్దర్‌దా (రజి) గారి 'దైవప్రవక్త (స) వాంతి చేసుకుని, రోజా ఇఫ్తార్ కూడా చేశారు' అన్న ఉల్లేఖనాన్ని విన్పించాను. ఆపై హజ్రత్ సౌబాన్ (రజి) ఇలా సమాధానం ఇచ్చారు : 'హజ్రత్ అబుద్దర్‌దా (రజి) సత్యం పలికారు. నేను స్వయంగా దైవప్రవక్త (స) గారి చేతులపై నీళ్లు పోశాను, ఇంకా పుక్కిలించటానికి ఆయన(స)కు నీళ్లు కూడా ఇచ్చాను.' (అబూదావూద్, తిర్మిజీ, దారిమీ)

దైవప్రవక్త (స) గారి ఈ రోజా, నఫిల్ రోజా కోవకు చెందినదన్న విషయాన్ని గ్రహించాలి. ప్రవక్త (స) గారికి ఏదైనా బాధ కలిగివుండవచ్చు, తత్కారణంగా ఆయన (స) ఇఫ్తార్ చేసి వుండవచ్చు.

## రోజా స్థితిలో మిస్వాక్ చేయటం అభిలషణీయమే

٥٣- عَنْ عَامِرِ بْنِ رَبِيْعَةَ قَالَ رَأَيْتُ النَّبِيَّ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ مَالَا أُحْصِي يَتَسَوَّكُ وَهُوَ
صَائِمٌ. (رَوَاهُ التِّرْمِذِيُّ وَأَبُوْدَاوُدَ)

**53.** హజ్రత్ ఆమిర్ బిన్ రబీయ (రజి) ఉల్లేఖించారు: "నేను దైవప్రవక్త (స)ను ఉపవాస స్థితిలో మిస్వాక్ చేస్తుండగా లెక్కలేనన్ని మార్లు చూశాను." (తిర్మిజీ, అబూదావూద్)

దీని వలన తెలిసిందేమంటే రోజాలో వున్నప్పుడు మిస్వాక్ చేయవచ్చు. దానితో రోజాకు ఎలాంటి భంగం వాటిల్లదు.

## రోజా స్థితిలో సుర్మా పెట్టవచ్చా?

٥٤- عَنْ أَنَسٍ قَالَ جَاءَ رَجُلٌ إِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ قَالَ اشْتَكَيْتُ عَيْنِيْ أَفَأَكْتَحِلُ وَأَنَا
صَائِمٌ، قَالَ نَعَمْ. (رَوَاهُ التِّرْمِذِيُّ)

**54. హజ్రత్ అనస్ (రజి) ఉల్లేఖనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరై ఇలా విన్నవించుకున్నాడు - నా కళ్లల్లో బాధగా వుంది, రోజా స్థితిలో నేను సుర్మా పెట్టుకోవచ్చా? అని. దానికి ఆయన (స) 'అవును, పెట్టుకోవచ్చు' అని అన్నారు. (తిర్మిజీ)**

ఈ ఉల్లేఖనం బలహీనమైనది. అందుకని ఒకవేళ దీన్ని నిజమైనదిగా నమ్మినట్లయితే దీనిద్వారా మీదు మిక్కిలి తెలిసేదేమంటే - సుర్మా పెట్టవచ్చు అని. ఎందుకంటే అది చిన్నపాటి పదార్థం. కాని దీన్ని ఆధారంగా చేసుకొని కళ్లల్లో కారేవిధంగా మందు పెట్టుకోవచ్చని భావించరాదు. ఎందుకంటే కంటికి, కంఠానికి మధ్య ఎలాంటి అడ్డుగోడ ఉండదు. ఒకవేళ మీరు ఏదైనా రంగు గల మందును కళ్లల్లో పెట్టుకున్నట్లయితే కొంత సేపటి తరువాత దాని రంగు కంఠంలోకి దిగినప్పుడు మీరు వుమ్మివేస్తే, మీ ఉమ్మి కూడా అదే రంగులో ఉంటుంది.

కళ్ళకు బదులు చెవుల్లో మందు వేయటానికి అనుమతి ఉంది. ఎందుకంటే చెవులకు కంఠానికి మధ్యలో ఒక పొర అడ్డంగా ఉంటుంది. దానివలన మందు కంఠంలోకి దిగదు. ఒకవేళ చెవి నిండా మందువేసినా దాని కొద్దిపాటి తడి కూడా కంఠంలో దిగదు. దీనికి ప్రతిగా కంటిలో ఏ కాస్త మందు వేసినా వెంటనే అది కంఠంలో దిగిపోతుంది. ఎందుకంటే కొంతమందికి ఈ విషయం తెలియదు, అందువల్ల చెవి లోతుగా ఉంటుంది కాబట్టి బాహ్యాపరంగా చూస్తే అది రంధ్రం గుండా లోపలికి దిగటం వల్ల రోజా భంగమవుతుందని భావిస్తారు, అందుకని కళ్ళల్లో మందువేయటం వలన రోజా భంగం కాదని అనుకుంటారు. చూడబోతే వ్యవహారం తద్భిన్నంగా ఉంది.

వాస్తవానికి ఇది ఫిఖా సమస్య కాదు. ఇది వైద్యపరమైన సమస్య. ఒకవేళ ఎవరైనా ఒక వ్యక్తికి మానవ దేహ నిర్మాణం గురించి తెలిసివుంటే అతను దీన్ని బాగా అర్థం చేసుకుంటాడు.

## రోజాలోని తీవ్రతను తగ్గించటానికి స్నానం చేయటం, తలపై నీళ్ళు చల్లుకోవటం సమ్మతమే

۵۵- عَنْ بَعْضِ اَصْحَابِ النَّبِیِّ صَلَّی اللّٰہُ عَلَیْہِ
وَسَلَّمَ قَالَ لَقَدْ رَاَیْتُ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ
بِالْعَرْجِ یَصُبُّ عَلٰی رَاْسِہِ الْمَاءَ وَھُوَ صَائِمٌ
مِنَ الْعَطَشِ اَوْ مِنَ الْحَرِّ (رَوَاہُ مَالِكٌ وَ اَبُوْدَاؤُدَ)

**55. దైవప్రవక్త (స) గారి ఒక సహాబీ ఇలా ఉల్లేఖించారు : నేను ప్రవక్త (స)ను 'అర్జ్'▲ అనే ప్రదేశంలో చూశాను. అప్పుడు ఆయన తలపై నీళ్ళు చల్లుకుంటున్నారు. ఆ సమయంలో ఆయన (స) రోజాలు వున్నారు. దాహం కారణంగానో లేక వేడిమికి తాళలేకనో అలా చేశారు.**

**(మాలిక్, అబూదావూద్)**

దాహార్తి కారణంగానో, ఎండతాపం కారణంగానో వాటి తీవ్రత నుంచి ఉపశమనం పొందటానికి ప్రవక్త (స) రోజా స్థితిలో వుండి తలపై నీళ్ళను చల్లుకోవటాన్ని దైవప్రవక్త (స) గారి ఈ సహచరులు (రజి) చూడటం జరిగింది. దీనివలన తెలిసేదేమంటే దీని మూలంగా రోజాలో ఎలాంటి భంగం వాటిల్లదు. అందువలన మీరు నీటి తొట్టెలో మీ దేహం మునిగేలా కూర్చోవచ్చు, మీ తలపై మాటిమాటికీ నీరు చల్లుకున్నా మీ రోజాకు భంగం వాటిల్లదు. ఇలా ఎక్కువ సమయం వరకు చేసినా సరే. నీళ్ళల్లో కూర్చున్నా లేక స్నానం చేసినా వేడి, తాపం తగ్గిపోతుందన్న విషయం తెలిసిందే. కాని దీని వలన రోజాకు భంగం వాటిల్లదు. అయితే మీ గొంతులో ఒక్క చుక్క నీరు దిగినా మీ రోజా భంగమయిపోతుంది.

## రోజాలో వున్నప్పుడు పచ్నాలు (శరీరంలోని చెడురక్తాన్ని బయటికి తీసే పద్ధతి) వేయించటం

٥٦- عَنْ شَدَّادِ بْنِ أَوْسٍ أَنَّ رَسُولَ اللهِ صَلَّى
اللهُ عَلَيْهِ وَسَلَّمَ أَتَى رَجُلاً بِالْبَقِيعِ وَهُوَ يَحْتَجِمُ
وَهُوَ آخِذٌ بِيَدِي، لِثَمَانِيَ عَشْرَةَ خَلَتْ مِنْ
رَمَضَانَ، فَقَالَ أَفْطَرَ الْحَاجِمُ وَالْمَحْجُومُ.
(رَوَاهُ أَبُوْدَاوُدَ وَابْنُ مَاجَهْ وَالدَّارِمِيُّ)

**56. హజ్రత్ షద్దాద్ బిన్ ఔస్ (రజి) ఇలా ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) బఖీహ్ అనే చోటును సందర్శించినప్పుడు అక్కడ ఒక వ్యక్తి పచ్నాలు వేస్తున్నాడు. ఆ సందర్భంలో ఆయన (స) నా చేతిని పట్టుకొని వున్నారు. ఆ రోజు రమజాన్ 18వ తేది. "పచ్నాలు వేసేవారు, వేయించుకునేవారు ఇద్దరి రోజాలు భంగమయిపోయాయి" అని ఆయన (స) చెప్పారు.**

**(అబూదావూద్, ఇబ్నెమాజా, దారిమీ)**

ఇంతకు క్రితమే హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఉల్లేఖించిన ఓ హదీసులో "స్వయంగా ప్రవక్త (స) రోజాలు వుండి పచ్నాలు వేయించుకున్నారు" అని తెలుపబడింది. అయితే ఇక్కడ దైవప్రవక్త (స) "పచ్నాలు వేసేవారు, వేయించు కునేవారు ఇద్దరి రోజా భంగమయిపోయింది" అని సెలవిచ్చారు. ఇక్కడ రెంటిలో ఏ హదీసును అనుసరించాలన్న ప్రశ్న ఉదయిస్తుంది.

ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మ) ఈ హదీసును స్వీకరించారు. దీని ఆధారంగానే ఆయన రోజాలో వున్నప్పుడు పచ్నాలు వేసేవారు, వేయించుకునేవారు ఇద్దరి రోజా భంగమవుతుందన్న అభిప్రాయంతో ఏకీభవించారు. కొంతమంది దృష్టిలో ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ ఈ హదీసును దేని ఆధారంగా అంగీకరించారంటే - పచ్నాలు వేయించుకున్న వ్యక్తి దేహం నుంచి రక్తం స్రవించి అతను నిస్సత్తువకు లోనయి రోజాను విరమించటానికి పూనుకుంటాడు. అదేవిధంగా కొమ్ము లేక కప్పు ద్వారా రక్తాన్ని పీల్చే వ్యక్తి రక్తం పీలుస్తున్న సమయంలో పొరపాటున ఒక చుక్క రక్తం అతని గొంతులోకి దిగినా అతని రోజా కూడా భంగమయ్యే ఆస్కారం, అనుమానం వుంది.

అయితే ఈ హదీసు విషయంలో ఇతర ఉల్లేఖనాల ద్వారా అందిన వివరాల ప్రకారం తెలిసిందేమంటే ఈ హదీసులో తెలిపిన ఈ సంఘటన మక్కా విజయం తర్వాతి కాలంలో సంభవించింది. అప్పుడు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ దైవప్రవక్త (స) పచ్నాలు వేయించుకోవటాన్ని చూశారు. అది వీడ్కోలు హజ్ నాటి సందర్భం. అందుకనే ఫిఖావేత్తల్లోని ఒక వర్గం వారు ఏమంటారంటే - ఈ విషయంలో హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి) గారి ఈ సాక్ష్యం కాలక్రమం రీత్యా ప్రవక్త (స) గారి చివరి ఆచరణగా తెలుస్తోంది. కాబట్టి ఈ వ్యవహారంలో చివరి ఆదేశం, హితవు ఏమంటే పచ్నాలు వేయించుకోవటం ద్వారా రోజా భంగం కాదు. ఇమామ్ అబూ హనీఫా (రహ్మ), ఇమామ్ మాలిక్ (రహ్మ) ఇంకా ఇమామ్ షాఫియి (రహ్మ) గారి అభిప్రాయం కూడా ఇదే.

## జీవితాంతం ఉండే రోజాలు, రమజాన్‌లోని ఒక్క రోజాకు కూడా సాటిరావు

٥٧- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ أَفْطَرَ يَوْمًا مِنْ رَمَضَانَ مِنْ غَيْرِ رُخْصَةٍ وَلَا مَرَضٍ لَمْ يَقْضِ عَنْهُ صَوْمُ الدَّهْرِ كُلِّهِ وَإِنْ صَامَهُ.

(رَوَاهُ أَحْمَدُ وَالتِّرْمِذِيُّ وَأَبُو دَاوُدَ وَابْنُ مَاجَه وَالدَّارِمِيُّ وَالْبُخَارِيُّ)

**57. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఎవరైనా ఒక వ్యక్తి ఎలాంటి బలమైన కారణం లేకుండా లేక ఎలాంటి అనారోగ్యానికి గురికాని స్థితిలో రమజాన్‌లోని ఒక రోజా విడిచిపెడితే అది అతను తన జీవితాంతం రోజాలు వున్నా ఆ ఒక్క రోజాకు అవి ప్రత్యామ్నాయం (ఖజా) కాజాలవు.**

**(అహ్మద్, తిర్మిజీ, అబూదావూద్, ఇబ్నెమాజా, దారిమీ, బుఖారీ)**

ఇది రమజాన్ రోజాకు చెందిన ఖజా తాలూకు షరీఅత్ ఆదేశం కాదు. ఎవరైనా వ్యక్తి ఖజా రోజా పాటిస్తే అది పూర్తవుతుంది. కాని వాస్తవమేమంటే అల్లాహ్ వద్ద అతని జీవితాంతపు రోజాలు కూడా పుణ్యఫలం, ఇంకా ఔన్నత్యం రీత్యా తాను రమజాన్‌లో బుద్ధిపూర్వకంగా విడిచిపెట్టిన ఆ ఒక్క రోజాకు సరిసమానం కాజాలవు. ఏదైనా షరీఅత్ కారణం రీత్యా రోజాను విడిచిపెడితే అది వేరే విషయం. అట్టి పరిస్థితిలో మనిషి ఖజా రోజాలు ఉండవచ్చు. కాని అంగీకారయోగ్యం కాని విషయమేమంటే ఎలాంటి షరీఅత్ కారణం లేకుండా ఉద్దేశ్యపూర్వకంగా రోజాను విడిచిపెట్టడం ఎలాంటిదంటే అతను జీవితకాలమంతా రోజాలున్నా దానికి సాటి రావు.

ఇక్కడ గమనించాల్సిందేమంటే షరీఅత్‌లో కొన్ని విషయాలు చట్టపరమైన స్థాయి కలిగివుంటే మరికొన్ని నైతిక స్థానం కలవిగా వుంటాయి. చట్టపరమైనవి ఏమంటే ఒకవేళ ఎవరైనా బుద్ధిపూర్వకంగా ఏదైనా ఒక రోజాను విడిచిపెడితే అతనిపై ఖజా తప్పనిసరి అవుతుంది. చట్టం కోరేదేమంటే అతను ఖజా రోజా పాటించాలన్నది. అయితే ఈ హదీసు రీత్యా తన రోజాను ఖజా చేసే నైతిక స్థానం ఏమంటే ఒక్క రోజు ఖజా ఉపవాసమే కాదు అతను జీవితాంతం రోజాలు పాటించినా అతను బుద్ధిపూర్వకంగా విడిచిపెట్టిన రోజాకు అవి సాటి రావు.

## అసలు ఉద్దేశం రోజా బాహ్యరూపం కాదు, కావలసింది దాని వాస్తవ ఊపిరి

۵۸۔ عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَیْهِ وَسَلَّمَ : كَمْ مِنْ صَائِمٍ لَيْسَ لَهٗ مِنْ صِیَامِهٖ اِلَّا الظَّمَاُ وَكَمْ مِنْ قَائِمٍ لَیْسَ لَهٗ مِنْ قِیَامِهٖ اِلَّا السَّهَرُ. (رَوَاهُ الدَّارِمِیُّ)

**58. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఎంతోమంది ఉపవాసాలుంటారు - వారు దప్పికతో పడివుండటం తప్ప వారికి దక్కేది మరేమీ లేదు. మరెంతోమంది రాత్రిళ్ళు నిల్చొని దైవారాధన చేస్తారు - కాని వీరి ఈ ఆరాధన వలన వారు నిద్ర నుంచి దూరమవటం తప్ప వారికి దక్కేది మరేమీ లేదు.**

**(దారిమీ)**

ఈ హదీసు ద్వారా తెలిసేదేమంటే ఆచరణల స్థాయి రెండు విధాలు. ఒకటి బాహ్యాపరమైనది. అంటే వాటిని బాహ్యాపరంగా ఎలా ఆచరిస్తే అలా అవి నెరవేర్చబడతాయి. రెండవది, గోప్యమయినది. అంటే దీనిద్వారా ఆచరణ అసలు ఉద్దేశం, ఆశించబడిన దాని ఊపిరి. షరీఅత్ సూచించిన విధంగా ఏదైనా పనిచేస్తే, దాని అర్థం మీ బాధ్యతను మీరు నిర్వర్తించారన్నమాట. అంటే మీ విధిని మీరు నెరవేర్చారన్నమాట. దీని తరువాత రెండవ ఆ కారణం ఆచరణకు ఊపిరిలాంటిది. శరీరం నుంచి ప్రాణం విడిపోయినప్పుడు, చూడటానికి దేహమైతే ఉన్నదున్నట్లు కన్పిస్తుంది, అయితే తేడా ఏమంటే మొదట అందులో ప్రాణమున్నది, ఇప్పుడు అందులో ప్రాణం లేదు, తేడా అంతే. అందులో ప్రాణమున్నంత వరకు దాన్ని సమాధి చేయాలన్న తలంపు రాదు మీకు. అయితే అది చచ్చిపోతే మీరు దాన్ని మీ వద్ద ఉంచడానికి ఇష్టపడరు. అలాగే ఆచరణలకు కూడా వాటి బాహ్యాచరణ, గుప్తాచరణలుంటాయి. ఒక మనిషి షరీఅత్ చూపినవిధంగా ఆచరించకపోతే షరీఅత్ దృష్టిలో అతని ఆ ఆచరణ నిరర్థకమైనది. ఇంకా తన ఆచరణలో వాంఛించిన నిజమైన జీవాత్మ లేకపోతే దేవుని దృష్టిలో అతని ఆ ఆచరణ అవాస్తవమైనదిగా, తేలికైనదిగా తేలిపోతుంది.

ఉదాహరణకు ఒక వ్యక్తి రోజా పాటించి పగలంతా ఏమీ తినలేదు, త్రాగలేదు. కాబట్టి రోజా యొక్క బాహ్యాచరణను నెరవేర్చాడు. ఒకవేళ అతను పగలంతా దేవుణ్ణి మరచిపోయి చేయకూడని పనులన్నీ చేస్తూ పోయినట్లయితే, అతన్నుద్దేశించి అతను రోజాయే వుండలేదని అనలేము, లేదా అతని రోజా భంగమయిందనీ చెప్పలేము. రోజా స్థితిలోనే అతను అబద్ధం పలికాడు, మరొకరిపై నిందమోపడమూ చేశాడు, ఇలాంటి పరిస్థితిలో అతను రోజా కాంక్షించే అసలు ఉద్దేశ్యాన్ని నాశనం చేశాడు లేక ఖూనీ చేశాడు. ఆ విధంగా అతని రోజా నిర్జీవమైపోయింది - మృత కళేబరంలా. వాస్తవానికి ఆ వ్యక్తి తన రోజాను ఆకలిదప్పులతో గడిపాడు తప్ప మరేదీ సాధించలేదు.

ఇదేవిధంగా ఎవరైనా ఒక వ్యక్తి రమజాన్ రాత్రిళ్ళల్లో జాగరణ చేసి, దైవారాధనలో తన కాలాన్ని గడుపుతాడు. అలాంటప్పుడు అతన్నుద్దేశించి అతను జాగరణ చేయలేదని, దైవారాధన చేయలేదని అనలేము. కాని తన ఈ జాగరణ నిజ భావంలో దేవుని వైపు మరలే భావనను సృజించలేకపోతే, ఇంకా తన ఆరాధనను స్వచ్ఛంగా, నిర్మల మనస్సుతో చేయకపోతే, తన రాత్రి జాగరణ, ఆరాధన కేవలం ఒక కల్తీ ఆచరణగా, జీవాత్మలేని, ప్రాణంలేని ఆచరణగా పరిగణించబడుతుంది. దీనివలన అతనికి రాత్రి జాగరణ తప్ప మరేదీ ప్రాప్తం కాదు.

అంతే, షరీఅత్ కోరుకునేదేమంటే మీ ఆచరణలు బాహ్యాపరంగానూ, చట్టానికి లోబడి వుండాలి, ఇంకా వాటిలో వాస్తవమైన జీవాత్మ కూడా ఉండాలన్నమాట – మీ ఆచరణల వాస్తవమైన ఆత్మ ఏమిటంటే, అల్లాహ్ స్మరణ, ఆయన పట్ల ప్రేమ, ఆయన ప్రీతిని పొందేకాంక్ష, ఆయన సన్నిధిలో హాజరై జవాబు చెప్పుకోవాలన్న భావన, ఆయన భీతి, అన్ని వేళల్లోనూ ఆయన ఆదేశాలు, చట్టాల పట్ల విధేయత చూపటం, వాటిని పాలించే భావన కలిగి వుండటం – వీటన్నిటి ద్వారానే ఆచరణలో, ఊపిరి, జీవం జనిస్తాయి. ఇవి లేకుంటే బాహ్యాపరంగా కేవలం షరీఅత్ నిబంధన పూర్తవుతుంది. ఇంకా చట్ట వ్యతిరేకత నుంచి కూడా అతను బాహ్యాపరంగా తప్పించుకోగలడు. అయితే ఆచరణల్లో నిజమైన జీవాత్మకు దూరమైపోతాడు. ఫలితంగా అల్లాహ్ సన్నిధిలో అతని ఆచరణలు ఎలాంటి గౌరవానికి, మూల్యానికి నోచుకోవు.

మూడవ భాగం

## మూడు చర్యల వల్ల రోజా భంగం కాదు

٥٩- عَنْ أَبِي سَعِيدٍ الْخُدْرِيِّ قَالَ قَالَ رَسُولُ
اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: ثَلَاثٌ لَا يُفْطِرْنَ الصَّائِمَ
الْحِجَامَةُ وَالْقَيْءُ وَالْاِحْتِلَامُ (رَوَاهُ التِّرْمِذِيُّ)

**59. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : మూడు చర్యలు ఉపవాసి ఉపవాసాన్ని భగ్నం చేయవు.**

**1. పచ్నాలు (హిజామా) వేయటం, లేక వేయించుకోవటం వలన.**

**2. వాంతి చేసుకోవటం వలన.**

**3. కలలో వీర్యస్ఖలనమవటం వలన.** **(తిర్మిజీ)**

ఈ హదీసులో పేర్కొన్న వాంతి ఎలాంటిదంటే దానంతట అదే వచ్చిన వాంతి అన్నమాట. అంతేగాని మనిషి ఏదైనా అవసరం కారణంగానో, లేదా బాధ రీత్యానో నోటిలో వేళ్ళుపెట్టి లేదా మరో పద్ధతి ద్వారా చేసుకున్న వాంతి కాదన్నమాట. ఇలా బలవంతంగా వాంతి చేసినట్లయితే రోజా భంగమయిపోతుంది, ఇంకా ఖజా తప్పనిసరి అవుతుంది.

## రోజా స్థితిలో పచ్చాలు వేయించుకోవటానికి షరీఅత్ రీత్యా తగు కారణం

٦٠- عَنْ ثَابِتِ الْبُنَانِيِّ قَالَ سُئِلَ اَنَسُ بْنُ مَالِكٍ كُنْتُمْ تَكْرَهُوْنَ الْحِجَامَةَ لِلصَّائِمِ عَلٰى عَهْدِ رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ، قَالَ لَا اِلَّا مِنْ اَجْلِ الضَّعْفِ

(رَوَاهُ الْبُخَارِيُّ)

**60.** **జనాబ్ సాబిత్ బనానీ (రహ్మ) (తాబయీ = సహాబా తరువాతి వారు) ఇలా చెప్పారు : నేను హజ్రత్ అనస్ (రజి) బిన్ మాలిక్‌తో "మీరు (ఇక్కడ కొందరు సహాబాలు అని ఉద్దేశం) దైవప్రవక్త (స) గారి కాలంలో రోజాలోవున్న వ్యక్తి పచ్చాలు వేయించుకోవటాన్ని మక్రూహ్ (అవాంఛ నీయం) గా భావించేవారా?" అని అడిగారు. హజ్రత్ అనస్ (రజి) దీనికి సమాధానంగా, "లేదు, అయితే దీనివలన బలహీనత తప్పక ఏర్పడుతుందన్న ఉద్దేశంతో వాటి జోలికి పోయేవారం కాదు" అని అన్నారు.** **(బుఖారీ)**

తెలిసిందేమంటే పచ్చాలు వేయించుకోవటం వల్ల బలహీనత కలగటం ఖాయం. దీనివలన భరించలేని బాధ, నొప్పి కలిగినట్లయితే, రోజాను కూడా భంగం చేయాల్సి వస్తుందనే శంకతో ప్రవక్త (స) సహచరులు (రజి) దీనికి దూరంగా వుండేవారు. అయితే వారు పచ్చాలు వేయించటం వలన రోజా భంగమవుతుందన్న భావనను కలిగివుండేవారు కాదు.

కొన్ని హదీసుల్లో పచ్చాలు వేయటం, వేయించుకోవటం వలన ఆయా రోజుల్లోని రోజాలు భంగమవుతాయని పేర్కొనటం జరిగింది. అందువలన తాబయీన్ (రహ్మ)లు సహాబాతో సంప్రదించి మరీ ఈ విషయంలో షరీఅత్ భావన ఏమిటన్నది తెలుసుకునేవారు. ఈ హదీసులోని చర్చనీయాంశం కూడా అదే.

## రోజాలో పచ్చాలు వేయించే విషయంలో హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) గారి ఆచరణ

۶۱- عَنِ الْبُخَارِيِّ تَعْلِيقًا قَالَ كَانَ ابْنُ عُمَرَ يَحْتَجِمُ وَهُوَ صَائِمٌ ثُمَّ تَرَكَهُ فَكَانَ يَحْتَجِمُ بِاللَّيْلِ-
امام بخاری تعلیقاً

**61. ఇమామ్ బుఖారీ (రహ్మ) (ఎలాంటి ప్రమాణాధారం లేకుండా) ఇలా ఉల్లేఖించారు : హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) గారి విధానం ఏమంటే, ఆయన రోజాలో వున్నప్పుడు పచ్చాలు వేయించుకునేవారు. తరువాత ఆయన దీన్ని మానుకొని, రాత్రివేళ పచ్చాలు వేయించటం మొదలెట్టారు. (బుఖారీ)**

ఇమామ్ బుఖారీ (రహ్మ) గారి పద్ధతి ఏమిటంటే కొన్నిసార్లు ఆయన ఏదైనా సమస్యను వివరించటానికి ఎవరైనా సహాబీ లేక తాబయీ ఉల్లేఖనం లేక ఆచరణను ఎలాంటి ప్రమాణం లేకుండా పేర్కొంటారు. ఇలాంటి ఉల్లేఖనాలు లేదా ఆచరణలను హదీసులుగా పరిగణించటం జరగదు. అయితే అవి తులమానం రీత్యా నమ్మదగ్గవి గానే పరిగణించబడేవి. ఎందుకంటే ఇమామ్ బుఖారీ పరిశోధకులు. ఆయన గట్టి నమ్మకంగా పేర్కొన్నదేదైనా వాస్తవ విరుద్ధం ఎంతమాత్రం కాదు.

ఇమామ్ బుఖారీ (రహ్మ) గారి ఈ ఉల్లేఖనం ద్వారా తెలిసేదేమంటే ఒకవేళ రోజాలో పచ్చాలు వేయించుకోవటం మక్రూహ్ అయి, రోజాకు భంగం వాటిల్లితే హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఇలా చేసేవారే కాదు. పిదప పచ్చాలు పగలు వేయించుకునే బదులు రాత్రిపూట వేయించుకోసాగారు. వయస్సులో పెద్దవారవటం చేత పగలు పచ్చాలు వేయించుకోవటం వలన బలహీనత ఏర్పడటాన్ని గమనించారు.

## పుక్కిలించిన పిదప ఉమ్మిని మింగటం, ఏదైనా చెట్టు బంక లేదా గుగ్గిలం చెట్టు బంక వగైరా నమలటం గురించిన సమస్య

۶۲- عَنْ عَطَاءٍ قَالَ إِنْ مَضْمَضَ ثُمَّ أَفْرَغَ مَا فِيهِ مِنَ الْمَاءِ لَا يَضِيرُهُ أَنْ يَزْدَرِدَ رِيقَهُ وَمَا

بَقِيَ فِيْ فِيْهِ، وَلَا يَمْضَغُ الْعِلْكَ فَإِنْ ازْدَرَدَ رِيْقَ الْعِلْكِ لَا أَقُوْلُ إِنَّهُ يُفْطِرُ وَلٰكِنْ يُنْهٰى عَنْهُ.

(رَوَاهُ الْبُخَارِيُّ فِيْ تَرْجَمَةِ بَابٍ)

**62. జనాబ్ అతా (రహ్మ) (ప్రఖ్యాత తాబయీ ఇంకా గొప్ప ఫిఖహ్‌వేత్త) వివరించే సమస్య ఏమిటంటే, ఎవరైనా ఓ వ్యక్తి (రోజాలో వున్నప్పుడు) పుక్కిలించి, నోటి నుంచి నీటిని పూర్తిగా ఉమ్మివేయాలి. ఆపై ఆ వ్యక్తి తన ఉమ్మిని మింగటంలో ఎలాంటి అభ్యంతరం లేదు - అది కూడా తన నోటిలో మిగిలివున్న దానిని (అంటే ఆ నీటి ప్రభావం) మాత్రమే. ఇంకా ఆ వ్యక్తి రోజా స్థితిలో ఎలాంటి చెట్టు బంకను గానీ లేదా గుగ్గిలం కాని నమలరాదు. ఎందుకంటే దాని ప్రభావం తన ఉమ్మిలో వుండి, దానిని మింగినట్లయితే ఆ వ్యక్తి రోజా భంగమవుతుందని మాత్రం నేను అనలేను, కాని అలాంటి చేష్ట నుంచి వారించటం జరుగుతుంది. (బుఖారీ)**

ఇంతకు ముందు వచ్చిన ఉల్లేఖనంలానే దీన్ని హదీసుగా గాకుండా జనాబ్ అతా (రహ్మ) గారి ధార్మిక తీర్పు (ఫత్వా)గా పొందుపరచటం జరిగింది. దీని ఉద్దేశం ఏమిటంటే ఒకవేళ మనిషి రోజాలో పుక్కిలించి, నోటి నుంచి నీరు బయటికి ఊసిన తరువాత కూడా దాని ప్రభావం మిగిలివుండి, దాన్ని మింగినట్లైతే రోజా భంగం కాదు. నీటితో పుక్కిలించాక ఆ నీటి తేమ నోట్లో కొంచెమయినా మిగిలివుంటుందనేది అందరికీ అర్థమయ్యే విషయమే. నోటిలోని మొత్తం నీటిని ఊసేసినప్పటికీ ఎంతో కొంత ప్రభావం ఉమ్మితో పాటు లోపలికి వెళ్ళటం ఖాయం. కాని ఇది రోజాను భంగపరిచే వస్తువైతే కాదు. అయితే ఎవరైనా వ్యక్తి ఉద్దేశ్యపూర్వకంగా నోట్లో కొంచెం నీటిని నిల్వవుంచి, ఉమ్మితో పాటు ఆ నీటిని మింగినట్లయితే అతని రోజా భంగమయ్యే అవకాశం ఉంది.

ఇంకా అక్కడ బొగ్గును నమలరాదని కూడా చెప్పడం జరిగింది. మనం పళ్ళ పొడి (మంజన్) లేక టూత్ పేస్ట్ అన్న భావంలో కూడా అర్థం చేసుకోవచ్చు. ఒక వ్యక్తి నోట్లో నీరు తీసుకొని బయటికి పుక్కిలిస్తాడు. అదేవిధంగా అతను పళ్లపొడి లేక టూత్‌పేస్ట్ ఉపయోగిస్తాడు. తరువాత పూర్తిగా నోటిని శుభ్రం చేస్తాడు. అలాంటప్పుడు అతని రోజా భంగమయ్యిందని చెప్పలేం. (ఇంతకు ముందు బొగ్గ

విషయంలో చెప్పినట్లు). అయితే రోజావున్న వ్యక్తి ఇలాంటప్పుడు జాగ్రత్తలు తీసుకోవటం ఉత్తమం.

నీరు అయితే ఉమ్మితో పాటు బయటికి వచ్చేస్తుంది. కాని ఇతర వస్తువులు కొంచెం గాఢత కలిగివుంటాయి. ఎంతగా పరిశుభ్రం చేసినా నోట్లో ఎంతోకొంత మిగిలివుండే ఆస్కారం ఉంది. అది రోజాను భంగపరిచేదిగా పరిణమిస్తుంది. అయితే మిస్వాక్ విషయం దీనికి భిన్నమైనది. ఎందుకంటే దైవప్రవక్త (స) రోజాలో మిస్వాక్ చేసేవారన్న విషయం రూఢీ అయిన విషయం. అయితే మిస్వాక్‌ను కూడా ఎంతో కొంత నమలాల్సివస్తుంది, దాని రసం కూడా వెలువడుతుంది. కాని అందులో చిక్కదనం ఉండదు కాబట్టి అది నోటిలో అతుక్కుని వుండే అవకాశం లేదు. అందువలన మిస్వాక్ విషయంలో ఎలాంటి అనుమానం లేదు. అయితే ఇతర వస్తువుల విషయంలో అలా ఊహించుకోవటం కూడా భావ్యం కాదు. అందుకని బొగ్గు ఉదాహరణ ఇవ్వటం జరిగింది. ఇందులో ఒక రకమైన గాఢత వుంటుంది. అలానే మంజన్ లేదా టూత్‌పేస్ట్‌లో కూడా ఒకింత చిక్కదనం వుంటుంది. అందువలన వీటి వాడకానికి దూరంగా ఉండటమే మంచిది. ▲

ജറ്റ

---

▲ *హదీసు పాఠం తరువాత మౌలానా గారు ఒక ప్రశ్నకు జవాబిస్తూ 'రోజాలో వున్నప్పుడు టూత్‌పేస్ట్ వాడటం అభిలషణీయం కాదు, అయితే మిస్వాక్ దీనికి భిన్నమైనది' అన్నారు. (సంకలనకర్త)*

بَابُ صَوْمِ الْمُسَافِرِ

# ప్రయాణీకుని రోజా

ఈ అధ్యాయంలో ప్రయాణంలో ఉన్నప్పుడు రోజా పాటించే ఆదేశాలు విశదీకరించబడ్డాయి.

మొదటి భాగం

## ప్రయాణంలో ఉన్నప్పుడు రోజా పాటించినా, లేక పాటించకపోయినా రెండూ అనుమతించబడినవే

٦٣- عَنْ عَائِشَةَ قَالَتْ إِنَّ حَمْزَةَ بْنَ عَمْرِو
الْأَسْلَمِيَّ قَالَ لِلنَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ أَصُومُ
فِي السَّفَرِ، وَكَانَ كَثِيرَ الصِّيَامِ، فَقَالَ إِنْ شِئْتَ فَصُمْ
وَإِنْ شِئْتَ فَأَفْطِرْ. (مُتَّفَقٌ عَلَيْهِ)

**62.** హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఈ విధంగా తెలిపారు : హజ్రత్ హమ్జా (రజి) బిన్ అమ్ర్ అస్లమీ గారు దైవప్రవక్త (స)తో "నేను ప్రయాణంలో వున్నవేళ రోజా వుండవచ్చా?" అని విన్నవించుకున్నారు. దీనిపై దైవప్రవక్త (స) "మనసు కోరితే రోజా వుండు, మనసు కోరకపోతే పాటించకు" అని సెలవిచ్చారు. (ముత్తఫకున్ అలైహ్)

హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఈ ఉల్లేఖనాన్ని వివరిస్తూ ఈ విషయాన్ని కూడా సెలవిచ్చారు : 'ప్రయాణీకుడు ఎలాంటివాడు' అని ఆరాదీశారు. ఎందుకంటే ఆమె (రజి.అన్హా) ఎంతో ఉన్నత శ్రేణి ధర్మశాస్త్రజ్ఞాని. షరీఅత్‌లోని సున్నితమైన అంశాలు కూడా ఆమె దృష్టిలో వుండేవి. అందుకని ఆమె వివరంగా సెలవిచ్చారు: పృచ్ఛకులైన హజ్రత్ హమ్జా (రజి) తరచుగా రోజాలు పాటించేవారు. ఇక్కడ ఆయన గారి ప్రశ్న నఫిల్ రోజాల గురించి కాదు, ఫర్జ్ రోజాల విషయం గురించి

మాత్రమే. "రమజాన్‌లో నేను ఒకవేళ ప్రయాణం చేయాల్సివస్తే, నేను రోజాలు పాటించాల్నా లేక వద్దా?" అన్నదే ఆయన ప్రశ్న. దీనికి దైవప్రవక్త (స) "నీకు ఇష్టమైతే రోజా పాటించు లేకపోతే లేదు. రెంటిలోనూ నీకు అనుమతి ఉంది" అని సెలవిచ్చారు. ఈ విషయంలో హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) గారి వివరణ ఏమిటంటే, హజ్రత్ హమ్‌జా (రజి) గారికి తరచూ రోజాలు పాటించే అలవాటు ఉంది, కాబట్టి ఒకవేళ ఒక మనిషి సంవత్సరంలో తరచుగా రోజాలు పాటించే వాడయినప్పుడు, సాధారణ మనుషులకన్నా రోజాలో ఎదురయ్యే కష్టాన్ని తేలిగ్గా సహించగలడు. కాబట్టి ఇలాంటి వ్యక్తి ప్రయాణంలో కూడా రోజాలు పాటించి నట్లయితే, ప్రయాణంలో ఎదురయ్యే కష్టాలను, కేవలం రమజాన్‌లో మాత్రమే రోజాలుండే వ్యక్తికన్నా తేలిగ్గా ఎదుర్కోగలడని ఆమె (రజి.అన్‌హా) గారి అభిప్రాయం.

హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) గారి ఈ వివరణ వెలుగులో ఒక విషయాన్ని గ్రహించవచ్చు - ప్రయాణంలో వున్నప్పుడు రోజా పాటించాల్నా, వద్దా అన్న రెండు విషయాలూ సమాన ప్రాతిపదిక కలిగివున్నాయన్నది అసలు విషయం కాదు. ఇక్కడ చూడవలసిందేమంటే ఒక మనిషిలో కష్టాన్ని సహించేంత సహనం వుంది, మరొకరిలో అది లేదు. ఎవరిలోనయితే ఈ శక్తులున్నాయో అలాంటి వ్యక్తి రోజా వుండటంలోనే మేలుంది, మరే వ్యక్తిలోనయితే అంతటి శక్తి, సహనం లేదో అతను రోజా పాటించకుండా వుండవచ్చు.

ఈ విధంగా ప్రయాణావస్థలో వున్నప్పుడు ఎలాంటి సందర్భంలో రోజా ఉండటం ఉత్తమం, మరెలాంటి సందర్భంలో ఉండకపోవటం ఉత్తమమైందోనన్న విషయం కూడా తెలుస్తోంది. ధర్మవేత్తల్లో ఈ సమస్య గురించి భేదాభిప్రాయముంది. ఇమామ్ మాలిక్ (రహ్మా), ఇమామ్ షాఫయి (రహ్మా) ఇంకా ఇమామ్ అబూ హనీఫా (రహ్మా) ప్రయాణంలో రోజా ఉండటాన్ని ఉత్తమమని నిర్ణయించారు. రోజా పాటించకపోవటాన్ని ప్రతిఫలం రీత్యా తక్కువ స్థాయిగా నిర్ణయించారు. ఇతర ఫిఖావేత్తలు రోజా ఉండకపోవటమే మేలని నిర్ణయించారు. మరికొంతమంది మేము ఇంతకు క్రితం వివరించిన విధంగా - అంటే రోజా వుండటమనేది మనిషి ప్రయాణంలోవున్న పరిస్థితి, అతని శక్తి, సహనాలపై ఆధారపడిందన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఒక వ్యక్తిలో కష్టాన్ని ఓర్చుకునే శక్తి ఎక్కువగా ఉండి అతను చేస్తున్న ప్రయాణంలో ఎలాంటి కష్టం ఎదురయ్యే అవకాశం లేకపోతే అలాంటి సందర్భంలో అతను రోజా పాటించడమే ఉత్తమం. దీనికి ప్రతిగా ఒక వ్యక్తిలో

కష్టాల్ని ఎదుర్కొనే శక్తి లేకపోగా, అతను ప్రయాణంలో ఎదురయ్యే కష్టాలను భరించటం కూడా కష్టంగా వున్నప్పుడు అతను రోజాలు పాటించకపోవటమే ఉత్తమం.

## ప్రయాణంలో రోజా పాటించేవారు, పాటించనివారు ఒకరింకొకరిపై అభ్యంతరం తెలుపరాదు

٦٤۔ عَنْ اَبِیْ سَعِیْدِ الْخُدْرِیِّ غَزَوْنَا مَعَ رَسُوْلِ
اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ لِسِتَّ عَشْرَۃَ مَضَتْ
مِنْ شَھْرِ رَمَضَانَ فَمِنَّا مَنْ صَامَ وَمِنَّا مَنْ اَفْطَرَ
فَلَمْ یَعِبِ الصَّائِمُ عَلَی الْمُفْطِرِ وَلَا الْمُفْطِرُ عَلَی
الصَّائِمِ۔ (رَوَاہُ مُسْلِمٌ)

**64.** హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : "మేము రమజాన్ **16**వ తేదీన దైవప్రవక్త (స)తో ఒక యుద్ధం కొరకు బయలుదేరాము. అప్పుడు మాలో కొందరు రోజాలో ఉన్నారు, మరికొందరు రోజాలో లేరు. అయినా రోజా వున్నవారు లేనివారిని నిందించనూలేదు, రోజా పాటించనివారు పాటించిన వారిపట్ల ఆక్షేపణ తెలుపనూలేదు." (ముస్లిం)

ఈ హదీసులో తెలుపబడిన విషయమేమిటంటే ఒకవేళ ఎవరైనా ఒక వ్యక్తి ప్రయాణంలో రోజా పాటించకపోయినా లేక పాటించినా దీనికి ప్రతిగా వ్యవహరించే వ్యక్తి అతని పట్ల ఎలాంటి విమర్శనా భావంతో వ్యవహరించరాదు. ఎందుకంటే షరీఅత్‌లో రెండు పరిస్థితులకూ అనుమతించబడింది. కాబట్టి ఏ వ్యక్తీ మరొకరి పట్ల వ్యతిరేక భావంతో వ్యవహరించే హక్కులేదు.

ఈ వ్యవహారంలో షరీఅత్‌లోని సున్నితమైన విషయాలను అవగాహన చేసుకోవాలి. దీని ఆధారంగానే హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) ఈ సంఘటనను వివరించారు. షరీఅత్ నిబంధన ఏమిటంటే, ఒకవేళ ఎవరైనా ఒక వ్యక్తి షరీఅత్‌లో అనుమతించబడిన రెండు పద్ధతుల్లోనూ ఏదో ఒకదానిని పాటిస్తే దాని పట్ల వ్యతిరేకత చూపే హక్కు మరే వ్యక్తికీ లేదు. ఒకవేళ ఎవరైనా ఇలా వ్యతిరేకత చూపిస్తే అలాంటి వ్యక్తి షరీఅత్ స్వభావాన్ని అర్థం చేసుకోలేదు. ఇంకా వాస్తవానికి షరీఅత్‌నే తన చెప్పుచేతల్లో తీసుకోవటానికి ప్రయత్నించాడని అర్థం. షరీఅత్ అయితే ప్రజలకు

సరిసమానమైన హక్కుల్ని ప్రసాదించింది. అలాంటప్పుడు ఒక వ్యక్తి ఒక వ్యవహారానికి మరో దానిపై ఆధిక్యతనిచ్చి ఇతరులను కించపరచే ప్రయత్నం చేస్తాడు. ఈ విధంగా ప్రజల పట్ల అనవసరంగా కాఠిన్యంగా వ్యవహరించి షరీఅత్‌లో అల్లాహ్ ప్రసాదించిన అనుమతులను లాక్కోవటానికి ప్రయత్నిస్తాడు. చూడటానికి ఈ విషయం చాలా చిన్నదిగా కనిపిస్తుంది. ఒక వ్యక్తి రోజా పాటించినా పాటించకపోయినా మరొక వ్యక్తి అతన్ని దూషిస్తున్నాడు. ఇది చాలా తీవ్రమయిన విషయం. ప్రజల్లో సమానతా భావాన్ని సృజించటానికి, ఇంకా వారిలో షరీఅత్ ఆదేశాలను పాటించటానికి వాటిపట్ల విధేయులై మెలిగే భావనల్ని జనింపజేయాలి. దీనికొరకు మనిషి బాగా అర్థం చేసుకోవలసిన విషయం ఏమిటంటే ఒక వ్యక్తి దేవుడిచ్చిన అనుమతి ద్వారా ప్రయోజనం పొందుతూ వున్నప్పుడు దాన్ని వ్యతిరేకించే హక్కు మరొక వ్యక్తికి లేదు.

## భరించశక్యం కాకపోతే ప్రయాణంలో రోజా పాటించవద్దు

٦٥- عَنْ جَابِرٍ قَالَ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ فِيْ سَفَرٍ فَرَاٰى زِحَامًا وَّرَجُلًا قَدْ ظُلِّلَ
عَلَيْهِ فَقَالَ مَا هٰذَا قَالُوْا صَائِمٌ، فَقَالَ لَيْسَ
مِنَ الْبِرِّ الصَّوْمُ فِي السَّفَرِ (مُتَّفَقٌ عَلَيْهِ)

**65. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్(రజి) గారి ఉల్లేఖనం: "ఒకసారి దైవప్రవక్త (స) ప్రయాణంలో వున్నప్పుడు ప్రజలు ఒకచోట గుంపుగా ఏర్పడటాన్ని గమనించారు. వాళ్ళంతా ఒక వ్యక్తి చుట్టూ చేరి నీడ కల్పించారు. ఆపై ఆయన (స) 'ఏమిటీ విషయం?' అని ఆరా తీయగా ప్రజలు ఇలా విన్నవించారు – 'ఒక వ్యక్తి రోజాలో ఉన్నాడు, దాని కారణంగా అతనిలో బలహీనత ఏర్పడింది'. దీనిపై ఆయన (స) సెలవిచ్చారు : "ప్రయాణంలో (ఇలాంటి) రోజా వుండటం ఎలాంటి పుణ్యకార్యం కాదు."**

**(ముత్తఫకున్ అలైహ్)**

ధర్మశాస్త్రవేత్తలు ప్రయాణంలో రోజా పాటించరాదని ఈ హదీసు ఆధారంగానే పేర్కొంటారు. అయితే ఈ హదీసులో దైవప్రవక్త (స) ప్రయాణంలో రోజా వుండటాన్ని పుణ్యానికి విరుద్ధమని పేర్కొన్నట్లుగాని లేదా ఆయన (స) గారి ఈ ఉపదేశం ప్రత్యేక పరిస్థితుల్లోనే వర్తిస్తుంది అన్న విషయంగాని వివరంగా లేదు. అయితే ఇక్కడ కళ్ళ

ముందు ప్రత్యేక పరిస్థితే కన్పిస్తుంది – ఒక వ్యక్తి రోజా కారణంగా బలహీనుడైపోయాడు. తెలిసిందేమంటే అది తీవ్రమైన ఎండా కాలం. ప్రయాణం కూడా పగలే చేయటం జరిగింది. కాబట్టి దాన్ని ఆ వ్యక్తి తట్టుకోలేక పడిపోయాడు. ఆపై ప్రజలు అతని చుట్టూ చేరి నీడ కల్పించారు. ఈ పరిస్థితిని చూసిన దైవప్రవక్త (స) "ప్రయాణంలో వున్నప్పుడు ఇలాంటి రోజా ఉండటం ఎలాంటి పుణ్యకార్యమూ కాదు" అని సెలవిచ్చారు. దీని భావం ఏమిటంటే ఒక వ్యక్తి ప్రయాణంలో రోజా పాటించబోయే ముందు, అందులో ఎదురయ్యే కష్టాలను భరించే శక్తి తనలో వుందా లేదా ? లేక భరించశక్యం కాని ఎలాంటి కష్టాలైనా ఎదురవబోతున్నాయా? అనే విషయాలను స్వయంగా ఆలోచించుకోవాలన్నమాట. ప్రయాణం కూడా భారంగా తోస్తున్న పరిస్థితిలో ఒక వ్యక్తి అతి కష్టంతో రోజా పాటించడం, దానిపై కష్టాల పాలవడం ఏమాత్రం పుణ్యకార్యం కాదు.

## ప్రయాణం కష్టమని తోచినప్పుడు రోజా పాటించకపోవటమే శ్రేయస్కరం

٦٦۔ عَنْ اَنَسٍ قَالَ كُنَّا مَعَ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فِي السَّفَرِ فَمِنَّا الصَّائِمُ وَمِنَّا الْمُفْطِرُ فَنَزَلْنَا مَنْزِلًا فِي يَوْمٍ حَارٍّ فَسَقَطَ الصَّوَّامُوْنَ وَقَامَ الْمُفْطِرُوْنَ فَضَرَبُوا الْاَبْنِيَةَ وَسَقَوُا الرِّكَابَ فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: ذَهَبَ الْمُفْطِرُوْنَ الْيَوْمَ بِالْاَجْرِ۔
(مُتَّفَقٌ عَلَيْهِ)

**66.** హ్రజత్ అనస్ (రజి) గారి ఉల్లేఖనం : "మేము ఒక ప్రయాణంలో దైవప్రవక్త (స) గారితో వున్నాం. మాలో కొందరు రోజాలో వున్నారు, మరికొందరు రోజా పాటించని వారున్నారు. అత్యంత వేడిగా వున్న ఒక రోజు మేము ఒక ప్రదేశంలో విడిది చేశాము. రోజాలో వున్నవారు విడిదిలోకి వెళ్ళి పడుకున్నారు. రోజా పాటించనివారు గుడారాలను వేసి, ప్రయాణంలో వున్న ఒంటెలకు నీరు త్రాగించారు. దీనిపై దైవప్రవక్త (స) "ఈ రోజు రోజా పాటించనివారు పుణ్యఫలాన్ని జుర్రుకున్నారు" అని సెలవిచ్చారు. (ముత్తఫకున్ అలైహ్)

ఈ హదీసులో సెలవిచ్చినట్లు ప్రయాణంలో వున్నప్పుడు రోజా పాటించక పోవడమే మేల్తరమన్న విషయం వైపునకే త్రాసు బరువుగా వంగుతోంది. దీని ప్రకారం ప్రయాణంలో రోజా వుండకపోవటం ఉత్తమం. పైన వివరించిన హదీసులో ఉపవాసం పాటించేవారు ఎండ తీవ్రతకు తట్టుకోలేక వెళ్ళగానే మేను వాల్చారు. వారిలో గుడారాలు వేసే శక్తి లేకపొయ్యింది, ఇంకా ఒంటెలకు నీరూ త్రాపలేకపోయారు. అందువలన రోజాలో లేనివారు పరుల విశ్రాంతి కోసం తగు ఏర్పాటు చేశారు. ఒకవేళ వారు కూడా రోజాలో వుండివుంటే అందరికందరూ పరుండేవారు. ఆపై గుడారాలు వేసేవారు, ఒంటెలకు నీరు త్రాపేవారు లేకపోయేవారు. ఈ కారణంగానే దైవప్రవక్త (స) “ఈ రోజు రోజా పాటించనివారు పరుల విశ్రాంతి కొరకు పాటుపడి పుణ్యాలను లూటీ చేశారు” అని సెలవిచ్చారు.

ఇక ఆలోచించండి, ప్రయాణంలో వున్నప్పుడు రోజా పాటించడం ఉచితమా లేక అనుచితమా అన్న విషయంలో రెండు కోణాలకు సంబంధించిన రుజువు లున్నాయి. రెంటిలోనూ తగిన బలం వుంది. దీనిపై ఇక ప్రయాణంలో రోజా వుండటం ఉత్తమమని ఏ వ్యక్తీ గట్టిగా చెప్పలేడు, కాదు ప్రయాణంలో రోజా పాటించకపోవటమే మేలని ఏ వ్యక్తీ గట్టిగా వాదించలేడు. తేలిందేమంటే ఏ నిర్ణయం తీసుకున్నా మనిషి తన సౌకర్యం, శక్తిపై ఆధారపడి వుంది. ఈ రోజు రోజా పాటించాల్నా, మానుకోవాల్నా అనే విషయాన్ని తన పరిస్థితుల కనుగుణంగా నిర్ణయించుకోవాలి. రెండు కోణాలు సమాన ప్రతిపత్తిని కలిగివున్నాయి. నేను ప్రయాణంలో రోజా పాటించకపోతే పుణ్యాలు తక్కువయిపోతాయని, తరువాత వీటిని పూర్తిచేసుకోవాల్సివస్తే రమజాన్ రోజుల్లో ప్రాప్తమయ్యే పుణ్యాలు ప్రాప్తం కావేమో అన్న ఎలాంటి సందేహమూ అతని మనసులో వుండకూడదు. స్వయంగా అల్లాహ్యే ప్రయాణంలో రోజా పాటించకపోయినా ఫర్వాలేదని, తరువాత వాటిని ఖజా చేసుకోవచ్చున్న సౌలభ్యాన్ని కల్పించాడు. అలాంటప్పుడు తరువాత ఖజా రోజా వుంటే రమజాన్‌లో రోజా పాటించినంత పుణ్యం ప్రాప్తం కాదన్న శంక మనిషిలో ఏమాత్రం వుండరాదు. ఒకవేళ బలమైన కారణం లేకుండా రమజాన్‌లో రోజా విడిచిపెట్టినట్లయితే దాని వ్యవహారం వేరు. అలా చేస్తే రమజాన్‌లోని ఒక్క రోజా పుణ్యం మనిషి తన జీవితాంతం ఖజా పాటించినప్పటికీ దానికి సరిసమానం కాదు. ఇక్కడ వ్యవహారం పూర్తిగా భిన్నమైనది. ఇలాంటి స్థితిలో రోజా ఖజా చేయటం వలన ప్రాప్తమయ్యే పుణ్యంలో కొరత ఏర్పడుతుందన్న అనుమానం లేదు. అసలు

విషయం ఏమిటంటే మనిషి తగిన విధంగా తన పరిస్థితుల్ని బేరీజు వేసుకొని తగు నిర్ణయం తీసుకోవాలి – ఈ రోజు నేను రోజా పాటించాల్నా వద్దా అనే విషయం. రెండు కోణాల్లో తన దృష్టి ఎక్కువగా ఎటు మళ్ళుతుందో దాన్ని ఆచరించాలి. పుణ్యఫలం రీత్యా రెండూ సమానత కలిగివున్నాయి.

## గత్యంతరం లేని పరిస్థితుల్లో రోజా ముందుగానే విడవటానికి అనుమతి వుంది

٦٧- عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ خَرَجَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مِنَ الْمَدِيْنَةِ إِلَى مَكَّةَ، فَصَامَ حَتَّى بَلَغَ عُسْفَانَ، ثُمَّ دَعَا بِمَاءٍ فَرَفَعَهُ إِلَى يَدِهِ لِيَرَاهُ النَّاسُ فَأَفْطَرَ حَتَّى قَدِمَ مَكَّةَ وَذٰلِكَ فِي رَمَضَانَ، فَكَانَ ابْنُ عَبَّاسٍ يَقُوْلُ: قَدْ صَامَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَأَفْطَرَ، فَمَنْ شَاءَ صَامَ وَمَنْ شَاءَ أَفْطَرَ —— مُتَّفَقٌ عَلَيْهِ —— وَفِي رِوَايَةٍ لِمُسْلِمٍ عَنْ جَابِرٍ أَنَّهُ شَرِبَ بَعْدَ الْعَصْرِ۔

**67.** హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) గారి ఉల్లేఖనం: (మక్కా విజయం నాటి ప్రయాణ సందర్భంగా) దైవప్రవక్త (స) మదీనా నుంచి మక్కా వైపు బయలుదేరినప్పుడు ప్రయాణ మొత్తం ఆయన (స) రోజా పాటిస్తూనే 'ఉస్ఫాన్' అనే చోటికి (మదీనా మరియు మక్కాల మధ్యనున్న ఓ తీర ప్రాంతం) వరకు చేరుకున్నారు. అక్కడ ఆయన (స) నీరు తెప్పించి దాన్ని ప్రజలు కూడా చూసేలా చేతితో పైకెత్తారు. తరువాత ఆయన (స) ఇఫ్తార్ చేశారు. తరువాత మక్కా చేరేవరకు రోజా పాటించలేదు. ఇది రమజాన్ కాలంలో జరిగిన సంఘటన. దీని ఆధారంగా హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఇలా అన్నారు (అంటే ఇది ఆయన గారి ధార్మిక తీర్పు) : "దైవప్రవక్త (స) రమజాన్ మాసంలో ప్రయాణం చేసినప్పుడు ఒక్కోసారి రోజా పాటించారు, మరొకసారి పాటించలేదు.

**అందుచేత మీ కోసం కూడా ఆదేశం ఏమిటంటే, మీకు ఇష్టమైతే ప్రయాణంలో రోజాలు పాటించండి, ఇష్టం లేకపోతే పాటించకండి." (ముత్తఫకున్ అలైహి) ఇంకా ఇమామ్ ముస్లిం గారు పేర్కొన్న హదీసులో హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) గారి పదాలు "దైవప్రవక్త (స) మఖామె ఉస్ఫాన్ వద్దకు వెళ్ళి అస్ర్ తరువాత నీరు త్రాగారు" అని అదనంగా ఉన్నాయి.**

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) గారి ఈ ఉల్లేఖనంలో, దైవప్రవక్త (స) పగలు ఏ సమయంలో రోజాను విరమించారన్న విషయం వివరంగా చెప్పబడలేదు. అయితే సహీహ్ ముస్లింలో హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) గారి ఉల్లేఖనంలో అది అసర్‌వేళ అని వివరంగా తెలుపబడింది. అయితే హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) గారి ఉల్లేఖనం సారాంశం కూడా అది పగటి సమయమనే తెలుపుతోంది – అది ఉదయమయినా లేక సాయంత్రానికి ముందైనా. ఎందుకంటే ఒకవేళ దైవప్రవక్త (స) సహ్రీ కంటే ముందు నీరు త్రాగినట్లైతే దాన్ని తెలుపడంలో ఎలాంటి అర్థం లేదు. ఒకవేళ మగ్రిబ్ తరువాత త్రాగారని తెలిపినా, దాన్ని కూడా తెలిపే అవసరమూ లేదు. మొత్తం మీద హజ్రత్ జాబిర్ (రజి) గారి ఉల్లేఖనం ద్వారా అది అస్ర్ వేళ అనే విషయం రూఢీ అవుతోంది.

ఈ హదీసులో హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) గారు; దైవప్రవక్త (స) నీటిని చేత్తో పైకెత్తి సైన్యంలో వున్న వారంతా చూసేలా నీరు త్రాగారు, దీంతో ఆయన (స) రోజా కూడా విరమించారు అన్న విషయాన్ని వివరంగా తెలిపారు.

ఈ హదీసు ద్వారా తెలిసిన మరో విషయం ఏమిటంటే, ఒకవేళ ఎవరైనా రోజాలో వున్నప్పుడు, భరించశక్యం కాని పరిస్థితి ఏర్పడితే ఆ వ్యక్తి వేళకంటే ముందుగానే ఇఫ్తార్ చేయవచ్చు. ఒక కోణం ఏమిటంటే మనిషి ఏదైనా బలమైన అనివార్య కారణం వలన రోజా పాటించలేకపోవచ్చు. మరో కోణం ఏమంటే ఒక మనిషి రోజా అయితే పాటించాడు కాని ఆపై అతనికి భరించలేని పరిస్థితి దాపురించింది, అప్పుడు అతనికి రోజాను విడిచే అనుమతి వుంది. ఈ విధంగా రోజాను విడిచిపెట్టినట్లయితే అది రోజా భంగం చేసిన కోవలోకి రాదు, దానికి కఫ్ఫారా చెల్లించాల్సిన నిబంధన కూడా వర్తించదు. అయితే దీన్ని ఖజా చేయటం తప్పనిసరి అవుతుంది.

**ప్రయాణీకుడు, పాలు త్రాపించే స్త్రీ, గర్భవతికి రోజా విడిచిపెట్టే అనుమతి ఉంది**

٦٨- عَنْ اَنَسِ بْنِ مَالِكٍ الْكَعْبِيِّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اِنَّ اللّٰهَ وَضَعَ عَنِ الْمُسَافِرِ شَطْرَ الصَّلٰوةِ وَالصَّوْمَ عَنِ الْمُسَافِرِ وَعَنِ الْمُرْضِعِ وَالْحُبْلٰى - (رَوَاهُ اَبُوْدَاؤدَ وَالتِّرْمِذِيُّ وَالنَّسَائِيُّ وَابْنُ مَاجَهْ)

**68. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ క'అబియ్యా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : అల్లాహ్ ప్రయాణీకుని కొరకు నమాజ్‌లో సగభాగాన్ని తగ్గించాడు, ఇంకా ప్రయాణంలో రోజాను విడిచిపెట్టే అనుమతిని కూడా ఇచ్చాడు. ఇదే విధంగా పాలు త్రాగించే స్త్రీలకు, గర్భవతులైన స్త్రీలకు కూడా రోజా విడిచిపెట్టే అనుమతి వుంది. (అబూదావూద్, తిర్మిజీ, నసాయి, ఇబ్నెమాజా)**

సగం నమాజ్‌ను తగ్గించటమంటే 4 రకాతుల్లోని నమాజ్‌లో 2 రకాతులు మాఫీ చేయబడ్డాయి. ఇక్కడ మరో విషయాన్ని ప్రత్యేకించి చెప్పే అవసరం వుంది కాబట్టి దైవప్రవక్త (స) నమాజ్ ఆదేశాలను వివరంగా సెలవియ్యలేదు. కేవలం ప్రయాణీకుని నమాజ్‌ను సగభాగం తగ్గించటం జరిగిందని సెలవిచ్చారు (స). ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే, మూడు, రెండు రకాతుల నమాజుల్లో ఎలాంటి తగ్గింపు లేదు. నమాజ్‌లో తగ్గింపే కాకుండా ప్రయాణీకుడు రోజా వుండే కట్టుబాటును కూడా సడలించడం జరిగింది. అయితే రెంటిలో తేడా ఏమిటంటే ప్రయాణీకుడు రోజాను తప్పనిసరిగా ఖజా చేసుకోవాలి, కాని ప్రయాణంలో తగ్గించి చేసుకున్న నమాజులకు ఖజా లేదు. అంటే ప్రయాణంలో 4 రకాతులకు బదులు 2 రకాతులు నమాజ్ చేసుకొని, ఇంటికి చేరాక ప్రయాణంలో విడిచిపెట్టిన మిగతా 2 రకాతులు పూర్తి చేసుకోవాలన్నది దీని భావం కాదు.

ప్రయాణీకుడు, పాలు పట్టే స్త్రీ, గర్భవతులైన స్త్రీలకు రోజా విడిచిపెట్టే అనుమతి వుందన్న దాని భావం ఏమంటే, ఒకవేళ వారు రోజా పాటించకపోతే ఎలాంటి దోషం లేదు. అయితే ఒక ప్రయాణీకుడు ప్రయాణంలో పూర్తి నమాజ్‌లు ఆచరించటం అభిలషణీయం కాదు కాని, రోజా వుండే వ్యక్తి స్థోమతవుంటే అతను రోజా పాటించటం మేలు.

ఈ సందర్భంగా మరో విషయాన్ని కూడా గమనించాల్సి వుంది. ఎవరైనా ఒక వ్యక్తి ప్రయాణంలో రోజాను విడిచిపెట్టినట్టైతే వాటి ఖజా పూర్తి చేసుకోవాలి. ఇదేవిధంగా పాలు త్రాపించే స్త్రీ పాలు త్రాపించే కాలంలో, ఇంకా గర్భవతులైన స్త్రీలు గర్భిణిగా వున్న కాలంలో అసాధారణమైన కష్టాన్ని ఎదుర్కోవాల్సి వస్తే వారు రోజాను విడిచిపెట్టవచ్చు. వారి ఈ కాలం గడిచిపోయాక విడిచిపెట్టిన ఖజా రోజాలను పూర్తి చేసుకోవాలి.

## ప్రయాణంలో కష్టాలు ఎదురవకపోతే రోజా పాటించాలి

٦٩- عَنْ سَلَمَةَ بْنِ الْمُحَبَّقِ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ كَانَ لَهُ حَمُولَةٌ تَأْوِي إِلَى شِبَعٍ فَلْيَصُمْ رَمَضَانَ حَيْثُ أَدْرَكَهُ.

(رواه ابوداؤد)

**69. జనాబ్ సలమ బిన్ ముహబ్బఖ్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : ఒక వ్యక్తి దగ్గర ఒక మంచి వాహనం వుండి, తాను రాత్రి వరకు ఒక చోటికి చేరి అక్కడ ప్రశాంతంగా కడుపునిండా భోజనం చేయగలిగిన పరిస్థితి వుంటే, అలాంటి వ్యక్తి రమజాన్ ఎక్కడ లభించినా రోజా పాటించాలి. (అబూదావూద్)**

ప్రవక్త (స) ఇక్కడ ప్రయాణీకుణ్ణి ఉద్దేశించి సెలవిచ్చిందేమంటే ఒక వ్యక్తి ప్రయాణంలో వున్నప్పుడు, తన వద్ద వాహనం వున్నా లేకపోయినా, తన స్థితి మెరుగ్గా లేకపోయినా రోజా పాటిస్తున్నప్పుడు, తాను మగ్రిబ్ వరకు ఒక చోటికి చేరి ప్రశాంతంగా తిని త్రాగే అవకాశం లేనప్పుడు తాను రోజా పాటించకూడదు. మరో కోణంలో, అతని వద్ద మంచి వాహనం వుంది, తాను రాత్రి వరకు ఒక చోటికి చేరుకొని ప్రశాంతంగా తిని త్రాగే అవకాశం వుందన్న పూర్తి నమ్మకముంటే అలాంటి వ్యక్తి రమజాన్ కాలం ఎక్కడ లభించినా అతను రోజాను పాటించటం మొదలుపెట్టాలి.

ఇక్కడ గమనించాల్సిన విషయం **"ఫల్‌యసుమ్"** అన్న దాని అర్థం "అతను తప్పక రోజా పాటించాలి" అని కాదు. ఎందుకంటే ఈ కోవకు చెందిన ఇతర హదీసుల్ని చేర్చి చూస్తే తెలిసేదేమంటే ప్రయాణీకునిపై ఇది తప్పనిసరి కాదు, కాని అతనికి అనుమతి వుంది. అందుకని **"ఫల్‌యసుమ్"**లో క్రియారూపం గుప్తంగా

వుంది. (అంటే అతను రోజా పాటించాలి) అన్నది. అయితే దీని అర్థం తప్పనిసరి అని కాదు, ఎందుకంటే ఇతర హదీసుల్ని పరిశీలిస్తే విషయం తేటతెల్లమవుతుంది - ఒకవేళ కేవలం ఈ హదీసునే ఆధారంగా చేసుకుంటే ఒక వ్యక్తి ప్రయాణంలో వున్నప్పుడు తప్పనిసరిగా రోజా వుండాలి అనే అర్థం స్ఫురిస్తుంది. కాని ఇది అభిలషణీయం కాదు.

హదీసుల ద్వారా, అలాగే ఖుర్‌ఆన్ ద్వారా ఆదేశాలను తెలుసుకునే పద్ధతి ఏమిటంటే, ఈ అంశం తాలూకు ఎన్ని హదీసులు, ఆయత్‌లున్నాయో వాటిని మనిషి జమచేసి వాటి సంగ్రహాన్ని, సారాంశాన్ని గ్రహించాలి. ఖుర్‌ఆన్‌లోని ఏదో ఒక ఆయత్‌ను ఆధారంగా తీసుకొని ఆదేశాన్ని జారీచేసేందుకు ప్రయత్నం చేసే మనిషి పొరబడేందుకు ఆస్కారం వుంది. అందుకని ఖుర్‌ఆన్‌లో ఈ అంశానికి సంబంధించిన ఇతర ఆయత్‌లలో కూడా ఏమని సెలవియ్యబడిందో పరిశీలించాలి. ఇదే విషయం హదీసుకు కూడా వర్తిస్తుంది. కేవలం ఏదో ఒక హదీసును ఆధారంగా చేసుకొని ఆదేశాన్ని జారీ చేసే బదులు, ఈ అంశానికి సంబంధించి దైవప్రవక్త (స) గారి వేరితర బోధనలేమిటి? అన్న దాన్ని కూడా క్షుణ్ణంగా పరిశీలించాలి. ఒకవేళ ఒక వ్యక్తి కేవలం ఇదే హదీసును దృష్టిలో వుంచుకొని ఆదేశం జారీచేస్తే, మంచి వాహనం లభించిన ప్రయాణీకుడు తప్పక రోజా పాటించాలనే అంటాడు. ఎందుకంటే దైవప్రవక్త (స) "ఫల్‌యసుమ్' అని సెలవిచ్చారు. అయితే ఇలా చెప్పటం ఏమాత్రం అభిలషణీయం కాదు. ఎందుకంటే ఇతర హదీసుల్లో వివరణాత్మకమైన పదాలతో తెలియజేయబడింది - ప్రయాణంలో రోజా విడిచిపెట్టే అనుమతి వుంది అని. అందుకనే ఇక్కడ **"ఫల్‌యసుమ్"** అన్న పదాలకు "అతను రోజా వుండటం ఉత్తమం" అని అనబడింది.

ఖుర్‌ఆన్ మరియు హదీసుల్లో ఈ ఆచరణపై అనేక ఉదాహరణలున్నాయి. ఒక మాటను ఆదేశంగా పేర్కొనటం జరిగింది. అంటే దాన్ని క్రియారూపంగా పేర్కొనటం జరిగింది. అయితే దాని అర్థం తప్పనిసరిగా చేయాలన్నది కాదు. ఉదాహరణకు, అల్ మాయిదా సూరాలో సెలవియ్యబడింది : **"ఇజా హలల్‌తుమ్ ఫస్‌తాదూ"** (ఆయత్ : 2) "ఇహ్రామ్ విడిచిన తరువాత మీరు వేటాడవచ్చు" - ఇక్కడ కేవలం **"ఫస్‌తాదూ"** (వేటాడండి) అన్న ఒక్క పదాన్నే తీసుకుంటే దాని అర్థం "మనిషి ఇహ్రామ్ విడవగానే ముందుగా వేటాడాలి" అని వస్తుంది. వాస్తవంగా చూస్తే దీని అర్థం అది కాదు. వాస్తవానికి దీని ఉద్దేశం, 'ఇహ్రామ్ స్థితిలో వున్నప్పుడు వేటాడటానికి మీకు అనుమతి లేదు' అన్నది. అయితే ఇక్కడ ఇహ్రామ్ విడిచిన పిదప

మీరు వేటాడవచ్చు అన్నదాంట్లో క్రియారూపం దాగివుంది కాని, తప్పనిసరి అన్న భావంలో కాదు. దీనివలన తెలిసేదేమంటే కేవలం క్రియారూపం వలన "తప్పనిసరి" అని రూఢీ కాదు.

## మక్కా విజయం నాటి ప్రయాణంలో ప్రవక్త (స) ఇఫ్తార్ చేసిన సంఘటన

٧٠- عَنْ جَابِرٍ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
خَرَجَ عَامَ الْفَتْحِ اِلٰى مَكَّةَ فِىْ رَمَضَانَ فَصَامَ حَتّٰى
بَلَغَ كُرَاعَ الْغَمِيْمِ فَصَامَ النَّاسُ ثُمَّ دَعَا بِقَدَحٍ
مِنْ مَّاءٍ فَرَفَعَهٗ حَتّٰى نَظَرَ النَّاسُ اِلَيْهِ ثُمَّ شَرِبَ
فَقِيْلَ لَهٗ بَعْدَ ذٰلِكَ اِنَّ بَعْضَ النَّاسِ قَدْ صَامَ
فَقَالَ اُولٰٓئِكَ الْعُصَاةُ، اُولٰٓئِكَ الْعُصَاةُ. (رَوَاهُ مُسْلِمٌ)

**70.** హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) గారి ఉల్లేఖనం : దైవప్రవక్త (స) మక్కా విజయం నాటి సంవత్సరం రమజాన్ నెలలో మదీనా నుంచి మక్కాకు బయలుదేరినప్పుడు దారి పొడుగునా ఆయన (స) రోజా పాటిస్తూ చివరకు 'కురాఅల్ నయీమ్"▲ అనే చోటికి చేరుకున్నారు. ఇతర ప్రజలు మామూలు ప్రకారం రోజా పాటించారు. ప్రవక్త (స) ఒక పాత్రలో నీరు తెమ్మని చెప్పారు. ఆపై ఆయన (స) ఆ నీటి పాత్రను అందరూ చూసేలా పైకెత్తి అందరూ చూస్తుండగానే ఆ నీటిని త్రాగారు (అంటే రోజా విరమించారు). దాని తరువాత కొంతమంది ఆయన (స) వద్దకు వెళ్ళి "ఇంకా కొంతమంది రోజాలోనే వున్నారు" అని విన్నవించుకోగా, దానిపై ఆయన (స) "వారు అవిధేయులు, వారు అవిధేయులు" అని సెలవిచ్చారు. (ముస్లిం)

దైవప్రవక్త (స) మక్కా విజయ ఉద్యమంపై ప్రయాణం చేసినప్పుడు అది రమజాన్ కాలం. ఇంకా అది ఎండాకాలం. ఆయన (స) దీర్ఘ ప్రయాణాన్ని

---

▲ కురాఅల్ నయీమ్ మదీనా మరియు మక్కాల మధ్య వున్న ఒక స్థలం. ఇది ఉస్ఫాన్ ప్రాంతానికి దగ్గరలో వుంది.

కొనసాగిస్తూ వెళ్తున్నప్పుడు ప్రజలతో అది పెద్ద ఉద్యమంలా తయారయ్యింది. ప్రజలు బలహీనులైపోతే యుద్ధం చేయలేరేమోనన్న అనుమానం కలిగింది. ఈ తలంపు వల్ల కూడా తనను అనుసరించి రోజా విరమిస్తారనే ఉద్దేశ్యంతో ఆయన (స) బహిరంగంగానే రోజాను విరమించారు. ఈ సందర్భంగా ఆయన (స) "మీరు రోజా విడవవచ్చు" అని ప్రజలకు సమాచారం పంపలేదు. కాని స్వయంగా ఆయన (స) అందరి ముందే ఒక ఆచరణ చేశారు – దాన్ని చూసి ప్రజలు కూడా రోజా విరమించాలని. అయితే ఈ రోజు అయితే దీనికి క్షమాపణ లభించింది. కాని దీని తరువాత ప్రజలు రోజా విరమించని సమాచారం ఆయన (స)కు అందజేయబడింది. దీనిపై ఆయన "వారు అవిధేయులు, వారు అవిధేయులు" అని సెలవిచ్చారు.

దీని అంతరార్థం ఏమిటంటే, దైవప్రవక్త (స) అల్లాహ్ ప్రసాదించిన ఒక వినాయింపుతో ప్రయోజనం పొందినప్పుడు, వీళ్ళెవరు? దాని అవసరం లేదని తలచటానికి? దీని అర్థం ఏమిటంటే ఈ ప్రజలు ఎంత మితిమీరిన ధీమాతో వున్నారంటే "మేమైతే చాలా ఉన్నత స్థానంలో వున్నాం, మాకు ఇలాంటి వినాయింపు ద్వారా ప్రయోజనం పొందే అవసరం కూడా లేదు" అని తలపోశారన్నమాట. అందుకనే ఆయన (స) "వారు అవిధేయులైన ప్రజలు" అని సెలవిచ్చారు.

ఇక్కడ స్పష్టంగా గ్రహించాల్సిన విషయం, దీని ఉద్దేశ్యం ఏమిటంటే ఒకవేళ రమజాన్ కాలంలో ఎవరైనా ఒక వ్యక్తికి క్లిష్టతర పరిస్థితి ఎదురైనప్పుడు రోజాను విరమించకపోతే అతను పాపాత్ముడవుతాడు అన్నది. ప్రవక్త (స) గారి బోధన ఉద్దేశ్యం ఏమంటే "నేను రోజా విరమించాను, ఆపై ఇతరులు రోజాను విరమించక పోవటమన్నది ఒక అవిధేయ చర్య" అన్నది. స్పష్టంగా తెలిసేదేమంటే దైవప్రవక్త (స) ఏ భావనతో అయితే బహిరంగంగా ఇఫ్తార్ చేశారో, దాన్ని చూసి ఇతరులు కూడా ఈ విషయంలో ఆయన (స) ను అనుసరించి విధేయత చూపాలన్నది.

## ప్రయాణంలో (క్లిష్టతర పరిస్థితి ఎదురయ్యే అనుమానముంటే) రోజా వుండటం భావ్యం కాదు

۱۷۔ عَنْ عَبْدِ الرَّحْمٰنِ بْنِ عَوْفٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: صَائِمُ رَمَضَانَ فِي السَّفَرِ
كَالْمُفْطِرِ فِي الْحَضَرِ۔ (رَوَاهُ ابْنُ مَاجَةَ)

**71. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు: ప్రయాణంలో వున్నప్పుడు రమజాన్ ఉపవాసం (రోజా) పాటించే వ్యక్తి, ఇంటిపట్టున వుండి రోజా పాటించని వ్యక్తిలాంటి వాడు. (ఇబ్నెమాజా)**

ఒక వ్యక్తి ఇంటిపట్టునే వుండి ఎలాంటి కారణం లేకుండా రమజాన్ రోజాలను విడిచిపెట్టడాన్ని ఎలా తప్పుగా భావించబడుతుందో, అలాగే ప్రయాణంలో వున్న వ్యక్తి తనను తాను కష్టాలపాల్జేసుకుని రోజా వుండటం కూడా మంచిదికాదు. దీని అర్థం రెండు ఆచరణల స్థితి, స్థానం ఒక్కటే అన్నది ఎంతమాత్రం కాదు. దీని ఉద్దేశం ఏమంటే ఒక వ్యక్తి ఇంటిపట్టునే వుండి కూడా రోజా పాటించకపోవటం పొరపాటు, అలాగే ప్రయాణంలో వుండి రోజా పాటించటం కూడా పొరపాటే. అయితే ప్రయాణంలో వున్న మనిషికి క్లిష్టతర పరిస్థితి ఎదురైనప్పుడే ఇది వర్తిస్తుంది. లేకపోతే ఇంతకు ముందు పేర్కొనబడిన హదీసుల ప్రకారం దైవప్రవక్త (స) స్వయంగా ప్రయాణంలో రోజా పాటించారని తెలుస్తోంది. ఇంకా ప్రవక్త సహచరులు (సహాబా - రజి) కూడా రోజా పాటించారు. ఇంకా సదృశంగా ఎలాంటి పరిస్థితి సంభవించిందంటే ఒక ప్రయాణంలో కొంతమంది సహాబా (రజి) రోజా పాటించారు, మరికొంతమంది పాటించలేదు.

అందుకని అసందర్భం కాదనుకుంటే అన్ని హదీసుల వెలుగులో ఈ హదీసులో పేర్కొనబడిందేమంటే ప్రయాణంలో మనిషికి క్లిష్ట పరిస్థితులు ఎదురౌతున్న శంక కలిగినట్లయితే రోజా వుండటం మంచిది కాదు. ఒక మనిషి ఇంటి పట్టున వుండి కూడా రోజా పాటించకుండా ఉండటం ఎంత తప్పో ఇదీ అంతే తప్పు. ఎందుకంటే ఈ విషయం ముందే వచ్చింది. ఇంటిపట్టున వుండి ఎలాంటి కారణం లేకుండా రోజాను పాటించని వ్యక్తి, తరువాత జీవితాంతం రోజా పాటించినా దానికి సరిరాదు. కాని ఒకవేళ ప్రయాణంలో రోజా ఉంటే అది అంతగా తీవ్రమైన పొరపాటుగా నిర్ణయించబడదు.

## ప్రయాణంలో రోజా విడిచిపెట్టే అనుమతి అల్లాహ్‌చే ప్రసాదించబడిన ఒక వెసులుబాటు

٧٢- عَنْ حَمْزَةَ بْنِ عَمْرٍو الْأَسْلَمِيِّ أَنَّهُ قَالَ يَا رَسُولَ اللهِ إِنِّيْ أَجِدُ بِيْ قُوَّةً عَلَى الصِّيَامِ فِي السَّفَرِ فَهَلْ عَلَيَّ جُنَاحٌ، قَالَ هِيَ رُخْصَةٌ مِنَ اللهِ عَزَّ وَجَلَّ فَمَنْ أَخَذَ بِهَا فَحَسَنٌ، وَمَنْ أَحَبَّ أَنْ يَصُوْمَ فَلَا جُنَاحَ عَلَيْهِ - (رَوَاهُ مُسْلِمٌ)

**72. హజ్రత్ హమ్‌జా బిన్ అమ్ర్ అస్లమీ (రజి) చెప్పారు : నేను దైవప్రవక్త (స)తో - "ఓ దైవప్రవక్తా (స)! నేను ప్రయాణంలో కూడా రోజా పాటించే శక్తిని కలిగి వున్నాను. ఒకవేళ ఆ స్థితిలో రోజా పాటిస్తే పాపాత్ముడనవుతానా?" అని విన్నవించాను. దానిపై దైవప్రవక్త (స) సెలవిచ్చారు : "ఇదైతే మహోన్నతుడైన అల్లాహ్ తరఫు నుంచి ప్రసాదించబడిన ఒక అనుమతి. ఎవరైనా ఒక వ్యక్తి ఈ అనుమతి ద్వారా ప్రయోజనం పొందినట్లైతే ఇది మంచి విషయమే. అయినా ఎవరైనా రోజా వుండటాన్నే ఇష్టపడినట్లయితే అందులో ఎలాంటి దోషమూ లేదు."**

**(ముస్లిం)**

ఇది ఈ అధ్యాయంలో పేర్కొనబడిన చివరి హదీసు. వాస్తవంగా చెప్పాలంటే ఒక మనిషిలో శక్తి వుండి, పరిస్థితులు కూడా అనుకూలంగా వుంటే ప్రయాణంలో కూడా అతను రోజా పాటించడం ముమ్మాటికీ సముచితమే. అందులో ఎలాంటి సందేహం లేదు. ఒకవేళ అతను ప్రయాణంలో రోజా పాటించే శక్తిలేదని, పైగా ప్రయాణంలో కష్టాలు ఎదురౌతాయన్న అనుమానం వున్న పరిస్థితులలో రోజా పాటించకుండా అల్లాహ్ ప్రసాదిత అనుమతి ద్వారా ప్రయోజనం పొందవచ్చు. ఎందుకంటే అల్లాహ్ ఏదైనా విషయంలో వినాయింపు ఇస్తే మనిషికి శ్రేయస్కరమైనదేమంటే అతను దాని ద్వారా ప్రయోజనం పొందాలి.

꧁꧂

بَابُ الْقَضَاءِ

# ఖజా అధ్యాయం

(ఈ అధ్యాయంలో ఖజా రోజాలకు సంబంధించిన ఆదేశాలు వివరించబడ్డాయి).

మొదటి భాగం

## రమజాన్ ఖజా రోజాలను షాబాన్ నెల మొదటి పదిహేను రోజుల చివర్లో కూడా పాటించవచ్చు

٧٣- عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ يَكُونُ عَلَيَّ الصَّوْمُ مِنْ
رَمَضَانَ فَمَا أَسْتَطِيعُ أَنْ أَقْضِيَ إِلَّا فِي شَعْبَانَ -
قَالَ يَحْيَى بْنُ سَعِيدٍ تَعْنِي الشُّغْلُ مِنَ النَّبِيِّ أَوْ
بِالنَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ (مُتَّفَقٌ عَلَيْهِ)

73. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఇలా ఉల్లేఖించారు: రమజాన్ ఉపవాసాల లోని కొన్నింటిని (ఖజాగా) పాటించాల్సిన బాధ్యత నాపైన ఉండేది. అయితే షాబాన్ నెలలో తప్ప మిగతా రోజుల్లో ఈ ఖజా రోజాలను పూర్తి చేయలేకపోయేదాన్ని. ఈ హదీసుకు చెందిన మరో ఉల్లేఖనకర్త యహ్యా బిన్ సయీద్ (రజి) దీని వివరణ ఇలా పేర్కొన్నారు. ఆమె (రజి.అన్హా) ఉద్దేశ్యంలో దీని భావం ఏమిటంటే దైవప్రవక్త (స) గారి సేవలో ఆమె నిమగ్నమవటం వల్ల షాబాన్ కంటే ముందు ఈ ఖజా రోజాలను పూర్తిచేయలేకపోయేవారు. (ముత్తఫకున్ అలైహి)

ఇంతకు ముందు వచ్చిన ఓ హదీసులో షాబాన్ నెల పదిహేనవ తేదీ తరువాత ఎలాంటి రోజా వుండరాదని దైవప్రవక్త (స) సెలవిచ్చారు. (షాబాన్ నెల ప్రారంభంలో దానికి అనుమతి వుంది). ఎందుకంటే షాబాన్ నెల చివరి రోజుల్లో కూడా రోజా పాటించినట్లయితే దౌర్బల్యం ఏర్పడి రమజాన్ రోజాలు పూరించలేకపోవచ్చు.

వాస్తవానికి మనిషి షాబాన్ నెలలో నఫిల్ రోజాలుంటాడు. రమజాన్‌లో వ్యవహారం ఫరజ్ రోజాలకు చెందినది. ఇక్కడ హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) సెలవిస్తున్న దేమంటే, 'నేను ఖజా రోజాలను షాబాన్ నెలలో పూరించేదాన్ని. ఎందుకంటే మిగతా పది నెలల్లో కూడా పనుల వత్తిడి వలన తీరిక వుండేది కాదు. వాటిని వాయిదా వేసుకుంటూ పోగా చివరకు షాబాన్ నెల వచ్చేది' అని. అయితే ఆమె (రజి) గారు ఈ రోజాలను షాబాన్ నెల పదిహేనవ తేదీకంటే ముందు పాటించేవారా లేదా తరువాతనా? అన్న విషయం వివరంగా తెలుపలేదు. కాని హదీసునుబట్టి అంచనా వేసి చూస్తే ఆమె (రజి.అన్‌హా) ఈ ఖజా రోజాలను షాబాన్ పదిహేనవ తేదీ తరువాతనే పూరించారని తెలుస్తోంది. దీన్నిబట్టి తెలిసిన విషయం వాస్తవానికి ఈ ఖజా రోజాలు విధిగా పాటించాల్సిన రోజాలు. ఇవి నఫిల్ రోజాలు కావు. అందువలన వాటిని ఆ రోజుల్లో కూడా పూర్తి చేసుకోవచ్చున్నమాట.

## నఫిల్, ఖజా రోజాలు పాటించే ముందు భార్య, భర్త అనుమతి తీసుకోవాలి

۷۴۔ عَنْ اَبِیْ ھُرَیْرَۃَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ
عَلَیْہِ وَسَلَّمَ، لَایَحِلُّ لِلْمَرْاَۃِ اَنْ تَصُوْمَ وَزَوْجُھَا
شَاھِدٌ اِلَّا بِاِذْنِہٖ، وَلَا تَاْذَنَ فِیْ بَیْتِہٖ اِلَّا بِاِذْنِہٖ۔
(رَوَاہُ مُسْلِمٌ)

**74. హజ్రత్ అబూ హురైరా (రజి) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : ఒక స్త్రీ కొరకు – భర్త ఇంటిపట్టున వున్నప్పుడు అతని అనుమతి లేకుండా రోజాలు వుండటం సముచితం కాదు. ఇంకా భర్త అనుమతిస్తే తప్ప ఆమె పరాయి వ్యక్తిని ఇంట్లో ప్రవేశించ టానికి కూడా అనుమతినివ్వరాదు. (ముస్లిం)**

ఈ హదీసులో దైవప్రవక్త (స) గారి ప్రబోధనం ద్వారా తెలిసేమంటే భర్త ఇంటిపట్టునే వుండగా ఒక స్త్రీ భర్త అనుమతి లేకుండా రోజాలు పాటించడం ధర్మసమ్మతం కాదు. నఫిల్ రోజాలనుద్దేశించి లేక ఖజా రోజాల గురించి ఇలా చెప్పి వుండవచ్చు (ఇక్కడ ఈ హదీసు ప్రబోధనం కూడా ఈ 'ఖజా అధ్యాయం'లో పేర్కొనటం జరిగింది). ఎందుకంటే ఖజా రోజాలు పదకొండు నెలల్లోపు ఎప్పుడైనా

పూర్తి చేసుకునే అవకాశం వుంది. అందువలన స్త్రీ ముందు తన భర్త నుంచి అనుమతి పొందాలి. అంతేగాని భర్త అనుమతి లేనిదే ఆమె (నఫిల్) రోజాలు పాటించటం సముచితం కాదు – అవి నఫిల్ లేక ఖజా రోజాలైనా సరే. ఎందుకంటే కొన్ని పరిస్థితుల్లో భర్తకు ఇది కష్టంగా పరిణమించవచ్చు. ఇలాంటి విషయాల కారణంగా భార్యాభర్తల మధ్య భేదాభిప్రాయాలు రావచ్చు లేక కనీసం భర్త మనసులో భార్యపట్ల అయిష్టత జనించే అవకాశం ఉంది. ఇది షరీఅత్ దృష్ట్యా అభిలషణీయం కాదు. భార్యాభర్తల మధ్య సుహృద్భావ సంబంధాలు నెలకొనాలని షరీఅత్ కోరుతుంది, ఒకవేళ వారిరువురి సంబంధాలు సరిగా లేకుంటే మున్ముందు వాటి ఫలితాలు చేదుగా మారవచ్చు. అందుకనే షరీఅత్ దంపతుల మధ్య ఎలాంటి పొరపొచ్చాలు జనించకూడదని భావిస్తుంది. కొన్ని పరిస్థితుల్లో భార్య పాటించే రోజా (అది నఫిల్ లేక ఖజా రోజా అయినా) భర్తకు ఆమె అహంకారంగా అనిపిస్తుంది. అలాంటప్పుడు రోజా తాలూకు తన నోటిద్వారా అనరాని మాటలు పలికే అవకాశం ఉంది. దీని కారణంగా భార్యాభర్తల సంబంధాల్లో అరుచి జనిస్తుంది, పైగా ఆ మనిషి కూడా పాపాత్ముడవుతాడు. అందువలన రోజా పాటించే ముందు భార్య భర్త అనుమతి తీసుకోవటం సముచితం. అయితే రమజాన్ రోజాల విషయం దీనికి భిన్నమైనది. రమజాన్ రోజాలు పాటించటానికి భార్య భర్త అనుమతిని తీసుకోవలసిన అవసరం లేదు. ఎందుకంటే రమజాన్ రోజాలు విడిచిపెట్టే ప్రసక్తే తలెత్తదు.

## బహిష్టు అయిన స్త్రీ రోజాను ఖజా చేసుకోవటం తప్పనిసరి అవుతుంది కాని నమాజులను కాదు

٧٥۔ عَنْ مُعَاذَةَ الْعَدَوِيَّةِ اَنَّهَا قَالَتْ لِعَائِشَةَ،
مَا بَالُ الْحَائِضِ تَقْضِي الصَّوْمَ وَلَا تَقْضِي الصَّلٰوةَ
قَالَتْ عَائِشَةُ، كَانَ يُصِيبُنَا ذٰلِكَ فَنُؤْمَرُ
بِقَضَاءِ الصَّوْمِ وَلَا نُؤْمَرُ بِقَضَاءِ الصَّلٰوةِ۔
(رَوَاهُ مُسْلِمٌ)

**75.** ఒక తాబయీ (ప్రవక్త –స– సహచరులను చూసిన) స్త్రీ "ముఅజతల్ అదవియ (రహ్మ)" ఇలా తెలిపింది : నేను ఒకసారి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారితో విన్నవించుకున్నాను – "ఇదేమి విచిత్రం, బహిష్టు

**అయిన ఒక స్త్రీ రుతుకాలంలో విడిచిపెట్టిన రోజాలను ఖజా చేస్తుంది. అయితే విడిచిపెట్టిన నమాజ్‌లను పూరించదు." దీనిపై హ|జ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) సమాధానంగా సెలవిచ్చారు – "దైవప్రవక్త (స) గారి కాలంలో మాకు రోజాలను ఖజా చేసుకునే ఆదేశమైతే ఇవ్వబడేది కాని, నమాజ్‌లు ఖజా చేసుకోవాలని ఎలాంటి ఆదేశమూ ఇవ్వబడేది కాదు." (ముస్లిం)**

ఇక్కడ మీరు గమనించే వుంటారు. ప్రశ్నించే స్త్రీ కారణాలను గురించి విచారిస్తుంది – బహిష్టు అయిన స్త్రీ రుతుకాలంలో విడిపోయిన రోజాలను ఖజా చేస్తున్నప్పుడు మరి విడిపోయిన నమాజ్‌ల ఖజాను ఎందుకు చేయదు? అని. అయితే హ|జ్రత్ ఆయిషా (ర.అ) దీనికి జవాబుగా సెలవిచ్చారు : "ఆదేశం ఇదే" అని. ఈ ఆదేశంలో ఔచిత్యం దాగివుంది. ఆలోచిస్తే అది అర్థమవుతుంది. హ|జ్రత్ ఆయిషా (ర.అ) సెలవిచ్చినట్లు, చట్టం మరియు ఆదేశం ఇదే. దీన్ని కాదని కారణం మీకు అర్థమయినా, కాకున్నా మీ కర్తవ్యం ఆదేశాలను పాటించటమే. పైగా ఇది ఒక ముస్లింకు ఉండవలసిన మొదటి లక్షణం. ఒకవేళ అతను నాకు అందులోని ఔచిత్యం అర్థమయినప్పుడే నేను ఆదేశాన్ని పాటిస్తాను అంటే అసలు అతను ముస్లిమే కాదు. ఒక వ్యక్తి అల్లాహ్‌ను విశ్వసించి దైవప్రవక్త (స) దైవదౌత్యాన్ని అంగీకరించిన మీదట, దైవ గ్రంథం పూర్తిగా సత్యమైనదని నమ్మిన తరువాత దాని ఆదేశాలను పాలించడం, విధేయత చూపడం అతని తప్పనిసరి కర్తవ్యం. అంతేగాని ప్రతి ఆదేశంలో దాగిన ఔచిత్యం, కారణం అతనికి అర్థమవ్వాలన్న షరతు ఏమీ లేదు, పైగా ఇతరులు దానిని గురించి అతనికి అర్థమయ్యేలా చెప్పే అవసరమూ లేదు. అల్లాహ్ ఆదేశం తన ముందుకు వచ్చినప్పుడు ఒక ముస్లింగా దాని పట్ల అతను శిరోధార్యత చూపాలి.

ఈ హదీసుకు సంబంధించినంత వరకు ఇందులో ప్రబోధించిన ఆదేశంలోని ఔచితి తేలిగ్గా అర్థమవుతుంది. ఐదుపూటల నమాజ్ తప్పనిసరిగా చేయాలన్నది తెలిసిన విషయమే. ఇక మీరే ఆలోచించండి, బహిష్టు అయిన స్త్రీ రుతుకాలంలో ఎనిమిది లేక పది రోజుల వరకు నమాజ్‌ను విడిచిపెట్టాల్సి వస్తుంది. ఆమెకు ఈ కాలంలో తప్పిపోయిన 40 లేక 50 నమాజ్‌లు ఆమెపై ఖజా అయిపోతాయి. వీటిని ఆమె తరువాత పూర్తిచేయాల్సి వుంది. ఇవి ఆమెకు చాలా భారంగా మారవచ్చు. అందువల్లనే అల్లాహ్ ఈ విషయంలో రాయితీ ప్రసాదించి, వాటి ఖజాను తప్పనిసరి చేయలేదు. దీనికి ప్రతిగా రోజాల విషయం ఏమిటంటే, అవి సంవత్సరంలోని ఒక

నెలలో మాత్రమే విధిగా చేయబడ్డాయి. అవి ఖజా అయినప్పుడు సంవత్సరంలోని మిగతా ఏ నెలలో అయినా వాటిని పూరించవచ్చు. నమాజ్‌కు మినహాయింపు ఇచ్చినట్లుగా వీటి విషయంలో వినాయింపు లేదు. ఇది స్పష్టమైన విషయమే. హజ్రత్ ఆయిషా (ర.అ) గారు తలచుకుంటే ఆ ప్రశ్నించిన స్త్రీకి ఈ ఆదేశంలో దాగిన ఔచితిని, కారణాన్ని తెలిపేవారే. కాని ఆమె (ర.అ) ఇందులో దాగిన విజ్ఞతను చూపేబదులు ఆజ్ఞాపాలన గురించే నొక్కి చెప్పారు.

**మరణించిన మనిషికి చెందిన ఖజా రోజాలు అతని సంరక్షకుని బాధ్యతగా మారతాయా?**

٧٦۔ عَنْ عَائِشَةَ قَالَتْ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ مَاتَ وَعَلَيْهِ صَوْمٌ صَامَ عَنْهُ وَلِيُّهُ۔ (مُتَّفَقٌ عَلَيْهِ)

**76. హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : ఒక వ్యక్తికి కొన్ని ఖజా రోజాలు పాటించవలసి వున్న స్థితిలో మరణం సంభవిస్తే అతని సంరక్షకుడు ఆ రోజాలను పాటించాలి. (ముత్తఫకున్ అలైహ్)**

ఇదొక సమస్యాత్మక ఫిఖహ్ చర్చ. ఖజా రోజాలు మిగిలివున్నప్పుడు ఒక వ్యక్తికి మరణం సంభవిస్తే అతని సంరక్షకుడు వాటిని తప్పక పూర్తి చేయాల్నా? లేదా? ఈ విషయం తాలూకు అనేక హదీసులున్నాయి. వాటిలో భిన్నాభిప్రాయా లున్నాయి. అందువలన ఈ హదీసు విషయంలో కూడా తర్కం జనిస్తుంది. పైగా ఫిఖహ్ (ధర్మశాస్త్రం) పంథాలు కూడా వేర్వేరుగా వున్నాయి. ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మా) ఈ హదీసు ఆధారంగా వ్యక్తం చేసిన ధర్మాభిప్రాయం ఏమంటే, ఒక వ్యక్తి మరణించినప్పుడు అతని తాలూకు మిగిలివున్న ఖజా రోజాలను అతని సంరక్షకుడు పూర్తి చేయాలి. కాని ఇమామ్ అబూ హనీఫా (రహ్మా), ఇమామ్ మాలిక్ (రహ్మా) ఇంకా ఇమామ్ షాఫియా (రహ్మా) దీనిపై ఏకాభిప్రాయం కలిగిలేరు. ఈ ఇమాములు ఈ హదీసును రద్దు చేయలేదు కాని దీనిపై భావాన్వయం చేస్తారు. మొదట వీరి దృష్టిలో అవి రమజాన్ రోజాలే కానవసరం లేదు, అవి జీవితానికి సంబంధించిన ఎలాంటి రోజాలైనా కావచ్చు. (అంటే ఒకవేళ ఒక వ్యక్తి నా ఫలానా

పని పూర్తయితే నేను ఇన్ని రోజాలుంటానని మొక్కుకున్నాడని అనుకుందాం. పని నెరవేరింది. అయితే మొక్కు పూర్తి అయ్యే ముందే అతను మరణించాడు. అప్పుడూ అతని సంరక్షకుడు ఆ రోజాలను పూర్తిచేయగలడు. మరో అర్థంలో ఇవి తప్పనిసరిగా పూరించాలన్న క్రియారూపంలో లేవు. (ఇంతకు ముందు కూడా ఒక హదీసు తాలూకు ఇదే విషయం పేర్కొనబడింది). అందువలన ఇక్కడ కూడా అతని సంరక్షకుడు ఆ రోజాలను పాటించవచ్చని చెప్పబడింది. మూడో అర్థంలో ఈ విషయం తాలూకు వచ్చిన ఇతర హదీసుల ద్వారా తెలిసేదేమంటే ఈ హదీసు వాటికంటే ముందే పేర్కొనబడింది. అందువలన ఈ ఫిఖ్‌హ్‌వేత్తల అభిప్రాయంలో ఈ ఆదేశం రద్దు చేయబడిందని భావించబడుతుంది.

ఈ పరంపర తాలూకు ఇతర హదీసులు మున్ముందు రాబోతున్నాయి.

రెండవ భాగం

## మరణించిన వ్యక్తి ఖజా రోజాలకు బదులుగా నిరుపేదలకు భోజనం పెట్టే విషయం

۷۷ - عَنْ نَافِعٍ عَنِ بْنِ عُمَرَ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: مَنْ مَاتَ وَعَلَيْهِ صِيَامُ شَهْرِ رَمَضَانَ فَلْيُطْعَمْ عَنْهُ مَكَانَ كُلِّ يَوْمٍ مِّسْكِيْنٌ.

(رَوَاهُ التِّرْمِذِيُّ وَقَالَ: وَالصَّحِيْحُ أَنَّهُ مَوْقُوْفٌ عَلَى ابْنِ عُمَرَ)

**77. జనాబ్ నాఫె (రహ్మ) గారు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ద్వారా ఉటంకించారు : దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు, "ఒక వ్యక్తి మరణించిన సమయాన అతని రమజాన్ రోజాలు ఇంకా మిగిలివుంటే అతని తరఫున ప్రతి రోజాకు బదులుగా ఒక నిరుపేదవానికి అన్నం పెట్టాలి (అంటే దాని పరిహారంగా ఇవ్వాలి)." (తిర్మిజీ)**

ఇమామ్ తిర్మిజీ (రహ్మ) దృష్టిలో ఇది దైవప్రవక్త (స) గారి ప్రబోధన కాదు, ఇది హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) గారి ధార్మిక తీర్పు మాత్రమే. అంటే దీనిని ప్రవక్త (స) సెలవిచ్చినట్లు రూఢీ లేదు. పైగా పటిష్టమైన ఆధారాలతో పేర్కొనబడిన ఉల్లేఖనాల ద్వారా తెలిసిందేమంటే ఇది హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) గారి స్వంత అభిప్రాయం. వీరి ధార్మిక తీర్పు ఏమంటే, ఒకవేళ ఎవరైనా వ్యక్తికి చెందిన రమజాన్ రోజాలు ఇంకా మిగిలివుండగా మరణం సంభవిస్తే,

అతని తరఫున పరిహారం (ఫిదియా)గా నిరుపేదకు అన్నం తినిపించాలి. ఈ ఫిదియా అతని జీవితకాలంలో కూడా చెల్లించవచ్చు. ఖుర్‌ఆన్‌లో పేర్కొన్న ఆదేశం ఏమిటంటే ఎవరైనా వ్యక్తి రోజా పాటించకుండా అనారోగ్యం వగైరాలతో మరణిస్తే ఫిదియా చెల్లించాలి. అంటే ప్రతి రోజాకు బదులు ఒక నిరుపేదకు అన్నం పెట్టాలి. ఉదాహరణకు అతను అనారోగ్యంగా వున్నప్పుడు అన్నం తినిపించలేకపోయాడు. ఆపై మరణించాడు. తరువాత అతని సంరక్షకుడు ఆ వ్యక్తి ఫిదియా రూపేణ ప్రతి రోజాకు బదులు ఒక నిరుపేదకు అన్నం పెట్టాలి.

ఒకవేళ దీనిని దైవప్రవక్త (స) గారి ప్రబోధనగా పరిగణిస్తే ఇది పై హదీసుకు వ్యతిరేకమవుతుంది. దాని ద్వారా ఆదేశించబడిందేమంటే అలాంటి వ్యక్తి సంరక్షకుడు ఆ వ్యక్తి తరఫున రోజాలు పాటించాలి. కాని దీనిని హ(జత్ ఇబ్నె ఉమర్ గారి ఉవాచగా భావిస్తే దాని అర్థం, హ(జత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) గారి ఈ ఫత్వా ప్రవక్త (స) గారి ప్రబోధనకు వ్యతిరేకం. మరి చూడబోతే ఇదొక తప్పనిసరి ఆచరణ. ఒకవేళ ఆయన జ్ఞానపరిధిలో సంరక్షకుడు రోజాలు పాటించాలన్నదే ప్రవక్త (స) గారి ప్రబోధన అయివున్నట్లయితే ఆయన (రజి) ఏమాత్రం దానికి వ్యతిరేకంగా ఫత్వా ఇచ్చేవారు కాదు. అందుకనే ధర్మశాస్త్రవేత్తలు దీనికి వ్యాఖ్యానంగా ఏం చెబుతారంటే ఒకవేళ సంరక్షకుడు రోజా పాటించాలన్న నియమం పూర్వ హదీసుల్లో వున్నప్పటికీ తరువాత అది రద్దు చేయబడింది. లేదా దానిలో క్రియారూపం తప్పనిసరి కాదు అన్న అర్థాన్ని గ్రహించారు. అయితే దీనిద్వారా కేవలం సంరక్షకుడు రోజా పాటించవచ్చు అన్న అనుమతి స్ఫురిస్తుంది. ఈ పరంపరలో మూడవ హదీసు రాబోతోంది.

మూడవ భాగం

## ఎవరైనా ఒక వ్యక్తి ఇతరులకు బదులు రోజా పాటించటం గానీ, ఇంకా నమాజ్ ఆచరించటం గానీ చేయలేదు

٨٧۔ عَنْ مَالِكٍ، بَلَغَهُ أَنَّ ابْنَ عُمَرَ كَانَ يُسْئَلُ هَلْ
يَصُومُ أَحَدٌ عَنْ أَحَدٍ أَوْ يُصَلِّيْ أَحَدٌ عَنْ أَحَدٍ، فَيَقُولُ
لَا يَصُومُ أَحَدٌ عَنْ أَحَدٍ وَلَا يُصَلِّيْ أَحَدٌ عَنْ أَحَدٍ۔
(رَوَاهُ مَالِكٌ فِي الْمُوَطَّأ)

**78. ఇమామ్ మాలిక్ (రహ్మ) గారు తన వద్దకు ఈ సమాచారం అందినట్లు పేర్కొన్నారు : హ(జత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (ర.అ) గారితో "ఎవరైనా ఒక వ్యక్తి ఇతరులకు బదులుగా రోజా పాటించవచ్చా? లేదా ఇతరులకు బదులుగా నమాజ్ ఆచరించవచ్చా" అన్న విషయమై ప్రశ్నించగా, ఆయన ఈ విధంగా బదులిచ్చేవారు : "ఏ వ్యక్తీ ఇతరులకు బదులు రోజా పాటించనూలేదు, నమాజ్ ఆచరించనూలేదు." (మాలిక్ – రహ్మ)**

దీనిద్వారా తెలిసేదేమంటే హ(జత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (ర.అ) గారి ఈ ఫత్వా ప్రవక్త (స) గారి ఏ హదీసుకూ వ్యతిరేకంగా పరిణమించదు. ఎందుకంటే ఒక వ్యక్తి యొక్క సంరక్షకుడు అతనికి బదులుగా రోజా పాటించాలన్న ప్రవక్త (స) గారి ఆజ్ఞను ఊహామాత్రంగానయినా సమ్మతించినట్లయితే, అది తన వరకు చేరలేదంటే దాని అర్థం అది ప్రవక్త సహచరుల కాలం. అనేకమంది సహాబాతో ప్రవక్త (స) ఇలా ఆదేశించేవారని అన్నప్పుడు తమరు ఈ ఫత్వా ఎలా ఇస్తున్నారు? అని వారు అడిగి వుండేవారు. కాని వారితో ఎవరూ ఇలా ప్రశ్నించలేదు. అంటే సర్వ సాధారణంగా (సహాబా) అనుచరులందరికీ తెలిసిన విషయం ఏమంటే ఎవరి ఖజా రోజాల బాధ్యత కూడా మరొకరిపై తప్పనిసరి గావించబడలేదు – అతను తన కుమారుడైనప్ప టికినీ.

ꕤ

## بَابُ صِيَامِ التَّطَوُّعِ

# స్వచ్ఛంద రోజాల అధ్యాయం

**"తతవ్వా"** అని అంటే తన ఇష్టపూర్వకంగా స్వచ్ఛందంగా ఒక పనిని నిర్వర్తించడం అని అర్థం. ఇది ఫర్జ్ కాదు. ఫర్జ్ అంటే దాన్ని తప్పకుండా చేయాలన్న నిబంధనతో కూడుకున్నది. తతవ్వా అంటే మనిషి స్వయంగా ఇష్టపడి చేసే పని అన్నమాట. తనపై విధిచేయబడని లేదా తప్పనిసరి చేయబడని ఆచరణ అన్నమాట. కాబట్టి **"సియాము తతవ్వా"** అంటే ఉద్దేశం నఫిల్ రోజాలు. ఈ అధ్యాయంలో వాటి గురించే ప్రస్తావించటం జరిగింది.

మొదటి భాగం

## ప్రవక్త (స) అన్ని నెలలకన్నా ఎక్కువగా నఫిల్ రోజాలను షాబాన్ నెలలోనే పాటించేవారు

٧٩۔ عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ يَصُوْمُ حَتّٰى نَقُوْلَ لَا يُفْطِرُ وَيُفْطِرُ
حَتّٰى نَقُوْلَ لَا يَصُوْمُ، وَمَا رَأَيْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى
اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِسْتَكْمَلَ صِيَامَ شَهْرٍ قَطُّ اِلَّا
رَمَضَانَ، وَمَا رَأَيْتُهٗ فِيْ شَهْرٍ اَكْثَرَ مِنْهُ صِيَامًا فِيْ
شَعْبَانَ، وَفِيْ رِوَايَةٍ قَالَتْ: كَانَ يَصُوْمُ شَعْبَانَ
كُلَّهٗ كَانَ يَصُوْمُ شَعْبَانَ اِلَّا قَلِيْلًا۔ (مُتَّفَقٌ عَلَيْهِ)

**79.** హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా తెలిపారు : దైవప్రవక్త (స) ఒక్కోసారి ఎడతెగని రోజాలు పాటించేవారు. అప్పుడు మేము ఇక ఆయన (స) రోజాలు విరమించరేమో అని తలచేవారం. అలాగే ఒక్కోసారి రోజాలు పాటించేవారు కాదు. అప్పుడు మేము ఇక ఆయన (స) రోజాలు

**పాటించరేమో అని భావించేవాళ్ళం. ప్రవక్త (స) ఏ నెలలోనూ పూర్తిగా రోజాలను పాటించడం నేను చూడలేదు - ఒక్క రమజాన్ తప్ప. ఇంకా షాబాన్ నెలలో తప్ప మరే నెలలోనూ ఎక్కువ రోజాలు పాటించడం కూడా నేను చూడలేదు. మరో ఉల్లేఖనంలో షాబాన్ నెలలో ఆయన (స) రోజాలు పాటించని రోజులు అతి తక్కువగా ఉండేవని పేర్కొనటం జరిగింది. అంటే షాబాన్ నెలంతా రోజాలు పాటించేవారన్నమాట.**

**(ముత్తఫకున్ అలైహ్)**

ఈ హదీసులో హజ్రత్ ఆయిషా (ర.అ) ప్రవక్త (స) గారి నఫిల్ రోజాల గురించి పేర్కొన్నారు. రాబోయే హదీసుల్లో మీకు ప్రవక్త (స) గారి రోజాల గురించి తెలిపిన వివిధ ఉల్లేఖనాలు లభిస్తాయి. వీటిద్వారా నఫిల్ రోజాల తాలూకు ఆయన (స) గారి ఆచరణ ఎలా వుండేదో తెలిసివస్తుంది. ఇక్కడ హజ్రత్ ఆయిషా (ర.అ) గారు తెలిపిందేమంటే, ఆయన (స) ఒక్కోసారి రోజాలే వుండేవారు కాదు. మరో మాటలో చెప్పాలంటే నవాఫిల్ రోజాల తాలూకు ఆయన (స) ఒక నిర్ధారిత పద్ధతిని అవలంబించేవారు కాదు.

హజ్రత్ ఆయిషా (ర.అ) తెలిపిన మరోమాట ఏమిటంటే రమజాన్ తప్ప మరే నెలలోనూ ఆయన పూర్తిగా రోజా పాటించలేదు. అయితే షాబాన్ నెలలో మాత్రం తతిమ్మా నెలలకన్నా ఎక్కువ రోజులు రోజా పాటించేవారు. అంటే షాబాన్ నెలలో ఎంతగా రోజాలు పాటించేవారంటే పూర్తి నెల రోజులూ రోజా పాటించారా అనిపించేది. ఈ విషయాన్ని ప్రత్యేకంగా ఎందుకు ప్రస్తావించడం జరిగిందంటే షాబాన్ నెల సగం రోజులు గడిచాక, ఎవరూ నఫిల్ రోజాలు పాటించరాదని సెలవిచ్చియున్నారు. ఎందుకంటే దీనిద్వారా మనిషి బలహీనుడైపోతే దాని ప్రభావం రమజాన్ రోజాలపై పడుతుంది. అయితే ఖజా రోజాలు పాటించేవారు, ఏదైనా మొక్కుబడి రోజాలు పాటించే వ్యక్తులు దీన్నుండి మినహాయించబడ్డారు, లేదా మరికొంతమంది ఇలాంటి ప్రత్యేక రోజుల్లోనే నఫిల్ రోజాలను పాటించే అలవాటు వున్నవారు కూడా వీటి నుంచి మినహాయించబడ్డారు. ఇలాంటి ప్రత్యేక వినాయింపు రోజుల్లో తప్ప ప్రవక్త (స) గారి ఈ సాధారణ హితవు కేవలం ఇతర వ్యక్తులకు వర్తిస్తుంది. ఆయన (స) సంప్రదాయం ఏమంటే షాబాన్ నెలలో సాధ్యమైనన్ని ఎక్కువ రోజులు ఉపవాసాలు పాటించేవారు.

## రమజాన్‌లో తప్ప దైవప్రవక్త (స) ఇతర నెలల్లో పూర్తి నెల రోజులు రోజా పాటించేవారు కారు

٨٠۔ عَنْ عَبْدِ اللّٰهِ بْنِ شَقِيْقٍ قَالَ قُلْتُ لِعَائِشَةَ اَكَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَصُوْمُ شَهْرًا كُلَّهٗ، قَالَتْ مَا عَلِمْتُهٗ صَامَ شَهْرًا كُلَّهٗ اِلَّا رَمَضَانَ وَلَا اَفْطَرَهٗ كُلَّهٗ، حَتّٰى يَصُوْمَ مِنْهُ، حَتّٰى مَضٰى لِسَبِيْلِهٖ۔
(رَوَاهُ مُسْلِمٌ)

**80.** జనాబ్ అబ్దుల్లాహ్ బిన్ షఖీఖ్ (రహ్మ) తెలిపారు : నేను హజ్రత్ ఆయిషా (ర.అ) గారితో దైవప్రవక్త (స) ఏదైనా నెలలో పూర్తిగా రోజాలు పాటించేవారా? అని ఆరా తీశాను. దానిపై హజ్రత్ ఆయిషా (ర.అ) సెలవిచ్చారు, 'రమజాన్‌లో తప్ప ఇతర ఏ నెలలో అయినా పూర్తిగా రోజాలు పాటించినట్లు నా దృష్టిలో లేదు. అదేవిధంగా ఒక్క రోజా అయినా పాటించకుండా ప్రవక్త (స) ఏ నెలనైనా విడిచిపెట్టారన్న విషయం కూడా నా జ్ఞాన పరిధిలో లేదు. ఈ సంప్రదాయం ఆయన (స) చివరి ప్రస్థానం వరకూ కొనసాగింది.' (ముస్లిం)

దీని ఉద్దేశం ఏమంటే ప్రాపంచిక జీవితం ముగిసేవరకు ప్రవక్త (స) రమజాన్ తప్ప మరే నెలలోనూ పూర్తి రోజాలు పాటించలేదు, ఇంకా ఎలాంటి రోజాలు పాటించకుండా ఏ నెలనూ విడిచిపెట్టలేదు.

## షాబాన్ నెల చివరి రెండు రోజుల ఉపవాసం గురించి

٨١۔ عَنْ عِمْرَانَ بْنِ حُصَيْنٍ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَنَّهٗ سَاَلَهٗ اَوْ سَاَلَ رَجُلًا وَعِمْرَانُ يَسْمَعُ فَقَالَ : يَا اَبَا فُلَانٍ اَمَا صُمْتَ مِنْ سَرَرِ شَعْبَانَ، قَالَ لَا، قَالَ : فَاِذَا اَفْطَرْتَ فَصُمْ يَوْمَيْنِ
(مُتَّفَقٌ عَلَيْهِ)

**81.** హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : ప్రవక్త (స) ఒక వ్యక్తిని విచారిస్తూ వుండగా

**నేను విన్నాను. (తరువాతి ఉల్లేఖనకర్తల అభిప్రాయంలో ఈ ప్రశ్న ప్రవక్త (స) గారు ఇతరులతో అన్నట్లు ఉన్నది) ఓ ఫలానా వ్యక్తీ! నీవు షాబాన్ నెలలోని చివరి రెండు రోజుల ఉపవాసాలు పాటించలేదా? దానికా వ్యక్తి 'లేదు' అని సమాధానమివ్వగా, ఆపై ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: 'నీవు ప్రస్తుత రమజాన్ రోజాలు పూర్తి చేసుకున్నాక, వేరే ఇతర రెండు రోజుల ఉపవాసాలు (వాటికి బదులుగా) పాటించాలి'.**

**(ముత్తఫకున్ అలైహ్)**

ఈ ఉల్లేఖనంలో ప్రవక్త (స) ప్రశ్నించింది ఎవరిని అన్న ప్రశ్న తలెత్తింది. తరువాతి ఉల్లేఖనకర్తలకు 'నాతో ప్రవక్త (స) ఇలా ప్రశ్నించార'ని చెప్పిన హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) గారి మాటలు గుర్తుకు రాలేదు. లేదా వేరే వ్యక్తితో ఈ విషయం గురించి ప్రశ్నిస్తున్నప్పుడు నేను విన్నాను అన్న విషయం కూడా కావచ్చు. మొత్తంమీద ప్రవక్త (స) గారు సెలవిచ్చినట్లు హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) ఉల్లేఖించారన్నది రూఢీఅయ్యింది. ఈ ఉల్లేఖనం ద్వారా తెలిసిందేమంటే ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) గారి ద్వారా ఈ హదీసును ఉల్లేఖించినవారు ధర్మవేత్త కాకపోవచ్చు. అందుకని ఆయన ఈ విషయాన్ని స్పష్టపరచలేదు – అసలు ప్రవక్త (స) ఆయనతో ఎందుకు ఇలా ప్రశ్నించారు? ఇంకా ఆ రోజాలు పాటించమని ఎందుకు తాకీదు చేశారు? షాబాన్ నెల చివరి రెండు రోజుల రోజాలను పాటించడం తప్పనిసరి అని, ఒకవేళ ఒక వ్యక్తి ఈ రోజాలను పాటించనట్లయితే తరువాతి రోజుల్లో ఖజా తప్పనిసరి అవుతుందా? అన్న విషయం స్పష్టంగా తెలియని కారణంగా ఇలాంటి అపార్థం తప్పక జనిస్తుంది.

వేరే ఉల్లేఖనం ద్వారా తెలిసే విషయమేమంటే ప్రవక్త (స) ప్రశ్నించిన ఆ వ్యక్తి ఖజా రోజాలు లేక మొక్కుబడి రోజాలు పూర్తి చేసుకోవాల్సి వుండింది, లేక ఆ రోజుల్లో ఆ వ్యక్తి నఫిల్ రోజాలు పాటించే అలవాటు వున్నవాడైనా కావచ్చు, ఇతర వ్యక్తులు వివిధ సందర్భాలలో పద్ధతుల్లో నఫిల్ రోజాలను పాటించినట్లు కొంతమంది ప్రతి నెల మధ్యలో మూడు రోజుల నఫిల్ రోజాలను పాటిస్తారు. మరికొందరు వేరేదినాల్లో పాటిస్తారు. లేక ఆ వ్యక్తి నెలలోని చివరి రెండు రోజుల రోజాలు పాటించే సంకల్పం చేసుకొని అయినా వుండవచ్చు. ప్రవక్త (స) ఆయనతో ఇలా ప్రశ్నించడానికి కారణం ఇదే అయి వుండవచ్చు. ఇంకా అవి ఖజా రోజాలు లేక మొక్కుబడి రోజాలు అయి, వాటిని అతను పూరించాలన్న విషయం ప్రవక్త (స) గారికి తెలిసివుండవచ్చు లేక ఆ రెండు రకాల రోజాల విషయమై ఆ వ్యక్తి తయారీ చేసుకొని వుండవచ్చు. అందుకనే ప్రవక్త (స) ఆయనతో ఈ ఫలానా రోజాలు

పాటిస్తున్నావా? అని ప్రశ్నించి వుండవచ్చు. ఇక స్వయంగా ఆ వ్యక్తి ఈ రోజాలను పాటించకపోవటానికి కారణం కూడా చాలా తేలిగ్గా అర్థమవుతుంది. దైవప్రవక్త (స) షాబాన్ 15వ తేదీ తరువాత రోజాలు ఉండకూడదని హితవు పలికినందున ఆయన (స) ఆ రోజుల్లో రోజా పాటించడం మానుకొని వుండవచ్చని తెలుస్తోంది. అందుకని ప్రవక్త (స) ఆ వ్యక్తికి సమస్యను సావధానపరచడానికి 'ఏమిటి? నీవు ఆ రోజుల్లో రోజాలు పాటిస్తున్నావా?' అని ప్రశ్నించివుండవచ్చు. అప్పుడు ఆ వ్యక్తి 'లేదు' అని చెప్పినప్పుడు, ప్రవక్త (స) "ఇక వాటికి బదులుగా ఇతర దినాల్లో రోజాలు పాటించాలి, దీనివలన నీవు తయారీ చేసుకున్న విధంగా అవి పూరించాలి (లేక నీ బాధ్యతలో వున్న మొక్కుబడి లేక ఖజా రోజాలు పూర్తి చేయబడాలి)" అని సెలవిచ్చివుండవచ్చు.

ఇదే ఈ హదీసులో దాగిన అంతరార్థం అయివుండవచ్చు. అలాకాక షాబాన్ నెలలోని చివరి రెండు రోజుల రోజాలను తప్పక పాటించాలని, ఒకవేళ పాటించకపోతే వాటి ఖజా తప్పనిసరి అవుతుందన్న విషయాన్ని వేరితర హదీసులలో రూఢీ పరచలేదు, లేదా ఫిఖా పండితులు దీని పట్ల సుముఖంగా లేరు.

## ముహర్రం నెలలోని రోజాలు ఇంకా తహజ్జుద్ నమాజ్ ప్రాశస్త్యం

۸۲ - عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: أَفْضَلُ الصِّيَامِ بَعْدَ رَمَضَانَ شَهْرُ اللهِ الْمُحَرَّمُ وَأَفْضَلُ الصَّلوٰةِ بَعْدَ الْفَرِيضَةِ ... صَلوٰةُ اللَّيْلِ - (رَوَاهُ مُسْلِمٌ)

**82. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : రమజాన్ తరువాత అన్నిటికన్నా శ్రేష్ఠమైన రోజాలు ముహర్రం నెల రోజాలు. ఫర్జ్ నమాజుల తరువాత శ్రేష్ఠమైన నమాజ్ "సలాతుల్లైల్" (తహజ్జుద్ నమాజ్). (ముస్లిం)**

ముహర్రం రోజాల గురించి ముస్ముందు పలు హదీసులు రాబోతున్నాయి. వీటిద్వారా దైవప్రవక్త (స) ఆషూరా (ముహర్రం 10వ తేదీ) నాటి రోజాను తప్పనిసరి చేసుకునేవారని, ఇంకా ముహర్రం నెలలో ఎక్కువగా రోజాలు పాటించేవారని తెలుస్తోంది. ఇక్కడ అవగతమైన మరో విషయం ఏమిటంటే రమజాన్ తరువాత

మిగతా అన్ని నెలల కంటే ముహర్రం నెలలో పాటించే రోజాలు శ్రేష్ఠమైనవి. దీనికి అనేక కారణాలుండవచ్చు. కాని దాన్ని గురించి వివరించటం జరగలేదు. అందువలన ముహర్రం నెలలోని నఫిల్ రోజాలు ఇతర నెలలకన్నా శ్రేష్ఠమైనవని పూర్తి నమ్మకంతో చెప్పలేము.

ఈ హదీసులో మరోమాట రాత్రిపూట ఆచరించే నమాజ్ గురించి సెలవియ్యడం జరిగింది. రాత్రి నమాజ్ అంటే తహజ్జుద్ నమాజ్. దీనిని మనిషి రాత్రివేళ నిశ్శబ్దంగా, గోప్యంగా ఆచరిస్తాడు. దీని విషయం స్వయంగా ఆ మనిషికీ దేవునికీ తప్ప మరొకరికి తెలియదు. ఫర్జ్ నమాజ్ తరువాత ఈ నమాజ్ దేవుని దృష్టిలో ఎంతో శ్రేష్ఠమైనదిగా, ఇష్టకరమైనదిగా పరిగణించటం జరిగింది.

శ్రేష్ఠత విషయానికివస్తే ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే ఒక సందర్భంలో ఒక విషయాన్ని శ్రేష్ఠమైనదిగా చెప్పడం జరుగుతుంది, మరో సందర్భంలో మరోదాన్ని శ్రేష్ఠమైనదిగా పేర్కొనటం జరుగుతుంది. వాస్తవానికి ఇందులో ఎలాంటి వైరుధ్యం, వ్యాఘాతం ఉండదు. కొన్ని పనుల శ్రేష్ఠత గురించి హదీసుల్లో వచ్చిన వివరాలు, ముఖ్యంగా ప్రజలకు వాటిపట్ల అవగాహన, శ్రద్ధ కల్పించడానికే అలా చెప్పటం జరిగింది. ఫలానా పని చేస్తే ఇంత పుణ్యం దొరుకుతుందని, మరో పని చేస్తే అది శ్రేష్ఠమైనదని పేర్కొనటంలో కూడా అదే ఉద్దేశం దాగి ఉంది. ఈ సందర్భంగా ఈ పని గురించి చెప్పిన తీరు, పద్ధతికి కారణం ఏమిటంటే, ప్రజల్లో దాని పట్ల మక్కువ జనించాలని మరికొన్ని సందర్భాల్లో ఒకేసారి అనేక పనుల గురించిన శ్రేష్ఠతను చాటే పదాలు వుపయోగించబడ్డాయి. దాని ఉద్దేశ్యం ఈ పనికన్నా మరేదీ శ్రేష్ఠమైనది, ఉత్తమమైనది లేదని చెప్పటం కాదు. వాస్తవానికి అనేక పనులు, ఆచరణలు వాటి వాటి సందర్భాల్లో గొప్పవే. ఉదాహరణకు, ఇక్కడ ముహర్రంలో నఫిల్ రోజా పాటించడం చాలా శ్రేష్ఠమైనదని సెలవియ్యటం జరిగింది. మరోచోట అరఫా (అంటే జిల్ హజ్జహ్ 9వ తేదీ) నాటి రోజా ఎంతో శ్రేష్ఠమైనదని చెప్పటం జరిగింది. వాస్తవానికి ఈ రెండు విషయాల్లో ఒకటి మరొకదానితో ఎలాంటి వైరుధ్యం కలిగి లేదు. దాని అర్థం అరఫా నాటి రోజా కూడా ఎంతో శ్రేష్ఠమైనదని చెప్పటమే. ఇంకా ముహర్రం (ఆషూరా రోజు) నాటి రోజా కూడా శ్రేష్ఠమైనదే. ఇదేవిధంగా ఫర్జ్ నమాజ్ తరువాత అన్నిటికంటే శ్రేష్ఠమైనది 'సలాతుల్లైల్' అంటే తహజ్జుద్ నమాజ్ అని పేర్కొనటం జరిగింది. దీని ఉద్దేశం ఇతర ఏ నమాజూ శ్రేష్ఠమైనది కాదు అని లేక తక్కువ శ్రేష్ఠత కలది అని చెప్పటం కాదు. ఇలా భావించటం సరియైనది కాదు. హదీసుల్లో "ముఅక్కిద

సున్నత్"లు ఎంతో శ్రేష్ఠమైనవని అనేకసార్లు పేర్కొనటం జరిగింది. అందువలన 'ముఅక్కిద సున్నత్' నమాజులు కూడా ఘనమైనవే. అదేవిధంగా తహజ్జుద్ నమాజ్ కూడా. రెంటిలో కూడా శ్రేష్ఠత దాగివుందని చెప్పటం రెంటి మధ్య వైరుధ్యం ఏర్పరచటం కానేకాదు.

ఫర్జ్ నమాజ్‌ల తరువాత తహజ్జుద్‌లో శ్రేష్ఠత వుందని చెప్పటానికి కారణం, ఫర్జ్ నమాజ్ అయితే ఇస్లామ్ మూలాధారాల్లో ఒకటి. ఇస్లాంకు మూలాధారాన్ని స్థాపించటానికి ఫర్జ్ నమాజ్‌ను బహిరంగంగా, పకడ్బందీ పద్ధతిలో నెరవేర్చటం అత్యంతావసరం. ఎందుకంటే ఇది వినా ఇస్లాం కట్టడం నిల్చోలేదు. అందువల్లనే ధర్మవ్యవస్థలో నమాజ్‌కు ఎంతో ప్రాధాన్యత చేకూరింది. దీనికి ప్రతిగా తహజ్జుద్ నమాజ్‌ను ఎంతో గోప్యంగా ఆచరించటం జరుగుతుంది. మనిషిలో అల్లాహ్ పట్ల గట్టి సంబంధం, అత్యధిక ప్రేమ, నిష్కల్మషమైన విశ్వాసం లేనంతవరకు, మనిషి రాత్రిళ్లలో లేచి నిశ్శబ్దంగా ఈ తహజ్జుద్ నమాజ్‌ను ఎవరికీ తెలియకుండా రహస్యంగా ఆచరించటం సాధ్యం కాదు. అసాధారణమైన శ్రద్ధాభక్తులు, దైవచింతన లేకపోతే ఇది సాధ్యం కాదు. ఫర్జ్ నమాజ్‌లో అయితే ప్రదర్శనాబుద్ధి కన్పించే అవకాశం వుంది. ఎందుకంటే మనిషి తగు ఏర్పాటు, తయారీ చేసుకొని నమాజ్ కొరకు మస్జిద్‌కు వెళతాడు. 'ఇతను నమాజ్ చేసే మనిషి' అని ప్రజలకు తెలియజెప్పే ఉద్దేశం కూడా అతని ఆచరణలో దాగి వుండవచ్చు. అయితే తహజ్జుద్ నమాజ్‌లో దీని అవకాశం లవలేశమైనా లేదు. తహజ్జుద్ నమాజ్‌నయితే అల్లాహ్‌తో గట్టి సంబంధం, నిష్కల్మష విశ్వాసం, దైవప్రేమ వున్నవాడే ఆచరించగలడు. అతను ప్రజల్లో పేరు ప్రఖ్యాతులు పొందాలన్న ఉద్దేశంతో కాక, అల్లాహ్ ప్రీతిని పొందే అభిలాషియై వుంటాడు. అందువల్లనే తహజ్జుద్ నమాజ్‌కు అంతటి ఘనమైన శ్రేష్ఠత వుంది.

ఇక్కడ ఆషూరా (ముహర్రం 10వ తేదీ) నాటి ఘనతకు కారణం హజ్రత్ హుసైన్ (రజి) ఆ రోజు అమరగతి పొందటం కాదు. ఈ రోజు ఘనతను గురించి పూర్వకాలం నుంచే ప్రస్తావించటం జరుగుతూ వస్తోంది. అంటే హజ్రత్ మూసా (అ) కాలం నుంచే దీన్ని పేర్కొంటూ రావటం జరుగుతోంది. వేరితర కొన్ని ఉల్లేఖనాల ద్వారా తెలుస్తున్నదేమంటే, హజ్రత్ మూసా (అ) జాతి వారికి ఫిర్ఔన్ దౌర్జన్యాల నుండి విముక్తి లభించిన రోజు అది. అందువలన హజ్రత్ మూసా (అ) కృతజ్ఞతాపూర్వకంగా, క్రమం తప్పకుండా ఆ రోజు రోజా పాటించేవారు. ఇది హజ్రత్ మూసా (అ) గారి సంప్రదాయం కావటాన దైవప్రవక్త (స) కూడా ఆషూరా రోజున రోజా పాటించడాన్ని శ్రేష్ఠతరంగా నిర్ణయించారు, ఇంకా ఆ రోజును

పాటించాలని హితవు పలికారు. మున్ముందు మరో హదీసులో దీని తాలూకు మరొక వివరణ రాబోతోంది.

### ఆషూరా (ముహర్రం 10వ తేదీ) రోజాలోని శ్రేష్ఠత

٨٣- عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ مَا رَأَيْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ يَتَحَرّٰى صِيَامَ يَوْمٍ فَضَّلَهٗ عَلٰى غَيْرِهٖ
اِلَّا هٰذَا الْيَوْمَ يَوْمَ عَاشُوْرَاءَ وَهٰذَا الشَّهْرَ يَعْنِيْ شَهْرَ
رَمَضَانَ ۔ (مُتَّفَقٌ عَلَيْهِ)

**83. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) శ్రేష్ఠత రీత్యా ఏ రోజు ఉపవాసాన్ని కూడా తనపై విధించుకున్నట్లు నేను చూడలేదు - ఆషూరా దినపు రోజాను తప్ప. అలాగే శ్రేష్ఠత రీత్యా పూర్తిగా ఏ నెల రోజులూ విధిగా రోజాలు పాటించలేదు - రమజాన్ మాసపు రోజాలు తప్ప. (ముత్తఫకున్ అలైహ్)**

ప్రవక్త ఆచరణ ఏమిటంటే రమజాన్ నెల రోజాలను విధిగా చేసుకున్నట్లు ఆషూరా దినపు రోజాను కూడా ఆయన (స) విధిగా చేసుకుని పాటించేవారు. దీనిద్వారా హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) వెలిబుచ్చిన అభిప్రాయం ఏమిటంటే ప్రవక్త (స) దృష్టిలో ఇతర దినాలకన్నా ఆషూరా నాటి శ్రేష్ఠత అధికంగా వుండేది. అందువల్లనే ఆ రోజు తప్పనిసరిగా రోజా పాటించేవారు.

స్పష్టంగా ఇక్కడ గ్రహించాల్సిన విషయమేమిటంటే, దైవప్రవక్త (స) ఆషూరా నాటి రోజా అన్నిటికంటే శ్రేష్ఠమని చెప్పినట్లు లేదు. ప్రవక్త (స) గారి ఆచరణను గమనించి అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) వెలిబుచ్చిన తన స్వంత అభిప్రాయం ఇది. దీన్ని ఇంత వివరంగా ఎందుకు చెప్పాల్సివచ్చిందంటే మున్ముందు ఒక హదీసు రాబోతోంది, అందులో ఆషూరా రోజు కంటే అరఫా రోజు మరింత శ్రేష్ఠమైనదని తెలుపబడింది. దీనివలన ఈ రెండు హదీసుల్లో పరస్పర వైరుధ్యం ఉందనే సందేహం కలుగుతుంది. కాని ఇలా ఆలోచించటం సబబుకాదు. ఎందుకంటే ప్రవక్త (స) ఈ విషయాన్ని సెలవియ్యలేదు. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) గారు సంగ్రహించి వెలిబుచ్చిన తన స్వంత అభిప్రాయ సారాంశ ఫలమిది. అరఫా నాటి శ్రేష్ఠత గురించి ప్రవక్త (స) తెలిపిన హదీసు మున్ముందు రాబోతోంది.

## ఆషూరాతో పాటు 9 లేదా 11వ తేదీ ఉపవాసాన్ని కూడా కలుపుకోవాలి

۸۴۔ عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ حِيْنَ صَامَ رَسُوْلُ اللّٰهِ صَلَّى
اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَوْمَ عَاشُوْرَاءَ وَاَمَرَ بِصِيَامِهٖ
قَالُوْا يَا رَسُوْلَ اللّٰهِ اِنَّهٗ يُعَظِّمُهُ الْيَهُوْدُ وَالنَّصَارٰى
فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: لَئِنْ بَقِيْتُ
اِلٰى قَابِلٍ لَاَصُوْمَنَّ التَّاسِعَ۔ (رَوَاهُ مُسْلِمٌ)

**84. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) గారి ఉల్లేఖనం - ఒకసారి దైవప్రవక్త (స) ఆషూరా రోజా పాటించారు. ఇంకా దాన్ని పాటించాలని ప్రజలకు హితవు పలికారు. ఆపై ప్రజలు, 'దైవప్రవక్తా (స), దీన్నయితే యూదులు, క్రైస్తవులు కూడా పాటిస్తారు కదా!' అని విన్నవించుకున్నారు. దానిపై దైవప్రవక్త (స), "ఒకవేళ వచ్చే సంవత్సరం నేను జీవించివుంటే ముహర్రం తొమ్మిదవ తేదీ రోజా కూడా పాటిస్తాను" అని సెలవిచ్చారు. (ముస్లిం)**

దీనిద్వారా తెలిసేదేమంటే ఈ విషయాన్ని ప్రజలు ప్రవక్త (స) జీవిత కాలంలోని చివరి సంవత్సరంలో విన్నవించారు. ప్రవక్త (స) సమక్షంలో ఇలా విన్నవించు కోవడంలో వారి ఉద్దేశ్యం ఏమిటంటే యూదులు, క్రైస్తవులు కూడా దీన్ని శ్రేష్ఠతగా భావిస్తున్నారు, మీరు కూడా దీని ప్రాశస్త్యాన్ని గురించి నిర్ణయించారు అన్నది. దీనివలన యూదులు, క్రైస్తవులు మేము వారిని అనుకరిస్తున్నామన్న అర్థం తొడుగుతారేమో. దీని విషయంపై దైవప్రవక్త (స) "నేను వచ్చే సంవత్సరం జీవించివుంటే ముహర్రం 9వ తేదీనాటి రోజా కూడా తప్పక పాటించి నా ఆచరణ యూదులు, క్రైస్తవుల ఆచరణకు భిన్నమైనదని తెలియజేస్తాను" అని సెలవిచ్చారు. దీనిద్వారా తెలిసిందేమంటే ఎవరైనా ఆషూరా నాడు రోజా వుండాలని సంకల్పించుకుంటే, అతను దానికి ముందు రోజైనా లేదా దాని తరువాతి రోజునైనా కలుపుకోవాలి. ఎందుకంటే దైవప్రవక్త (స) ఏదైనా పనిని చేయాలని సంకల్పించుకోవడం కూడా అది ఆయన (స) సంప్రదాయం అన్నది రుజువైన విషయమే. మున్ముందు వచ్చే హదీసు ద్వారా ఆషూరాతో ముహర్రం 9వ తేదీనే కలుపుకోవాలన్న నిబంధన ఏదీ లేదు, 11వ తేదీనైనా కలుపుకోవచ్చు అన్న విషయం తెలుస్తోంది.

ఈ విషయం ద్వారా మీరు ఇస్లామ్‌లోని సున్నిత స్వభావాన్ని అంచనా వేయవచ్చు. అది ప్రతి చోటా ముస్లింల వైశిష్ట్యాన్ని, ఔన్నత్యాన్ని ఏ విధంగా నెలకొల్పాలని అనుకుంటుందో తెలుస్తోంది. ఇంకా ఎట్టి పరిస్థితుల్లోనూ అది ముస్లింలు యూదులు, క్రైస్తవులను ఇంకా ఇతర అవిశ్వాసుల్ని అనుకరించే అవకాశాన్నివ్వదు.

ఇలాంటి హితవుల్ని దృష్టిలో వుంచని కారణంగా పరిస్థితి ఎంతగా దిగజారిపోయిందంటే ముస్లింలు యూదులు, క్రైస్తవుల ఒక్కొక్క చెడును ఎంచుకొని మరీ అనుకరించటం మొదలెట్టారు. ఈ కారణంగా ముస్లిం, ముస్లిమేతరుల మధ్య బాహ్యాపరమైన తేడాయే లేకుండా పోయింది. కొన్ని సందర్భాల్లో ఎలా వుంటుందంటే మనం ఒక మనిషిని ముస్లింగా భావించి మాట్లాడుతుంటాం, కొంత సమయం తరువాత అతను పరధర్మానికి సంబంధించిన వ్యక్తి అని తెలిసిపోతుంది. దైవప్రవక్త (స) సెలవిచ్చారు. ఒక సమయం రాబోతోంది, అప్పుడు మీరు యూదులు, క్రైస్తవుల అడుగులకు మడుగులొత్తటం మొదలెడతారు. పరిస్థితి ఎంత వరకు వస్తుందంటే వారు ఏదైనా ఉడుము రంధ్రంలో దూరిపోతే మీరు కూడా అందులో దూరిపోతారు. నేడు ఆ చిత్తరువు సంపూర్ణంగా మనముందుంది. ఇలా ఎందుకు జరిగిందంటే దీని కారణం కేవలం ముస్లింలు జీవితంలోని దాదాపు అన్ని వ్యవహారాల్లో ఇస్లామీయ షరీఅత్ స్వభావాన్ని, దాని వైభవాన్ని అలక్ష్యం చేశారు.

## అరఫా (జిల్‌హజ్జహ్ 9వ తేదీ) రోజా గురించి

٨٥- عَنْ أُمِّ الْفَضْلِ بِنْتِ الْحَارِثِ أَنَّ نَاسًا تَمَارَوْا
عِنْدَهَا يَوْمَ عَرَفَةَ فِي صِيَامِ رَسُولِ اللهِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ بَعْضُهُمْ هُوَ صَائِمٌ وَقَالَ بَعْضُهُمْ
لَيْسَ بِصَائِمٍ، فَأَرْسَلْتُ إِلَيْهِ بِقَدَحِ لَبَنٍ وَهُوَ وَاقِفٌ
عَلَى بَعِيرِهِ بِعَرَفَةَ فَشَرِبَهُ. (مُتَّفَقٌ عَلَيْهِ)

**85.** హజ్రత్ ఉమ్ముల్ ఫజల్ (రజి) బిన్తె హారిస్ ఉల్లేఖనం : నా సమక్షంలో అరఫా రోజున ప్రజలు ఇలా తర్కిస్తున్నారు – "ఈ రోజు దైవప్రవక్త (స) రోజా పాటించారా? లేదా?" అని. వారిలో కొంతమంది

**అభిప్రాయం ప్రకారం ఆయన (స) రోజాలో వున్నారు, మరికొంతమంది ఆయన (స) రోజా పాటించలేదు అని అన్నారు. దీనిపై (వాస్తవం తెలుసుకోవటానికి) నేను ప్రవక్త సన్నిధిలోకి ఒక పాల పాత్రను పంపాను. ఆ సమయంలో ఆయన అరఫా మైదానంలో ఒంటెపై స్వారీఅయి వున్నారు. ఆయన (స) ఆ పాల పాత్రను తీసుకొని పాలను త్రాగారు. (ముత్తఫకున్ అలైహ్)**

ప్రవక్త (స) అంతిమ హజ్జ్ (హజ్జతుల్ విదా) సందర్భంగా అరఫా మైదానంలో వున్నప్పుడు ఈ రోజు దైవప్రవక్త (స) రోజాలో వున్నారా? లేదా? అన్న ప్రశ్న తలెత్తింది. ఎందుకంటే ఆయన (స) మదీనాలో వున్నప్పుడు అరఫా రోజు (అంటే జిల్ హజ్జహ్ 9వ తేదీన) తప్పనిసరిగా రోజా పాటించేవారు. ఇక ప్రవక్త (స) ఒంటెపై ఆసీనులై వుండి పాలు త్రాగినప్పుడు ఆయన అరఫా నాడు రోజా పాటించలేదన్న విషయం అందరికీ తెలిసిపోయింది. దీనిద్వారా గ్రహించిన అర్థం ఏమిటంటే అరఫా రోజాను ఇతర ప్రాంతాల్లో వున్నప్పుడు పాటించాలి. మరి హజ్జ్ చేసే వారు ఆ రోజు రోజా పాటించకపోవటమే సముచితం. ఎందుకంటే అరఫా మైదానంలో హాజీలు పరుగులు తీస్తూ వుంటారు. బహిరంగ మైదానంలో కొన్ని సందర్భాల్లో తీవ్రమైన ఎండలో గడపాల్సివస్తుంది. ఇలాంటి స్థితిలో మనిషి రోజా కూడా వుంటే దానివలన అతనికి కష్టం కలగవచ్చు. ఫలితంగా రోజాను కూడా భంగపరిచే పరిస్థితి రావచ్చు. దీని కారణంగా దైవప్రవక్త (స) ఆ సందర్భంగా అరఫా నాటి రోజాను పాటించలేదు. తన ఆచరణ ద్వారా తాను రోజా పాటించలేదన్న విషయాన్ని అందరికీ తెలియజేశారు.

## ప్రవక్త (స) జిల్‌హజ్జహ్ నెలలోని మొదటి పది రోజుల ఉపవాసాలన్నీ ఎన్నడూ పాటించలేదు

٨٦۔ وَعَنْ عَائِشَةَ قَالَتْ مَارَأَيْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ صَائِمًا فِى الْعَشْرِ قَطُّ (رَوَاهُ مُسْلِمٌ)

**86.** **హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా పేర్కొన్నారు : "దైవప్రవక్త (స) జిల్ హజ్జహ్‌లోని మొదటి పది రోజులలో పూర్తిగా రోజా పాటించటాన్ని నేను ఎన్నడూ చూడలేదు." (ముస్లిం)**

హ(జత్ ఆయిషా (ర.అ) ఇలా ఎందుకు సెలవిచ్చారంటే, కొన్ని ఇతర హదీసుల ద్వారా తెలుస్తోంది - దైవప్రవక్త (స) జిల్ హజ్జహ్‌లోని ప్రారంభ రోజుల్లో రోజా పాటించటాన్ని తప్పనిసరి చేసేవారు. దీనివలన ఎవరైనా ప్రవక్త (స) అప్పుడప్పుడూ లేదా సదా మొదటి పూర్తి 9 రోజులు రోజా పాటించేవారేమో అని తలపోసే ఆస్కారముంది.

హ(జత్ ఆయిషా (ర.అ) గారి ఈ ఉల్లేఖనంపై కొంతమంది ఇలా అభిప్రాయపడవచ్చు - ప్రవక్త (స) మొదటి 9 రోజులు ఎడతెగకుండా రోజా పాటించేవారన్న విషయం హ(జత్ ఆయిషా (ర.అ) జ్ఞానపరిధిలోకి రాలేదేమో. ఇంకా మరికొందరి అభిప్రాయంలో ప్రవక్త (స) గారు దీన్ని తన ఆచరణలో పెట్టినా పెట్టకపోయినా ఆ రోజుల్లో పూర్తిగా రోజాలు తప్పక పాటించాలని సెలవిచ్చేవారేమో. అయితే ఆయన (స) ఆ రోజుల్లో రోజా పాటిస్తే అధిక శ్రేష్ఠమని సెలవిచ్చి ఉండటం చేత ఎవరయినా ఆ దినాలలో ఎడతెగకుండా - మొదటి 9 రోజులు - ఉపవాసాలు పాటిస్తే అందులో తప్పేమీ లేదు.

## నఫిల్ రోజాలు పాటించే మస్నూన్ పద్ధతి

٨٧- عَنْ اَبِیْ قَتَادَةَ اَنَّ رَجُلاً اَتَی النَّبِیَّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ
فَقَالَ کَیْفَ تَصُوْمُ، فَغَضِبَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ
وَسَلَّمَ مِنْ قَوْلِهٖ، فَلَمَّا رَاٰی عُمَرُ غَضَبَهٗ قَالَ رَضِیْنَا
بِاللّٰهِ رَبًّا وَّ بِالْاِسْلَامِ دِیْنًا وَّبِمُحَمَّدٍ نَّبِیًّا، نَعُوْذُ بِاللّٰهِ
مِنْ غَضَبِ اللّٰهِ وَغَضَبِ رَسُوْلِهٖ، فَجَعَلَ عُمَرُ
یُرَدِّدُ هٰذَا الْکَلَامَ حَتّٰی سَکَنَ غَضَبُهٗ، فَقَالَ عُمَرُ:
یَا رَسُوْلَ اللّٰهِ کَیْفَ مَنْ یَّصُوْمُ الدَّهْرَ کُلَّهٗ، قَالَ
لَا صَامَ وَلَا اَفْطَرَ اَوْ قَالَ لَمْ یَصُمْ وَلَمْ یُفْطِرْ، قَالَ
کَیْفَ مَنْ یَّصُوْمُ یَوْمَیْنِ وَیُفْطِرُ یَوْمًا، قَالَ: وَیُطِیْقُ
ذٰلِكَ اَحَدٌ؟ قَالَ: کَیْفَ مَنْ یَّصُوْمُ یَوْمًا وَیُفْطِرُ یَوْمًا، قَالَ ذٰلِكَ صَوْمُ
دَاوٗدَ، قَالَ کَیْفَ مَنْ یَّصُوْمُ یَوْمًا وَّیُفْطِرُ یَوْمَیْنِ،
قَالَ ذٰلِكَ وَدِدْتُ اَنِّیْ طُوِّقْتُ ذٰلِكَ ثُمَّ قَالَ رَسُوْلُ اللّٰهِ

صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: ثَلَاثٌ مِنْ كُلِّ شَهْرٍ وَرَمَضَانُ إِلٰى
رَمَضَانَ فَهٰذَا صِيَامُ الدَّهْرِ كُلِّهِ، صِيَامُ يَوْمِ عَرَفَةَ
أَحْتَسِبُ عَلَى اللّٰهِ أَنْ يُكَفِّرَ السَّنَةَ الَّتِي قَبْلَهُ وَالسَّنَةَ
الَّتِي بَعْدَهُ، وَصِيَامُ يَوْمِ عَاشُورَاءَ أَحْتَسِبُ عَلَى
اللّٰهِ أَنْ يُكَفِّرَ السَّنَةَ الَّتِي قَبْلَهُ (رواه مسلم)

**87.** హ|జత్ అబూ ఖతాదా అన్సారీ (రజి) ఉల్లేఖనం, ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరై, మీరు ఎలా రోజాలు పాటిస్తారని అడిగారు. ఆ వ్యక్తి మాటపై ప్రవక్త (స) గారికి కోపం వచ్చింది. అప్పుడు హ|జత్ ఉమర్ (రజి) ప్రవక్త (స) గారి కోపాన్ని, అసహనాన్ని గమనించి ఇలా అన్నారు, "మేము అల్లాహ్‌యే మా ప్రభువని, ఇస్లాం మా ధర్మమని, ముహమ్మద్ (స) మా ప్రవక్త అని నమ్ముతున్నాము. దీనిపై సంతుష్టుల మైనాము. మేము అల్లాహ్ ఆగ్రహం నుంచి అల్లాహ్‌నే శరణు వేడుకుంటున్నాము, ఇంకా ఆయన ప్రవక్త (స) ఆగ్రహం నుండి కూడా." హ|జత్ ఉమర్ (రజి) ఈ మాటనే పలుమార్లు పలుకగా ప్రవక్త (స) కోపం తగ్గుముఖం పట్టింది. ఇంకా హ|జత్ ఉమర్ (రజి) స్వయంగా ప్రవక్త (స)తో అడగటం మొదలెట్టారు - 'ఓ దైవప్రవక్తా (స)! నిత్యం రోజా పాటించే ఆ వ్యక్తి ఎలాంటివాడు?' దానికి ప్రవక్త (స), "అతను రోజా పాటించలేదు ఇంకా విరమించలేదు" అని సెలవిచ్చారు. హ|జత్ ఉమర్ (రజి) మళ్ళీ, 'వరుసగా రెండు రోజులు రోజా వుండి ఒకరోజు దాన్ని విరమించినవాడు ఎలాంటివాడు?' అని విన్నవించుకోగా, ప్రవక్త (స) "ఎవడైనా అలాంటి శక్తి కలిగి వున్నాడా?" అని సెలవిచ్చారు. హ|జత్ ఉమర్ (రజి) మళ్ళీ విన్నవించుకున్నారు - 'రోజు మార్చి రోజు రోజా పాటించే వ్యక్తి ఎలాంటివాడు' అని. "ఇది హ|జత్ దావూద్ (అ) గారి రోజా పాటించే పద్ధతి" అని ప్రవక్త (స) సెలవిచ్చారు. ఆపై హ|జత్ ఉమర్ (రజి) మళ్ళీ, 'ఒకరోజు రోజా పాటించి రెండు రోజులు నాగా చేసిన వ్యక్తి ఎలాంటివాడు?' అని విన్నవించుకున్నారు. "నాలో ఒకవేళ అంతటి శక్తి వుంటే, అలాగే చేయాలని నేను భావిస్తాను" అని ప్రవక్త (స) సెలవిచ్చారు. ఆపై స్వయంగా ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "ప్రతి నెల మూడు రోజులు రోజా పాటించటం, రమజాన్ నెల పూర్తిగా

**రోజాలు పాటించటం 'సౌముద్దహ్ర్' (అంటే నిత్యం రోజా పాటించడం) వంటిది. మళ్లీ ఆయన (స) ఇలా సెలవిచ్చారు : "అరఫా నాడు రోజా పాటించటం వలన - నాకైతే అల్లాహ్‌పై పూర్తి నమ్మకముంది - ఎలాంటి పుణ్యం లభిస్తుందంటే, దాని శుభం వలన అల్లాహ్ గడచిన సంవత్సరం లోని పాపాలు, ఇంకా రాబోయే సంవత్సరంలోని పాపాలు క్షమిస్తాడు. ఇంకా ఆషూరా నాడు రోజా పాటించటంపై నేను అల్లాహ్‌పై నమ్మకంతో చెబుతున్నాను - అంతకు ముందు అంటే కదచిన సంవత్సరం లోని పాపాలను ఆయన మన్నిస్తాడు." (ముస్లిం)**

ప్రవక్త (స) గారికి ఆ వ్యక్తిపై ఎందుకు కోపం వచ్చిందంటే, అతను "ప్రవక్తా (స)! నేను రోజాలు ఏ విధంగా పాటించాలి?" అని ప్రశ్నించవలసింది. అంతేగాని, "మీరు రోజాలు ఎలా పాటిస్తారు?" అని కాదు. ప్రవక్త (స) గారి అనేక వ్యవహారాలు ఆయన వ్యక్తిత్వం కొరకే ప్రత్యేకమైనవిగా వుండేవి. పైగా నఫిల్ ఆరాధనలను గుప్తంగా చేయాలి తప్ప వాటిని బహిరంగపరచరాదు. గుప్తంగా వాటిని ఆచరించటమే వాటిలో ఊపిరిలూదినట్లు లెక్క. వాటిని బహిరంగపరచటం సముచితం కాదు. వాటి గురించి ఆరా తీయటం కూడా తప్పు. ఉదాహరణకు, మీరు ఎవరైనా వ్యక్తితో మీరు తహజ్జుద్‌లో ఎన్ని రకాతుల నమాజ్ చేస్తారు? అని ప్రశ్నించారనుకోండి, మొట్టమొదట మీ ముందు అతను తాను తహజ్జుద్ ఆచరిస్తున్నట్లు చెప్పాలి, ఎన్ని రకాతులు ఆచరిస్తున్నది వగైరా విషయాలను కూడా విప్పి చెప్పాల్సివస్తుంది. అసలు తహజ్జుద్ నమాజ్ ఎటువంటిదంటే అది ప్రజలకు తెలియకుండా గుప్తంగా చేయవలసిన ఆరాధన. అది మీకు - మీ ప్రభువుకు మధ్య రహస్యమైన విషయం, రెండవది ఏ వ్యక్తీ దాన్ని తెలుసుకునేలా వుండకూడదు. ఫర్జ్ నమాజ్‌లయితే బహిరంగంగా చేయబడతాయి. నఫిల్ నమాజ్‌లను గుప్తంగా చేయటంలోనే వాటిలో ఊపిరిలూదినట్లు.

ఇక ఆ వ్యక్తి ప్రశ్నకు అంతరార్థం ఏమిటంటే, దైవప్రవక్త (స) తాను ఆచరించే నఫిల్ నమాజ్‌లు, పద్ధతులను గురించి బహిరంగంగా ప్రజలందరిలో ప్రకటించాలని, ఇంకా ఆయన (స) ప్రత్యేక విధానమేమిటో కూడా తెలుపాలన్నది. ఈ విషయమే ప్రవక్త (స) కోపానికి కారణమయ్యింది. ప్రజలు ఈ విధంగా ప్రశ్నించి తన ఆచరణలను గురించి, దైవానికి తనకూ మధ్య గుప్తంగా వుంచాలన్న అనుబంధాన్ని గురించి ఆరా తీసే ప్రయత్నం చేయకూడదు.

హజ్రత్ ఉమర్ (రజి) పదే పదే చెప్పిన పలుకుల వల్ల ఆయన (స) కోపం తగ్గు ముఖం పట్టసాగింది. అప్పుడే హజ్రత్ ఉమర్ (రజి) స్వయంగా ప్రశ్నించడం మొదలెట్టారు. ప్రశ్నించే సరియైన విధానం ఇదేనని తెలిపారు (సల్లల్లాహు అలైహి వ సల్లం).

ప్రవక్త (స), "అతను రోజా పాటించనూలేదు, లేక విరమించనూలేదు" అని సెలవిచ్చిన దాని ఉద్దేశ్యం ఏమిటంటే ఎవరైనా ఒక వ్యక్తి ఎడతెగకుండా రోజా పాటిస్తూపోతే, ఎలాంటి విడుపు ఇవ్వకపోతే ఇక అది అతని అలవాటై పోయిందన్న మాట. అలాంటి వ్యక్తి పోలిక పగలు ఒక్కపూట మాత్రమే అన్నం తినే అలవాటు చేసుకున్న వ్యక్తిలాంటిది. ఈ విధంగా అలవాటు చేసుకుని నఫిల్ రోజా పాటిస్తున్నానని చెప్పుకోవటంలో అర్థమే లేదు. ఇక తాను అలవాటు ప్రకారం నిర్ణయించుకున్న వేళకే అతనికి ఆకలి వేస్తుంది. ఇక తతిమ్మా సమయంలో అతను రోజా పాటించనట్లే లెక్క. అందుకనే ప్రవక్త (స), ఎవరైనా ఒక వ్యక్తి ఎడతెగకుండా రోజా పాటిస్తున్నానని చెప్పుకుంటే ఇక అతను రోజా పాటించటం లేదు, ఇఫ్తార్ కూడా చేయటం లేదని సెలవిచ్చారు.

తరువాత "రెండు రోజులు రోజా పాటించి, తరువాత ఒక రోజు విరమించుకోవటం, ఇలాంటి శక్తి ఎవరికైనా వుందా?" అని సెలవిచ్చిన దాని భావం ఏమిటంటే ఒక వ్యక్తి నాగా లేకుండా ఇలాంటి ఆచరణ చేయటం ఎంతో కష్టంతో కూడుకున్న పని, ఈ విధంగా సంకల్పాన్ని పూర్తి చేయటం ఒక వ్యక్తి వశంలో లేని పని.

ఆపై హజ్రత్ ఉమర్ (రజి) 'ఒక వ్యక్తి ఒక రోజు రోజా పాటించి, మరునాడు వదలి వేయటం సబబేనా?' అని ప్రశ్నించగా, ప్రవక్త (స) "హజ్రత్ దావూద్ (అ) ఈ విధంగా ఆచరించేవారు" అని సెలవిచ్చారు. అంతేగాని మీరు ఈ విధంగా చేయండి, ఈ విధంగా చేయకండి అని మాత్రం సెలవియ్యలేదు. ఒకవేళ ఒక వ్యక్తి ఇలా ఆచరించాలని అనుకుంటే అతను హజ్రత్ దావూద్ (అ) పద్ధతిని పాటించినట్లని మాటను ముగించారు.

"ఒక వ్యక్తి ఒక రోజు రోజా పాటించి, రెండు రోజులు నాగా చేస్తే" అని మళ్ళీ హజ్రత్ ఉమర్ (రజి) ప్రశ్నించిన దానిపై ఆయన (స) "ఈ పద్ధతి మంచిదేకాని, అలా ఆచరించటానికి నాలో అంతటి శక్తీ లేదు, శాశ్వతంగా దాన్ని కొనసాగించే నిబద్ధతా లేదు" అని సెలవిచ్చారు. దీని అర్థం ఏమిటంటే ఒకవేళ ఒక వ్యక్తి అంతటి శక్తి కలిగివుంటే అలా ఆచరించవచ్చు లేకుంటే అలా చేయాలని సంకల్పించు కోకూడదు.

హజ్రత్ ఉమర్ (రజి) ఈ ప్రశ్నను మదీనా పవిత్ర నగరిలోనే అడిగి వుండవచ్చు. ఎందుకంటే హిజ్రత్ తరువాతనే రోజాలు విధిగావించబడ్డాయి. ప్రవక్త (స) మదీనాకు వలస (హిజ్రత్) వెళ్లేనాటికి ఆయన (స) వయస్సు 53 లేక 54 యేళ్లు వుంటాయి. దైవదౌత్య బాధ్యతల నిర్వహణలో ఆయన ఎనలేని కష్టాలను ఎదుర్కొన్నారు. అందువలన ప్రతి మూడు రోజుల కొకసారి రోజాలు వుండే పరిస్థితి కాని, దాన్ని అలవాటు చేసుకునే అవకాశంగాని లేకుండింది. దీని కారణంగానే ఆయన (స) ఇలాంటి రోజాలుండాలంటే తనలో అంతటి శక్తి లేదని సెలవిచ్చారు.

ఇక హజ్రత్ ఉమర్ (రజి) గారి ప్రశ్నలన్నీ అయిపోగా స్వయంగా ప్రవక్త (స) నఫిల్ రోజాల తాలూకు ఇలా సెలవిచ్చారు : ప్రతి నెలా మూడు రోజులు, తరువాత రమజాన్ నెల పూర్తిగా రోజాలు పాటించడం ఒక మనిషి నిత్యం అంటే సంవత్సరమంతా రోజాలు పాటించడంతో సమానం.

నఫిల్ రోజాలు పాటించడానికి ప్రజలకు ఇంతగా కష్టపడాల్సిన అవసరం లేదు. ఎందుకంటే వారు ముస్లింలు అయిన కారణంగా ప్రపంచంలో దైవాభీష్టానికి వ్యతిరేకంగా వున్న విషయాలకు గాను తమపై విధిగా యుక్తమైన వాటిని నిర్వర్తించాలి. దానితో పాటు తమ భార్యాపిల్లల ఉదరాన్నీ నింపాలి. వీటితో పాటు ఇతర ప్రాపంచిక పనుల్నీ నిర్వర్తించాలి. అందువలన వారు తమ నవాఫిల్‌లకు విధియుక్త ధర్మాలకు మధ్య సంతులనాన్ని, సమతూకాన్ని పాటించాలి. పైగా నవాఫిల్‌ల (స్వచ్ఛంద ఆరాధనల) నిర్వర్తన కోసం కష్టపడటం వలన దాని ప్రభావం విధ్యుక్త ధర్మాలపై పడకూడదు.

ప్రతి నెలా మూడు రోజుల నఫిల్ రోజాలు, ఇంకా రమజాన్ నెల రోజాల ప్రాశస్త్యాన్ని వివరించిన తరువాత ఎవరైనా ఒక వ్యక్తి అరఫా నాటి రోజా కూడా పాటించినట్లయితే అతని కడచిన సంవత్సరంలోని పాపాలు ఇంకా రాబోయే సంవత్సరంలోని పాపాలు కూడా మన్నించబడతాయని ప్రవక్త (స) సెలవిచ్చారు. ఆ తరువాత ఆషూరా నాటి రోజా కూడా పాటిస్తే సంవత్సరం క్రితం వున్న అతని పాపాలకు అది పరిహారంగా మారుతుంది.

ఈ హదీసు ద్వారా అరఫా నాటి రోజా ఆషూరా నాటి రోజా కన్నా గొప్పదని తెలుస్తోంది.

ఇక్కడ కప్ఫారా (పరిహారం) తాలూకు వివరించిన దాని ప్రకారం ఎవరికీ ఎలాంటి అపార్థం కలగకూడదు. అదేమంటే ఒక వ్యక్తి అరఫా నాటి రోజా పాటించి ఇక తన కడచిన సంవత్సరం, రాబోయే సంవత్సరం నాటి పాపాలు మన్నించబడ్డాయి

కదా అని భావించి ఇక తాను ఒక సంవత్సరం పొడగూత తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించవచ్చునన్నది దీని అర్థం ఎంతమాత్రం కాదు. ఈ హదీసు ద్వారా ఇలాంటి అర్థాన్ని ఆపాదించుకోవడం సమంజసం కాదు. ఇలాంటి హదీసులు అల్లాహ్ పట్ల అవిధేయత కనబరచడానికి సాకులు వెదికే వారిని ఉద్దేశించినవి కావు. ఇలాంటి హదీసులు గ్రాత్రింబవళ్లు మేము ఏ పనులు చేస్తే అల్లాహ్ ఇష్టపడతాడు, మరే పనులు చేస్తే అతని సామీప్యం లభిస్తుందో అని చింతన చేసేవారి గురించే. అందువలన ఇలాంటి ప్రబోధాలు అలాంటి వ్యక్తుల్లో చైతన్యాన్ని, స్పృహను కలిగించి వారు అల్లాహ్‌కు మరింతగా సన్నిహితులయ్యేలా ప్రయత్నించేందుకు దోహదపడతాయి. ఈ రోజాలు తెలిసీ, ఏమాత్రం భయం భక్తీ లేకుండా పాపాలు చేసే వ్యక్తి కొరకు పరిహారంగా పరిణమించవు. మానవమాత్రుడు కావటాన, బలహీనుడవటం చేత ఒక వ్యక్తి ఆచరణద్వారా, మాటల ద్వారా జరిగిన పొరపాట్లు, పాపాలకు పరిహారంగా పరిణమిస్తాయి, పైగా ఇలాంటి వ్యక్తులు రేబవళ్లు అల్లాహ్ ఆదేశాలను పాటిస్తూ, సంపూర్ణ విధేయతతో తమ జీవితాలు కొనసాగేట్లు ప్రయత్నిస్తూ వుంటారు. ఇలాంటి వారి పొరపాట్లకే ఈ రోజాలు పరిహారంగా మారతాయి. మనిషి తాను చేసిన పొరపాట్ల పట్ల క్షమాపణ వేడుకోవటానికి కూడా సమయం లేకపోవటం, లేదా వాటిని అతను ఏమరుపాటులోపడి మరచిపోవటం మూలాన వాటికి ఇవి పరిహారంగా మారతాయి. ఎందుకంటే మూలతః అతను దైవం దృష్టిలో విధేయత కనబరిచే దాసుడవటం చేత అతని సత్కార్యాలు అతని పొరపాట్లకు మన్నింపుగా మారతాయి. ఇది కేవలం తన దాసులపై అల్లాహ్ కురిపించే ప్రత్యేక కారుణ్యానుగ్రహం. ఎందుకంటే ఆయన వారిని మన్నించాలని అభిలషిస్తున్నాడు. ఆయన తన దాసుల తప్పులు, పాపాలను పట్టుకోవాలని పట్టుపట్టడం లేదు. ఆయన కరుణామయుడు కావటాన తన దాసుని ద్వారా ఏకాస్త మంచి పని జరిగినా దాని మూలంగా అతన్ని మన్నించాలని కోరుతున్నాడు. కాబట్టి ఒక విశ్వసించిన దాసుడు ఆచరించిన నఫిల్ రోజాలైనా, నఫిల్ ఆరాధనలైనా, నఫిల్ (స్వచ్ఛంద) దానాలైనా అన్నిటికి అన్నీ అతని పొరపాట్లకు, పాపాలకు పరిహారంగా మారతాయి.

## సోమవారం నాటి రోజా ప్రాశస్త్యం

٨٨- عَنْ اَبِي قَتَادَةَ قَالَ سُئِلَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ عَنْ صَوْمِ الْاِثْنَيْنِ فَقَالَ فِيْهِ وُلِدْتُ
وَفِيْهِ اُنْزِلَ عَلَيَّ - (رَوَاهُ مُسْلِمٌ)

**88. హజ్రత్ అబూ ఖతాదా అన్సారీ (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స)ను సోమవారం నాటి రోజా గురించి ప్రశ్నించటం జరిగింది. ఆపై ఆయన ఇలా (స) సెలవిచ్చారు, "ఈ రోజే నేను జన్మించాను, ఇంకా ఈ రోజే నాపై ఖుర్ఆన్ అవతరించింది." (ముస్లిం)**

ఆయన (స) ఆ రోజు రోజా పాటించండి అని గాని, లేక పాటించవద్దని గాని సెలవియ్యలేదు. ఆ నాటి ప్రాశస్త్యం గురించి తెలుపుతూ "ఈ రోజు నేను జన్మించాను, ఈ రోజే నాపై ఖుర్ఆన్ అవతరణ ప్రారంభమయ్యింద"ని సెలవిచ్చారు. కాబట్టి, ఒక వ్యక్తి ఆ రోజు రోజా పాటిస్తే అతని కోసం అది మంచిది, అందులో శ్రేష్ఠత ఉంది. ఒకవేళ ఎవరైనా అలా పాటించకున్నా వారిపై ఎలాంటి నిలదీత లేదు.

## ప్రతి నెలా మూడు రోజులు నఫిల్ రోజాలు పాటించడం ప్రవక్త (స) సంప్రదాయం

٨٩- عَنْ مُعَاذَةَ الْعَدَوِيَّةِ اَنَّهَا سَاَلَتْ عَائِشَةَ اَكَانَ
رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَصُوْمُ مِنْ
كُلِّ شَهْرٍ ثَلَاثَةَ اَيَّامٍ، قَالَتْ نَعَمْ، فَقُلْتُ لَهَا مِنْ
اَيِّ اَيَّامِ الشَّهْرِ كَانَ يَصُوْمُ، قَالَتْ لَمْ يَكُنْ يُبَالِيْ
مِنْ اَيِّ اَيَّامِ الشَّهْرِ يَصُوْمُ (رَوَاهُ مُسْلِمٌ)

**89. హజ్రత్ ముఆజహ్ అద్వియ (రహ్మా) పేర్కొన్నారు : "నేను హజ్రత్ ఆయిషా (ర.అ)తో "దైవప్రవక్త (స) ప్రతి నెలా మూడు రోజులు రోజా పాటించేవారా?" అని ఆరా తీశాను. దానిపై ఆమె (ర.అ) "అవును" అని సెలవిచ్చారు. "దైవప్రవక్త (స) నెలలోని ఏ మూడు రోజులు రోజా పాటించేవారు?" అని అడిగాను. దానికి ఆమె (ర.అ) "ఆయన(స)కు నెలలోని ఏ మూడు రోజులు రోజా పాటించాలి? అన్న దానిపై పట్టింపు ఉండేది కాదు" అని సమాధానమిచ్చారు. (ముస్లిం)**

భావమేమంటే నఫిల్ రోజాల గురించి ప్రవక్త (స) ఓ ప్రత్యేక తేదీలంటూ, ప్రత్యేక రోజులని నిర్ణయించలేదు. అయితే ఆయన (స) నెలలో మూడు రోజులు నఫిల్ రోజాలను పాటించకుండా వుండేవారు కాదు.

## రమజాన్ రోజాలతో పాటు షవ్వాల్ నెల ఆరు రోజుల రోజాలు పాటించిన వ్యక్తి ఎల్లప్పుడు రోజా పాటించిన వానితో సమానం

٩٠- عَنْ أَبِي أَيُّوبَ الْأَنْصَارِيِّ أَنَّهُ حَدَّثَهُ أَنَّ رَسُولَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: مَنْ صَامَ رَمَضَانَ ثُمَّ أَتْبَعَهُ سِتًّا مِنْ شَوَّالٍ كَانَ كَصِيَامِ الدَّهْرِ.

(رَوَاهُ مُسْلِمٌ)

**90. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఏ వ్యక్తి అయినా రమజాన్ నెల ఉపవాసాలన్నీ పాటించి, తరువాత షవ్వాల్ నెలలో ఆరు రోజుల రోజాలను కూడా పాటిస్తే, అలాంటి వ్యక్తి సదా రోజా పాటించిన వాడవుతాడు.**

**(ముస్లిం)**

ఇంతకు ముందు వచ్చిన హదీసులో ఒక ముస్లిం ప్రతి నెల మూడు రోజులు రోజా పాటిస్తూ రమజాన్ నెల పూర్తిగా రోజా వున్నట్లయితే ఆ వ్యక్తి ఎల్లకాలం రోజా వున్నట్లేనని సెలవియ్యడం జరిగింది. ఇక్కడ ఈ హదీసులో ఒకవేళ ఒక వ్యక్తి పూర్తి రమజాన్ రోజాలు పాటించి ఆపై ఆరు రోజులు షవ్వాల్ రోజాలు పాటించినట్లయితే అతను సదా రోజాలున్నట్లేనని సెలవివ్వడం జరిగింది. ఈ రెంటిలో ఎలాంటి వైరుధ్యం లేదని భావించాలి. వాస్తవానికి వేటికవే వాటి స్థానాన సమాన స్థాయి కలిగివున్నాయి. ఇక ఇదంతా అల్లాహ్ కృప, కటాక్షం మాత్రమే. ఒకవేళ ఒక వ్యక్తి మొదటి విధానం ప్రకారం ఆచరించినా అతను సదా రోజావున్న పుణ్యం ప్రాప్తమవుతుంది. లేదా రెండవ పద్ధతి ప్రకారం ఆచరించినా కూడా అతనికి అదే పుణ్యం ప్రాప్తమవుతుంది.

ఇంకో విషయాన్ని కూడా గమనించాలి ఇక్కడ. షవ్వాల్‌లో ఆరు రోజుల రోజాలు రమజాన్ పండుగ మరుసటి రోజునుంచే పాటించి, 7వ తేదీ వరకు పూర్తి చెయ్యాలన్న నియమం లేదు. షవ్వాల్ నెలలో వీటిని ఎప్పుడైనా పూరించవచ్చు. పైగా వాటిని వరుసగా పాటించాలన్న నియమమూ, అవసరమూ లేదు.

## ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్‌హా నాడు ఎలాంటి రోజా లేదు

٩١- عَنْ أَبِي سَعِيدٍ الْخُدْرِيِّ قَالَ نَهَى رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنْ صَوْمِ يَوْمِ الْفِطْرِ وَالنَّحْرِ. (مُتَّفَقٌ عَلَيْهِ)

**91.** **హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) ఈదుల్ ఫిత్ర్ ఇంకా ఈదుల్ అజ్‌హా నాడు రోజా పాటించడాన్ని నిషేధించారు. (ముత్తఫకున్ అలైహి)**

۹۲- وَعَنْهُ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: لَاصَوْمَ فِيْ يَوْمَيْنِ، اَلْفِطْرِ وَالْاَضْحٰى - (مُتَّفَقٌ عَلَيْهِ)

**92.** **హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఈదుల్ ఫిత్ర్ ఇంకా ఈదుల్ అజ్‌హా నాడు ఎలాంటి రోజా లేదు. (ముత్తఫకున్ అలైహి)**

ఇక్కడ ఇస్లాం దర్పం, సంతులనం గమనించండి. నమాజ్‌లా రోజా కూడా ఒక దైవారాధనే. కాని ఇస్లాం నైజం ఏమిటంటే వేళ కాని వేళ ఇలాంటి ఆరాధనను నిర్వర్తించడం పుణ్యప్రాప్తికి బదులు పాపంగా పరిణమిస్తుందని అంటోంది. ఈదుల్ ఫిత్ర్ రోజు ఎలాంటిదంటే ముప్ఫయి రోజుల ఉపవాసాల తరువాత అల్లాహ్ సంతోషించేది ఇంకా మీ నుంచి కోరేదేమంటే మీరు సర్వ స్వతంత్రులై తిని, త్రాగాలన్నదే. ఇంకా ప్రాపంచిక ప్రయోజనాలను, రుచులను ఆస్వాదించాలన్నదే అల్లాహ్ అభిమతం. అలాకాక, ఈ రోజు కూడా రోజా వుండి తనకు తాను కష్టాలపాలు చేసుకోవటం అనేది అల్లాహ్ ప్రీతికి పూర్తిగా వ్యతిరేకం. ఏ రోజైతే మీరు హాయిగా, ఆహ్లాదకరంగా వుండాలో ఆ రోజు మీరు హాయిగా గడపాలి, ఇంకా కష్టపడాల్సిన రోజు తప్పకుండా కష్టపడాలి. ఒకవేళ మీరు విశ్రాంతి తీసుకుని హాయినొందవలసిన సమయంలో కూడా కష్టపడితే, మీరు దేవునితో "లేదు, నీవు ఇచ్చే ఎలాంటి మినహాయింపు మాకు అవసరం లేదు, దాని అవసరమే మాకు లేద"ని చెప్పదలచుకున్నారన్నమాట. ఇలాంటి పోకడను నివారించటానికే దైవప్రవక్త (స) పండుగ వేళల్లో రోజా వుండకూడదని గట్టిగా మందలించారు.

## అయ్యామె తష్రీఖ్‌లో రోజా పాటించటం సముచితం కాదు

۹۳- عَنْ نُبَيْشَةَ الْهُذَلِيِّ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اَيَّامُ التَّشْرِيْقِ اَيَّامُ اَكْلٍ وَشُرْبٍ وَذِكْرِ اللّٰهِ (رَوَاهُ مُسْلِمٌ)

**93.** **హజ్రత్ నుబైష హుజలీ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : 'అయ్యామె తష్రీఖ్' తిని, త్రాగి, దైవనామ స్మరణ చేసే రోజులు. (ముస్లిం)**

**'అయ్యామె తష్రీఖ్'** అంటే జిల్ హజ్జహ్ 11, 12, 13 తేదీలన్నమాట. ఈ ఉల్లేఖనం సారాంశం ఏమంటే ఈ రోజుల్లో రోజా పాటించడం అభిలషణీయం కాదు.

## జుమా రోజును ఉపవాసం కొరకు ప్రత్యేకించుకోవటం సమ్మతం కాదు

۹۴- عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ: لَا یَصُوْمُ اَحَدُکُمْ یَوْمَ الْجُمُعَةِ اِلَّا اَنْ یَّصُوْمَ قَبْلَهٗ اَوْ یَصُوْمَ بَعْدَهٗ (مُتَّفَقٌ عَلَیْهِ)

**94. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు : మీలో ఏ వ్యక్తీ జుమా రోజు – దీని ముందు రోజుగాని లేక తరువాతి రోజు గాని రోజా వుంటే తప్ప – రోజా పాటించరాదు. (ముత్తఫకున్ అలైహ్)**

ఈ హదీసు ద్వారా తెలిసిందేమంటే జుమా రోజును ఉపవాసం కొరకు ప్రత్యేకించుకోవటం సరయింది కాదు. ప్రవక్త (స) గారి ఈ ప్రబోధనం ద్వారా ఇస్లాం నైజమేమిటో తెలుస్తోంది. మనిషి తనకు తాను మార్గదర్శిగా మారకూడదని ఇస్లాం వాంఛిస్తుంది. అతని మార్గదర్శులు కేవలం అల్లాహ్, ప్రవక్త (స) మాత్రమే. అల్లాహ్ ఇంకా ప్రవక్త (స) నిర్ణయించిన షరీఅత్ ఆదేశాల్లో తన ఆలోచనల్ని జొప్పించి అందులో హెచ్చుతగ్గులు చేయటానికి ఎవరికీ హక్కు లేదు. అలా చేస్తే పరిస్థితి యూదులు, క్రైస్తవుల్లా మారిపోతుంది. వారు అలా ధర్మంలో జోక్యం చేసుకొని దాని రూపాన్నే చెడగొట్టారు. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త (స) ఒక ప్రత్యేక నమాజ్ కొరకు జుమా రోజును ఓ ప్రత్యేక ప్రాశస్త్యాన్ని ప్రసాదించారు. ఇక ఎవరైనా ఒక వ్యక్తి ఈ రోజు శ్రేష్ఠమైన రోజు కాబట్టి రోజా పాటించటం మంచిదని తలపోస్తే అతను దేవుని షరీఅత్‌లో పెచ్చుమీరి పోయాడన్నమాట. అల్లాహ్ తన తరఫున ఆ రోజుకు ఒక ప్రత్యేక లక్ష్యాన్ని, శ్రేష్ఠతను ప్రసాదించాడు. కాని మనిషి తనకు తాను పెచ్చుమీరి మెలమెల్లగా రమజాన్ రోజాలను తప్పనిసరిగా ఎలా పాటిస్తున్నాడో అలాగే జుమా నాటి రోజాను కూడా విధిగా చేసుకుంటే ఇది ఒక కొత్త పోకడగా, కొత్త షరీఅత్‌గా ఆవిర్భావం చెందుతుంది. అందుకనే ప్రవక్త (స) జుమా నాడు నఫిల్ రోజా పాటించడాన్ని వారించారు. అయితే జుమా రోజుకు ముందుగానీ,

తరువాతి రోజున గాని రోజా పాటిస్తున్నప్పుడు జుమా రోజు రోజా పాటించడానికి అనుమతి ఉంది.

## శుక్రవారం రాత్రిని జాగరణకు, పగటిని రోజా పాటించడానికి ప్రత్యేకించుకోవటం సముచితం కాదు

٩٥- عَنْ اَبِیْ هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ
وَسَلَّمَ: لَا تَخْتَصُّوْا لَيْلَةَ الْجُمُعَةِ بِقِيَامٍ مِنْ بَيْنِ اللَّيَالِىْ
وَلَا تَخْتَصُّوْا يَوْمَ الْجُمُعَةِ بِصِيَامٍ مِنْ بَيْنِ الْاَيَّامِ
اِلَّا اَنْ يَكُوْنَ فِىْ يَوْمٍ يَصُوْمُهٗ اَحَدُكُمْ. (رَوَاهُ مُسْلِمٌ)

**95.** **హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు : జుమా రాత్రి జాగరణ (నఫిల్ ఆరాధనలు, తహజ్జుద్ నమాజ్) చేయడానికి ప్రత్యేకించుకోకండి – ఒకవేళ మీలో ఎవరైనా ఆ తేదీల్లో ఉపవాసాలు పాటిస్తుండగా శుక్రవారం వస్తే అది వేరే విషయం. (ముస్లిం)**

దీనివలన షరీఅత్‌లోని సున్నిత నైజం తెలిసివస్తోంది. అల్లాహ్ నిర్ణయించిన హద్దులను కాదని షరీఅత్‌లో ఏ వ్యక్తీ తనకు తాను జోక్యం చేసుకోవటం గాని, దాన్ని అధికం చేసుకోవటం గాని కుదరదు. ఇంతకు ముందు గతించిన జాతుల్లో కొంతమంది వ్యక్తులు తమ ఊహలు, తలంపులు, మనోకాంక్షల ప్రకారం అల్లాహ్ నిర్ణయించిన హద్దుల్లో విధి విధానాల్లో హెచ్చుతగ్గులు చేసుకున్నారు. దీని ఫలితంగా దేవుని ధర్మశాస్త్రానికి తోడు మరో షరీఅత్ ఉనికిలోకి వచ్చి అది వ్యక్తుల్ని తన బంధనాల్లో కట్టిపడవేయసాగింది. ఖుర్‌ఆన్‌లోని ఆరాఫ్ సూరాలో ఇలాంటి పద్ధతిని "ఇస్ర్" ఇంకా "అగ్‌లాల్"గా పేర్కొనటం జరిగింది. అంటే వ్యక్తులు తమ చేతులతో కంఠపాశాన్ని, సంకెళ్ళను తయారు చేసుకొని, తమ కంఠాలకు బిగించుకోవటం మొదలుపెట్టారు. ముమ్ముందు ఆ షరీఅత్ ఎంత బరువైనదిగా మారిందంటే ప్రజలు ఆ కట్టుబాట్లను తెంచుకొని పరారై చివరికి దేవుని పూర్తి షరీఅత్‌నే తమపై నుంచి దించిపడేశారు. నిషేధాజ్ఞలు ఎక్కువైనప్పుడు మనిషి వత్తిడికి లోనవుతాడు. అసలు దుర్మార్గం, దౌర్జన్యం ఏంటంటే కొంతమంది మతపెద్దలు, పురోహితులు, పీష్వాలు లేక గురువుల తరఫున విధించబడిన కట్టుబాట్లను సామాన్య ప్రజానీకం ముందు అవి దేవుని షరీఅత్‌లో అంతర్భాగాలుగా ప్రచారం చేయటం జరిగింది. ఫలితంగా

ప్రజలు వీటి వత్తిడికి తాళలేక అలాంటి బంధనాలను, శృంఖలాలను త్రెంచేస్తారు. ఇలాంటి పరిస్థితుల్లో ఏవి దేవుని తరఫున విధించబడిన ఆదేశాలు, మరేవి మానవమాత్రులు కల్పించిన ఆదేశాలు అన్న విషయాన్ని పరికించి చూడరు. వారు అన్నింటినీ త్రెంచిపడేసి సంపూర్ణ స్వతంత్రులుగా మారిపోతారు. ఇలాంటి దురవస్థకే యూదులు, క్రైస్తవులు గురిచేయబడ్డారు. ఇంకా ఇతర దైవప్రవక్తల సమాజాలు కూడా ఈ వైపరీత్యానికి గురిఅయ్యాయి. దీని కారణంగానే దేవుని షరీఅత్‌లో నిబంధనావళిని నిర్ణయించాల్సి వచ్చింది - అల్లాహ్ ఇంకా ఆయన ప్రవక్త (స) ద్వారా నిర్ణయించినదే ఫర్జ్ (విధి) అనీ, ఏ వ్యక్తికీ ఇందులో అధికం చేసే అధికారం, హక్కు లేదనీ, ఇందులో వాజిబ్ (తప్పనిసరి) చేయబడినది మాత్రమే వాజిబ్ అనీ, ఇందులో కూడా ఏ వ్యక్తీ తన తరఫున మరేదీ అదనంగా జోడించజాలడనీ నిర్దేశించడం జరిగింది. దేవుని షరీఅత్‌లో హరామ్ (నిషిద్ధం)గా పేర్కొనబడినదే హరాం. ఏ వ్యక్తికీ ఇందులో హెచ్చుతగ్గులు చేసే అధికారం లేదు. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త (స) నిర్ణయించినదే మక్రూహ్ (అవాంఛనీయమైనది). తన తరఫున మరికొన్నింటిని మక్రూహ్‌గా నిర్ణయించే అధికారం ఏ వ్యక్తికీ లేదు. ఒకవేళ ఎవరైనా ఒక వ్యక్తి ఒక వస్తువును హలాల్ లేదా హరామ్ అని నిర్ణయించిన పక్షంలో ఖుర్ఆన్, హదీసుల్లో దేని ఆధారంగా ఈ మాట అంటున్నాడో తప్పక చూపాల్సి వుంటుంది. ఒకవేళ అతను ఖుర్ఆన్, హదీసుల ఆధారం చూపకుండా ఫలానా గురువుగారు దీన్ని హలాల్ అని లేదా హరామ్ అని పేర్కొన్నారని లేదా ఫలానా పుస్తకంలో ఈ విధంగా వ్రాసివుందని చెప్పినంత మాత్రాన మనం దాన్ని నమ్మాల్సిన పనిలేదు. అతను ఖుర్ఆన్‌లో ఏ ఆయత్‌లో లేక హదీసులో దీనిని హలాల్ చేయబడిందో లేక దీనికి పవిత్రత ఆపాదించబడిందో పేర్కోవల్సివస్తుంది. మహోన్నతమైన విజ్ఞతతో కూడుకున్న దేవుని షరీఅత్ తన దాసులను దేవుడు విధించని బంధనాల్లో బంధించాలని అభిలషించదు. ఒకవేళ ప్రజలకు ఇలాంటి అనుమతే గనక ఇచ్చినట్లయితే ఇక అల్లాహ్, ఆయన ప్రవక్త (స) మాత్రమే షరీఅత్ నిర్ణాయకులుకారని, ఇతరులు కూడా దీని నిర్మాతలుగా రూపొందవచ్చన్న భావం స్ఫురిస్తుంది. ప్రజలు కేవలం దేవునికి మాత్రమే దాసులు కారని, ఇంకా ఇతరులకు కూడా దాసులుగా వుండాలని భావిస్తే, ఇక ఇలాంటి గురువులకు కూడా దేవుని దాసులపై తాము పెత్తనం చెలాయించే హక్కు వుందన్నమాట!

ఫిఖహ్ (ధర్మశాస్త్రం) పద్ధతి ప్రకారం ఆదేశాలను, సమస్యల పరిష్కారాన్ని కనుగొన్నట్లు ఖుర్ఆన్, హదీసుల వెలుగులో ధర్మాదేశాలను తెలుసుకోలేమేమోనన్న

అపార్థం ఇక్కడ జనించకూడదు. ఏ సమస్య అయినా ఖుర్‌ఆన్, హదీసుల వెలుగులో పరిష్కరించకపోతే అది ధర్మంలో అధికం చేయబడినట్లే లెక్క. కాబట్టి ఇలాంటి అపమార్గం నుండి ఒక దైవదాసుడు స్వయంగా దూరంగా ఉండటమే గాక, ఇతరులను కూడా దీన్నుంచి రక్షించే ప్రయత్నం చేయాలి.

అందువల్లనే దైవప్రవక్త (స), ముందుగానే రోజా పాటిస్తూ వుంటే తప్ప జుమా నాటి రేయిని ఆరాధనలకు, ఇంకా పగలును ఉపవాస వ్రతానికి తప్పనిసరి చేసుకోవటం సముచితం కాదని సెలవిచ్చారు. ఎందుకంటే అల్లాహ్ జుమా రోజును ఎందుకు ప్రత్యేకంగా చేశాడంటే ఆ రోజు పగటిపూట నమాజ్ కొరకు రావాలని, అందరూ సామూహికంగా నమాజ్ ఆచరించాలని నిర్ణయించాడు. ఇతర నమాజ్‌ల విషయంలో కొంత సడలింపు వుంది. ఒకవేళ మీరు వున్న ప్రాంతంలో సమీపంలో మస్జిద్ లేదు, ఇంకా మీకు అజాన్ పిలుపు కూడా విన్పించని పరిస్థితి లేదా మీరు ఏదైనా అడవి ప్రాంతంలో వున్నారు, అలాంటి పరిస్థితిలో మీరు ఉన్నచోటనే నమాజ్ ఆచరించవచ్చు. అప్పుడు ఒకవేళ మీతో పాటు నలుగురైదుగురు మనుషులున్నట్లయితే అక్కడే మీరు ఒక జమాఅత్‌గా ఏర్పడి నమాజ్ చేయవచ్చు. ఇలాంటి స్థితిలో మీరు మస్జిద్‌కే వెళ్ళి నమాజ్ చేయాలని లేదు. అయితే జుమా నమాజ్ అలా కాదు. ఈ నమాజ్ కొరకు సాధ్యమైనంతమంది మస్జిద్‌లో కూడి నమాజ్ ఆచరించాలి. ఎక్కువమంది ముస్లిములు జమఅయి ప్రత్యేక నమాజ్‌ను చేయాలని, ఇమామ్ ఇచ్చే ఖుత్బాను వినాలనే అల్లాహ్ ఈ రోజును నిర్ణయించాడు. ఇలా కనీసం వారానికి ఒకసారైనా మనిషికి అల్లాహ్ ఆదేశాలను గుర్తు చేసేందుకే ఈ రోజును నిర్ణయించటం జరిగింది. ఇక ఎవరైనా ఒక మనిషి జుమా రోజు ఎంతో శ్రేష్ఠమైనదని భావించి, ఈ రోజు రోజా పాటిస్తే బావుంటుందికదా అని తలపోయవచ్చు. జుమానాడు ఒక ప్రత్యేక శ్రేష్ఠతను ప్రసాదించి ప్రత్యేక ఆరాధన కొరకు దీన్ని నిర్ణయించటం జరిగింది. అలాంటిది ఎవరైనా ఒక మనిషి ఈ రోజు రోజా పాటించాలనుకుంటే అతను షరీఅత్‌లో అధికం చేశాడన్నమాట. దానిపైనే సంతృప్తి చెందక రాత్రిపూట కూడా తనపైన ఓ ఆరాధనను తప్పనిసరి చేసుకున్నాడన్నమాట! ఇక ఇలాంటి వాటిని అంగీకరించినట్లైతే దీన్ని చూసి ఇతరులు కూడా ఆచరించటం మొదలెడితే దాన్ని ఒక సమూహమే ఆచరించటం మొదలెడుతుంది. క్రమక్రమంగా ఒకటి రెండు శతాబ్దాలు గడచిన తరువాత ప్రజలు జుమా రోజు కేవలం ఆరాధనలు చేయటమే గాక, రోజాలు పాటించటం కూడా ప్రారంభిస్తారు. ఇక దీనిపై అల్లాహ్ నిర్ణయించిన విధి ఏమిటో, ప్రజలు తమంతటట తాము తమపైన విధించుకున్నది ఏమిటో అర్థం

కాదు, ఫలితంగా షరీఅత్‌లో లేని ఒక విషయం దానిలో ఓ అంతర్భాగమైపోతుంది. అందుకనే దైవప్రవక్త (స) చాలా స్పష్టంగా జుమా రోజును నఫిల్ ఆరాధనల కోసం ప్రత్యేకం చేసుకోకండి అని సెలవిచ్చారు. రోజా పాటించటం, రాత్రిళ్లు ఆరాధనలో గడపటంలో ఎలాంటి దోషం లేదు. రెండూ ఆమోదయోగ్యమైనవే. కాని జుమా నాడే వాటిని ప్రత్యేకించుకొని, విధిగా చేసుకోవటం షరీఅత్‌లో అదనంగా చేర్చిన విషయంగా మారే ప్రమాదముంది. అందువల్లనే దైవప్రవక్త (స) చాలా స్పష్టంగా దీనిని వారించారు.

## దైవమార్గంలో ఒక రోజు రోజా పాటించటం వల్ల అసాధారణ పుణ్యం ప్రాప్తిస్తుంది

٩٦- عَنْ أَبِي سَعِيدٍ الْخُدْرِيِّ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ صَامَ يَوْمًا فِي سَبِيلِ اللهِ بَعَّدَ اللهُ وَجْهَهُ عَنِ النَّارِ سَبْعِينَ خَرِيفًا - (مُتَّفَقٌ عَلَيْهِ)

**96. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు : ఏ వ్యక్తిఅయితే దైవమార్గంలో ఒక రోజు రోజాను పాటిస్తాడో అల్లాహ్ అతని కొరకు నరకాగ్నిని 70 ఏళ్ళ కాలం పాటు దూరం చేస్తాడు. (ముత్తఫకున్ అలైహ్)**

దైవమార్గంలో రోజా పాటించటమంటే, ఒక వ్యక్తి జిహాద్ కొరకు బయలుదేరి, తన ప్రయాణాన్ని కొనసాగిస్తూనో లేదా ఏదైనా శిబిరంలో ఉంటూనో రోజా పాటించినట్లైతే అతని ఆ రోజా దైవమార్గంలో రోజాగా పరిగణించబడుతుంది. ఉదాహరణకు ఒక వ్యక్తి హజ్జ్ లేక ఉమ్రా కొరకు బయలుదేరి, ప్రయాణంలోనే రోజాలు పాటిస్తే అతను దైవమార్గంలో రోజా పాటించినట్లు లెక్క. ఇది అతని ఉత్తమ ఆచరణగా, ప్రతిఫలానికి కారణంగా మారుతుంది.

**'ఫీ సబీలిల్లాహ్'** అంటే **'లి వజ్‌హిల్లాహి'** కూడా కావచ్చు. అంటే కేవలం దైవం కోసమే రోజా పాటించటం. ఈ రెండు సందర్భాల్లోనూ అల్లాహ్ సెలవిచ్చినట్లు అలాంటి వ్యక్తిని నరకాగ్నికి 70 యేళ్ల కాలంపాటు దూరం చేయటం జరుగుతుంది.

ఇక్కడ ఈ 70 యేళ్ల కాల గమనం, వేగం ఎలా వుంటుందో అన్న విషయాన్ని విడమర్చి చెప్పలేదు. అది ఒంటె వేగమా, లేక ఒక మానవుని నడకలాంటి వేగమా, ఏదైనా పక్షి ఎగిరిపోయే వేగమా లేక జెట్ విమాన వేగమా లేక కాంతి ప్రయాణవేగమా అన్నది తెలుపలేదు. అసలు ఇక్కడ ఇలా చెప్పటంలోని ఉద్దేశం ఇలాంటి ఆచరణ ద్వారా మనిషి నరకానికి చాలా దూరం చేయబడతాడన్నదే. అది ఎంత దూరమంటే 70 యేళ్ళ కాల వ్యవధి మధ్యలో వచ్చి అడ్డుపడుతుందన్నమాట. ఇది కేవలం ఆ మనిషి అల్లాహ్ కొరకు రోజా పాటించిన దాని మూలంగా ప్రసాదించబడిన ప్రతిఫలం.

ఎవరైనా ఒక వ్యక్తి అల్లాహ్ మార్గంలో తనపై విధించబడిన జిహాద్ కొరకు బయలుదేరాడు. ఇలాంటి వ్యక్తి తెలిసీ పాపం చేసేవాడు కాదు. అతని ద్వారా ఇలా జరుగుతుందని కూడా ఆశించలేము. అందువలన అలాంటి వ్యక్తి స్పష్టంగా ఈ ప్రతిఫలానికి హక్కుదారుడుగా నిర్ణయించబడతాడు. ఖుర్ఆన్, హదీసుల్లో పేర్కొన్నట్లు నఫిల్ ఆరాధనల ప్రతిఫలంగా చేకూరే బహుమానాలు తెలిసీ పాపాలకు పాల్పడే ప్రజల కొరకు కాదు. ఇవి లభించేది తమ సాధారణ జీవితాలు పుణ్యాలలో, నిష్టాగరిష్టలతో గడిపిన సజ్జనులకు మాత్రమే. ఇక్కడ 'ఫీ సబీలిల్లాహ్' అన్నదాని పరిధి ఏమిటో స్పష్టమవుతోంది – ఈ పుణ్యఫలం ఎలాంటి వ్యక్తికి లభిస్తుందంటే అతను కేవలం ఫర్జ్ (విధి)లనే నెరవేర్చినవాడు, నిషిద్ధం చేయబడిన వాటికి దూరంగా మసలుకునేవాడు మాత్రమే కాదు, అతను దైవమార్గంలో తన ప్రాణాలను కూడా పణంగాపెట్టి పోరాడటానికి బయలుదేరిన వ్యక్తి అన్నమాట. దీనితోపాటు అతను నఫిల్ రోజాను కూడా పాటించినట్లైతే ఇక అతను నరకానికి ఎంతో దూరంగా వుంచబడటానికి హక్కుదారుడవుతాడన్నమాట.

ఇదేవిధంగా అల్లాహ్ ప్రీతి కొరకు హజ్జ్, ఉమ్రాల ప్రయాణం చేస్తూ మార్గంలో రోజాలు కూడా పాటించే వ్యక్తికి కూడా ఇలాంటి ప్రతిఫలం లభిస్తుంది. హరామ్ గావించబడిన వాటిని తింటూ హజ్జ్ చేసేవారికి, హజ్జ్ తరువాత కూడా హరామ్ వస్తువులను తినే వారికి ఇలాంటి ప్రతిఫలం లభించదు. ఎందుకంటే వారు దైవ మార్గంలో ఈ ప్రయాణం చేయలేదు, కాబట్టి ఇలాంటివారు దీనికి హక్కుదారులుగా నిర్ణయించబడలేదు.

## నఫిల్ ఆరాధనల్లో మధ్యేమార్గం

٩٧- وَعَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ قَالَ لِيْ
رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَا عَبْدَ اللّٰهِ أَلَمْ
أُخْبَرْ أَنَّكَ تَصُوْمُ النَّهَارَ وَتَقُوْمُ اللَّيْلَ، فَقُلْتُ بَلٰى،
يَا رَسُوْلَ اللّٰهِ، قَالَ فَلَا تَفْعَلْ، صُمْ وَأَفْطِرْ وَقُمْ
وَنَمْ، فَإِنَّ لِجَسَدِكَ عَلَيْكَ حَقًّا وَإِنَّ لِعَيْنِكَ عَلَيْكَ
حَقًّا وَإِنَّ لِزَوْجِكَ عَلَيْكَ حَقًّا وَإِنَّ لِزَوْرِكَ عَلَيْكَ حَقًّا،
لَا صَامَ مَنْ صَامَ الدَّهْرَ، صَوْمُ ثَلَاثَةِ أَيَّامٍ مِنْ كُلِّ
شَهْرٍ صَوْمُ الدَّهْرِ كُلِّهِ، صُمْ كُلَّ شَهْرٍ ثَلَاثَةَ أَيَّامٍ
وَاقْرَأِ الْقُرْآنَ فِيْ كُلِّ شَهْرٍ. قُلْتُ إِنِّيْ أُطِيْقُ أَكْثَرَ
مِنْ ذٰلِكَ. قَالَ صُمْ أَفْضَلَ الصَّوْمِ، صَوْمَ دَاوُدَ،
صِيَامُ يَوْمٍ وَإِفْطَارُ يَوْمٍ، وَاقْرَأْ فِيْ كُلِّ سَبْعِ لَيَالٍ
مَرَّةً وَلَا تَزِدْ عَلٰى ذٰلِكَ. (مُتَّفَقٌ عَلَيْهِ)

**97.** హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) గారి కుమారుడు హజ్రత్ అబ్దుల్లాహ్ (రజి) కథనం : దైవప్రవక్త (స) నన్ను ఇలా అడిగారు : "ఓ అబ్దుల్లాహ్! నీవు నిత్యం రోజా పాటిస్తున్నావని, రాత్రిళ్ళకు రాత్రిళ్లు దైవారాధనలో గడుపుతున్నావని విన్నాను. నిజమేనా?" నేను విన్నవించుకున్నాను : 'అవును దైవప్రవక్తా (స)!' అని. ఆపై దైవప్రవక్త (స) "ఇక మీదట అలా చేయకు. రోజా పాటించు, మళ్లీ దాన్ని విరమించు. రాత్రిళ్లు నిల్చొని ఆరాధనా చెయ్యి ఇంకా నిద్ర కూడా పో. ఎందుకంటే నీ శరీరానికి కూడా నీపై హక్కుంది, నీ కళ్లకు కూడా నీపై హక్కుంది, ఇంకా నీ భార్యకు కూడా నీపై హక్కుంది, ఇంకా నిన్ను కలుసుకోవటానికి వచ్చేవారికి కూడా నీపై హక్కుంది. సదా రోజాలు పాటించేవాడు అసలు రోజానే వుండలేదు. నెలలో మూడు రోజులు రోజా పాటించే వ్యక్తి (సౌమె దహర్) సదా రోజాలు పాటించినవానితో సమానం. అందుకని ప్రతి నెలా మూడు రోజులు రోజా పాటించు. నెలకు ఒకసారి పూర్తి ఖుర్‌ఆన్‌ను పారాయణం చెయ్యి" అని సెలవిచ్చారు. తరువాత నేను

**విన్నవించుకున్నాను – 'దైవప్రవక్తా (స)! నేను అంతకన్నా ఎక్కువ శక్తి కలిగివున్నాను' అని. దానికి ఆయన (స), "మంచిది, నీవు శ్రేష్ఠమైన రోజా పాటించు. అదే హజ్రత్ దావూద్ (అ) రోజా. అంటే ఒక రోజు రోజా పాటించి, మరొకరోజు ఇఫ్తార్ చేయటం (అంటే రోజా పాటించకుండా వుండటం). ఇంకా ప్రతి ఏడు రాత్రుల కొకసారి ఖుర్ఆన్ పారాయణాన్ని పూర్తి చెయ్యి. దీనిపైన అధికంగా ఏమీ చేయవద్దు" అని సెలవిచ్చారు. (ముత్తఫకున్ అలైహ్)**

కళ్ళ హక్కు అంటే మీరు మేల్కొని వుండి వాటిని తెరచివుంచండి, పరుండినప్పుడు వాటిని మూసి వుంచండి. అంతేగాని మీరు పగలంతా మేల్కొని వుంటూ రాత్రిళ్లు కూడా విశ్రాంతి తీసుకోకుండా వుండటం అంటే అల్లాహ్ మీకు ప్రసాదించిన అమూల్యమైన సంపద అయిన కళ్ళ పట్ల అమర్యాదగా ప్రవర్తించాలని అనుకుంటున్నట్లు లెక్క.

కలవటానికి వచ్చేవారి హక్కు అంటే అర్థం, ఒకవేళ మీరు రాత్రిళ్లకు రాత్రిళ్లు ఆరాధనలో గడుపుతూ, పగలు రోజా కూడా పాటిస్తున్నట్లయితే ఇక మీతో ఎవరైనా కలవటానికి వచ్చినప్పుడు వారిని ఆహ్వానించే పరిస్థితిలో వుండరు మీరు. వేసవి కాలంలో మీరు రోజాలో వున్నప్పుడు, మిమ్మల్ని కలవటానికి ఎవరైనా వస్తే మీరు అతనితో మనస్ఫూర్తిగా కలవలేరు, అప్పుడు మీ పరిస్థితి వేరుగా వుంటుంది. మీరు రోజాలో వున్నట్లు వచ్చిన వ్యక్తికి తెలియకపోవచ్చు. ఒకవేళ వచ్చిన వ్యక్తికి మీరు అన్యమనస్కంగా ఆహ్వానించి, ఆర్ద్రత లేకుండా మాట్లాడినట్లయితే ఆ వ్యక్తి 'ఇతనెలాంటివాడు, వచ్చిన వారితో ఎలా మాట్లాడాలో, వారితో ఎలా మసలుకోవాలో అన్న విషయం కూడా ఇతనికి బొత్తిగా తెలియదు' అని భావిస్తాడు.

నఫిల్ రోజా పాటించేవారు ముఖ్యంగా వేసవి కాలంలో ఎక్కువ సమయాన్ని రోజాలో గడపాల్సివస్తుంది. సరిగ్గా ఇఫ్తార్ సమయానికి ఎవరైనా కలవటానికి వచ్చినట్లయితే మీరు అతన్ని అన్యమనస్కంగా కలుస్తారు. నఫిల్ రోజాలోవున్న వ్యక్తి తాను రోజాలో వున్నానని తెలుపలేడు. ఆ వచ్చిన వ్యక్తి కూడా ఎదుటి వ్యక్తి రోజా పాటిస్తున్నట్లు గమనించే స్థితిలో వుండడు. ఇలాంటి స్థితిలో ఫిర్యాదుల పర్వం మొదలవుతుంది. చివరకు సంబంధాల్లో దూరాలు కూడా పెరిగే ఆస్కారముంటుంది. దైవ ప్రవక్త (స) ఈ పరిస్థితులన్నింటినీ గమనించివుంటారు – మీరు సదా రోజాలు పాటించటం, రాత్రిళ్లు ఆరాధనల్లో గడపటం వలన సంతులనం కోల్పోతారు, ఫలితంగా మీ శరీరం, మీ కళ్లు, మీ భార్య, ఇంకా మిమ్మల్ని కలవటానికి వచ్చినవారు

ఇలా అన్నిటిపట్లా, అందరిపట్లా మీరు అనవసరమైన 'అతి'కి పోయి ఆపై 'గతి' తప్పి ఎవరి హక్కునూ నెరవేర్చలేకపోతారు. మనిషి నిస్తేజంగా వుంటే ఇటు మామూలు వ్యక్తులతోనూ సత్సంబంధాలుండవు, అటు ఇంటివారితోనూ సరిగ్గా మసలుకోలేడు. ప్రతి వ్యక్తి తనతో ఇతరులు మంచిగా మెలగాలనే ఆశిస్తాడు. అయితే ఆశించినది పూర్తి కానప్పుడు సహజసిద్ధంగానే అతని భావావేశాలు నిర్జీవంగా మారిపోతాయి.

ఆపై ఎవరైతే నిత్యం రోజా పాటిస్తాడో అతను రోజానే వుండలేదని సెలవియ్యబడింది. దీని కారణం ఇంతకు ముందు కూడా తెలుపడం జరిగింది. ఒకవేళ ఎవరైనా ఒక వ్యక్తి కేవలం ఒక్క పూట మాత్రమే భోజనం చేసే అలవాటును చేసుకున్నట్లయితే అది అతని మామూలయిపోతుంది. ఇక ఇప్పుడు అతను రోజా పాటిస్తున్నప్పటికీ అతని రోజా ఎలా లెక్కలోకి వస్తుంది. మీ మామూలుకు భిన్నంగా తినటం, త్రాగటం మానేయటం, దానితో ఇతర నిబంధనల్ని కూడా పాటించటాన్ని రోజా అంటారు. అంతేగాని, మీ అలవాటే ఒక పూట తినేదైతే ఇక ఆచరణ రీత్యా మీ రోజా లెక్కలోకి రాదు. ఇక ఇందులో అసాధారణ విషయం ఏముందని? అందుకనే సదా రోజా పాటించే వ్యక్తి ఎలాంటి రోజా పాటించలేదని సెలవియ్యబడింది. ఇంకా ఈ ఉల్లేఖనంలోనే ఈ విధంగా రోజా పాటించేవారికి ఎలాంటి పుణ్యం ప్రాప్తం కాదని సెలవియ్యడం జరిగింది. ఎందుకంటే షరీఅత్ రీత్యా అనుమతించినదే పుణ్యంగా పరిగణించటం జరుగుతుంది. మనిషి సదా రోజా పాటించాలన్నది షరీఅత్ రీత్యా సముచితం కాదు.

తరువాత ప్రతి నెలలో మూడు రోజులు రోజా పాటించటం సదా రోజా వున్నట్లుగా పరిగణించటం జరుగుతుందని సెలవియ్యటం జరిగింది. దీని అర్థం ఏమిటంటే నిత్యం రోజా పాటించి మీరు ఎంత పెద్ద పుణ్యాన్ని ఆశిస్తున్నారో అల్లాహ్ తన కారుణ్యంతో మీరు ప్రతి నెలా మూడు రోజులు రోజా పాటించినా దానికి సమానమైన పుణ్యాన్ని ప్రసాదిస్తానని సెలవిస్తున్నాడు.

ప్రతి నెల ఒకసారి పూర్తి ఖుర్‌ఆన్‌ని పారాయణం చెయ్యాలని అంటే, మీరు తహజ్జుద్ నమాజ్‌లో దాన్ని పఠించాలని భావం. దీన్ని పూర్తి చేయటానికి ప్రతి రోజు తహజ్జుద్‌లో ఒక పారా ఖుర్‌ఆన్‌ని పఠించాలన్నమాట.

దైవప్రవక్త (స) బోధనలకు జవాబుగా హజ్రత్ అబ్దుల్లా (రజి) "నేను దీనికన్నా ఎక్కువ శక్తి కలిగివున్నాన"ని చెప్పినప్పుడు, ప్రవక్త (స), "సరే, 'అఫ్జలుస్సౌమ్'ని

పాటించండి, ఇది ప్రవక్త దావూద్ (అ) విధానం" అని సెలవిచ్చారు. దీని అర్థం ఏమిటంటే ఒక రోజు రోజా పాటించడం, మరుసటి రోజు పాటించకపోవటం. ఒకవేళ ప్రతి నెలా మూడు రోజులకన్నా అధికంగా రోజా పాటించే శక్తి కలిగివుంటే, అంటే హజ్రత్ దావూద్ (అ) గారి విధానాన్ని పాటించే శక్తి కలిగివుంటే, ప్రతి ఏడు రాత్రులకొకసారి ఖుర్ఆన్ పారాయణాన్ని పూర్తిచేయండి, ఇంకా దీనికన్నా అధికంగా ఆచరణ చేయకండి. అంటే ఏడు రాత్రులకు ఒకసారి ఖుర్ఆన్ పారాయణాన్ని పూర్తి చేసే అనుమతి ఉంది, అంతకంటే ఎక్కువ ఆచరణకు అనుమతి లేదు.

ఈ వివరాల ద్వారా తెలిసేదేమంటే, అల్లాహ్ షరీఅత్ సంతులనాన్ని ఇష్టపడుతుంది. కాని 'అతి'ని మాత్రం కాదు. మనిషి తన యావత్ హక్కులు, బాధ్యతల్లో సంపూర్ణ సంతులనాన్ని పాటించాలని షరీఅత్ అభిలషిస్తుంది. అందరి హక్కుల్ని నెరవేర్చాలి. శరీర హక్కుతో పాటు మానవుల హక్కులు కూడా నెరవేర్చాలి. ఒకరి హక్కును నెరవేర్చినప్పుడు ఇతరుల హక్కులకు భంగం వాటిల్లకూడదన్న మాట. అల్లాహ్ తన దాసులపై అనేక బాధ్యతలను మోపాడు. అంతేగాని మనిషిపై కేవలం నమాజ్ రోజాలను మాత్రమే విధించలేదు. అతని పుణ్యం కేవలం వీటితోనే ముడిపడి లేదు. మనిషి తన జీవికను సంపాదించటానికి పాటుపడటం కూడా అతని బాధ్యతే. ఒకవేళ అతను సదా రోజాను పాటించి, రాత్రిళ్లు నిడివైన ఆరాధనలు చేస్తూవుంటే, అతను తన జీవనోపాధిని సంపాదించటానికి ఇంకా షరీఅత్ తనపై విధించిన ఇతర బాధ్యతల్ని కూడా నెరవేర్చే శక్తి ఎక్కణ్నుంచి వస్తుంది? అందుకనే ఆరాధనల్లో కూడా సంతులనం పాటించే అవసరం ఉంది. ఇదే విషయాన్ని ఇక్కడ మనకు బోధించటం జరిగింది. ప్రవక్త (స) మనకు దైవ స్మరణ విధానం కూడా నేర్పారు. కాని రాత్రంతా వేలసార్లు దీన్నే స్మరించాలని చెప్పటం జరగలేదు. ఆ దైవస్మరణలు కూడా గరిష్ఠంగా 33, 33 ఇంకా 34 సార్లు పఠించాలని మాత్రమే సెలవిచ్చారు. అవి కూడా చిన్న చిన్న పదాలతో కూడుకున్నవి మాత్రమే. పెద్ద పెద్ద స్మరణల సంఖ్యను తగ్గించటం జరిగింది. ఈ విధంగా దైవప్రవక్త (స) నఫిల్ ఆరాధనల్లో కూడా ఒక సుహృద్భావపూరిత సంతులనాన్ని పాటించమని సెలవిచ్చారు. తరువాత క్రమంగా ప్రజలు వీటిలో 'అతి'కి పోయారు. వాస్తవానికి వారు దేవుని షరీఅత్ స్వభావాన్ని చిన్న చూపు చూపి సంతులనాన్ని దెబ్బతీశారు. ఆపై 'అతి'నే అతిగా ప్రేమించటం జరిగింది.

రెండవ భాగం

## సోమ, గురువారాల నఫిల్ రోజాల శ్రేష్ఠత

٩٨۔ عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَصُوْمُ الْاِثْنَيْنِ وَالْخَمِيْسَ۔
(رَوَاهُ التِّرْمِذِيُّ وَالنَّسَائِيُّ)

**98. హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం : "దైవప్రవక్త (స) సోమవారం, గురువారం నాడు నఫిల్ రోజాలను పాటించేవారు." (తిర్మిజీ, నసాయి)**

మున్ముందు నఫిల్ రోజాల తాలూకు దైవప్రవక్త (స) గారి వివిధ ఆచరణలున్న హదీసులు పేర్కొనబడ్డాయి. అందువలన ఈ సందర్భంగా ఆదిలోనే ఒక విషయాన్ని గ్రహించవలసివుంది.

దైవప్రవక్త (స) గారి పరలోక ప్రస్థానం తరువాత ప్రజలు అనేకమంది సహాబా (రజి.అన్హుమ్) ప్రవక్త (స) గారి దైనందిన వ్యవహారాల తాలూకు ఆరా తీసినప్పుడు ప్రతి ఒక్కరూ తమ జ్ఞాన పరిధి మేర వివరించారు. కాబట్టి ఈ హదీసుల్లో మీకు ఏదైనా విభేదం కనబడితే అందులో ఏదో వైరుధ్యం వుందన్నది దాని భావం కాదు. దానర్థం ఏమంటే నఫిల్ రోజాల వ్యవహారంలో ఏదో ఒక పద్ధతి ఆచరణలో వుండేది కాదు. ఒకప్పుడు ఆయన (స) ఓ పద్ధతిని ఆచరిస్తే, మరొకప్పుడు మరోవిధంగా ఆచరించేవారు. ఎందుకంటే నఫిల్ ఆరాధనలో స్వేచ్ఛ వుంది. ఫర్జ్ విషయంలో అయితే ఏదైతే విధిగా నిర్ణయించబడిందో అదే అమలయ్యేది. కాని నఫిల్‌లో ఈ నిబంధన ఏమీ లేదు. నఫిల్ ఆరాధనల విషయంలో వివిధ కాలాల్లో, వివిధ సమయాల్లో దైవప్రవక్త (స) గారి ఆచరణ వేర్వేరుగా వుండేది. అందువలన దైవప్రవక్త (స) ఆచరణ తాలూకు ఎవరి జ్ఞాన పరిధిలో ఏది వుందో దాన్నే వారు వివరించారు.

ఇక్కడ హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (స) సోమవారం, గురువారాల్లో రోజా పాటించేవారు. సోమవారం తాలూకు ఇంతకు ముందు పేర్కొన్న హదీసు ప్రకారం ప్రవక్త (స) 'నేను సోమవారం నాడు జన్మించాను, ఇంకా సోమవారం నాడే నాపైన దివ్యవాణి (వహీ) అవతరించింది. అందువలన సోమవారానికి ఈ శ్రేష్ఠత వుంది' అని సెలవిచ్చారు. గురువారం నాటి శ్రేష్ఠత గురించి ముందు రాబోతోంది.

## సోమవారం, గురువారం రోజుల శ్రేష్ఠత

٩٩- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ، تُعْرَضُ الْأَعْمَالُ يَوْمَ الْاِثْنَيْنِ وَالْخَمِيْسِ
فَأُحِبُّ أَنْ يُعْرَضَ عَمَلِيْ وَأَنَا صَائِمٌ. (رَوَاهُ التِّرْمِذِيُّ)

**99. హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : "సోమవారం మరియు గురువారం రోజుల్లో ఆచరణలు సమర్పించబడతాయి. అందువలన నేను ఉపవాస స్థితిలో వున్నప్పుడు నా ఆచరణలు సమర్పించబడాలని అభిలషిస్తున్నాను." (తిర్మిజీ)**

ఈ హదీసు ద్వారా దైవప్రవక్త (స) సోమ, గురువారాల్లో నఫిల్ రోజాలకు ఎందుకు ప్రాధాన్యతనిచ్చేవారన్న విషయం తెలిసివచ్చింది. ఇక మిగిలిన ప్రశ్న, సోమ, గురువారాల్లో ఆచరణలు ఎలా సమర్పించబడతాయన్న విషయం ఆ దైవానికి, ఇంకా ఆయన ప్రవక్త (స)కే పరిమితం. మరోవ్యక్తి దీని కారణాన్ని వివరంగా తెలుసుకోజాలడు. ఎందుకంటే ఆచరణల సమర్పణ వివిధ పద్ధతుల్లో తెలుపబడింది. అందువలన అక్కడ ఏ ఏ పద్ధతుల్లో హాజరుకావలసి వస్తుందో అనే విషయాన్ని మనం చెప్పలేము.

## ప్రతి నెలా 13, 14, 15వ తేదీల్లో రోజా ఉండే సూచన

١٠٠- عَنْ أَبِي ذَرٍّ قَالَ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ
وَسَلَّمَ: يَا أَبَا ذَرٍّ إِذَا صُمْتَ مِنَ الشَّهْرِ ثَلَاثَةَ أَيَّامٍ
فَصُمْ ثَلَاثَ عَشْرَةَ وَأَرْبَعَ عَشْرَةَ وَخَمْسَ عَشْرَةَ.
(رَوَاهُ التِّرْمِذِيُّ وَالنَّسَائِيُّ)

**100. హజ్రత్ అబూజర్ గిప్ఫారీ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు : ఓ అబూజర్! ఒకవేళ నెలలో మూడు రోజుల రోజా పాటించాలనుకుంటే 13, 14, 15వ తేదీల్లో రోజాలు పాటించండి. (తిర్మిజీ, నసాయి)**

ప్రవక్త (స) అనేకమందికి హితవు గరపిందేమంటే, ఒకవేళ నెలలో మూడు రోజుల పాటు రోజాలను పాటించాలనుకుంటే 13, 14, 15వ తేదీల్లో రోజా

పాటించండని సూచించారు. ఇలా ఆచరించటం తప్పనిసరయితే కాదు. అయితే ప్రవక్త (స) ఈ పద్ధతి మేలైనదని సూచించారు. స్వయంగా ఆయన (స) ఆచరణ కూడా ఇదే.

## ప్రవక్త (స) ప్రతి నెలా ప్రారంభంలో మూడు రోజుల ఉపవాసం పాటించేవారు

١٠١- عَنْ عَبْدِ اللّٰهِ بْنِ مَسْعُوْدٍ قَالَ كَانَ رَسُوْلُ اللّٰهِ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَصُوْمُ مِنْ غُرَّةِ كُلِّ شَهْرٍ
ثَلَاثَةَ اَيَّامٍ وَقَلَّمَا كَانَ يُفْطِرُ يَوْمَ الْجُمُعَةِ.
(رَوَاهُ التِّرْمِذِيُّ وَالنَّسَائِيُّ، وَرَوَاهُ اَبُوْدَاوُدَ اِلٰى ثَلَاثَةِ اَيَّامٍ)

**101. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్‌వూద్ (రజి) ఉల్లేఖనం : "దైవప్రవక్త (స) ప్రతి నెల ప్రారంభంలో మూడు రోజుల పాటు రోజాను పాటించేవారు. అయితే జుమా నాడు రోజా పాటించని సందర్భాలు చాలా అరుదు." (తిర్మిజీ, నసాయి - అబూ దావూద్ ద్వారా ఈ ఉల్లేఖనం 'సలాసత అయ్యామ్' అన్న పదాల వరకే వుంది).**

ఈ హదీసులో రెండు విషయాలు వివరణ కోరుతున్నాయి.

మొట్టమొదటి విషయం ఇంతకు ముందు వచ్చిన హదీసులో ఇంకా ఇతగ హదీసుల్లో పేర్కొన్నట్లు ప్రవక్త (స) ప్రతి నెలా 13, 14 ఇంకా 15వ తేదీల్లో రోజా పాటించేవారు. ఇంకా ఈ పద్ధతిని అనుసరించమనే ఆయన (స) హితవు గరిపారు. అయితే ఈ హదీసులో ప్రవక్త (స) నెలలోని ప్రారంభ రోజుల్లో రోజా పాటించేవారని వచ్చింది.

ఈ విరుద్ధాంశానికి కారణమేమిటి? - దానికి కారణం నఫిల్ రోజా పాటించటానికి ఎలాంటి ప్రకటన చేయటం జరగదు. ఏ మనిషీ దీన్ని ప్రకటించడు, మరే ప్రత్యేక సందర్భంలోనూ దీని ప్రకటన వెలువడదు - దీని ద్వారా ఫలానా వ్యక్తి రోజా పాటిస్తున్నాడని తెలియడానికి. కొన్ని సందర్భాల్లో తన భార్యకు కూడా ఈ విషయం తెలిపే అవసరం లేదు. ఎందుకంటే భర్త ఎక్కడో బయట తన సమయాన్ని గడిపి ఇంటికి వచ్చి భోజనం చేయకపోతే, అతను ఎక్కడో బయట భోజనం చేసి వచ్చాడనటానికి ఇది రుజువు కాదు. అందుకని ఒక వ్యక్తి నఫిల్ రోజా విషయం ఎవరికీ ఏమీ తెలియకపోవచ్చు. ఇక కొంతమందికి ప్రవక్త (స) గారి కొన్ని సూచనల

మేరకు ఈ రోజు ఆయన (స) రోజా వున్నారని తెలిసేది, దానిపై ప్రజలు నఫిల్ రోజాల విషయంలో ప్రవక్త (స) గారి పద్ధతి ఫలానా విధంగా వుందని ఓ అభిప్రాయా నికి వచ్చేవారు. ఈ విధంగా ప్రతివారు తమ తమ అభిప్రాయాలను భిన్నంగా కలిగి వుండేవారు. అందుకనే ఎవరికి వారు తమ జ్ఞాన పరిధిలో వున్న మేరకు ఉల్లేఖించారు. ఎవరికైనా ప్రవక్త (స) 13, 14 ఇంకా 15వ తేదీల్లో రోజా పాటించేవారన్న విషయం తెలిసినప్పుడు, ఆ వ్యక్తి అలానే ఉల్లేఖించాడు. అదేవిధంగా మరో వ్యక్తికి ప్రవక్త (స) నెల ప్రారంభ రోజుల్లో రోజాను పాటించేవారని తెలిసింది, అతను దాన్నే పేర్కొనేవాడు. అయితే ప్రవక్త (స) నెలలో 15 రోజుల పాటు రోజా వుండేవారన్నది కూడా సంభవమే. ఒకప్పుడు నెలలోని ప్రారంభ రోజుల్లో, మరొకప్పుడు మధ్యలో, ఒక్కోసారి జుమా రోజు కూడా రోజా పాటించేవారు. అందువల్ల దైవప్రవక్త (స) నెలలో కేవలం మూడు రోజులు మాత్రమే ఉపవాసం ఉండేవారని ఖచ్చితంగా చెప్పేందుకు వీలులేదు. అది కూడా ఫలానా, ఫలానా తేదీలు అని ఇదమిత్థంగా చెప్పలేము. అందువలన హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మసూద్ (రజి) గారి ఈ కథనం - ప్రవక్త (స) నెలలోని 13, 14, 15 వ తేదీల్లో రోజా పాటించేవారన్న విషయానికి వ్యతిరేకం కాదు. ఇంకా ప్రవక్త (స) సోమవారం, గురువారాల్లో రోజా పాటించేవారన్న ఉల్లేఖనానికి కూడా విరుద్ధంగా లేదు.

రెండవ విషయం-హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం - ప్రవక్త (స) జుమా నాడు రోజా పాటించకపోవటం అన్నది బహు అరుదు అన్నది. అయితే ఇంతకు ముందు హదీసుల్లో ప్రవక్త (స) జుమా రోజు రోజా పాటించటం పట్ల ప్రజలను వారించారు. ఆలోచిస్తే ఇందులోని మార్మికత సులువుగా అర్థమవుతుంది. ప్రవక్త (స) రోజా పాటించినప్పుడు ఎలాంటి ప్రకటన చేసేవారు కాదు. ఇంకా సాధారణంగా ఆయన (స) ఏ ఏ రోజుల్లో రోజా పాటించేవారన్నది కూడా తెలిసివచ్చేది కాదు. అందువలన హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) తరచుగా గమనించినప్పుడు ప్రవక్త (స) జుమా నాడు రోజా పాటించారు. దీన్ని ఆధారంగా చేసుకొని ప్రవక్త (స) సాధారణంగా, తరచుగా జుమా నాడు రోజా పాటించేవారని తలపోసి ఈ విధంగా ఉల్లేఖించి వుంటారు. ఇది నిర్ణయాత్మకమైన ఉల్లేఖనం కాదు. ఎందుకంటే ప్రవక్త (స) ముందు నుంచే రోజా పాటిస్తూ వున్నప్పుడు అందులో జుమా రోజు కూడా వచ్చివుంటుంది. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) ప్రవక్త (స)ను గమనించినప్పుడు అది జుమా రోజు అయివుండవచ్చు. అందువలన ఆయన (రజి) ప్రవక్త (స) జుమా నాడు తరచూ రోజా పాటించేవారన్న నిర్ధారణకు వచ్చారు. ఇలాంటి సందర్భంలో ఆయన (రజి) గారి ఈ హదీసు

ప్రత్యేకమైన ఏర్పాటుతో జుమా రోజు రోజాను పాటించరాదన్న బోధనకు ఇది విరుద్ధాంశంగా పరిణమించదు.

## నఫిల్ రోజాల విషయంలో ప్రవక్త (స) వారి మరో పద్ధతి

١٠٢- عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ يَصُوْمُ مِنَ الشَّهْرِ السَّبْتَ وَالْاَحَدَ
وَالْاِثْنَيْنِ، وَمِنَ الشَّهْرِ الْاٰخَرِ الثَّلَاثَاءَ وَالْاَرْبِعَاءَ
وَالْخَمِيْسَ (رَوَاهُ التِّرْمِذِيُّ)

**102. హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనం : "దైవప్రవక్త (స) ఒక నెలలోని శని, ఆది ఇంకా సోమవారాల్లో రోజా పాటించేవారు. మరుసటి నెలలో మంగళవారం, బుధవారం, గురువారాల్లో రోజా పాటించేవారు."**

**(తిర్మిజీ)**

ఇక్కడ ఇంతకు ముందు వచ్చిన హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనం దీనికి భిన్నంగా ఎందుకు వుందన్న ప్రశ్న జనిస్తుంది. అసలు విషయం ఏమంటే దైవప్రవక్త (స) పరమపదించాక హజ్రత్ ఆయిషా (ర.అ) దీర్ఘ కాలం పాటు అంటే సుమారు 47 లేక 48 సంవత్సరాల పాటు జీవించి వున్నారు. ప్రజలలో ప్రవక్త (స) వ్యవహారాలను, ఆయన (స) హితవులను, ఆదేశాలను, ఆయన (స) జీవితానికి సంబంధించిన ప్రతి కోణాన్ని తెలుసుకోవాలన్న ఆసక్తి, మక్కువ, శోధన, తపన ఎంతగానో వుండేది. అందువలన వందలు, వేల మైళ్లు ప్రయాణించి మదీనాకు వచ్చేవారు. ప్రత్యేకంగా వారు హజ్రత్ ఆయిషా (ర.అ) గారి సన్నిధిలో హాజరయ్యే వారు, ఎందుకంటే ప్రవక్త (స) గారి జీవిత వ్యవహారాలు ఆమె (ర.అ)కు అన్నివిధాలా, అత్యధికంగా తెలుసని, వాటిని ఆమె తెలియజేస్తారనే భావన ప్రజల్లో ప్రబలంగా వుండేది. కాబట్టి ఇంతటి సుదీర్ఘకాలంలో లెక్కకు మించినవారు వివిధ సమయాల్లో వచ్చి ప్రవక్త (స) గారి విషయాలను తెలుసుకున్నారు. ఇక ప్రతి హదీసులో దాని పూర్వరంగమేదో తెలుపడం జరిగేది కాదు. అందువలన ఆయా అధ్యాయాల్లో ఒక హదీసును రూఢీగా చెప్పటం చాలా కష్టంగా వుండేది. ఎందుకంటే దాని పూర్వపక్షంలో ఏ ప్రస్తావన వచ్చిందో తెలియదు. విరుద్ధ భావనలున్న ఉల్లేఖనాలకు వివిధ ఆధారాలతో, వివిధ కోణాల్లో వాటి సమాధానాలు ఇవ్వబడ్డాయి. అంతమాత్రాన

అవి విరుద్ధమైనవని నిర్ణయించలేము. హజ్రత్ ఆయిషా (ర.అ) ఎవరో ఒక వ్యక్తి అడిగిన దానికి ప్రవక్త (స) సోమ మరియు గురువారం రోజా పాటిస్తారని సెలవివ్వగా ఆ వ్యక్తి దాన్నే ఉల్లేఖించాడు. అదేవిధంగా మరో వ్యక్తితో వేరే సందర్భంలో ప్రవక్త (స) నెలలోని ఫలానా రోజుల్లో రోజా పాటించేవారని, మరో నెలలో ఫలానా రోజుల్లో రోజా పాటించేవారని, ఇంకా ఒక నెలలో వరుసగా మూడు రోజులు రోజా పాటిస్తే మరుసటి నెలలో ఇతర రోజుల్లో లేక తేదీల్లో మూడు రోజుల రోజాను పాటించేవారని చెప్పటం జరిగేది. ఈ విధంగా ప్రతి రెండు నెలల్లో రోజా పాటించని వారం అంటూ మిగిలివుండేది కాదు. ఇదే విషయాన్ని ఆ వ్యక్తి ఉల్లేఖనంగా పేర్కొన్నాడు. ఈ విధంగా వివిధ ఉల్లేఖనాలు, వివిధ సందర్భాలలో పేర్కొనబడ్డాయి. వీటికి సంబంధించి ప్రవక్త (స) గారి నఫిల్ రోజాలను గురించి ప్రజలు ప్రశ్నించినప్పుడు హజ్రత్ ఆయిషా (ర.అ) గారు ఒకేసారి అన్ని హదీసులను ఎందుకు చెప్పలేదని ప్రశ్నించటం సముచితం కాదు. ఇతర సహాబాది కూడా ఇదే పద్ధతి. వీరిద్వారా కూడా అనేక హదీసులు ఉల్లేఖించబడ్డాయి. తరువాత వచ్చిన వారు అనేక రకాలైన ప్రశ్నలు అడగటం జరిగింది. ఒకరితో పది సంవత్సరాల వరకు, మరొకరితో ముప్ఫయి ఏళ్ళపాటు, వేరొకరితో నలభై ఏళ్ల వరకు ప్రశ్నించటం జరుగుతూ వచ్చింది. ఈ విధంగా వేలమంది ప్రజలు అనేకమంది సహాబాలతో, వివిధ సందర్భాలలో హదీసులను విన్నారు, తరువాత వాళ్లు ఇలా ఉల్లేఖిస్తూపోయారు. ఇలా పేర్కొనటం విరుద్ధాంశం కాదు, విన్నవారు విన్నది విన్నట్లుగా దాన్ని ఇతరుల వరకూ చేరవేశారు.

## నఫిల్ రోజాల విషయమై హజ్రత్ ఉమ్మె సలమా (ర.అ)కు ప్రవక్త (స) హితవు

۱۰۳۔عَنْ اُمِّ سَلَمَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ يَأْمُرُنِيْ اَنْ اَصُوْمَ ثَلَاثَةَ اَيَّامٍ مِّنْ كُلِّ شَهْرٍ
اَوَّلُهَا الْاِثْنَيْنِ وَالْخَمِيْسُ ۔ (رَوَاهُ اَبُوْدَاؤدَ وَالنَّسَائِيُّ)

**103.** హజ్రత్ ఉమ్మె సలమా (ర.అ) ఉల్లేఖనం : "దైవప్రవక్త (స) నాకు ప్రతి నెల మూడు రోజులు రోజా పాటించాలని, వాటి ప్రారంభం సోమవారం నుంచి లేదా గురువారం నుంచి చేయాలని" హితవు గరిపారు. (అబూదావూద్)

ఈ ఉల్లేఖనాన్ని ఇతర ఉల్లేఖనాలతో కలిపి చూసినప్పుడు, అనేకమంది ప్రజలకు అనేక విధాలుగా బోధించటం జరిగిందని తెలుస్తోంది. నఫిల్ రోజాల తాలూకు ఎలాంటి నియమనిబంధనలు నిర్ణయించబడలేదని దీని ద్వారా తెలుస్తోంది. ఒకవేళ ప్రవక్త (స) ప్రతి వ్యక్తికి ప్రత్యేక రోజుల్లోనే రోజా పాటించమని చెప్పివుంటే, ఇదే నిబంధనగా, చట్టంగా రూపొందేది. ఆపై ఎవరైనా నఫిల్ రోజా పాటించాలను కుంటే నిర్ణయించిన రోజుల్లోనే రోజా పాటించాల్సి వచ్చేది. అందువలన ప్రవక్త (స) వివిధ ప్రజలకు వివిధ రకాలైన నఫిల్ రోజాల పద్ధతులను సూచించారు. వీటన్నింటిని ఒక చోట చేర్చినప్పుడు ఈ విషయంలో ఒకే రకమయిన నిర్ధారిత పద్ధతి లేదని తెలిసివస్తోంది.

## ఏ వ్యక్తి సదా రోజా పాటించినట్లు?

۱۰۴- عَنْ مُسْلِمِ الْقُرَشِيِّ قَالَ سَئَلْتُ اَوْ سُئِلَ
رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنْ صِيَامِ الدَّهْرِ، فَقَالَ
اِنَّ لِاَهْلِكَ عَلَيْكَ حَقًّا، صُمْ رَمَضَانَ وَالَّذِىْ
يَلِيْهِ وَكُلَّ اَرْبِعَاءَ وَخَمِيْسٍ فَاِذًا اَنْتَ قَدْ صُمْتَ
الدَّهْرَ كُلَّهُ - (رَوَاهُ اَبُوْدَاوُدَ وَالتِّرْمِذِىُّ)

**104. హజ్రత్ ముస్లిమ్ ఖురైషి (రజి) ఉల్లేఖనం : నేను లేదా మరో వ్యక్తి దైవప్రవక్త (స)తో 'సౌమిద్దహర్' (నిత్యం రోజా పాటించే విషయం) గురించి ఆదేశం ఏమిటని అడిగాము. సమాధానంగా ఆయన (స) "మీ ఆలుబిడ్డలకు మీపై హక్కుంది. రమజాన్ రోజాలు పాటించండి. ఆపై నెల అంటే షవ్వాల్ నెలలో ఆరు రోజులు రోజాలు పాటించండి, ఇంకా ప్రతి బుధ, గురువారాల్లో కూడా రోజా పాటించండి. ఈ విధంగా చేస్తే మీరు నిత్యం రోజా వుండేవారుగా పరిగణించబడతారు" అన్నారు. (అబూదావూద్, తిర్మిజీ)**

పూర్వకాలంలో సన్యాసత్వం స్వీకరించే అలవాటు ఎక్కువగా వుండేది. అందువల్ల మత ధర్మాలలో బైరాగులు, సన్యాసులు, యోగులు వగైరాలు 'సౌమె దహర్'కు చాలా గౌరవం, విలువ ఇచ్చేవారు. "సౌమె దహర్" పాటించేవాడు పుణ్యాత్మునిగా భావించబడేవాడు. అందువల్లనే ప్రవక్త (స)తో సౌమెదహర్ గురించి

అధికంగా ప్రశ్నించటం జరిగింది, సమాధానంగా ప్రజలకు దాని ఆదేశాలను ప్రవక్త (స) సెలవిస్తూ వచ్చారు. ప్రస్తుత హదీసు ప్రకారం పృచ్ఛకునికి సమాధానంగా ప్రవక్త (స) "నీ ఆలుబిడ్డలకు కూడా నీపై హక్కుంది" అని చెప్పారు. అంటే 'సౌమెదహర్' పాటించేవ్యక్తి తన ఆలుబిడ్డల హక్కులను నిర్వర్తించలేడు. ఇంతకు ముందు మరో హదీసులో మీ శరీరానికి మీపై హక్కుందని సెలవియ్యటం జరిగింది, మీ కళ్ళకు మీపై హక్కుంది, మిమ్మల్ని కలుసుకునేవారికీ మీపై హక్కుంది అనన్నారు. అందువలన 'సౌమెదహర్' పాటిస్తూ ఇలాంటి హక్కుల్ని నెరవేర్చలేరు. ఈ విధంగా ఆరాధనల్లో 'అతి'ని ప్రవక్త (స) రద్దు చేశారు. విధిగా నిర్ణయించిన ఆరాధనలకన్నా ఎక్కువగా ఆరాధనలు చేసే అభిలాష కల వారికి ప్రవక్త (స) ఒక మధ్యేమార్గంతో కూడిన పద్ధతిని సూచించారు.

ప్రపంచాన్ని, దాని వ్యవహారాలను త్యజించిన వారు మాత్రమే 'సౌముద్దహర్'ను పాటిస్తూ ఏకాంత కుహరాల్లో కూర్చుంటారు. అయితే ప్రపంచంలో ప్రాతినిధ్యపు బాధ్యత నిర్వర్తించాల్సిన వారు ఇక్కడ వివాహం చేసుకుంటారు, భార్యాపిల్లల బరువు బాధ్యతలను నిర్వర్తిస్తారు, వ్యాపార లావాదేవీలు నిర్వహిస్తారు, ఉద్యోగాలు చేస్తారు, న్యాయస్థానాల పీఠాలను అధిరోహిస్తారు, ఇంకా ప్రభుత్వ కార్యకలాపాలను కూడా నిర్వహిస్తారు. మొత్తానికి దేవుని ప్రాతినిధ్య బాధ్యతలన్నీ వారు నిర్వహిస్తూ ఉంటారు. **'సాయముదహర్'**గా మారే వ్యక్తికి లభించే పుణ్యప్రాప్తి ఎంతో ఘనమైనదిగా పేర్కొనబడుతుంది. కాని ఇలాంటి పుణ్యాలన్నీ విశ్వాసి అయిన ఒక వ్యక్తికి కూడా ఎప్పుడు ప్రాప్తమవుతాయంటే అతను తన విధులు బాధ్యతలు నిర్వర్తిస్తూ రమజాన్ రోజాలు, తరువాత షవ్వాల్ నెలలోని ఆరు రోజుల రోజాలను పాటించటంతో పాటు ప్రతి నెలా బుధవారం, గురువారాల్లో రోజాలను పాటించినప్పుడే అలాంటి పుణ్యాలన్నీ అతనికి ప్రాప్తమవుతాయి.

ఈ హదీసులో పృచ్ఛకునికి బుధవారం, గురువారం నాటి రోజాలను గురించి తెలుపటం జరిగింది. ఇంతకు ముందు మరొకరికి సోమవారం, గురువారాల్లో రోజా పాటించాలని లేక మరొక వ్యక్తికి ఇతర రోజుల్లో రోజాలు పాటించాలని పేర్కొనటం జరిగింది. ఈ విధంగా వివిధ వ్యక్తులకు వివిధ పద్ధతుల్లో, వివిధ రోజుల్లో రోజాలు పాటించాలని చెప్పటం జరిగింది. ఇలా వివిధ సందర్భాలలో వివిధ తరహాలున్నాయి. ఒక వైద్యుని దగ్గర అన్ని రోగాలకు ఒకే మందు వుంటే అతను విజ్ఞుడైన వైద్యుడు కాదు. విజ్ఞుడైన వైద్యుడెవరంటే రోగి లక్షణాన్ని, పరిస్థితిని, వాతావరణాన్నిబట్టి వైద్యపరమైన చికిత్సలను, దేశకాల వాతావరణాలను ఇలా

అన్నిటినీ పరికించి మందును, మోతాదును నిర్ణయిస్తాడు. ఇదేవిధంగా ప్రతి పృచ్ఛకుని పరిస్థితిని గమనించి ప్రవక్త (స) నఫిల్ రోజాల విషయంలో అనేక పద్ధతులను సూచించారు. అవి అన్నీ వాటి వాటి స్థానాల్లో సరిఅయినవి, పుణ్యప్రాప్తికి దోహదం చేసేవే.

## అరఫాత్ మైదానంలో అరఫా నాటి రోజా పాటించటం సముచితం కాదు

١٠٥- عَنْ أَبِي هُرَيْرَةَ أَنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ نَهٰى عَنْ صَوْمِ يَوْمِ عَرَفَةَ بِعَرَفَةَ.

(رَوَاهُ أَبُوْدَاؤُدَ)

**105.** హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) అరఫాత్ మైదానంలో 'అరఫా' నాటి రోజా పాటించటాన్ని వారించారు.

(అబూ దావూద్)

ఇంతకు ముందు వచ్చిన కొన్ని హదీసుల్లో అరఫా నాటి రోజా శ్రేష్ఠమైనదని పేర్కొనటం జరిగింది. పైగా ఆ రోజు రోజా పాటిస్తే గడచిన సంవత్సరంలో జరిగిన పాపాలకు, రాబోయే సంవత్సరం నాటి పాపాలకు ఇది పరిహారం (కప్ఫారా)గా మారుతుందని కూడా చెప్పటం జరిగింది. ఈ కారణంగా ప్రజలు దీన్ని తప్పక పాటిస్తూ వుంటారు. అయితే హజ్జ్ చేసేవారు మాత్రం అరఫా నాటి రోజా పాటించడాన్ని ప్రవక్త (స) వారించారు.

గతంలో కూడా హజ్జ్ చాలా కష్టంతో కూడుకున్న కార్యక్రమం అని పేర్కొనటం జరిగింది. అందువలన హజ్జ్ కాలంలో రోజా పాటించడాన్ని ప్రవక్త (స) వారించారు. వాస్తవానికి మనిషి ఒక ఆరాధనలో నిమగ్నమైవున్నప్పుడు దాన్ని పూర్తిగా నిర్వర్తించాల్సి వుంటుంది. అతను హజ్జ్ చేస్తున్నట్లయితే దాని పూర్తి హక్కును నిర్వర్తించాలి. హజ్‌ను తగ్గించుకొని, కొన్ని నఫిల్ ఆరాధనలు చేయటానికి ప్రయత్నించటం వలన మనిషి ఇటు హజ్జ్‌నూ పూర్తిగా నిర్వర్తించలేడు, అటు నఫిల్ ఆరాధనల్నీ పూర్తిగా నెరవేర్చజాలడు. హజ్జ్ ఒక పెద్ద పుణ్యకార్యమని, తప్పనిసరి విధి అని కూడా మనిషికి తెలుసు. అలాంటప్పుడు మనిషి ఒక నఫిల్ ఆరాధనను నిర్వర్తించటానికి ఒక విధ్యుక్త కార్యక్రమాన్ని విడిచిపెట్టే నిస్సహాయునిగా మారటం ఏ విధంగానూ సముచితమైన విషయం కాదు. ఇక్కడైతే పుణ్యకార్యాల్లోనూ ఒక సంతులనం పాటించాలి, దాన్ని దృష్టిలో పెట్టుకునే మనిషి ఇతర పుణ్యాలను, సత్కార్యాలను ఆచరించాలి.

## శనివారం రోజు రోజా పాటించటం సముచితం కాదు

١٠٦- عَنْ عَبْدِ اللهِ بْنِ بُسْرٍ عَنْ أُخْتِهِ الصَّمَّاءِ أَنَّ
رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ : لَا تَصُوْمُوْا
يَوْمَ السَّبْتِ إِلَّا فِيْمَا افْتُرِضَ عَلَيْكُمْ، فَإِنْ لَّمْ يَجِدْ
أَحَدُكُمْ إِلَّا لِحَاءَ عِنَبَةٍ أَوْ عُوْدَ شَجَرَةٍ فَلْيَمْضَغْهُ
(رَوَاهُ أَحْمَدُ وَأَبُوْدَاؤدَ وَالتِّرْمِذِيُّ وَابْنُ مَاجَهْ وَالدَّارِمِيُّ)

**106.** **హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ బుస్ర్ (రజి) తన చెల్లెలు సమ్మాయి (ర.అ) ద్వారా ఉల్లేఖించిన దాని ప్రకారం ప్రవక్త (స) ఇలా ఉపదేశించారు : శనివారం నాడు రోజా పాటించకండి – ఆ రోజు రోజా వుండటం తప్పనిసరి విధి అయివుంటే తప్ప. ఒకవేళ ఎవరైనా వ్యక్తి పొరపాటుగా శనివారం నాడు రోజా పాటించివుంటే, దాన్ని అతను ఒక ద్రాక్ష పండు ముక్కతోనో లేదా ఏదైనా చెట్టు బెరడు దొరికినా దాన్ని నమిలి అతను రోజా విరమించాలి."**

**(అహ్మద్, అబూదావూద్, తిర్మిజీ, ఇబ్నెమాజా, దారిమీ)**

"ఏ రోజైతే రోజా విధిగా పాటించవలసివుందో" అన్న పదాలకు భావం ఏమంటే శనివారం రమజాన్ నెలలో వచ్చినదయితే తప్పక రోజా పాటించాల్సిందే. మరో భావం ఏమిటంటే మీరు రమజాన్ నెల తాలూకు ఖజా రోజాలు పాటిస్తున్నప్పుడు లేదా కప్ఫారా రోజాలు పాటిస్తున్నప్పుడు మధ్యలో శనివారం వచ్చినట్లయితే తప్పక ఆ రోజు రోజా పాటించాలి. అయితే ప్రత్యేకంగా శనివారం రోజు రోజా పాటించే సంకల్పం చేసుకోవటం సముచితం కాదు. ఈ నిషేధం ఎలాంటిదంటే ఒకవేళ ఎవరైనా వ్యక్తి పొరపాటున శనివారం రోజా పాటించే సంకల్పం చేసుకున్నట్లయితే అతను దాన్ని త్యజించాల్సి వుంటుంది. ఎందుకంటే శనివారాన్ని యూదులు శ్రేష్ఠమైనదిగా భావిస్తారు. ఆ రోజు వారు రోజా పాటించే ఏర్పాటు చేసుకుంటారు. అందుకనే శనివారం నాడు రోజా పాటించటానికి ప్రత్యేక ఏర్పాటు చేసుకోవటంగాని, తరచూ ఆ రోజు రోజా పాటించటం లేదా అప్పుడప్పుడైనా ఆ రోజు రోజా పాటించటానికి ఎంపిక చేసుకోవటం కూడా నిషేధించబడింది. ఒకవేళ ఎవరైనా వ్యక్తి ఆ రోజు రోజా పాటిస్తున్నా దాన్ని మధ్యలోనే త్యజించాల్సి వుంటుంది. తెలిసిందేమంటే ఈ విషయంలో గట్టి తాకీదు చేయటంతో పాటు, ఒకవేళ ఎవరైనా పొరపాటుగా ఆ రోజు రోజా పాటిస్తున్నట్లయితే దానిని పూరించే అనుమతిని కూడా

రద్దు చేయటం జరిగింది. ఈ తాకీదు ఎందుకు చేయబడిందంటే యూదులు, క్రైస్తవులతో ముస్లింల పోలిక ఉండరాదని. ఎందుకంటే ముస్లింలు ఒక సముదాయం రీత్యా తమ ప్రత్యేకతను చాటాలి, దాన్ని గట్టిగా పాటించాలి కూడా. ముస్లింలు ఈ మౌలిక విషయాల్లో ఎంతగా నిర్లక్ష్యం వహిస్తే వారు అంతగానే యూదులు, క్రైస్తవుల్లో కలిసిపోయే ప్రమాదముంది. అది ఎంతవరకు దారి తీస్తుందంటే ఒక దశలో వారి మధ్య ఎవరు ఏమిటో అనే భేదం చూపటం కూడా కష్టమైపోతుంది.

## దైవమార్గంలో ఒక రోజు రోజాకు కూడా అసాధారణ పుణ్యం

١٠٧ - عَنْ أَبِي أُمَامَةَ قَالَ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ صَامَ يَوْمًا فِي سَبِيلِ اللّٰهِ جَعَلَ اللّٰهُ بَيْنَهُ وَبَيْنَ النَّارِ خَنْدَقًا كَمَا بَيْنَ السَّمَاءِ وَالْأَرْضِ
(رواه الترمذي)

**107.** హజ్రత్ అబూ ఉమామ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) సెలవిచ్చారు : అల్లాహ్ మార్గంలో ఎవరైనా ఒక వ్యక్తి రోజా పాటిస్తే **అల్లాహ్ అతనికీ-నరకానికీ మధ్య, ఆకాశానికి భూమికి మధ్య ఎంతదూర ముందో అంతటి విశాలమైన అగాధాన్ని అడ్డుగా సృష్టిస్తాడు. (తిర్మిజీ)**

దీనివల్ల తెలుస్తున్నదేమంటే దైవప్రవక్త (స) ఈ విషయాన్ని ఎన్నోమార్లు, వివిధ పదాలతో సెలవిచ్చారు. ఇంతకు ముందు వచ్చిన హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) గారి ఉల్లేఖనంలో కూడా ప్రవక్త (స) ఏ వ్యక్తిఅయితే అల్లాహ్ మార్గంలో ఒక రోజు రోజా పాటిస్తాడో 70 సంవత్సరాల కాల వ్యవధితో అల్లాహ్ నరకాన్ని అతనికి దూరం చేస్తాడని చెప్పారు. ఆ హదీసుకు వివరణగా 'ఫీ సబీలిల్లాహ్' "అల్లాహ్ మార్గంలో జిహాద్" అనే అర్థంలో తెలుపబడింది, ఇంకా హజ్ మరియు ఉమ్రా కూడా ఇందులో చేర్చబడ్డాయి. ఇదేవిధంగా ధర్మజ్ఞాన సముపార్జనకై ప్రయాణించటం, ఇంకా ప్రజలకు దైవధర్మం వైపునకు పిలుపునివ్వటానికి బయలుదేరడం కూడా 'ఫీ సబీలిల్లాహ్' కోవలోకే వస్తుంది. మొత్తంమీద ఏ వ్యక్తి ప్రయాణమైనా దైవమార్గం కొరకు ఉద్దేశించబడి అందులో నఫిల్ రోజా పాటించి నట్లయితే అది కూడా అంతటి ఘనమైన పుణ్యంగా పరిగణించబడుతుంది.

ఈ హదీసులు ఇంతకు ముందు పేర్కొనబడినట్లు చెప్పటం జరగటం లేదు. అదేమిటంటే ప్రజలు జీవితంలో ఒకసారి దైవధర్మం ప్రచారం కొరకు బయలుదేరి ఆ ప్రయాణంలో ఒక రోజు నఫిల్ రోజా పాటించి, ఇక శాశ్వతంగా తమకు నరకం నుంచి విముక్తి లభించిందని భావించరాదు. ఈ హదీసులకు భావం ఇలా తీసుకోవటం కూడా సముచితం కాదు. అసలు ఉద్దేశం ఏమిటంటే దేవుడు నిర్ణయించిన విధులను నిర్వర్తిస్తూ అల్లాహ్ మార్గంలో తమ సమయాన్ని, శ్రమను, నేర్పరితనాన్ని చూపుతున్న వారి ఒక్కొక్క నఫిల్ ఆరాధన కూడా గొప్ప పుణ్యప్రాప్తికి సమానమైనదిగా ఎంచబడుతుంది.

ఆకాశం నుంచి భూమి వరకు అగాధం సృష్టించబడుతుందంటే దాని భావం నిజంగా అగాధం త్రవ్వబడుతుంది అని కాదు. దీని భావం ఏమంటే ఆ వ్యక్తికి - నరకానికి మధ్య ఒక సుదూరాన్ని అడ్డుగా వుంచడం జరుగుతుంది. అందువలన ఆ వ్యక్తి నరకం నుంచి ఆ రీతిలో దూరంగా రక్షించబడతాడు. మున్ముందు కూడా ఇలాంటి హదీసు రాబోతోంది. అది మరో పద్ధతిలో పేర్కొనబడింది.

## చలికాలంలోని రోజా తేరగా లభించిన 'ప్రాప్తి'

١٠٨ - عَنْ عَامِرِ بْنِ مَسْعُوْدٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اَلْغَنِيْمَةُ الْبَارِدَةُ الصَّوْمُ فِي الشِّتَاءِ
(رَوَاهُ أَحْمَدُ وَالتِّرْمِذِيُّ)

**108. హజ్రత్ ఆమిర్ బిన్ మస్వూద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఉద్బోధించారు : చలికాలంలోని రోజాలు అందివచ్చిన శ్రేష్ఠమైన ప్రాప్తం. (అహ్మద్, తిర్మిజీ)**

**'గనీమతె బారిదహ్'** అని ఉచితంగా చేతికందిన ప్రాప్తినంటారు. దానికొరకు ఎలాంటి శ్రమ, కష్టం అవసరం ఉండదు. దానికి ఎలాంటి ఖర్చుపెట్టాల్సిన పనిలేదు, ప్రాణాన్ని పణంగా పెట్టాల్సిన పనీ లేదు.

చలికాలంలో రోజా స్థితి కూడా ఉచితంగా అందివచ్చిన సంపదలా వుంటుంది. ఎందుకంటే ఆ కాలంలో పెద్దగా శ్రమపడాల్సిన పనిలేదు.

ఇక్కడ రోజా అంటే ఉద్దేశం రమజాన్ రోజాలని, ఇంకా నఫిల్ రోజాలని కూడా భావం. రమజాన్ రోజాలు కూడా మనిషికి ఉచిత ప్రయోజనాన్నిస్తాయి, ఇంకా నఫిల్ రోజాలు కూడా ఇలాంటి ప్రయోజనాన్నిస్తాయి. ఎందుకంటే వాటిలో ఎండాకాలంలో వలే కష్టాలకు ఓర్చుకోవాల్సిన అవసరం ఉండదు.

మూడవ భాగం

## ఆషూరా (ముహర్రం 10వ తేదీ) నాటి రోజా హజ్రత్ మూసా (అ) గారి సంప్రదాయం

١٠٩- عَنِ ابْنِ عَبَّاسٍ اَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ قَدِمَ الْمَدِيْنَةَ فَوَجَدَ الْيَهُوْدَ صِيَامًا يَوْمَ
عَاشُوْرَاءَ، فَقَالَ لَهُمْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ: مَا هٰذَا الْيَوْمُ الَّذِيْ تَصُوْمُوْنَهُ؛ فَقَالُوْا
هٰذَا يَوْمٌ عَظِيْمٌ اَنْجَى اللّٰهُ فِيْهِ مُوْسٰى وَقَوْمَهُ
وَغَرَّقَ فِرْعَوْنَ وَقَوْمَهُ فَصَامَهُ، فَقَالَ رَسُوْلُ
اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، فَنَحْنُ اَحَقُّ
وَاَوْلٰى بِمُوْسٰى مِنْكُمْ فَصَامَهُ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ وَاَمَرَ بِصِيَامِهِ-(مُتَّفَقٌ عَلَيْهِ)

**109.** హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) హిజ్రత్ చేసి మదీనా విచ్చేసిన తరువాత యూదులు ఆషూరా నాటి రోజాను పాటించడం గమనించారు. "మీరు రోజా పాటించే ఈ రోజు ఎలాంటిది?" అని వారిని అడిగారు ప్రవక్త (స). "ఈ రోజు చాలా గొప్పదినం. ఈ రోజునే అల్లాహ్ హజ్రత్ మూసా (అ)కు, ఆయన సమాజానికి విముక్తిని ప్రసాదించి, ఫిరౌన్ మరియు ఆయన సమూహాన్ని ముంచివేశాడు. అందువలన హజ్రత్ మూసా (అ) ఈ రోజు అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకోవటానికి రోజా పాటించేవారు" అని వారు సమాధానమిచ్చారు. దానిపై దైవప్రవక్త (స) "అయితే మేము మీ కంటే ఎక్కువగా ఆయన (అ) విధానాన్ని ఆచరించే హక్కుదారులం" అని సెలవిచ్చారు. ఇంకా ప్రవక్త (స) ఆ రోజు రోజా పాటించడమే గాక, ప్రజలకు కూడా ఆ రోజు రోజా పాటించమని హితవు గరిపారు.

(ముత్తఫకున్ అలైహ్)

ఈ బోధన ద్వారా దానంతట అదే తెలిసే విషయమేమిటంటే, అవి మదీనా కాలం నాటి ప్రారంభరోజులు. ఇంకా రమజాన్ రోజాలు విధి గావించబడలేదు.

ఇంకా అల్లాహ్ తరఫు నుంచి "మీరు యూదులు, క్రైస్తవుల విధానాలను కాదని మీ విధానాన్ని వేరు చేసుకోండి" అన్న అల్లాహ్ ఆదేశం వెలువడలేదు. ఈ ఆదేశం వెలువడక ముందు ఏ వ్యవహారంలోనైనా అల్లాహ్ ఆదేశం రాకపోతే ఆయన (స) గ్రంథవహుల పద్ధతినే ఆచరించేవారు. ఇది ఆయన (స) సాధారణ ఆచరణ. దాని ఆధారంగానే ఆయన (స) బైతుల్ మఖ్దిస్‌కు అభిముఖులై నమాజ్‌ని ఆచరించేవారు. తరువాత ఆయన (స)కు ఖిబ్లా మార్పిడి ఆదేశాలు వచ్చాయి.

ఈ హదీసు ద్వారా తెలిసే మరో విషయమేమంటే షరీఅత్‌లో కొన్ని రోజులను జ్ఞాపకం ఉంచుకునేలా చేయటం జరిగింది. ఇంకా జ్ఞాపకముంచుకోవటానికి ఆయా రోజులను ఎన్నుకోవటం జరిగింది. వీటిలో దేవుని అసాధారణ చిహ్నాం పరమార్థం ఉంటుంది – ఆషూరా నాటి రోజులా. ఆ రోజునే అల్లాహ్ మూసా (అ)ను ఆయన సమూహాన్ని మిసర్ నుంచి వెలికితీసి వారి కళ్ల ముందే ఫిరౌన్‌ను ముంచివేశాడు. అందువల్లనే ఈ రోజు మూసా (అ) షరీఅత్‌లో చిరస్మరణీయంగా మారిపోయింది. అంతేగాని మిసర్ నుంచి బయలుదేరే కథలు, సంగతులు తెలిపేలా నిర్ణయించబడ లేదు. ఇంకా ఆ రోజున జాతరలు, యాత్రలు జరుపుకునేలా చేయకుండా ఆ రోజు ఉపవాసం పాటించేలా నిర్ణయించటం జరిగింది. అదేవిధంగా హజ్రత్ ఇబ్రాహీం (అ) తన కుమారుణ్ణి బలి ఇవ్వటానికి ఏర్పాటు చేశాడు. ఈ ఘనమైన చరిత్రాత్మక రోజునే శాశ్వతంగా గుర్తుంచుకునేలా చేశాడు, పూర్తి ప్రపంచ విశ్వాసులు ఖుర్బానీ ఇచ్చి ఆ రోజు జ్ఞాపకాన్ని తాజాగా నెమరువేసుకోవాలని నిర్ణయించటం జరిగింది. ఇదేవిధంగా ఖుర్ఆన్ అవతరించిన నెలలో రోజా పాటించాలని నిర్ణయించాడు అల్లాహ్. షరీఅత్ జ్ఞాపకాల సందర్భాలను ఆచరణ రూపేణా సమ్మతించి గౌరవిస్తుంది. అయితే దాని కోసం ఆ స్థాయి, గౌరవాన్ని షరీఅత్‌యే నిర్ణయిస్తుంది. ఆ స్థాయి, గౌరవాలే వాస్తవరూపంలో ఊపిరిలూది ప్రాతినిధ్యం వహిస్తాయి.

## దైవప్రవక్త (స) తరచూ శని, ఆదివారాలు రోజా పాటించడంలోని విజ్ఞత

١١٠- عَنْ أُمِّ سَلَمَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ يَصُوْمُ يَوْمَ السَّبْتِ وَيَوْمَ الْاَحَدِ
أَكْثَرَ مَا يَصُوْمُ مِنَ الْاَيَّامِ وَيَقُوْلُ: إِنَّهُمَا يَوْمَا
عِيْدٍ لِلْمُشْرِكِيْنَ فَأَنَا أُحِبُّ أَنْ أُخَالِفَهُمْ- (رواه احمد)

**110. హజ్రత్ ఉమ్మె సలమా (ర.అ) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) తన నఫిల్ రోజాల్లో సాధారణంగా శని, ఆదివారాలు రోజా పాటించేవారు, ఇంకా 'ఇవి బహుదైవారాధకుల పండుగ రోజులు (అంటే వారి పవిత్ర రోజులు), అందువలన నేను కోరేదేమంటే వారికి వ్యతిరేకంగా ఆచరించండి' అని సెలవిచ్చారు. (అహ్మద్)**

ఇక్కడ ముష్రికీన్ (బహుదైవారాధకులు) అంటే భావం యూదులు, క్రైస్తవులు. శనివారం యూదులకు, ఆదివారం క్రైస్తవులకు వారి ధర్మాల రీత్యా పవిత్రంగా భావించబడేవి. దీనిమూలంగా శనివారం యూదులు, క్రైస్తవ్యాన్ని ఆచరించేవారు ఆదివారం నాడు రోజా పాటిస్తారు. అయితే మహాప్రవక్త (స) "ఈ రెండు రోజులు రోజా పాటించి ఇద్దరినీ వ్యతిరేకిస్తున్నాను" అని సెలవిచ్చారు. ఎందుకంటే యూదులు కేవలం శనివారం నాడు రోజా పాటిస్తారు కాని ఆదివారం నాడు పాటించరు. క్రైస్తవులు కేవలం ఆదివారం నాడు రోజా పాటిస్తారు కాని శనివారం పాటించరు. ఈ విధంగా గ్రంథవహుల వద్ద ఏ కారణంగా ఆ రెండు రోజుల ప్రాముఖ్యం ఉండేదో దానిని కొనసాగిస్తూనే వారి పద్ధతులకు భిన్నంగా వ్యవహరించారు.

## రమజాన్ రోజాలను ఫర్జ్ గావించబడక ముందు మహాప్రవక్త (స) ఆషూరా నాటి రోజాను పాటించమని తాకీదు చేసేవారు

١١١- عَنْ جَابِرِ بْنِ سَمُرَةَ قَالَ كَانَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَأْمُرُ بِصِيَامِ يَوْمِ عَاشُورَاءَ وَيَحُثُّنَا عَلَيْهِ وَيَتَعَاهَدُنَا عِنْدَهُ، فَلَمَّا فُرِضَ رَمَضَانُ لَمْ يَأْمُرْنَا وَلَمْ يَنْهَنَا عَنْهُ وَلَمْ يَتَعَاهَدْنَا عِنْدَهُ.

(رَوَاهُ مُسْلِمٌ)

**111. హజ్రత్ జాబిర్ బిన్ సముర (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) ఆషూరా నాటి ఉపవాసాన్ని పాటించమని మమ్మల్ని ఆదేశించేవారు, ఇంకా దానికై ప్రోత్సహించేవారు. ఇంకా ఎవరెవరు ఈ రోజాను పాటిస్తున్నారన్న విషయాన్ని ఆరా తీసి తెలుసుకునేవారు. ఆపై రమజాన్ రోజాలు విధి గావించబడిన పిదప ఆషూరా నాటి రోజాను పాటించేందుకు ఆదేశాన్నీ ఇవ్వలేదు, దాన్నుంచి వారించనూ లేదు, ఇంకా ఎవరెవరు ఈ రోజా పాటిస్తున్నారన్న విషయంపై ఆరా కూడా తీయలేదు." (ముస్లిం)**

**"యహుస్సునా"** (అంటే ప్రోత్సహించేవారు) అన్న పదాల ద్వారా తెలిసేదేమంటే ప్రవక్త (స) ఆషూరా నాటి రోజాను విధిగానూ చేయలేదు, ఇంకా తప్పనిసరిగా కూడా నిర్ణయించలేదు. అదొక పుణ్యకార్యమని చెబుతూ దాన్ని ప్రోత్సహించటమైతే చేసేవారు ప్రవక్త (స).

**"యతఆ హదునా ఇందహు"** అన్న దాని భావం ఏమిటంటే, 'ప్రవక్త (స) ఈ రోజు ఎవరెవరు రోజా పాటించార'ని మమ్మల్ని అడిగేవారు. ఇది కూడా ప్రోత్సాహాన్నిచ్చే, శ్రద్ధ చూపేలా చేయటానికి పాటించే ఒక పద్ధతి. దీనిద్వారా ప్రజలు దాని ప్రాముఖ్యాన్ని తెలుసుకునేలా చేయటమే ముఖ్య ఉద్దేశం. ఆపై హ(జత్ జాబిర్ (రజి) ఉల్లేఖించారు : రమజాన్ రోజాలు విధి గావించబడిన తరువాత ఆయన (స) ఆషూరా నాడు రోజా పాటించమని ఆదేశమూ ఇవ్వలేదు, దాన్ని వారించనూ లేదు, ఇంకా ఈ రోజు ఎవరెవరు రోజా పాటించారని ఆరా కూడా తీయలేదు. ఈ విధంగా ప్రవక్త (స) రమజాన్ రోజాలు ఫర్జ్ అయిన పిదప ఆషూరా దినానికి గల ప్రాముఖ్యాన్ని ఉపేక్షించారు.

## నాలుగు పనులను ప్రవక్త (స) ఎన్నడూ విడనాడలేదు

١١٢- عَنْ حَفْصَةَ قَالَتْ اَرْبَعٌ لَمْ يَكُنْ يَدَعُهُنَّ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، صِيَامُ عَاشُوْرَاءَ وَالْعَشْرِ وَثَلَاثَةِ اَيَّامٍ مِنْ كُلِّ شَهْرٍ وَرَكْعَتَانِ قَبْلَ الْفَجْرِ -
(رَوَاهُ النَّسَائِيُّ)

**112.** హ(జత్ హఫ్సా (ర.అ) తెలిపారు : నాలుగు పనులను దైవప్రవక్త (స) ఎన్నడూ విడనాడలేదు. **1.** ఆషూరా నాటి రోజా **2.** జిల్‌హజ్జహ్ నెల మొదటి దశకంలోని రోజాలు **3.** ప్రతి నెల మూడు రోజుల రోజాలు **4.** ఫ(జ్ నమాజ్‌లోని ఫర్జ్‌కు ముందున్న రెండు రకతుల సున్నత్ నమాజ్. **(నసాయి)**

హదీసు మూలంలో "అష్‌ర్" (పది) అనే పదం వాడబడింది, కాని దీని భావం జిల్ హజ్జహ్‌లోని మొదటి తొమ్మిది రోజులని భావం, ఎందుకంటే 10వ రోజైతే ఈదుల్ అజ్‌హా పండుగయే.

హజ్రత్ హఫ్సా (ర.అ) గారి బోధనవల్ల తెలిసిందేమంటే దైవప్రవక్త (స) ఏనాడూ ఫజ్ర్ నమాజ్‌లోని సున్నత్ నమాజ్‌లను విడనాడలేదు. ప్రవక్త (స) నిత్యం వాటిని ఆచరించేవారు. ఇంకా వాటిని పాటించేందుకు గట్టి తాకీదు చేసేవారు. ఇతర ఫర్జ్ నమాజ్‌లలో ఉన్న సున్నత్ నమాజ్ లన్నింటికంటే ఈ రెండు రకాతులకు ఎంతో శ్రేష్ఠత వుందని తెలుపబడింది.

నఫిల్ రోజాల తాలూకు ప్రవక్త (స) గారి అనేక విధానాలు, వాటి ప్రాముఖ్యం గురించి వివరణాత్మకమైన హదీసులు ఇంతకు ముందే వచ్చాయి.

## ప్రవక్త (స) "అయ్యామె బైజ్" రోజాలను ప్రత్యేకంగా పాటించేవారు

١١٣- عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ كَانَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لَا يُفْطِرُ أَيَّامَ الْبِيْضِ فِيْ حَضَرٍ وَلَا سَفَرٍ. (رَوَاهُ النَّسَائِيُّ)

**113. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఇలా చెప్పారు : దైవప్రవక్త (స) 'అయ్యామె బైజ్' (అంటే 13, 14, 15వ తేదీలు) రోజాలను ఏనాడూ విడనాడలేదు. ఆయన (స) ఇంటివద్ద వున్నా లేక ప్రయాణంలో వున్నప్పటికీ. (నసాయి)**

ఇంతకు ముందు కూడా ఈ విషయాన్ని తేటతెల్లం చేయటం జరిగింది. ప్రవక్త (స) గారి నఫిల్ ఆరాధనల విషయమై సహాబా (రజి.అన్‌హుమ్)కు తెలిసిన విషయాన్ని ఉల్లేఖించేవారు. ఆ విధంగా హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ప్రవక్త (స)ను "అయ్యామె బైజ్'లో తరచూ రోజా పాటించటాన్ని గమనించి వుంటారు, అందువలన ఆయన (రజి), ప్రవక్త (స) ఈ తేదీల్లోని రోజాలను ఎన్నడూ విడనాడలేదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఇతర సహాబా ప్రవక్త (స) ఇతర ఆరాధనలు చేస్తుండగా చూసి, వారు వాటినే ఉల్లేఖించారు. ఈ విధంగా ఒక వ్యక్తి ప్రవక్త (స) గారిని చూసినప్పుడు ఆయన (స) ఏ ఆచరణనైతే చేసేవారో దాన్నే ప్రవక్త నిత్యం ఆచరించేవారని భావించారు. అందువల్లనే నఫిల్ రోజాల తాలూకు ప్రవక్త (స) అనేక పద్ధతులు పేర్కొనబడ్డాయి. అంతేగాని, వాటిలో వాస్తవానికి ఎలాంటి వైరుధ్యం లేదు.

## రోజా శరీరం తాలూకు జకాత్

۱۱۴۔ عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ، لِکُلِّ شَیْءٍ زَکٰوةٌ وَزَکٰوةُ الْجَسَدِ الصَّوْمُ (رَوَاهُ ابْنُ مَاجَه)

**114.** హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ప్రతి వస్తువుకు జకాత్ వుంది. మనిషి శరీరానికి జకాత్ ఉపవాసం. (ఇబ్నెమాజా)

వాస్తవానికి ఆరాధనలన్నీ ఒక విధంగా జకాత్‌కు వివరణగా, నిర్వచనంగా ఉనికిలోకి వచ్చినవే. అయితే పరిభాషలో కేవలం సంపదపై ఇచ్చే దానిని జకాత్‌గా భావించటం జరిగింది. వాస్తవానికి జకాత్ అంటే అల్లాహ్ మీకు ప్రసాదించిన దానిలో ఏదైతే మీ వద్ద ఉందో, దానిపై అల్లాహ్‌కు గల హక్కును అంగీకరించాలి. అందులో నుంచి అల్లాహ్ మార్గంలో వ్యయపరచాలి. ఇలా రోజా మనిషి శరీరంపై జకాత్ లాంటిది. కాబట్టి మనిషి అల్లాహ్ తనకు లెక్కలేనన్ని మేళ్లను ప్రసాదించాడని, శరీరం లాంటి గొప్ప సేవకునికి అల్లాహ్ తన అధీనం చేశాడనే భావనతో రోజాను పాటించాలి. ఈ రోజా అల్లాహ్ పట్ల కృతజ్ఞతగా పాటించానని భావించాలి. ఒకవేళ ఎవరైనా తన ఆరోగ్యాన్ని బాగుచేసుకొనే ఉద్దేశంతో రోజా పాటిస్తే అది శరీరంపై జకాత్ చెల్లించినట్లు భావించబడదు. అల్లాహ్ ప్రీతి పొందటానికి రోజా పాటించినప్పుడు మాత్రమే శరీరంపైన జకాత్ చెల్లించినట్లు లెక్క. అదేవిధంగా మీ సమయం మీద కూడా జకాత్ ఉంది. అల్లాహ్ ధర్మోన్నతికై మీరు వెచ్చించే సమయం నిస్సందేహంగా అది సమయంపై చెల్లించే జకాత్‌గా భావించబడుతుంది. అదేవిధంగా మీ నేర్పరితనం, ప్రావీణ్యతలపై కూడా జకాత్ వుంది. అల్లాహ్ మీకు శక్తియుక్తులు, ప్రావీణ్యతలు ప్రసాదించాడు. వీటితో మీరు దైవధర్మోన్నతి కొరకు, ప్రజల్లో ధర్మావగాహన కలిగించటానికి, అవిశ్వాసులకు వ్యతిరేకంగా పోరాడటానికి వినియోగించినట్లయితే, ఇది మీ బుద్ధిజ్ఞానాలపై జకాత్ చెల్లించినట్లు భావించటం జరుగుతుంది. ఈ విధంగా అల్లాహ్ మీకు దేన్ని ప్రసాదించినా దానిపై జకాత్ చెల్లించటం దాని హక్కు. మీరు దాని హక్కును చెల్లించినట్లైతే అది దానిపై జకాత్ చెల్లించినట్లు లెక్క.

## సోమవారం, గురువారం నాటి నఫిల్ రోజాల శ్రేష్ఠత

۱۱۵- عَنْ اَبِیْ هُرَیْرَةَ اَنَّ النَّبِیَّ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ کَانَ یَصُوْمُ یَوْمَ الْاِثْنَیْنِ وَالْخَمِیْسِ، فَقِیْلَ یَا رَسُوْلَ اللّٰهِ اِنَّكَ تَصُوْمُ یَوْمَ الْاِثْنَیْنِ وَالْخَمِیْسِ، فَقَالَ اِنَّ یَوْمَ الْاِثْنَیْنِ وَالْخَمِیْسِ یَغْفِرُ اللّٰهُ فِیْهِمَا لِکُلِّ مُسْلِمٍ اِلَّا ذَا هَاجِرَیْنِ، یَقُوْلُ دَعْهُمَا حَتّٰی یَصْطَلِحَا

(رواه احمد وابن ماجه)

**115.** హజ్రత్ అబూ హురైరా (రజి) ఇలా ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) సోమవారం, గురువారం నాటి రోజాలను పాటించేవారు. ఆపై ఆయన (స)తో "ఓ దైవప్రవక్తా (స)! తమరు సోమ, గురువారాల్లో తరచూ రోజా పాటిస్తారా?" అని విన్నవించుకోగా, సమాధానంగా ఆయన (స), "సోమవారం, గురువారాలు ఎలాంటివంటే అల్లాహ్ ఆ దినాలలో ప్రతి ముస్లింకు మన్నింపును ప్రసాదిస్తాడు – పరస్పరం ఒకరినొకరు చంపుకున్న ఇద్దరు ముస్లింలను తప్ప. వారిద్దరూ పరస్పరం సంప్రదించుకొని సంధిచేసుకోవటానికి వారిని వారి మానాన వదలివేయండి అని అల్లాహ్ సెలవిచ్చాడు." (అహ్మద్, ఇబ్నెమాజా)

ఇది దైవప్రవక్త (స) విజ్ఞతాభరితమైన శిక్షణల్లో ఒక ఉదాహరణ. ఒక ప్రక్క ప్రవక్త (స) ఈ ఆచరణలోని మార్మికతను తెలియజేశారు. మరో ప్రక్క గొప్ప నైతికతా ప్రధానమైన పాఠాన్ని కూడా ఇచ్చారు.

మొట్టమొదటి విషయం సెలవిచ్చినదేమిటంటే ప్రతి సోమవారం, గురువారం అల్లాహ్ ప్రతి ముస్లింకు మన్నింపును ప్రసాదిస్తాడు. ఇందులో 'ముస్లిమ్' కు అనేక అర్థాలు వస్తాయి. ఒక కోణం ఏమిటంటే 'ముస్లిమ్'ను దాని అసలు అర్థంలో తీసుకోవాలి. అంటే ఆ మనిషి అల్లాహ్ దాసునిగా, విధేయునిగా తన పూర్తి జీవితాన్ని అల్లాహ్ ఆరాధనలో గడుపుతాడు. మరొకవ్యక్తి ఇస్లాంను వ్యతిరేకించేబదులు, అంగీకరించాడు. అతనిపై కూడా ముస్లిం అన్న పదం ఆపాదించబడింది. కాని అతని ఆచరణాత్మక జీవితం చూస్తే పూర్తిగా లోపాలు, పాపాలతో నిండి వుంటుంది. అయితే ఇక్కడ ముస్లిం అనే పదాన్ని మొదటి అర్థంలో తీసుకుంటే అతను ముస్లిం

అయినప్పటికీ మానవ బలహీనత కారణంగా అతని వల్ల జరిగిన తప్పులు, పాపాలు అతని నఫిల్ ఆరాధనల మూలంగా వాటంతటవే మన్నించబడతాయి.

ఒకవేళ ఇక్కడ ముస్లిం అన్న పదాన్ని రెండవ అర్థంలో తీసుకుంటే, అతను కేవలం ఇస్లాంను స్వీకరించాడు, అయితే ఇస్లాంను పూర్తిగా త్యజించి అవిశ్వాసాన్ని స్వీకరించని కారణంగా రెంటిలో తేడా వుంది. ఈ విధంగా రెంటిలో వేర్వేరు ఫలితాలున్నాయి. ఒకవేళ ఒక వ్యక్తి ఇస్లాంను పూర్తిగా త్యజించి, నేను ఖుర్ఆన్‌ను మార్గదర్శినిగా, ముహమ్మద్(స)ను దైవప్రవక్తగా అంగీకరించనని, తన అవిశ్వాసంపై (అది క్రైస్తవం అయినా, యూదుమతమైనా లేదా మరేదయినా ధర్మంపై) స్థిరంగా వున్నాడంటే ముమ్మాటికీ అతను తిరుగుబాటుదారుడే అని అర్థం. ఇలాంటి పరిస్థితిలో అతని పుణ్యం, పుణ్యంగా పరిగణించబడదు, అతని ద్వారా ఎలాంటి సదాచరణ జరుగుతుందని ఆశించబడదు. అతను ఒకవేళ ప్రభుత్వ శాసనం, న్యాయవ్యవస్థ ప్రకారం ఇతరులకు శిక్షలు విధించేవాడైనా, ఇతరులపై (Criminal Procedure Code) ప్రభుత్వ శిక్షాస్మృతి ప్రకారం వ్యాజ్యాలు నడిపేవాడైనా, లేక అతన్ని Civil Service Conduct Rules ప్రకారం న్యాయస్థానం న్యాయమూర్తిగా ఖరారు చేసినా, ఇంకా దేశ శాసనానుసారం ఆచరించే వాడైనాసరే, ఒకవేళ అతను తిరుగుబాటు చేసిన నేరస్థునిగా పట్టుబడినవాడైతే ప్రభుత్వం అతనికి పూర్తిగా శిక్ష విధిస్తుంది - అతను క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ప్రకారం ప్రభుత్వ పాలనా వ్యవహారాలను నడిపేవాడని, పూర్తి న్యాయవ్యవస్థకు లోబడి నడుచుకున్నవాడన్న విషయాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవటం జరగదు. ఇలాంటి వ్యవహారమే దేవునిపై తిరుగుబాటు చేసిన వ్యక్తిది కూడా కావచ్చు. అతను ఇస్లాంను త్యజించి అవిశ్వాసంపై, బహుదైవారాధనపై పాతుకుపోయాడు. అలాంటప్పుడు అతని ఏ ఆచరణా సదాచరణగా ఎంచబడే ప్రశ్నే తలెత్తదు. అతని ఆచరణలన్నీ వృథా అయిపోయాయి. అతని తిరుగుబాటుకు గాను పూర్తిగా శిక్షించడం జరుగుతుంది. ఒకవేళ ఒక వ్యక్తి ఇస్లాంను సత్యధర్మంగా నమ్మి, దాని ప్రకారం ఆచరించడానికి నిర్ణయించుకున్నట్లయితే ఆ విధంగా అతను దేవుని విధేయులలో పరిగణించబడతాడు. ఇప్పుడు ఒకవేళ అతను ఏదైనా తప్పు, పాపం చేసినట్లయితే అతను నేరస్థునిగానే పరిగణించబడతాడు కాని, తిరుగుబాటుదారునిగా మాత్రం కాదు. అతను ఏదైనా మంచి చేస్తే దాని ప్రతిఫలానికి అర్హుడౌతాడు, ఏదైనా తప్పు చేస్తే దాని శిక్షకు పాత్రుడౌతాడు. ఇలాంటి వ్యక్తి దేవుని తిరుగుబాటుదారుని పరిధి నుంచి తప్పించుకుని వచ్చాడు. అలాంటప్పుడు ఇక అతని చిన్న చిన్న పుణ్యకార్యాలకు సైతం ప్రతిఫలం ఇవ్వబడుతుంది. ఒక్కొక్కప్పుడు తన జీవితాంతం పాపకార్యాల్లో మునిగివున్నప్పటికీ చివర్లో ఏదో ఒక పుణ్యకార్యం చేస్తే

వెనుకటి పాపాలన్నీ పరిహరించబడే ఆస్కారమూ వుంది. ఉదాహరణకు, ఒక వ్యక్తి నిలువెల్లా పాపాత్ముడే. కాని అతను ముస్లిం - విశ్వాసి. ఇస్లాంకు, కుఫ్ర్ (తిరస్కారం)కు మధ్య యుద్ధం సంభవిస్తుంది. అలాంటి పరిస్థితిలో విశ్వాసం అతనిలో జాగృతమవుతుంది. అతను దైవమార్గంలో పోరాడతాడు. ఈ విధంగా అతని ఈ ఒక్క ఆచరణ అతని పాపకార్యాలన్నింటికీ పరిహారంగా మారుతుంది. అందువలన ఒక ముస్లిం మన్నింపునకై ఎన్నో రకాల ఆచరణలున్నాయి. అందుకనే ఇక్కడ ప్రతి ముస్లిం మన్నించబడతాడని సెలవియ్యటం జరిగింది.

మన్నింపునకు కూడా రెండు అర్థాలున్నాయి. ఒకటి సంపూర్ణ మన్నింపు. రెండవది సగం మన్నింపు - సంపూర్ణ మన్నింపు అంటే అతని తప్పులన్నీ మన్నించబడతాయి. సగం మన్నింపు అంటే అతని ఒక్కొక్క పుణ్యకార్యం ఒక్కొక్క పాపానికి పరిహారమవుతుంది. అంతేకాని అతను తన పాపాలపై పట్టుబడతాడని కాదు. పరలోకంలో ఆ వ్యక్తి గురించి అతను ఎన్ని మంచిపనులు చేశాడు, మరెన్ని చెడు పనులు చేశాడని లెక్కించబడుతుంది. అతని మంచిపనుల ద్వారా చెడు పనులు పరిహరించబడతాయి. అప్పటికీ చెడులే అధికంగా వున్నట్లు తేలిపోతే ఇక అతనికి శిక్ష పడే ప్రశ్న తలెత్తుంది. అయితే అల్లాహ్ తన కరుణానుగ్రహాలతో అతన్ని శిక్షించే బదులు మన్నించనూవచ్చు.

## దైవప్రీతి కొరకు ఒక రోజు రోజా పాటించిన దాని శ్రేష్ఠత

١١٦ - عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ صَامَ يَوْمًا ابْتِغَاءَ وَجْهِ اللهِ بَعَّدَهُ اللهُ مِنْ جَهَنَّمَ كَبُعْدِ غُرَابٍ طَائِرٍ وَهُوَ فَرْخٌ حَتَّى مَاتَ هَرِمًا۔

(رَوَاهُ أَحْمَدُ وَرَوَى الْبَيْهَقِيُّ فِي شُعَبِ الْإِيْمَانِ عَنْ سَلَمَةَ بْنِ قَيْسٍ)

**116.** హజ్రత్ అబూ హురైరా (రజి) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఏ వ్యక్తి అయితే దైవప్రీతి కొరకు ఒక రోజు రోజా పాటిస్తాడో అలాంటి వ్యక్తికి అల్లాహ్ నరకాన్ని ఎంతదూరంగా వుంచుతాడంటే ఒక కాకి పుట్టినప్పటి నుంచి ముసలిదై చచ్చిపోయే స్థితికి చేరుకునే కాలవ్యవధి వరకు ఎంతదూరం ఎగిరిపోతుందో అంతదూరం వరకు.. (అహ్మద్, బైహఖీ)

ఇంతకు ముందు ఇలాంటి కోవకు చెందిన పలు హదీసులు వచ్చాయి. వాటిలో ఒక దానిలో దైవమార్గంలో రోజా పాటించిన వ్యక్తికి ఇలాంటి పుణ్యం లభిస్తుందని పేర్కొనటం జరిగింది. కాని ఈ హదీసులో దైవప్రీతి కొరకు రోజా పాటించిన వ్యక్తికి ఇలాంటి పుణ్యం లభిస్తుందని పేర్కొనటం జరిగింది.

ఒక వ్యక్తి ఒక నఫిల్ రోజా పాటించి, ఇక నరకం నా నుంచి ఎంతో దూరం చేయబడింది కాబట్టి ఇంకా నేను మరిన్ని దైవారాధనలు చేసి, కష్టపడాల్సిన అవసరం దేనికీ అన్నది దీని అర్థం కాదు. వాస్తవానికి ఇలాంటి మాట అల్లాహ్ ఆరాధనల పట్ల సాకులు వెతుకుతూ పలాయనం చిత్తగించేవారిని ఉద్దేశించి చెప్పటం జరగలేదు. ఈ మాట పూర్తి ఏకాగ్రచిత్తంతో, భక్తి ప్రపత్తులతో విధులను నిర్వర్తించేవారి నుద్దేశించి చెప్పటం జరిగింది. వారు మరో ప్రక్క మరింతగా అల్లాహ్ ప్రీతిని పొందే ఉద్దేశంతో మరిన్ని పుణ్యకార్యాలు చేసేవారై వుంటారు.

ఇలాంటి హదీసులను గమనించి కొంతమంది తమ నాసికలను ఎగురవేస్తూ ఇలాంటి హదీసులే జనాల్ని చెడగొడుతున్నాయని అంటూ వుంటారు. కాని ఇలాంటి హదీసులే సమాజాన్ని సంస్కరించాయని వారికి తెలియదు. ఇలాంటి పుణ్యాత్ములైన వ్యక్తులు దైవప్రీతిని బడయటానికి సమయం కొరకు నిత్యం పరితపిస్తూ వుంటారు. ఈ ఫలానా పనిచేస్తే ఫలానా పుణ్యం ప్రాప్తిస్తుందని వారికి తెలియజేయటం జరుగుతుంది. వీరు ప్రతి ఒక్క పనికి పూనుకుంటారు. నిత్యం ఏ మంచి పని అయినా వారి నుంచి చేజారిపోకూడదని అనుక్షణం తపనపడుతుంటారు.

بَابٌ

# అధ్యాయం

మొదటి భాగం

## నఫిల్ రోజాలో వేళకంటే ముందు ఇఫ్తార్ చేసే విషయంలో ప్రవక్త (స) గారి రెండు ఆచరణలు

١١٧- عَنْ عَائِشَةَ قَالَتْ دَخَلَ عَلَيَّ النَّبِيُّ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ ذَاتَ يَوْمٍ فَقَالَ هَلْ عِنْدَكُمْ شَيْءٌ
فَقُلْنَا لَا، قَالَ فَإِنِّي إِذًا صَائِمٌ، ثُمَّ أَتَانَا يَوْمًا آخَرَ
فَقُلْنَا يَا رَسُوْلَ اللهِ أُهْدِيَ لَنَا حَيْسٌ فَقَالَ أَرِيْنِيْهِ
فَلَقَدْ أَصْبَحْتُ صَائِمًا فَأَكَلَ (رَوَاهُ مُسْلِمٌ)

**117.** హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా ఉల్లేఖించారు : ఒకసారి దైవప్రవక్త (స) నా వద్దకు విచ్చేసి 'నీ వద్ద తినటానికి ఏదైనా వుందా?' అని ఆరా తీశారు. 'లేదు' అని నేను విన్నవించాను. 'మంచిది, ఈ రోజు రోజా పాటిస్తాను' అని ఆయన (స) సెలవిచ్చారు. మళ్ళీ మరో రోజు మా వద్దకు విచ్చేయగా నేను 'ఓ దైవప్రవక్తా (స)! మా వద్దకు ఎవరో "హైస్"▲ను పంపారు' అని విన్నవించాను. 'మంచిది, తీసుకువచ్చి నాకు చూపండి. నేనైతే ఉదయం రోజా పాటించే సంకల్పం చేసుకున్నాను' అని సెలవిచ్చి దాన్ని ఆరగించారు. (ముస్లిం)

ఈ హదీసులో తెలిపినట్లు ఒకసారి ఇంట ఏమీ లేని కారణాన ప్రవక్త (స) ఆ రోజు రోజా పాటించారు. అలానే మరో గోజు ఇంట్లో ఏమీ లేదు కాబోలు అని

---

▲ ఖర్జూరం, నెయ్యి, పాలుకలిపి చేసిన పదార్థాన్ని 'హైస్' అని అంటారు.

భావించి రోజా పాటించారు. పిదప కానుకగా "హైస్" అనే పదార్థం పంపబడినట్లు తెలుసుకొని దాన్ని ఆరగించి రోజా విడిచారు. ఈ రెండు సంఘటనలు నఫిల్ రోజాకు సంబంధించినవి. ముస్ముందు ఇలాంటివే మరికొన్ని హదీసులు రాబోతున్నాయి.

## నఫిల్ రోజాను ఖజా చేసుకోవటం

١١٨- عَنْ اَنَسٍ قَالَ دَخَلَ النَّبِيُّ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ عَلٰى اُمِّ سُلَيْمٍ فَاَتَتْهُ بِتَمْرٍ وَ
سَمْنٍ، فَقَالَ اَعِيْدُوْا سَمْنَكُمْ فِيْ سِقَائِهٖ
وَتَمْرَكُمْ فِيْ وِعَائِهٖ فَاِنِّيْ صَائِمٌ، ثُمَّ قَامَ
اِلٰى نَاحِيَةٍ مِّنَ الْبَيْتِ فَصَلّٰى غَيْرَ الْمَكْتُوْبَةِ فَدَعَا
لِاُمِّ سُلَيْمٍ وَ اَهْلِ بَيْتِهَا. (رَوَاهُ الْبُخَارِيُّ)

**118.** **హజ్రత్ అనస్ (రజి) ఇలా ఉల్లేఖించారు : ఒకసారి దైవప్రవక్త (స) నా తల్లి ఉమ్ము సులైమ్ (ర.అ) వద్దకు వెళ్ళగా ఆమె ప్రవక్త (స) సేవలో ఖర్జూరం, నెయ్యి తీసుకువచ్చారు. దానిపై ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "మీ నెయ్యి పాత్రలో పోసుకోండి, ఇంకా మీ ఖర్జూరాలను సంచిలో పెట్టండి, ఎందుకంటే ఈ రోజు నేను రోజా పాటిస్తున్నాను." తరువాత దైవప్రవక్త (స) ఇంటి ఓ మూలలో నిల్చొని నఫిల్ నమాజ్ చేసుకున్నారు, తరువాత హజ్రత్ ఉమ్ము సులైమ్ (ర.అ) కొరకు, ఆమె ఇంటి వారికొరకు దుఆ చేశారు. (బుఖారీ)**

హజ్రత్ ఉమ్ము సులైమ్ (ర.అ) హజ్రత్ అనస్ (రజి) గారి తల్లి. ఈ కుటుంబీకు లంతా దైవప్రవక్త (స) పట్ల ఎనలేని ప్రేమ చూపించేవారు, ఇంకా ఆయన (స) సేవలో వుండేవారు. ప్రవక్త (స) కూడా ఆ కుటుంబీకుల పట్ల ప్రేమ భావంతో మెలిగేవారు. 10వ యేట ఉన్నప్పుడే హజ్రత్ అనస్ (రజి) గారిని ఆయన కుటుంబీకులు ప్రవక్త (స) సేవలో వదలిపెట్టారు. ఆపై ఆయన (రజి) ప్రవక్త (స) గారి సేవలో పదేళ్లు గడిపారు. ఈ చిరకాల అనుబంధం, ప్రేమైక భావాల రీత్యా ప్రవక్త (స) తరచూ వారి ఇంటికి విచ్చేసేవారు. హజ్రత్ అనస్ (రజి) అలాంటి ఓ సందర్భాన్నే ఇక్కడ ప్రస్తావించారు.

ఈ విధంగా రెండు విభిన్న హదీసులు మీ ముందుకొచ్చాయి. ఒక హదీసులో ప్రవక్త (స) నఫిల్ రోజా పాటించారు, తినే పదార్థం వస్తే దాన్ని సేవించారు. ప్రస్తుత హదీసులో ప్రవక్త (స) రోజాలో వున్నప్పుడు ఆహార పదార్థాన్ని ఆయన ముందుంచినప్పుడు దాన్ని ఆయన (స) తినకుండా 'నేను రోజాలో వున్నాను' అని సెలవిచ్చారు. ఈ రెండు హదీసులను గమనించిన పిదప తెలిసేదేమంటే, ఒక పరిస్థితి ఏమంటే ఇంట్లో తినటానికి ఏమీ లేదని తెలిసి ప్రవక్త (స) రోజా పాటించారు. ఆ తరువాత ఇంటికి ఎవరో తినే వస్తువును పంపారని తెలిసినప్పుడు దాన్ని సేవించారు. ఇంట్లో తినటానికి ఏమీ లేదని తెలిసి రోజా సంకల్పాన్ని చేసుకున్నారు – అల్లాహ్ వద్ద దాని పుణ్యఫలం లభిస్తుందన్న ఉద్దేశంతో. రెండో పరిస్థితిలో మొదటే నఫిల్ రోజా వుండే సంకల్పం చేసుకున్నారు, అప్పుడు తినే పదార్థం ముందు పెట్టబడినప్పటికీ ఇఫ్తార్ చేయలేదు. ఈ రెండు పరిస్థితుల్లోనూ చాలా తేడా ఉంది. మొదటి స్థితిలో తినటానికి ఏమీ లేదు కాబట్టి రోజా పాటించారు, ఆపై తినే వస్తువు ముందుకొచ్చినప్పుడు దాన్ని సేవించారు. రెండో స్థితిలో మొదటి నుంచే రోజా సంకల్పం చేసుకున్న కారణాన, తినే పదార్థం ముందు పెట్టబడినా నఫిల్ రోజాలో వున్నా దాన్ని తినలేదు.

ఫిఖ్‌హ్‌వేత్తల మధ్య నఫిల్ రోజా ఖజా చేసే విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. వివిధ హదీసుల వెలుగులో ఇమామ్ అహ్మద్ (రహ్మ), ఇమామ్ షాఫయి (రహ్మ) గారి అభిప్రాయం ఎలా ఉందంటే, ఒకవేళ ఎవరైనా వ్యక్తి నఫిల్ రోజాలో వుండి, ఏదైనా తిని దాన్ని భంగం చేసినా దాని బదులు ఖజా పాటించే అవసరం లేదు. ఇమామ్ అబూ హనీఫా (రహ్మ) గారి అభిప్రాయంలో దానికి ఖజా పాటించాలి. ఇంకా ఇమామ్ మాలిక్ (రహ్మ) గారి అభిప్రాయంలో ఎలాంటి కారణం లేకుండా రోజాను భంగం చేసినట్లయితే దానికి ఖజా పాటించాలి. అయితే సరిఅయిన కారణం చూపి మధ్యలోనే ఇఫ్తార్ చేసినట్లైతే దానికి ఖజా లేదు.

## భోజనానికి ఎవరైనా ఆహ్వానిస్తే అంగీకరించటం మంచి పద్ధతి

۱۱۹۔ عَنْ اَبِیْ هُرَیْرَةَ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ
عَلَیْهِ وَسَلَّمَ اِذَا دُعِیَ اَحَدُکُمْ اِلٰی طَعَامٍ وَهُوَ
صَائِمٌ فَلْیَقُلْ اِنِّیْ صَائِمٌ۔ وَفِیْ رِوَایَةٍ۔ قَالَ اِذَا دُعِیَ
اَحَدُکُمْ فَلْیُجِبْ فَاِنْ کَانَ مُفْطِرًا فَلْیَطْعَمْ۔
(رَوَاهُ مُسْلِمٌ)

**119.** **హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు : ఎవరైనా మీకు విందుకు ఆహ్వానించినప్పుడు మీరు ఉపవాసంలో వున్నట్లయితే "నేను ఉపవాసంలో వున్నాన"ని వారితో చెప్పాలి. మరో ఉల్లేఖనంలో ప్రవక్త (స) సెలవిచ్చారు : ఎవరైనా మిమ్మల్ని విందుకు ఆహ్వానిస్తే, ఆహ్వానాన్ని స్వీకరించాలి. ఒకవేళ మీరు ఉపవాసంలో వుంటే నమాజ్ చేసుకోవాలి. లేకపోతే విందు భోజనం చేయాలి. (ముస్లిం)**

"ఫల్‌యుసల్లీ" అంటే భావం 'అతను రోజాలో వుంటే నమాజ్ చేయాలి.' ఈ సందర్భంగా దీనికి రెండు భావాలున్నాయి. ఒకటి : విందుకు పిలిచిన వారి కొరకు దుఆ చేయాలి, రెండు : ప్రజలు భోజనం చేయడానికి సంసిద్ధులైనప్పుడు ఆ సమయంలో ఇతను నమాజ్ చేయాలి. ఈ రెండు అర్థాలు జోడిస్తే, మనిషి నఫిల్ నమాజ్‌లూ ఆచరించాలి, ఆతిథేయుని కొరకు దుఆ కూడా చేయాలి.

## రెండవ భాగం

## నఫిల్ రోజా పాటిస్తున్నప్పుడు నిర్ణీత సమయానికి ముందే ఇఫ్తార్ చేయవచ్చు

١٢٠- عَنْ أُمِّ هَانِئٍ قَالَتْ لَمَّا كَانَ يَوْمُ الْفَتْحِ فَتْحِ
مَكَّةَ جَاءَتْ فَاطِمَةُ فَجَلَسَتْ عَلَى يَسَارِ رَسُولِ
اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَأُمُّ هَانِئٍ عَنْ
يَمِيْنِهٖ، فَجَاءَتِ الْوَلِيْدَةُ بِإِنَاءٍ فِيْهِ شَرَابٌ فَنَاوَلَتْهُ
فَشَرِبَ مِنْهُ، ثُمَّ نَاوَلَهُ أُمَّ هَانِئٍ فَشَرِبَتْ مِنْهُ
فَقَالَتْ يَا رَسُولَ اللهِ لَقَدْ أَفْطَرْتُ
وَكُنْتُ صَائِمَةً، فَقَالَ لَهَا أَكُنْتِ تَقْضِيْنَ شَيْئًا
قَالَتْ لَا، قَالَ فَلَا يَضُرُّكِ إِنْ كَانَ تَطَوُّعًا- وَفِيْ رِوَايَةٍ
فَقَالَتْ يَا رَسُوْلَ اللهِ أَمَا إِنِّيْ كُنْتُ صَائِمَةً، فَقَالَ:
اَلصَّائِمُ الْمُتَطَوِّعُ أَمِيْرُ نَفْسِهٖ، إِنْ شَاءَ صَامَ
وَإِنْ شَاءَ أَفْطَرَ- (رَوَاهُ أَبُوْدَاوُدَ وَالتِّرْمِذِيُّ وَالدَّارِمِيُّ وَأَحْمَدُ)

**120.** **హజ్రత్ ఉమ్మె హానీ (ర.అ)▲ గారు ఇలా తెలిపారు : మక్కా విజయం నాడు దైవప్రవక్త (స) నా వద్దకు వచ్చిన సందర్భాన హజ్రత్ ఫాతిమా (ర.అ) ప్రవక్త (స) సన్నిధిలో హాజరయి ప్రవక్త (స) గారి ఎడమ వైపు కూర్చోగా నేను (ఉమ్మెహాని) ఆయన (స) గారి కుడి వైపున కూర్చున్నాను. అంతలో ఇంటి బానిసరాలైన అమ్మాయి ఓ పళ్లెరంలో త్రాగేందుకు పానీయాన్ని తీసుకువచ్చి ప్రవక్త (స) సేవలో పెట్టింది. ఆయన (స) దానిలోనుంచి కొంత త్రాగి నా చేతికి ఇచ్చారు. నేను అందులో నుంచి కొంత త్రాగి ఇలా విన్నవించుకున్నాను : "ఓ దైవప్రవక్తా (స)! నేను రోజా విడిచాను. నిజానికి నేను (ఈ రోజు) రోజా పాటించాను." దీనిపై ఆయన (స) "నీవు నీ తప్పిపోయిన ఖజా రోజాలు పాటిస్తున్నావా?" అని సెలవియ్యగా, నేను "లేదు" అని జవాబిచ్చాను. ఆపై ఆయన (స) "ఒకవేళ ఇది నఫిల్ రోజా అయితే (ఇలా ఇఫ్తార్ చేయటంలో) మరేం ఫరవా లేదు" అని సెలవిచ్చారు. మరో ఉల్లేఖనంలో పేర్కొన్నట్లు హజ్రత్ ఉమ్మె హానీ (ర.అ) ఇలా విన్నవించుకున్నారు : "ఓ దైవప్రవక్తా (స)! నేను రోజా పాటిస్తున్నాను." దానిపై ప్రవక్త (స), "నఫిల్ రోజా పాటించేవారు తన మనస్సుకు నాయకుని (చక్రవర్తి) లాంటివారు. వారు తలచుకుంటే రోజా పాటించవచ్చు (అంటే రోజాను పూర్తి చేసుకోవచ్చు), లేదనుకుంటే ఇఫ్తార్ చేయవచ్చు" అని అన్నారు.**

**(అబూదావూద్, తిర్మిజీ, దారిమీ, అహ్మద్)**

విశ్వసించిన ఒక పురుషుడు లేక స్త్రీ కొరకు ప్రవక్త (స) త్రాగిన నీటి పాత్రను తనకు సమర్పిస్తే అంతకంటే ఎక్కువ భాగ్యం ఏముంటుంది? అందువల్లనే హజ్రత్ ఉమ్మె హానీ (ర.అ) ప్రవక్త (స) విడిచిపెట్టిన పానీయాన్ని ఎంతో మక్కువతో త్రాగారు. కాని ఆపై ఆమెకు దీన్నే ఇఫ్తార్‌గా భావించాల్నా, వద్దా అనే ఆలోచన వచ్చి ఆమె ప్రవక్త (స)తో "దైవప్రవక్తా (స)! నేనైతే రోజాలో వున్నాను" అని విన్నవించుకున్నారు. దానిపై ప్రవక్త (స) "ఒకవేళ ఇది నఫిల్ రోజా అయితే ఇందులో ఎలాంటి దోషం లేద"ని సెలవిచ్చారు.

దీనివలన తెలిసేదేమంటే, నఫిల్ ఉపవాసం పాటించేవారు ఫర్జ్ రోజాలో

---

▲ *ఈమెగారు ప్రవక్త (స) గారి బాబాయి కూతురు. హజ్రత్ అలీ (రజి) గారి సొంత చెల్లెలు.*

వున్న నిబంధనలను పాటించాల్సిన అవసరం లేదు. ఒకవేళ ఎవరైనా ఒక వ్యక్తి ఉద్దేశ్యపూర్వకంగా ఫర్జ్ రోజాను త్యజిస్తే దానికి పరిహారంగా అతను 60 రోజాలయినా పాటించాలి లేదా 60 మంది నిరుపేదలకు అన్నం అయినా పెట్టాలి. కాని మధ్యలోనే నఫిల్ రోజాను విడిచిపెడితే దానికి ఎలాంటి పరిహారం లేదు.

"మరేం ఫరవాలేదు" అన్న పదాలకు ఒక అర్థం, నఫిల్ రోజాలు విడిచిపెడితే దానిపై ఎలాంటి పరిహారం తప్పనిసరి కాదు లేదా ఎలాంటి శిక్షా పడదు. మరో భావంలో దానికి ఖజా చేయాలి, అయితే అలా రోజా విడవటంలో ఎలాంటి దోషం లేదు. ఈ విషయంలో ఫికహ్‌వేత్తల మధ్య ఈ హదీసును అర్థం చేసుకోవటంలో అభిప్రాయభేదం తలెత్తింది. అయితే దానికి ఏదో ఒక మూలాధారం ఉంది. ప్రతివారూ ఏదో ఒక దాన్ని ఆధారంగా పేర్కొన్నారు. ఆధారం లేకుండానే వారు ఎలాంటి ఫత్వా (తీర్పు)ను ఇవ్వటం జరగలేదు.

## నఫిల్ రోజాను ఖజా చేయటం

١٢١- عَنِ الزُّهْرِيِّ عَنْ عُرْوَةَ عَنْ عَائِشَةَ قَالَتْ
كُنْتُ أَنَا وَحَفْصَةُ صَائِمَتَيْنِ فَعُرِضَ لَنَا طَعَامٌ
اِشْتَهَيْنَاهُ فَأَكَلْنَا مِنْهُ، فَقَالَتْ حَفْصَةُ يَا
رَسُوْلَ اللهِ إِنَّا كُنَّا صَائِمَتَيْنِ فَعُرِضَ لَنَا طَعَامٌ
اِشْتَهَيْنَاهُ فَأَكَلْنَا مِنْهُ، قَالَ اِقْضِيَا يَوْمًا
آخَرَ مَكَانَهُ (رَوَاهُ التِّرْمِذِيُّ وَأَبُوْدَاوُدَ)

**121.** ఇమామ్ జుహ్‌రీ (రహ్మ) ఉర్వా (రజి) బిన్ జుబైర్ ద్వారా ఆయన హజ్రత్ ఆయిషా (ర.అ) ద్వారా ఉల్లేఖించారు : నేను మరియు హజ్రత్ హఫ్సా (ర.అ) ఒకసారి రోజాలు వున్నాం. ఈ సందర్భంగా మా వద్దకు ఓ రుచికరమైన పదార్థం వచ్చింది. అది మాకెంతో ఇష్టమైనది. మేమిద్దరం దానిని తిన్నాం. ఆ పిదప హజ్రత్ హఫ్సా ప్రవక్త (స)తో, "దైవప్రవక్తా (స)! మేమిద్దరం రోజాలో వున్నప్పుడు మా ముందు మాకెంతో ప్రీతికర మైన పదార్థం సమర్పించబడింది. మేము దాన్ని తిన్నాం" అని విన్నవించారు. దానిపై ప్రవక్త (స) "దీని ఖజా పూరించడానికి మరేదైనా రోజు రోజా పాటించండి" అని సెలవిచ్చారు. (తిర్మిజీ, అబూదావూద్)

ఇంతకు ముందు వచ్చిన హదీసులో మీరు మీ మనస్సుకు నాయకులు. మీకు ఇష్టమైతే నఫిల్ రోజా పాటించవచ్చు లేదా మానవచ్చు. రోజాలో వున్నప్పుడు మధ్యలోనే ఇఫ్తార్ చేసినా మరేం ఫరవాలేదు అని సెలవియ్యటం జరిగింది. ఇక్కడ దాని ఖజా పూర్తి చేసుకోండి అని సెలవియ్యటం జరిగింది. ఇలాంటి హదీసుల్ని సంకలనం చేయటం వలన "ఖజా చేసుకోండి" అన్న పదాల భావం 'మీరు ఖజా చేసుకోవాలి' అని కూడా వస్తుంది, మరోభావం "మీరు రోజాను మధ్యలోనే విరమిస్తే అందులో ఎలాంటి దోషమూ లేదు" అని కూడా వస్తుంది. అయితే ఒకవేళ మీ మనస్సులో ఏదైనా వెలితిగా అనిపిస్తే మరో రోజు దాని ఖజా చేసుకోవాలి. అయితే రోజాను విడిచిపెట్టినందుకు ఎలాంటి నిలదీత లేదు.

ఫికహ్‌వేత్తల మధ్య సాధారణంగా ఇలాంటి హదీసుల్లో లేదా ఆయత్‌లలో అర్థాలను నిర్ణయించటంలో భేదాభిప్రాయాలు తలెత్తుతాయి. ఇది సహజమే. కొన్ని సందర్భాలు ఎలా ఉంటాయంటే మరొకరి భాష్యం దోషయుక్తమైనది అని నిర్ణయించే గట్టి ఆధారం ఏదీ లభించదు. అయితే ప్రతివారికి తమ ఆధారం బలీయమైనదిగా కన్పిస్తుంది. కాని ఇతరుల దృష్టిలో అది తేలిగ్గా భావించబడుతుంది. అందువలన ఇలాంటి సందర్భాల్లో ఫలానా వారి భాష్యం పూర్తిగా తప్పుయినదని ఖండించటం భావ్యం కాదు. ఇదేవిధంగా ఎవరినయినా, ఫలానా వ్యక్తి ఖుర్ఆన్, హదీసులకు విరుద్ధంగా ప్రవర్తిస్తాడని ఖరాఖండిగా చెప్పటమూ భావ్యం కాదు.

## నఫిల్ రోజా పాటించేవారి శ్రేష్ఠత

١٢٢۔ عَنْ أُمِّ عُمَارَةَ بِنْتِ كَعْبٍ أَنَّ النَّبِيَّ صَلَّى اللهُ
عَلَيْهِ وَسَلَّمَ، دَخَلَ عَلَيْهَا فَدَعَتْ لَهُ بِطَعَامٍ
فَقَالَ لَهَا كُلِي فَقَالَتْ إِنِّي صَائِمَةٌ فَقَالَ النَّبِيُّ
صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ إِنَّ الصَّائِمَ إِذَا أُكِلَ
عِنْدَهُ صَلَّتْ عَلَيْهِ الْمَلَائِكَةُ حَتَّى يَفْرُغُوا۔
(رَوَاهُ أَحْمَدُ وَالتِّرْمِذِيُّ وَابْنُ مَاجَهْ وَالدَّارِمِيُّ)

**122.** హజ్రత్ ఉమ్మె ఉమారా బిన్తె కఅబ్ (ర.అ) గారి ఉల్లేఖనం : ఒకరోజు

దైవప్రవక్త (స) మా ఇంటికి వచ్చిన సందర్భాన ఆయన ముందు భోజనం సమర్పించాము. అప్పుడు ఆయన (స), నీవు కూడా తిను అని సెలవివ్వగా, 'నేను రోజాలో వున్నాను' అని విన్నవించుకున్నాను. దానిపై ప్రవక్త (స) "ఒకవేళ రోజా పాటిస్తున్న వ్యక్తి ముందు తినటం, త్రాగటం చేస్తున్నప్పుడు (అతను అందులో పాల్గొనకపోతే) అతని ఇంటి అతిథులు తినటం త్రాగటం పూర్తి చేసేవరకు దైవదూతలు అతని మన్నింపు, క్షమాభిక్ష కొరకు దుఆ చేస్తూనే వుంటారు" అని సెలవిచ్చారు.

(అహ్మద్, తిర్మిజీ, ఇబ్నెమాజా, దారిమీ)

మనిషి నఫిల్ రోజాలు పాటిస్తున్నప్పుడు - మధ్యలో అతను తిని, త్రాగే హక్కు కలిగివుండి కూడా - ఇతరులు తన ముందు తింటూ, త్రాగుతున్నప్పుడు తాను రోజాను పాటించటం ఎంతో గొప్ప విషయం. ఈ సందర్భంగా తాను కనబరిచే సహనం, మనోనిబ్బరం, దైవప్రీతిని పొందే మక్కువ ఎంతో కొనియాడదగింది. దీని కారణంగా దైవదూతలు కూడా దానికి తగ్గట్టుగా అలాంటి వ్యక్తి మన్నింపు, క్షమాభిక్షల కొరకు ప్రార్థిస్తూ ఉంటారు.

మూడవ భాగం

## నఫిల్ రోజాకు లభించే పుణ్యం

١٢٣- عَنْ بُرَيْدَةَ قَالَ دَخَلَ بِلَالٌ عَلٰى رَسُوْلِ اللّٰهِ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ يَتَغَدّٰى، فَقَالَ رَسُوْلُ
اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اَلْغَدَاءَ يَا بِلَالُ، قَالَ
اِنِّيْ صَائِمٌ يَا رَسُوْلَ اللّٰهِ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
نَاكُلُ رِزْقَنَا وَفَضْلُ رِزْقِ بِلَالٍ فِي الْجَنَّةِ، اَشَعَرْتَ
يَا بِلَالُ اَنَّ الصَّائِمَ يُسَبِّحُ عِظَامُهُ وَيَسْتَغْفِرُ
لَهُ الْمَلَائِكَةُ مَا اُكِلَ عِنْدَهُ۔ (اَلْبَيْهَقِيُّ)

**123.** హజ్రత్ బురైదా (రజి) ఉల్లేఖనం : ఒకసారి హజ్రత్ బిలాల్ (రజి) దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరైనప్పుడు ప్రవక్త (స) పగటి పూట భోజనం చేస్తున్నారు. ప్రవక్త (స) అప్పుడు "బిలాల్ రండి, మీరూ భోజనం చేయండి" అని సెలవిచ్చారు. దానికి "దైవప్రవక్తా (స)! నేను

**రోజాలో వున్నాను" అని హజ్రత్ బిలాల్ విన్నవించుకున్నారు. ఆపై ప్రవక్త (స) "మేము మా వంతు ఆహారం భుజిస్తున్నాము. బిలాల్‌కు చెందిన ఉత్తమ ఆహారం స్వర్గంలో వుంది. ఓ బిలాల్! మీకు తెలుసా? ఉపవాసి ముందు జనులు భోజనం చేసేంతవరకు అతని ఎముకలు కూడా దేవుని పరిశుద్ధతను కొనియాడుతూ వుంటాయి. ఇంకా దైవదూతలు కూడా అతని మన్నింపు, క్షమాభిక్ష కొరకు దుఆ చేస్తూ వుంటారు" అని సెలవిచ్చారు. (బైహఖీ)**

ఒక మనిషికి భోజనం కొరకు పిలిచినప్పుడు అన్నం తన ముందు వున్నప్పటికీ నఫిల్ రోజాను పూరించే ఉద్దేశంతో దాన్ని తినకపోతే దానికి ఎంతటి ప్రతిఫలం ప్రసాదించబడుతుందంటే, ఆ ఆహారం అతని కొరకు స్వర్గంలో పదిలపర్చబడుతుంది. ఇంకా ఇతరులు తన ముందు కూర్చొని తినేంతవరకు అతని ఎముకలు దేవుని పరిశుద్ధతను కొనియాడుతుంటాయి, ఇంకా దైవదూతలు అతని మన్నింపు, క్షమాభిక్ష కొరకు దుఆ చేస్తూ ఉంటారు.

ഊ

# بَابُ لَيۡلَةِ الۡقَدۡرِ

# లైలతుల్ ఖద్ర్ (ఘనమైన రేయి) అధ్యాయం

మొదటి భాగం

## లైలతుల్ ఖద్ర్ రమజాన్ చివరి దశకంలోని బేసి రాత్రులలో ఉంది

۱۲۴- عَنۡ عَائِشَةَ قَالَتۡ قَالَ رَسُوۡلُ اللهِ صَلَّى اللهُ عَلَيۡهِ وَسَلَّمَ : تَحَرَّوۡا لَيۡلَةَ الۡقَدۡرِ فِي الۡوِتۡرِ مِنَ الۡعَشۡرِ الۡاَوَاخِرِ مِنۡ رَمَضَانَ (رَوَاهُ الۡبُخَارِيُّ)

**124.** **హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు : లైలతుల్ ఖద్ర్‌ను రమజాన్ నెలలో చివరి పది రోజుల్లోని బేసి రాత్రుల్లో (అంటే 21, 23, 25, 27 ఇంకా 29) వెదకండి.**

**(బుఖారీ)**

"లైలతుల్ ఖద్ర్" అంటే ఆ ప్రత్యేక రాత్రి పేరు కాదు. అది దాని గుణ వాచకం. ఎందుకంటే పవిత్ర ఖుర్ఆన్ ఆ ప్రత్యేక రాత్రిన అవతరింపజేయబడింది. అందువలన దానిని 'ఘనమైన రేయి' అని పిలువటం జరిగింది.

### 'ఖద్ర్' అంటే .... ?

'ఖద్ర్'కు అనేక అర్థాలున్నాయి. ఒక అర్థం ఏమిటంటే ఆ రాత్రి ఎంతో గౌరవప్రదమైన, శ్రద్ధ కనబరచాల్సిన రాత్రి. ఇంకా ఎంతో ఘనమైనది. ఎందుకంటే ఆ రాత్రిన ఖుర్ఆన్ అవతరింపజేయబడింది. అంతేకాకుండా 'ఖద్ర్' అన్న పదం 'అదృష్టం', 'విధివ్రాత' అన్న అర్థంలో కూడా వాడబడుతుంది. ఎందుకంటే ఖుర్ఆన్‌లో

సెలవియ్యబడింది : **"తనజ్జలుల్ మలాయికతు వర్రూహు ఫీహా బిఇజ్ని రబ్బిహిమ్ మిన్‌కుల్లి అమ్ర్"** (దైవదూతలు ఇంకా జిబ్రయీల్ –అలైహి– ఈ రాత్రి తమ ప్రభువు ఆజ్ఞతో ప్రతి తరహాకు చెందిన ఆదేశాలను, ఆజ్ఞలను తీసుకొని అవతరిస్తారు). అందువలన ఈ రాత్రిని 'అదృష్టాదురదృష్టాలు' నిర్ణయించే రాత్రి అన్న అర్థంలో కూడా తీసుకోవచ్చు. కొంతమంది వ్యాఖ్యాతలు 'ఖద్ర్' అన్న పదానికి 'విశాలత', 'మార్గము' ఇంకా 'కష్టం' అన్న అర్థాలు కూడా పేర్కొన్నారు. ఎందుకంటే ఇలాంటి వ్యాఖ్యాతలు 'లైలతుల్ ఖద్ర్'ను ఎలా పేర్కొన్నారంటే ఈ విషయంలో ప్రజలకు దాని సరిఅయిన తేదీని తెలుపకుండా అల్లాహ్ ప్రజలను ఇరకాటంలో పడేశాడు అని భాష్యం చెప్పారు. కాని ఇది చాలా దూరాలోచన.

లైలతుల్ ఖద్ర్ తాలూకు రమజాన్‌లో అది ఏ రాత్రిన వుందనే విషయాన్ని స్పష్టంగా తెలుపడం జరగలేదు. దైవప్రవక్త (స) తెలిపినట్లు అది రమజాన్ నెల చివరి దశకంలోని బేసి రాత్రుల్లో దాగి వుంది. అందువలన ఆయా రాత్రుల్లో దాన్ని వెదకాలి.

లైలతుల్ ఖద్ర్ ఖచ్చితంగా ఫలానా రాత్రి అని తెలుపకపోవటంలో మరో యుక్తి కూడా దాగివుందన్న విషయం తెలుస్తోంది. అలా తెలుపని కారణంగా మనిషి బహుశా ఈ రోజు రాత్రే లైలతుల్ ఖద్ర్ కాబోలు అని ప్రతి బేసి రాత్రిన దైవ సన్నిధిలో నిలబడి దైవారాధన చేస్తాడు. ఒకవేళ లైలతుల్ ఖద్ర్‌ను అతను పొందినట్లయితే దేనికొరకు అతను అభిలషిస్తున్నాడో దాన్ని అతను పొందినట్లే. ఇక ఆ తరువాత కూడా అతను మరికొన్ని రాత్రులు దైవారాధనలో గడిపినట్లయితే అతని పుణ్యఫలం మరింత అధికమవడానికి అది దోహదకారి కాగలదు.

## లైలతుల్ ఖద్ర్ విషయంలో గౌరవనీయులైన సహాబా (రజి) కన్న కల

١٢٥ ـ عَنِ ابْنِ عُمَرَ قَالَ إِنَّ رِجَالًا مِنْ أَصْحَابِ النَّبِيِّ ﷺ أُرُوا لَيْلَةَ الْقَدْرِ فِي الْمَنَامِ فِي السَّبْعِ الْأَوَاخِرِ فَقَالَ رَسُولُ اللّٰهِ ﷺ: أَرَى رُؤْيَاكُمْ قَدْ تَوَاطَأَتْ فِي السَّبْعِ الْأَوَاخِرِ فَمَنْ كَانَ مُتَحَرِّيَهَا فَلْيَتَحَرَّهَا فِي السَّبْعِ الْأَوَاخِرِ. (متفق عليه)

**125. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) గారి అనేకమంది సహచరు (రజి)లకు లైలతుల్ ఖద్ర్ రమజాన్ చివర్లోని ఏడు రాత్రుల్లో వుందన్న విషయాన్ని కలలో చూపించటం జరిగింది. ఇదే విషయాన్ని వారు దైవప్రవక్త (స) సన్నిధిలో విన్నవించగా ఆయన (స) ఇలా సెలవిచ్చారు : లైలతుల్ ఖద్ర్ రమజాన్ చివరి ఏడు రాత్రుల్లో వుందన్న విషయంపై మీ అందరి కలలు ఏకీభావంతో వున్నాయని నాకు తెలుస్తోంది. అంతే, ఇక ఏ వ్యక్తి అయితే లైలతుల్ ఖద్ర్‌ను వెదకాలని భావిస్తాడో అతను రమజాన్ చివరి ఏడు తేదీల్లో వెదకాలి. (ముత్తఫకున్ అలైహ్)**

ఇక్కడ గమనించాల్సిన మరో విషయం ఏమిటంటే అనేక హదీసుల్లో తెలిపిన విషయాలు ఒకదానితో మరొకటి భిన్నంగా వుండవచ్చు. వాటిలో విభేదానికి కారణం ఒక విధంగా కాల భేదం కావచ్చు. ఎందుకంటే ఉల్లేఖకులు వాటి ఉల్లేఖనంలో వాటి కాలం పేర్కొనలేదు. ఈ హదీసులో కూడా ఇది ఏ కాలానికి చెందినదో దేనికి సంబంధించినదో అన్న నిర్ధారణ జరగలేదు. పైన హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనంలో లైలతుల్ ఖద్ర్‌ను రమజాన్ చివరి పది తేదీల్లో వెదకాలని ప్రవక్త (స) సెలవిచ్చినట్లు పేర్కొనబడింది. ఇక్కడ అనేకమంది సహాబా కలను ప్రస్తావించటం జరిగింది. దాని ప్రకారం రమజాన్ చివరి ఏడు రాత్రుల్లో ఏదో ఒక రాత్రి లైలతుల్ ఖద్ర్ కావచ్చని పేర్కొనబడింది. అందువలన సహచరులందరూ ఒకేలా కలగనటాన్ని గమనించిన ప్రవక్త (స) ఇక లైలతుల్ ఖద్ర్‌ను రమజాన్ చివరి ఏడు రాత్రుల్లో వెదకండని సెలవిచ్చారు. దీనిద్వారా హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనం ముందు కాలానికి చెందినదని, ఇంకా హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) ఉల్లేఖనం తదుపరి కాలానికి చెందినదని తెలుస్తోంది (నిజం దేవుడెరుగు). ఒకదానితో మరొకటి విభేదిస్తున్నాయని ఇలాంటి హదీసుల్ని రద్దు చేయజాలం. వాటిలో విభేదమల్లా కాల భేదంతోనే ఏర్పడింది. ఇలాంటి విభేదం, కారణం వల్ల అవి నిరాధారమైనవని, దోషయుక్తమైనవని నిర్ణయించడానికి వీలు లేదు.

## లైలతుల్ ఖద్ర్‌ను రమజాన్ చివరి దశకంలోని బేసి రాత్రుల్లో వెదకాలని హితవు

١٢٦- عَنِ ابْنِ عَبَّاسٍ اَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ: اِلْتَمِسُوْهَا فِي الْعَشْرِ الْاَوَاخِرِ مِنْ رَمَضَانَ لَيْلَةَ
الْقَدْرِ فِيْ تَاسِعَةٍ تَبْقٰى، فِيْ سَابِعَةٍ تَبْقٰى، فِيْ
خَامِسَةٍ تَبْقٰى۔ (بخاری)

**126.** **హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : లైలతుల్ ఖద్ర్‌ను రమజాన్ చివరి పది రోజుల్లో వెదకండి. అంటే 21 లేక 29 లేదా 23 లేక 27 లేదా 25 తేదీల్లో.**

**(బుఖారీ)**

హదీసు మూలంలో **"ఫీ తాసియతిన్ తబ్‌ఖా"** ఇంకా ఇలాంటివే మరికొన్ని పదాలు వచ్చాయి. వాస్తవానికి ఇది అరబీ భాషలో సంఖ్యను తెలిపే ఒక ప్రత్యేక పద్ధతి. ఒకవేళ వాటికి శబ్దానువాదం చేస్తే భావంలో పొరపాటు రావచ్చు. అరబ్బులలో వ్రాయటం, చదవటం అలవాటు లేదు. అందువలన సాధారణంగా వారి లెక్కా పత్రం అంతా వ్రేళ్ళతోనే చేసేవారు. ఇంకా సంఖ్యను గణించే పద్ధతులు కూడా అమల్లో వుండేవి. అందులోని ఓ ప్రత్యేక పద్ధతి ప్రకారం ఇక్కడ లెక్కకట్టి తేదీలను నిర్ణయించటం జరిగింది.

హదీసు మూలం ద్వారా ఈ హదీసు కూడా హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనం కాలం నాటిదే అని తెలుస్తోంది. అయితే తేడా ఏమిటంటే హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖనంలో చివరి దశకంలోని బేసి రాత్రుల ప్రస్తావనను వదలివేయటం జరిగింది. కాని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) గారి ఉల్లేఖనంలో తేదీల నిర్ణయం, ఫలానా రాత్రుల్లో లైలతుల్ ఖద్ర్‌ను వెతకాలని చెప్పటం జరిగింది. ఈ విధంగా ఈ హదీసు మొదటి హదీసుతో కొంతమేర విభేదిస్తున్నా ఒకదానితో మరొకటి పూర్తిగా విరుద్ధం కాదు. పైగా ఒక హదీసు మరోదానిని సమర్థించేదిగా ఉంది.

లైలతుల్ ఖద్రను వెదకటానికి ప్రవక్త (స) పూర్తి రమజాన్ మాసం ఏతికాఫ్‌లో గడిపిన సంఘటన

١٢٧- عَنْ أَبِي سَعِيْدِ الْخُدْرِيِّ أَنَّ رَسُوْلَ اللّٰهِ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِعْتَكَفَ الْعَشْرَ الْاَوَّلَ
مِنْ رَمَضَانَ ثُمَّ اعْتَكَفَ الْعَشْرَ الْاَوْسَطَ فِيْ
قُبَّةٍ تُرْكِيَّةٍ ثُمَّ اَطْلَعَ رَاْسَهٗ فَقَالَ اِنِّيْ اعْتَكَفْتُ
الْعَشْرَ الْاَوَّلَ اَلْتَمِسُ هٰذِهِ اللَّيْلَةَ ثُمَّ اعْتَكَفْتُ
الْعَشْرَ الْاَوْسَطَ ثُمَّ اُتِيْتُ فَقِيْلَ لِيْ اِنَّهَا فِي
الْعَشْرِ الْاَوَاخِرِ فَمَنْ كَانَ اعْتَكَفَ مَعِيَ فَلْيَعْتَكِفِ
الْعَشْرَ الْاَوَاخِرَ فَقَدْ اُرِيْتُ هٰذِهِ اللَّيْلَةَ ثُمَّ
اُنْسِيْتُهَا وَقَدْ رَاَيْتُنِيْ اَسْجُدُ فِيْ مَاءٍ وَّطِيْنٍ مِنْ
صَبِيْحَتِهَا فَالْتَمِسُوْهَا فِي الْعَشْرِ الْاَوَاخِرِ وَالْتَمِسُوْهَا
فِيْ كُلِّ وِتْرٍ قَالَ فَمَطَرَتِ السَّمَاءُ تِلْكَ اللَّيْلَةَ
وَكَانَ الْمَسْجِدُ عَلٰى عَرِيْشٍ فَوَكَفَ الْمَسْجِدُ فَبَصُرَتْ
عَيْنَايَ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَعَلٰى
جَبْهَتِهٖ اَثَرُ الْمَاءِ وَالطِّيْنِ مِنْ صَبِيْحَةِ اِحْدٰى
وَعِشْرِيْنَ (مُتَّفَقٌ عَلَيْهِ فِي الْمَعْنٰى) ـــــ وَفِيْ

رِوَايَةِ عَبْدِ اللّٰهِ بْنِ اُنَيْسٍ قَالَ لَيْلَةَ ثَلَاثٍ وَّعِشْرِيْنَ۔
(رَوَاهُ مُسْلِمٌ)

**127.** హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) ఇలా ఉల్లేఖించారు : ఒకసారి దైవప్రవక్త (స) రమజాన్‌లోని మొదటి దశకంలో ఏతెకాఫ్ పాటించారు. మళ్లీ ఒకసారి ఆయన (స) టర్కీ ప్రాంత తరహాలోని ఒక గుడారంలో రమజాన్‌లోని మధ్యస్థ దశకంలో ఏతెకాఫ్ పాటించారు. ఏతెకాఫ్ పూర్తవగానే ఆయన (స) తన పవిత్రమైన తలను గుడారం నుంచి బయటికి తీసి సెలవిచ్చారు : నేను ఈ రేయిని వెదకటానికి మొదటి

**దశకంలో ఏతెకాఫ్ చేశాను. ఆపై నేను మధ్యస్థ దశకంలో ఏతెకాఫ్ పాటించాను. అప్పుడు నా వద్దకు వచ్చేవాడు వచ్చి, నాతో "లైలతుల్ ఖద్ర్ రమజాన్‌లోని చివరి దశకంలో ఉంది" అని అన్నాడు. అంటే, ఇక నాతో పాటు ఏతెకాఫ్ పాటించినవారు, ఇక రమజాన్ చివరి దశకంలో ఏతెకాఫ్ పాటించాలి. ఈ రేయి (లైలతుల్ ఖద్ర్) చూపించ బడింది, అయితే మళ్లీ మరపింపజేయబడింది. నేను ఆ రేయి ఉదయాన వర్షంలో తడిసిన మట్టిలో (వర్షం కారణంగా) నమాజ్ చేశాను. ఇక మీరు రమజాన్‌లోని చివరి దశకంలో పూర్తి రోజుల్లోని బేసి రాత్రుల్లో లైలతుల్ ఖద్ర్‌ను వెదకండి" - దీని తరువాత హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) తెలిపారు : ఒక రాత్రిన (దేన్ని గురించైతే ఆయన ప్రస్తావిస్తున్నారో) ఆ రాత్రి వర్షం కురిసింది. మస్జిదె నబవీ ఖర్జూరపు ఆకులతో కప్పబడిన ఒక అరుగులాంటి కప్పుతో కప్పబడింది. (మస్జిద్ క్రింది భాగంలో పరచబడిన వస్తువు ఏదీ లేదు. వర్షం కారణంగా మస్జిద్‌లో నీరు కారసాగింది. అప్పుడు నా కళ్లు 21వ తేదీ రాత్రి ఉదయం వేళ ఆయన (స) పవిత్ర నుదుటిపై వర్షపు నీరు ఇంకా మట్టి మిళితమై ఉండటం చూశాయి-ఇమామ్ బుఖారీ (రహ్మ), ఇమామ్ ముస్లిం (రహ్మ) భావం రీత్యా ఈ హదీసు పట్ల ఏకీభావం వ్యక్తం చేశారు. ఇంకా హజ్రత్ అబ్దుల్లాహ్ (రజి) బిన్ ఉనైస్ తన ఉల్లేఖనంలో ఈ రాత్రిని 23వ తేదీ రాత్రిగా పేర్కొన్నారు. దీనిని ఇమామ్ ముస్లిం (రహ్మ) ఉల్లేఖించారు.**

రమజాన్‌లోని వివిధ దశకాల్లో దైవప్రవక్త (స) ఏతెకాఫ్ పాటించటాన్ని బట్టి ఆయన (స) లైలతుల్ ఖద్ర్‌ను అన్వేషించేవారన్న విషయం తెలిసివచ్చింది. దీని కారణంగానే ఆయన మొదటి దశకంలో ఏతెకాఫ్ పాటించారు. మళ్లీ మధ్యస్థ దశకంలో రమజాన్ ఏతెకాఫ్ పాటించారు. ఆ పిదప లైలతుల్ ఖద్ర్ రమజాన్ చివరి దశకంలో వుందన్న విషయం సూచనగా అందింది. అందువలన ఆయన (స) తనతోవున్న సహబా (రజి) నుద్దేశించి మీరు కూడా ఇక చివరి దశకం రోజుల్లో ఏతెకాఫ్ పాటించండని పురమాయించారు.

హదీసు మూలంలో "ఇన్నీ ఉన్సీతుహా" అన్న పదాలు వచ్చాయి. వాటి అర్థం "ఆ రేయి నాకు మరపింపజేయబడింది". అంతేగాని "నేను మరచిపోయాను" అని సెలవియ్యబడలేదు. ఇక్కడ ఓ సున్నిత విషయం దాగివుంది. ఒకవేళ అల్లాహ్ తరఫున ఏదైనా విషయం హితవుగా అవతరించినా మరే విషయమయినా అల్లాహ్ తరఫున ప్రవక్త (స)కు ప్రసాదించబడినప్పుడు దాన్ని మరచిపోయినట్లయితే దాని

అర్థం, దేవుడు క్షమించుగాక, దైవదౌత్యం సురక్షితంగా లేదన్న భావం స్ఫురిస్తుంది. ఇలా జరగటం బుద్ధికందే విషయమే. ఒకవేళ అల్లాహ్‌యే మరపింపజేయాలని తలిస్తే ఆయనకు సర్వాధికారాలున్నాయి – తన ప్రవక్త (స) మనస్సు నుంచి ఏయే మాటలను తీసివేయాలనుకున్నా అది చేయగలడు. అల్లాహ్‌కు ప్రతి పని చేసే అధికారం ఎలా వుందో అదేవిధంగా తాను చేసిన ఎన్నో పనులను తొలగించే అధికారం కూడా కలిగివున్నాడు. అందువలన అల్లాహ్ తన ప్రవక్త (స)కు ఈ విషయాన్ని తెలుపకుండాను వుండలేదు, అయితే దాన్ని తెలిపిన తరువాత ఆయన (స) మనస్సు నుంచి తీసివేశాడు, ఎందుకంటే అల్లాహ్ ప్రజలకు ఏ విషయాన్నయితే తెలియజేయకూడదని తలచాడో దాన్ని ప్రజలకు చేరకుండా చేశాడు. అందువల్లనే ప్రవక్త (స) **"ఇన్నీ ఉన్సీతుహా"** – ఆ రేయి నాకు మరపింపజేయబడిందని సెలవిచ్చారు. ▲

ఇక ఇప్పుడు ఉల్లేఖకులైన హ్‌జ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) సంగ్రహించిన హదీసు ప్రకారం లైలతుల్ ఖద్ర్ 23వ తేదీ రాత్రి అన్నదాని వాస్తవం ఏమిటి? దానికి సమాధానం ఇది : దైవప్రవక్త (స), నాకు కలలో చూపించిన విషయం ఏమిటంటే అది ఏదో ఒక వర్షపు రాత్రి, ఉదయం వేళ నేను బురదలో సజ్దా చేశాను. ▲▲ దానిని ప్రజలు గమనించి చూస్తే అది 21 రేయిన వర్షం కురిసింది. ఫజ్ర్ నమాజ్ తరువాత దైవప్రవక్త (స) నుదుటిపై నీరు, మట్టి అంటి వుంది. దీనిపై

---

▲ *మరో హదీసుకు వ్యాఖ్యానం వ్రాస్తూ గౌరవనీయులైన మౌలానా ఈ విషయాన్ని ఇలా సెలవిచ్చారు : ధార్మిక విషయంలో ప్రవక్త (స)కు మరుపు అనేది సహజంగా వుంటుందని అనటం సరికాదు. దివ్య ఖుర్‌ఆన్‌లో సెలవియ్యబడింది:* ***సనుఖ్‌రిఉక ఫలా తన్‌సా ఇల్లా మాషా అల్లాహ్*** *(అల్ ఆలా : 6 & 7) – ఓ ప్రవక్తా! మేము నిన్ను చదివింపజేస్తాము. ఆ తర్వాత నీవు మరచిపోవు. కాని అల్లాహ్ కోరినది తప్ప – అని దైవప్రవక్త (స)కు సముదాయించి చెప్పటం జరిగింది. ఇంకా ఇలా సెలవియ్యబడింది –* ***'మా నన్‌సఖ్ మిన్ ఆయతిన్ అవ్ నున్‌సిహా నత్‌తి బిఖైరిమ్ మిన్‌హా అవ్ మిస్‌లిహా – అలమ్ తత్‌లమ్ అన్నల్లాహ అలా కుల్లి షైయిన్ ఖదీర్.'*** *(అల్ బఖరా: 106) – మేము ఎప్పుడయినా ఏదయినా ఆయత్‌ను రద్దుచేసినా లేక మరపింపజేసినా దాని వంటి లేక దానికంటే ఉత్తమమైన దానిని అవతరింపజేస్తాము. అల్లాహ్ అన్నింటిపై ఆధిపత్యం కలవాడని తెలియదా? – ఇక అసలు విషయమేమంటే అల్లాహ్ మొదట లైలతుల్ ఖద్ర్ గురించి తెలిపాడు, కాని తరువాత దానిని మరపింపజేశాడు. దీనిపై ఆయనకు పూర్తి అధికారం వుంది.*

▲▲ *ఆ కాలంలో మస్జిదె నబవీ (స) నేలన ఎలాంటి గచ్చు లేక నాపరాళ్లు పరచబడలేదు. ఉత్త నేలపై ఏవో కొన్ని కంకరరాళ్లు పోయబడ్డాయి. వర్షం కారణంగా అది బురదగా మారిపోయేది.*

ప్రజలు 'దైవప్రవక్త (స) చూపిన విధంగా లైలతుల్ ఖద్ర్ ఆ రేయినే' అనుకున్నారు. కాని 21వ రేయిలోనే లైలతుల్ ఖద్ర్ అని ప్రవక్త (స) పేర్కొనలేదన్న విషయాన్ని మనం గమనించాలి. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) ఇదే రేయి లైలతుల్ ఖద్ర్ కావచ్చు అని స్వయంగా తలపోశారు. ప్రవక్త (స)కు మరో రాత్రిని సూచించి ఉండవచ్చు. ఎందుకంటే అబ్దుల్లాహ్ బిన్ ఉనైస్ (రజి) ఉల్లేఖనంలో అది 23వ రాత్రి అన్న పదాలున్నాయి. ఈ విధంగా 21వ రాత్రి అన్నది బలంగా లేదు. ప్రజలకు అది ఏ రాత్రి అన్నది ఇదమిత్థంగా తెలుపకపోవటం అనేది దేవుని యుక్తికి తార్కాణం కావచ్చు. దీన్ని ఈ ఉల్లేఖనం పరిపూర్ణం చేసింది. ఈ విషయాన్ని ఉల్లేఖనాలు తేల్చలేకపోయాయి, ఇంకా దైవప్రవక్త (స) కూడా కలలో చూసిన విధంగా అది ఫలానా రాత్రి అని సెలవియ్యలేదు.

## రమజాన్ 27వ రాత్రినే లైలతుల్ ఖద్ర్ కావచ్చు అన్న విషయమై ఓ ఉల్లేఖనం

١٢٨ - عَنْ زِرِّ بْنِ حُبَيْشٍ قَالَ سَأَلْتُ أُبَيَّ بْنَ كَعْبٍ فَقُلْتُ إِنَّ أَخَاكَ ابْنَ مَسْعُوْدٍ يَقُوْلُ مَنْ يَّقُمِ الْحَوْلَ يُصِبْ لَيْلَةَ الْقَدْرِ، فَقَالَ رَحِمَهُ اللّٰهُ أَرَادَ أَنْ لَّا يَتَّكِلَ النَّاسُ أَمَا إِنَّهُ قَدْ عَلِمَ أَنَّهَا فِي رَمَضَانَ وَ أَنَّهَا فِي الْعَشْرِ الْأَوَاخِرِ وَ أَنَّهَا لَيْلَةُ سَبْعٍ وَعِشْرِيْنَ ثُمَّ حَلَفَ لَا يَسْتَثْنِيْ أَنَّهَا لَيْلَةُ سَبْعٍ وَعِشْرِيْنَ فَقُلْتُ بِأَيِّ شَيْئٍ تَقُوْلُ ذٰلِكَ يَا أَبَا الْمُنْذِرِ قَالَ بِالْعَلَامَةِ أَوْ بِالْآيَةِ الَّتِيْ أَخْبَرَنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ أَنَّهَا تَطْلُعُ يَوْمَئِذٍ لَا شُعَاعَ لَهَا۔ (رواه مسلم)

**128.** **హజ్రత్ జిర్ర్ బిన్ హుబైష్ (హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) గారి ప్రముఖ శిష్యులు) ఇలా తెలిపారు : నేను ఒకసారి హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి)ను అడిగాను - సోదరా! హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి), 'ఏ వ్యక్తి అయితే సంవత్సరం మొత్తం రాత్రుల్లో జాగరణ చేస్తాడో అలాంటి వ్యక్తి లైలతుల్ ఖద్ర్‌ను పొందుతాడు?' అని అన్నారు. దీనిపై మీ అభిప్రాయం ఏమిటి? అంటే ఆయన రమజాన్ విషయాన్ని సయితం**

**మినహాయించారు. అంటే రమజాన్ చివరి దశకాన్ని అన్నమాట. ఆపై హజ్రత్ ఉబై బిన్ కాబ్ ఇలా సమాధానమిచ్చారు : అబ్దుల్లాహ్ బిన్ మస్‌వూద్ (రజి)పై అల్లాహ్ కారుణ్యం కురియుగాక! ఆయన అసలు ఉద్దేశ్యం ఏమంటే, ప్రజలు ఓ ప్రత్యేక తేదీ లేక ప్రత్యేక కాలం పైనే భరోసా పెట్టుకోరాదు. (ఆ విధంగా తలచి మిగిలిన సంవత్సరం రోజుల్లోని ఆరాధనల పట్ల అశ్రద్ధ వహించరాదు). లైలతుల్ ఖద్ర్ రమజాన్‌లో వుందని, అది కూడా రమజాన్ చివరి దశకంలోని రాత్రుల్లో వుందని, ఇంకా రమజాన్ 27వ రాత్రినే ఉందని కూడా ఆయనకు తెలుసు. మరి హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) ఎలాంటి మినహాయింపు లేకుండా ప్రమాణ పూర్వకంగా 'అది రమజాన్ 27వ రాత్రి' అని చెప్పారు. దీనిపై నేను ఓ అబూ మున్‌జర్ (హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) గారి మారుపేరు) మీరు ఈ విషయాన్ని ఏ ఆధారంగా అంటున్నారు? అని ప్రశ్నించాను. దీనిపై ఆయన సమాధానమిచ్చారు – దైవప్రవక్త (స) మాకు తెలిపిన విధంగా ఒక గుర్తు ఏమిటంటే, ఆ రోజు సూర్యుడు ఉదయిస్తాడు, కాని అందులో వేడి కిరణాలుండవు. (ముస్లిం)**

"వేడి కిరణాలు ఉండవు" అన్న దాని భావం ఏమిటంటే అంతటి తీవ్రత ఉండదు అన్నమాట. ఇది మబ్బులు ఉన్న కారణంగా కూడా కిరణాల్లో తీవ్రత ఉండకపోవచ్చు. ఇంకా ఆ రోజు కిరణాల్లో తాపం, తేజస్సు కూడా ఉండకపోవచ్చు. ఇక దీనిపై ఆ రోజే లైలతుల్ ఖద్ర్ అని నిర్ణయించే విషయమై ఆలోచించి చూడాలి.

హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) తన పర్యాలోచన ప్రయత్నంతో ప్రవక్త (స) తన కల సారాంశాన్ని తెలిపినట్లుగా దాని గుర్తుల కారణంగా 'లైలతుల్ ఖద్ర్ 27వ రాత్రే అని తేల్చి చెప్పగలుగుతున్నాను' అని అన్నారు. అలాంటి చిహ్నాలతో సూర్యుడు మరో తేదీ నాడు కూడా ఉదయించవచ్చు. మరో విధంగా "లా షుఆఅలహా" అన్న పదాలు కూడా సూర్యుడు ఉదయించడంలో ఈ **"లా షుఆఅ లహా"** అన్న పదాలు వాడబడతాయి అని నిర్ణయించి ఎలా చెబుతారో చెప్పలేం. ఈ విధంగా సదా లైలతుల్ ఖద్ర్ 27వ రాత్రియే అని నిర్ణయించి చెప్పలేం. లేదా మరో తేదీనాడు ఒక వ్యక్తి నిలబడి "ఈ రోజు సూర్యుని కిరణాలు ఎలా వున్నాయో చూడండి!" అని చెప్పి తనకు తాను "ఇది **'లా షుఆఅ లహా'** వాతావరణంలా వుంది అని చెప్పి నేటి తేదీయే ఆ ప్రత్యేక రాత్రి అని నిర్ణయించి చెప్పేందుకు సాహసిస్తాడు. ఖచ్చితంగా ఈ రోజే లైలతుల్ ఖద్ర్ అన్న విషయం ప్రజలకు నిర్ణయాత్మకంగా తెలుపరాదు అన్న అల్లాహ్ యుక్తి ఎలా వుందో అన్నది ఇక్కడ గమనించగలరు.

## చివరి దశకంలో దైవప్రవక్త (స) ఆరాధనలు పాటించటంలో చూపే శ్రద్ధాసక్తులు

۱۲۹- عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَجْتَهِدُ فِي الْعَشْرِ الْاَوَاخِرِ مَا لَا يَجْتَهِدُ فِي غَيْرِهٖ۔ (رَوَاهُ مُسْلِمٌ)

**129.** హజ్రత్ ఆయిషా (ర.అ) తెలిపారు : దైవప్రవక్త (స) రమజాన్ మాసం చివరి పది రోజుల్లో (దైవారాధన చెయ్యటంలో) ఎంతగా శ్రమించేవారంటే అలా మరే కాలంలోనూ చేసేవారు కారు. (ముస్లిం)

## రమజాన్ చివరి దశకంలో ప్రవక్త (స) ఆరాధనలు

۱۳۰- عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ اِذَا دَخَلَ الْعَشْرُ شَدَّ مِئْزَرَهٗ وَاَحْيٰى لَيْلَهٗ وَاَيْقَظَ اَهْلَهٗ۔ (مُتَّفَقٌ عَلَيْهِ)

**130.** హజ్రత్ ఆయిషా (ర.అ) కథనం : రమజాన్ చివరి పది రోజులు ప్రారంభమయ్యాయంటే, దైవప్రవక్త (స) నడుం బిగించి రాత్రంతా మేల్కొనేవారు. ఇంకా తన ఇంటివారిని కూడా మేల్కొలిపేవారు. (ముత్తఫకున్ అలైహ్)

దైవారాధన చెయ్యటంలో దైవప్రవక్త (స) సదా అత్యంతగా శ్రమించేవారు. అయితే హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనాన్నిబట్టి రమజాన్ చివరి దశకంలో ఆయన (స) మరింత ఎక్కువగా శ్రమించేవారు.

## రెండవ భాగం

## లైలతుల్ ఖద్ర్ దుఆ

۱۳۱- عَنْ عَائِشَةَ قَالَتْ قُلْتُ يَا رَسُوْلَ اللّٰهِ اَرَاَيْتَ اِنْ عَلِمْتُ اَيُّ لَيْلَةٍ لَيْلَةُ الْقَدْرِ مَا اَقُوْلُ فِيْهَا، قَالَ قُوْلِيْ: اَللّٰهُمَّ اِنَّكَ عَفُوٌّ تُحِبُّ الْعَفْوَ فَاعْفُ عَنِّيْ۔ (رَوَاهُ اَحْمَدُ وَابْنُ مَاجَةَ وَالتِّرْمِذِيُّ)

**131.** హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా సెలవిచ్చారు : నేను దైవప్రవక్త (స)తో విన్నవించుకున్నాను : "ఓ దైవప్రవక్తా (స)! ఒకవేళ లైలతుల్ ఖద్ర్ ఏ రాత్రియో నాకు తెలిస్తే, అందులో నేను ఏం కోరుకోవాలి? మీ ఉద్దేశం తెలుపండి". దీనిపై ఆయన (స) ఇలా సెలవిచ్చారు:"ఓ నా దేవా! నీవు అత్యంతగా క్షమించేవాడివి. నీవు క్షమించటాన్ని అమితంగా ఇష్టపడ తావు. కాబట్టి నన్ను క్షమించు అని వేడుకో." (అహ్మద్, ఇబ్నెమాజా, తిర్మిజీ)

## లైలతుల్ ఖద్ర్‌ను రమజాన్ చివరి దశకంలోని బేసి రాత్రుల్లో వెదకాలని హితవు

١٣٢- عَنْ أَبِي بَكْرَةَ قَالَ سَمِعْتُ رَسُولَ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ يَقُولُ : اِلْتَمِسُوهَا يَعْنِي لَيْلَةَ الْقَدْرِ
فِي تِسْعٍ يَبْقَيْنَ اَوْ فِي سَبْعٍ يَبْقَيْنَ اَوْ فِي خَمْسٍ
يَبْقَيْنَ اَوْ ثَلَاثٍ اَوْ اٰخِرِ لَيْلَةٍ (رَوَاهُ التِّرْمِذِيُّ)

**132.** హజ్రత్ అబీ బకరహ్ (రజి) ఇలా ఉల్లేఖించారు : నేను దైవప్రవక్త (స) ఇలా సెలవిస్తుండగా విన్నాను : లైలతుల్ ఖద్ర్‌ను రమజాన్ **21** లేదా **23** లేదా **25** లేదా **27** లేదా **29** తేదీల రాత్రుల్లో వెదకండి. (తిర్మిజీ)

ఇంతకు ముందు కూడా లైలతుల్ ఖద్ర్ రమజాన్ చివరి దశకంలో వుందన్న విషయం చర్చకు వచ్చింది. అది బేసి రాత్రుల్లో వుందని, అంటే 21, 23, 25, 27, 29వ తేదీ రాత్రుల్లో అని చెప్పటం జరిగింది.

## లైలతుల్ ఖద్ర్ ప్రతి రమజాన్‌లో ఉంటుంది

١٣٣- عَنِ ابْنِ عُمَرَ قَالَ سُئِلَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ عَنْ لَيْلَةِ الْقَدْرِ، فَقَالَ هِيَ فِي كُلِّ رَمَضَانَ.
(رَوَاهُ اَبُوْ دَاوُدَ)

**133.** హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) కథనం : లైలతుల్ ఖద్ర్ విషయంలో దైవప్రవక్త (స)తో విన్నవించుకోగా, ఆయన (స) "ప్రతి రమజాన్‌లో లైలతుల్ ఖద్ర్ ఉంటుంద"ని సెలవిచ్చారు. (అబూదావూద్)

ఖుర్ఆన్ అవతరించిన రాత్రిని ఖుర్ఆన్‌లో లైలతుల్ ఖద్ర్‌గా పేర్కొనటం జరిగింది. ఎందుకంటే అది రమజాన్‌లో ఒక రాత్రి. అందువలన ప్రతి రమజాన్‌లో ఒక రేయి లైలతుల్ ఖద్ర్‌గా వుంటుంది. అయితే అది ఏ రాత్రి అన్నది నిర్ణాయకం కాలేదు. దానికి బదులు అది రమజాన్ చివరి దశకంలోని బేసి రాత్రుల్లో ఏదో ఒక రాత్రిలో ఉంది.

## హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉనైస్ గారికి ప్రతి నెలా 23వ తేదీ రాత్రి మస్జిద్-యె-నబవీలో గడిపేందుకు హితవు

١٣٤- عَنْ عَبْدِ اللهِ بْنِ أُنَيْسٍ قَالَ قُلْتُ يَا رَسُوْلَ اللهِ إِنَّ
لِيْ بَادِيَةً أَكُوْنُ فِيْهَا وَأَنَا أُصَلِّيْ فِيْهَا بِحَمْدِ اللهِ فَمُرْنِيْ
بِلَيْلَةٍ أَنْزِلُهَا إِلٰى هٰذَا الْمَسْجِدِ، فَقَالَ انْزِلْ لَيْلَةَ
ثَلَاثٍ وَعِشْرِيْنَ قِيْلَ لِابْنِهِ كَيْفَ كَانَ أَبُوْكَ يَصْنَعُ،
قَالَ كَانَ يَدْخُلُ الْمَسْجِدَ إِذَا صَلَّى الْعَصْرَ فَلَا
يَخْرُجُ مِنْهُ لِحَاجَةٍ حَتّٰى يُصَلِّيَ الصُّبْحَ فَإِذَا صَلَّى
الصُّبْحَ وَجَدَ دَابَّتَهُ عَلٰى بَابِ الْمَسْجِدِ فَجَلَسَ عَلَيْهَا
وَلَحِقَ بِبَادِيَتِهِ (رَوَاهُ أَبُوْدَاوُدَ)

**134.** హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉనైస్ (రజి) ఇలా తెలిపారు : నేను దైవప్రవక్త (స)ను విన్నవించుకున్నాను : ఓ దైవప్రవక్తా (స)! నా ఇల్లు అడవిలో ఉంది. నేను అక్కడే వుంటాను, దైవకృప వల్ల అక్కడే నేను నమాజ్ ఆచరిస్తాను. నాకు ఒక శుభవంతమైన రాత్రిని తెలుపండి. ఆ రాత్రిన నేను శుభవంతమైన మస్జిద్ (మస్జిదె నబవీ)లో హాజరై అక్కడే నేను దైవారాధనలో గడపగలగాలి." దానిపై ప్రవక్త (స) "నీవు **23**వ తేదీ రాత్రి వస్తూ ఉండు" అని సెలవిచ్చారు. తరువాతి ఉల్లేఖకుల ప్రకారం హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉనైస్ (రజి) గారి కుమారుడు హమ్జా బిన్ అబ్దుల్లాహ్‌తో, "మీ తండ్రి మస్జిద్-యె-నబవీలోకి వెళ్ళి ఏం చేసేవారు?" అని అడగటం జరిగింది. దానిపై ఆయన "వారు (**22**వ తేదీ నాడు) అసర్ నమాజ్ వేళకు మస్జిద్-యె-నబవీలో ప్రవేశించి, ఫజర్ నమాజ్ చదివే వరకు ఆ శుభవంతమైన మస్జిద్ నుంచి బయటికి వచ్చేవారు కారు - ఏదైనా అత్యంత అవసరమైన పనిబడితే తప్ప. ఫజ్ర్ నమాజ్

**చదివిన పిదప వారి వాహనం సిద్ధంగా ఉండేది, దానిపై ఎక్కి మళ్లీ అడవికి తిరుగు ప్రయాణమయ్యేవారు" అని తెలిపారు. (అబూదావూద్)**

ఈ హదీసులో హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉనైస్ (రజి) 23వ తేదీ రాత్రి మస్జిద్-యె-నబవీలో గడిపింది రమజాన్ మాసంలో 23వ తేదీ రాత్రియా లేదా సాధారణ నెలల్లోని 23వ తేదీ రాత్రియా అన్నది వివరంగా తెలుపలేదు - ఎందుకంటే రమజాన్ అన్న పదం ఈ హదీసులో రాలేదు. ఇంకా ఇందులో హజ్రత్ అబ్దుల్లాహ్ (రజి) దైవప్రవక్త (స)తో లైలతుల్ ఖద్ర్ విషయాన్ని ప్రస్తావించి నేను లైలతుల్ ఖద్ర్‌ను మీతో గడపాలని భావిస్తున్నానన్న విషయం కూడా తెలుపలేదు. అందువలన ఈ హదీసు ద్వారా 23వ తేదీ రాత్రినే లైలతుల్ ఖద్ర్ అన్న విషయం నిర్ణయాత్మకంగా చెప్పలేము. దీనివలన ఈ హదీసు ఉల్లేఖకులు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉనైస్ (రజి) గారిని వివరాలు అడగలేదు, ఇంకా వారి కుమారునితో కూడా లైలతుల్ ఖద్ర్ విషయంలోనే ఈ విషయాన్ని అడిగారా? లేదా రమజాన్ నెలలోని మరేదైనా తేదీ గురించి అడిగారా? లేదా ప్రవక్త (స) ప్రతి నెలలోని 23వ తేదీ నాడు వచ్చి మస్జిద్-యె-నబవీలో గడపమని చెప్పారా? అన్నది కూడా స్పష్టంగా తెలుపలేదు. అందువలన ప్రవక్త (స) ఈ రోజు లైలతుల్ ఖద్ర్ అని తెలిపారన్న విషయం కూడా స్పష్టంగా లేదు. ఒకవేళ ఇది స్పష్టంగా తెలిపివున్నట్లయితే 23వ తేదీ రాత్రి లైలతుల్ ఖద్ర్ అయి ఉండేది.

## మూడవ భాగం

## ప్రవక్త (స)గారికి మొదట లైలతుల్ ఖద్ర్ విషయం తెలుపబడింది

١٣٥- عَنْ عُبَادَةَ بْنِ الصَّامِتِ قَالَ خَرَجَ النَّبِيُّ
صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لِيُخْبِرَنَا بِلَيْلَةِ الْقَدْرِ فَتَلَاحَى
رَجُلَانِ مِنَ الْمُسْلِمِيْنَ، فَقَالَ خَرَجْتُ لِأُخْبِرَكُمْ بِلَيْلَةِ
الْقَدْرِ فَتَلَاحَى فُلَانٌ وَفُلَانٌ فَرُفِعَتْ وَعَسٰى أَنْ
يَكُوْنَ خَيْرًا لَّكُمْ، فَالْتَمِسُوْهَا فِي التَّاسِعَةِ وَالسَّابِعَةِ
وَالْخَامِسَةِ (رَوَاهُ الْبُخَارِيُّ)

**135. హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (రజి) ఇలా ఉల్లేఖించారు : ఒకసారి దైవప్రవక్త (స) మస్జిద్-యె-నబవీ నుంచి (లేక ఆయన శుభకర సదనం నుంచి) మాకు లైలతుల్ ఖద్ర్ విషయం తెలిపేందుకు బయలుదేరారు.**

**అంతలో ఇద్దరు ముస్లింలు తగాదాపడుతున్నారు. దీనిపై ఆయన (స) మాతో ఇలా సెలవిచ్చారు : "నేను మీకు లైలతుల్ ఖద్ర్ సమాచారం ఇచ్చేందుకు బయలుదేరాను. కాని ఫలానా ఫలానా వారు వివాదమాడు కుంటున్నారు. ఇంతలో ఆ సమాచారం (అంటే ఆ రాత్రి గురించిన విషయం) నా నుంచి విస్మరింపజేయబడింది. బహుశా ఇందులోనే మీ మేలు దాగివుండేమో! అందువలన ఇప్పుడు మీరు 21 లేదా 23 లేదా 25వ తేదీ రాత్రుల్లో దానిని వెదకండి." (బుఖారీ)**

ఇంతవరకు వచ్చిన హదీసులపై దృష్టి సారించటం వలన తెలిసేదేమంటే, ఇందులో అల్లాహ్ వివేచన దాగివుంది కాబట్టే లైలతుల్ ఖద్ర్ విషయాన్ని ఆయన (స)కు ఖచ్చితంగా తెలుపలేదు, ఇంకా 'ఫలానా రాత్రి లైలతుల్ ఖద్ర్' అన్న విషయాన్ని ప్రజలకు తెలిపే విషయంలో కూడా ప్రవక్త (స)కు ఆదేశించటం జరగలేదు.

దైవప్రవక్త (స)కు సూచనప్రాయంగా తెలుపబడిన విషయమేమిటంటే, లైలతుల్ ఖద్ర్ రమజాన్ చివరి దశకంలోని బేసి రాత్రుల్లో వుంది, కాబట్టి మీరు దానిని వెదకండి అన్నదే. ఈ హదీసులో కూడా బేసి రాత్రుల్లో మూడు రాత్రుల గురించి ప్రధానంగా పేర్కొనబడింది. అంటే, 21, 23, 25 రాత్రులు. కొన్ని ఉల్లేఖనాల్లో 21 నుంచి 29వ తేదీ వరకున్న బేసి రాత్రులు తెలుపబడ్డాయి. మరికొన్నింటిలో చివరి ఏడు రాత్రులు పేర్కొనబడ్డాయి.

హదీసులు ఉల్లేఖిస్తున్నప్పుడు ఏ హదీసులో ఏ రాత్రి గురించి తెలుపబడిందో చెప్పలేదు కాబట్టి ఏది ముందు కాలానిది, మరేది తరువాతి కాలానిదో అనేది నిర్ణయించటం కష్టం. ముస్లిం సముదాయంలో ప్రాచుర్యం పొందినది ఏమంటే - లైలతుల్ ఖద్ర్ చివరి దశకంలోని బేసి రాత్రుల్లో వుందన్నదే.

## తనకు విధేయులైన దాసులపై అల్లాహ్ గర్విస్తాడు

١٣٦ - عَنْ أَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ: إِذَا كَانَ لَيْلَةُ الْقَدْرِ نَزَلَ جِبْرِيْلُ فِيْ كَبْكَبَةٍ
مِّنَ الْمَلَائِكَةِ يُصَلُّوْنَ عَلٰى كُلِّ عَبْدٍ قَائِمٍ أَوْ قَاعِدٍ
يَّذْكُرُ اللّٰهَ عَزَّ وَجَلَّ فَإِذَا كَانَ يَوْمُ عِيْدِهِمْ يَعْنِيْ
يَوْمُ فِطْرِهِمْ بَاهٰى بِهِمْ مَلَائِكَتَهٗ فَقَالَ يَا مَلَائِكَتِيْ
مَا جَزَاءُ أَجِيْرٍ وَّفّٰى عَمَلَهٗ، قَالُوْا رَبَّنَا جَزَاءُهٗ أَنْ يُّوَفّٰى
أَجْرُهٗ، قَالَ مَلَائِكَتِيْ عَبِيْدِيْ وَإِمَائِيْ قَضَوْا فَرِيْضَتِيْ

عَلَيْهِمْ ثُمَّ خَرَجُوْا يَعُجُّوْنَ إِلَى الدُّعَاءِ وَعِزَّتِيْ وَجَلَالِيْ
وَكَرَمِيْ وَعُلُوِّيْ وَارْتِفَاعِ مَكَانِيْ لَأُجِيْبَنَّهُمْ فَيَقُوْلُ
ارْجِعُوْا قَدْ غَفَرْتُ لَكُمْ وَبَدَّلْتُ سَيِّئَاتِكُمْ حَسَنَاتٍ
قَالَ فَيَرْجِعُوْنَ مَغْفُوْرًا لَّهُمْ - (رَوَاهُ الْبَيْهَقِيُّ)

**136.** హజ్రత్ అనస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు – లైలతుల్ ఖద్ర్ సంభవించినప్పుడు జిబ్రీల్ (అ) దైవదూతల ఒక సమూహంతో ప్రభవిస్తారు. నిల్చొని వుండి లేక కూర్చొని వుండి అయినా ఘనమైన, రౌద్రుడైన అల్లాహ్ ఆరాధనలో మునిగివున్న ప్రతి దాసుని గురించీ దుఆ చేస్తారు – (అంటే మేల్కొని వుండి ఆరాధనలో వున్నవారిని గురించి). ఆపై ఈదుల్ ఫిత్ర్ రోజు అల్లాహ్ తన దాసుల గురించి దైవదూతల సమక్షంలో గర్వపడుతూ ఇలా సెలవిస్తాడు – ఓ నా దూతలారా! – తన బాధ్యతను సజావుగా నెరవేర్చిన ఆ కూలివాని (కూలీ) ప్రతిఫలం ఏమిటీ?’ అందుకు దైవదూతలు ‘ఓ మా ప్రభూ! దానికి ప్రతిఫలం దాసుని కూలీ పూర్తిగా చెల్లించటం’ అని సమాధానమిస్తారు. ఆపై అల్లాహ్–“ఓ నా దూతలారా! నా దాసదాసీలు నేను వారిపై విధించిన బాధ్యతను నెరవేర్చారు. ఇంకా (ఈద్ నమాజ్ చేయటానికి) తమ ఇళ్ల నుంచి బయలుదేరి నా సమక్షంలో విలపిస్తూ దీనంగా అర్థిస్తున్నారు. నా ఘనత, గౌరవాల సాక్షిగా! నా కరుణ, అనుగ్రహాల హద్దు మేరకు, నా అంతస్తు మేరకు నేను వారి ప్రార్థనలను, మొరలను తప్పక ఆమోదిస్తాను” అని సమాధానం ఇస్తాడు. తదుపరి అల్లాహ్ తన దాసులనుద్దేశించి ఇలా సెలవిస్తాడు – “వెళ్లండి! నేను మిమ్మల్ని క్షమించివేశాను. మీ చెడులను మంచి కార్యాలుగా మార్చివేశాను.” ఇంకా దైవప్రవక్త (స) సెలవిచ్చారు – దాసులు తాము క్షమించబడిన స్థితిలో తిరుగు ప్రయాణమవుతారు. (బైహఖీ)

అల్లాహ్ విశ్వసించిన తన దాసులందరికీ ఇలా సంవత్సరం మొత్తం క్షమిస్తూనే ఉంటాడు. ఎందుకంటే వారు రమజాన్‌లో ఉపవాసాలున్నారు, లైలతుల్ ఖద్ర్ కొరకు రాత్రుల్లో జాగరణ చేసి ఆరాధనలో గడిపారు. మళ్లీ పండుగరోజు నమాజ్ కొరకు బయలుదేరి అల్లాహ్‌ను వేడుకున్నారు. దాని ఫలితంగా వారు అల్లాహ్ చేత క్షమించబడి తిరుగు ప్రయాణమయ్యారు.

❧

# بَابُ الْاِعْتِكَاف

# ఏతెకాఫ్ అధ్యాయం

మొదటి భాగం

## ఏతెకాఫ్‌లో దైవప్రవక్త (స) గారి సంప్రదాయం

١٣٧ - عَنْ عَائِشَةَ اَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
كَانَ يَعْتَكِفُ الْعَشْرَ الْاَوَاخِرَ مِنْ رَمَضَانَ حَتّٰى
تَوَفَّاهُ اللّٰهُ، ثُمَّ اعْتَكَفَ اَزْوَاجُهُ مِنْ بَعْدِهٖ - (مُتَّفَقٌ عَلَيْهِ)

**137.** **హ్రజత్ ఆయిషా (ర.అ) ఇలా ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) రమజాన్ చివరి దశకంలో ఏతెకాఫ్‌లో గడిపేవారు. ఆయన (స) పరమపదించే వరకు ఇలానే ఆచరించారు. ఆపైన ఆయన (స) తరువాత ఆయన పవిత్ర సతీమణులు దీనిని కొనసాగించారు. (ముత్తఫకున్ అలైహ్)**

తనను తాను ఆపుకోవటాన్ని 'ఏతెకాఫ్' అని అంటారు. తనను తాను ఏదైనా ఒక దానిపై స్థిరంగా, నిలకడగా ఉంచటాన్ని, ఒకదానితో సంబంధాన్ని కలిగి ఉండటాన్ని షరీఅత్ పరిభాషలో ఏతెకాఫ్ అంటారు. మనిషి ఒక ప్రత్యేక స్థితిలో మస్జిద్‌లో వేచి వుండటాన్ని, అదే స్థితిలో తనకు తాను ఆపుకోవటాన్ని ఏతెకాఫ్ అని అంటారు.

దైవప్రవక్త (స) రమజాన్ చివరి దశకంలోని పది రోజులూ మస్జిద్‌లో ఉండేవారు. ఇలా ఆయన (స) జీవితాంతం పాటించారు. ఈ సంప్రదాయం పవిత్ర మదీనా నగరంలో ఉండగా పాటించారన్నమాట. ఆయన (స) పవిత్ర మదీనాలో వున్నప్పుడే రమజాన్ రోజాలు పాటించాలన్న ఆదేశం అయ్యింది. పైగా పవిత్ర మక్కాలో ప్రత్యేకంగా ఒక మస్జిద్ అంటూ లేకపోయింది. ఆ విధంగా మస్జిద్-యె-హరామ్ (కాబా)లో ఏతెకాఫ్ పాటించే అవకాశం లేకుండింది. అందువలన పవిత్ర మదీనా నగరంలో ఆయన (స) జీవితం అంత్యదశ వరకు ఈ పది రోజుల ఏతెకాఫ్ పాటించారు.

ఆయన పవిత్ర సతీమణుల ఏతెకాఫ్ మస్జిద్–యె–నబవీలో కాక వారి వారి కుటీరాల్లో పాటించబడేది. సతీమణులందరి కుటీరాలు కూడా మస్జిద్–యె–నబవీకి ఆనుకుని ఉండేవి. ప్రతి కుటీరం ద్వారం మస్జిద్ ప్రాంగణంలోపలే తెరచుకునే విధంగా ఉండేది. దైవప్రవక్త (స) ఏ సతీమణి వద్ద విశ్రమించినా ఆయన ఆ కుటీరం ద్వారాన్ని తెరచుకుని నేరుగా మస్జిద్ లోపలికి వచ్చేవారు. ఈ కుటీరాలన్నీ మస్జిద్‌కు ఆనుకునే వుండటం వలన పవిత్ర సతీమణులెవరూ మస్జిద్ లోపలికి వచ్చే అవసరం కూడా ఏర్పడేది కాదు. పైగా స్త్రీల ఏతెకాఫ్ మస్జిదుల్లో పాటించబడదు, ఇళ్లల్లో మాత్రమే పాటించబడేది. అందువలన పవిత్ర సతీమణులు కూడా రమజాన్ చివరి దశకంలో వారి వారి కుటీరాల్లోనే ఏతెకాఫ్ పాటించేవారు.

## రమజాన్‌లో ప్రవక్త (స) ఎడతెగని దానధర్మాలు, జిబ్రీల్ (అ)తో పాటు ఖుర్ఆన్ పారాయణం

١٣٨- عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ اَجْوَدَ النَّاسِ بِالْخَيْرِ وَكَانَ اَجْوَدَ مَايَكُوْنُ
فِيْ رَمَضَانَ، كَانَ جِبْرِيْلُ يَلْقَاهُ كُلَّ لَيْلَةٍ فِيْ رَمَضَانَ
يَعْرِضُ عَلَيْهِ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الْقُرْاٰنَ
فَاِذَا لَقِيَهٗ جِبْرِيْلُ كَانَ اَجْوَدَ بِالْخَيْرِ مِنَ الرِّيْحِ الْمُرْسَلَةِ.
(مُتَّفَقٌ عَلَيْهِ)

**138.** హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఇలా ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) ఒకరికి మేలు చేసే విషయంలో కూడా (సాధారణతః) ప్రజలందరికంటే ముందంజలో ఉండేవారు. ఆ విధంగా ఆయన అందరికన్నా మిన్నగా దానం చేసేవారు. మరీ ప్రత్యేకంగా రమజాన్‌లో అత్యంత అధికంగా దానశీలునిగా మారేవారు. జిబ్రీల్ (అ) రమజాన్ కాలంలో ప్రతి రాత్రి దైవప్రవక్త (స) వద్దకు వచ్చేవారు. ఇంకా ప్రవక్త (స) ఆయనకు ఖుర్ఆన్ పారాయణం చేసి విన్పించేవారు. జిబ్రీల్ (అ) తనను కలిసినప్పుడు ప్రవక్త (స) మేలు చేసే విషయంలో, ఆగకుండా వీచే గాలికన్నా మించిన దానశీలునిగా మారేవారు. (గాలి ఏ విధంగా ఒకచోట మొదలై నిలకడగా వుండక అన్నింటిపై నుంచి పయనించినట్లు).

(ముత్తఫకున్ అలైహ్)

పవిత్ర ఖుర్ఆన్ దైవప్రవక్త (స)పై అవతరించినప్పుడు వెంటనే అది ఆయన (స) హృదయ ఫలకంపై చెరగని ముద్రలా నిలిచేది. ఆపై ఆయన (స) దానిని మరిచిపోయేవారు కాదు. కాని రమజాన్ నెలలో (ఖుర్ఆన్ అవతరణ ప్రారంభమైన నెల) ప్రవక్త (స) వద్దకు జిబ్రీల్ (అ) విచ్చేసేవారు. అప్పటి వరకు ఎంత ఖుర్ఆన్ అవతరించబడిందో అంతమేర ఖుర్ఆన్‌ను ఆయన (స) పారాయణం చేసి జిబ్రీల్ (అ)కు విన్పించేవారు. గాలి వీచడం ప్రారంభమై ప్రతి వస్తువునూ తాకి ప్రతి చోటి నుంచి ప్రసరించినట్లు ఈ కాలంలో ప్రవక్త (స) మంచి పనులను, దానధర్మాలను మామూలుకన్నా మిన్నగా చేసేవారు. జిబ్రీల్ (అ)ను కలవటం మూలాన ఇంకా ఆయన (అ)కు ఖుర్ఆన్ పారాయణం విన్పించటం వలన చేకూరిన సంతోషమే వీటికి ప్రోద్బలంగా పరిణమించేవి.

## జిబ్రీల్ (అ) ప్రతి సంవత్సరం రమజాన్‌లో ప్రవక్త (స)కు ఖుర్ఆన్ విన్పించేవారు

١٣٩- عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ كَانَ يُعْرَضُ عَلَى النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ الْقُرْآنَ كُلَّ عَامٍ مَرَّةً فَعُرِضَ عَلَيْهِ مَرَّتَيْنِ فِي الْعَامِ الَّذِي قُبِضَ وَكَانَ يَعْتَكِفُ كُلَّ عَامٍ عَشْرًا فَاعْتَكَفَ عِشْرِيْنَ فِي الْعَامِ الَّذِي قُبِضَ.
(رَوَاهُ الْبُخَارِيُّ)

**139.** **హజ్రత్ అబూ హురైరా (రజి) ఇలా ఉల్లేఖించారు : దైవప్రవక్త (స) సమక్షంలో ప్రతియేడు ఒకసారి ఖుర్ఆన్ పారాయణం చేసి విన్పించ బడేది. అయితే ఆయన (స) పరమపదించిన సంవత్సరంలో రెండు పర్యాయాలు ఖుర్ఆన్‌ను విన్పించటం జరిగింది. ఆయన (స) ప్రతి సంవత్సరం పది రోజులు ఏతెకాఫ్ పాటించేవారు. అయితే ఆయన (స) తనువు చాలించిన యేట ఇరవై రోజుల పాటు ఏతెకాఫ్ పాటించారు. (బుఖారీ)**

ఇంతకు ముందు హదీసులో ప్రవక్త (స) జిబ్రీల్ (అ)కు ఖుర్ఆన్ విన్పించేవారని చెప్పబడింది. ఈ హదీసులో ప్రవక్త (స)కు జిబ్రీల్ (అ) ఖుర్ఆన్ విన్పించేవారని తెలుపబడింది. ఈ ఆచరణ రెండు కోణాల నుంచీ కొనసాగేదని తెలుస్తోంది. అంటే జిబ్రీల్ (అ) ఒకసారి ప్రవక్త (స)కు ఖుర్ఆన్ వినిపిస్తే మరోసారి ప్రవక్త (స)

జిబ్రీల్ (అ)కు ఖుర్ఆన్ విన్పించేవారు. అయితే ప్రవక్త (స) పరమపదించిన సంవత్సరం ఆయన (స)కు రెండుసార్లు ఖుర్ఆన్ విన్పించటం జరిగింది. అంటే రెండుసార్లు ఆయన (స) జిబ్రీల్ (అ)కు ఖుర్ఆన్ వినిపిస్తే, జిబ్రీల్ (అ) ఆయన (స)కు రెండుసార్లు ఖుర్ఆన్ విన్పించారు.

ప్రవక్త (స) సాధారణంగా పది రోజులు ఏతెకాఫ్ పాటించేవారు. అయితే ఆయన (స) పవిత్ర జీవితంలోని చివరి సంవత్సరం 20 రోజుల పాటు ఏతెకాఫ్ పాటించారు.

## ఎంతో అవసరమైతే తప్ప ఏతెకాఫ్ పాటిస్తున్న సమయంలో ప్రవక్త (స) ఇంటిలోకి వెళ్లేవారు కాదు

۱۴۰۔ عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ إِذَا اعْتَكَفَ أَدْنٰى إِلَيَّ رَأْسَهٗ وَهُوَ
فِي الْمَسْجِدِ فَأُرَجِّلُهٗ وَكَانَ يَدْخُلُ الْبَيْتَ إِلَّا
لِحَاجَةِ الْإِنْسَانِ۔ (مُتَّفَقٌ عَلَيْهِ)

**140. హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా ఉల్లేఖించారు : "దైవప్రవక్త (స) ఏతెకాఫ్ పాటిస్తున్న సమయంలో ఆయన (స) మస్జిద్‌లో నుంచే తన పవిత్రమైన తలను నా కుటీరంలో పెట్టేవారు. అప్పుడు నేను ఆయన (స) తలను దువ్వేదాన్ని. ఏతెకాఫ్ పాటిస్తున్నప్పుడు ఆయన (స) ఇంటిలోకి ప్రవేశించేవారు కాదు - మానవ సహజ అవసరాలు తీర్చుకోవటానికి తప్ప. (ముత్తఫకున్ అలైహి)**

'హాజల్ ఇన్సాని' అంటే అనివార్య అవసరాల పరిపూర్తికై మస్జిద్ నుంచి బయటికి రావటం తప్ప మరో మార్గం లేని పరిస్థితి అన్నమాట. ఉదాహరణకు మలమూత్ర విసర్జన వగైరాలన్నమాట. ఎందుకంటే మస్జిద్‌లో సహజ అవసరాలు తీర్చుకోలేని పరిస్థితిలో అన్నమాట.

ఇక ఆయన (స) ఏతెకాఫ్ సమయంలో తన పవిత్రమైన తలను హజ్రత్ ఆయిషా (ర.అ) కుటీరం వైపు పెట్టగా ఆమె ప్రవక్త (స) గారి తలను సంస్కరించేవారు అన్నది. (ఇంతకు ముందే తెలిపినట్లు) పవిత్ర సతీమణుల కుటీరాల ఒక తలుపు మస్జిద్-యె-నబవీ వైపు తెరచుకునేలా ఉండేది. మస్జిద్‌లో కూర్చొని ఉన్నప్పుడు,

ఉన్నపళంగానే ప్రవక్త (స), తన తలను ఆయిషా (ర.అ) కుటీరం వైపు పెట్టగా ఆమె గారు (ర.అ), తలకు నూనె రాసి సంస్కరించేవారన్నమాట. మనిషి తన తలను బయటికి తీసినంతమాత్రాన తాను బయటికి వెళ్లినట్లు కాదు. తన అడుగు బయటికి వేస్తేనే మనిషి బయటికి వెళ్లినట్లు లెక్క. తన అడుగు బయట పెడితేనే దేహం బయటపడి బయటికి వచ్చినట్లు లెక్క. కేవలం తల బయటికి తీసినంత మాత్రాన ఏతెకాఫ్‌కు భంగం వాటిల్లదు – మీ అడుగు బయటకు వేస్తేనే మీ ఏతెకాఫ్‌లో భంగం ఏర్పడుతుంది. అనివార్యమైన పరిస్థితి ఏర్పడితేనే మస్జిద్ నుంచి బయటికి వచ్చే అనుమతి ఉంది. ఉదాహరణకు, ఒక మనిషికి భోజనం తెచ్చి ఇచ్చేవాడు ఎవడూ లేడు. అందువలన అలాంటి వ్యక్తి మస్జిద్ నుంచి బయటికి వెళ్లవచ్చు – అతను తన ఇంటికైనా లేదా మరోచోటికైనా వెళ్లవచ్చు. అదేవిధంగా అతను మలమూత్ర విసర్జనకు కూడా బయటికి వెళ్లవచ్చు. ఇలా అనివార్య పరిస్థితుల్లో తప్ప ఏతెకాఫ్ దీక్షబూనిన వ్యక్తికి బయటికి వెళ్లే అనుమతి లేదు.

## అజ్ఞానంలో ఏదైనా మంచి పనికి మొక్కుకుంటే దాన్ని పూర్తిచేయాలి

١٤١- عَنِ ابْنِ عُمَرَ اَنَّ عُمَرَ سَاَلَ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ كُنْتُ نَذَرْتُ فِي الْجَاهِلِيَّةِ اَنْ اَعْتَكِفَ لَيْلَةً فِي الْمَسْجِدِ الْحَرَامِ، قَالَ فَاَوْفِ بِنَذْرِكَ - (مُتَّفَقٌ عَلَيْهِ)

**141.** హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఇలా ఉల్లేఖించారు : హజ్రత్ ఉమర్ (రజి) దైవప్రవక్త (స)తో ఇలా విన్నవించుకున్నారు – "నేను అజ్ఞాన కాలంలో ఒకరాత్రి మస్జిద్–యె–హరామ్ (బైతుల్లాహ్)లో ఏతెకాఫ్ కూర్చుంటానని మొక్కుకున్నాను. నేను ఈ మొక్కును చెల్లించుకోవాల్నా?" దీనిపై ప్రవక్త (స) సెలవిచ్చారు–"అవును, నీవు నీ మొక్కును చెల్లించుకో". (ముత్తఫకున్ అలైహ్)

దీనివలన తెలిసిందేమంటే, అజ్ఞాన కాలంలోనైనా సరే, ఒక మనిషి మంచి పనిచేస్తానని మొక్కుకొనివుంటే, అతను ఆ మొక్కును పూర్తిచేయాలి. అలాకాక, ఒక తప్పుడు పని లేక పనికిమాలిన ఒక పనిని చేస్తాననో లేక ఒక పాపకార్యాన్ని చేస్తాననో మొక్కుకున్నట్లయితే దాన్ని నెరవేర్చరాదు. అజ్ఞాన కాలంలో మొక్కుకున్న

ఏదైనా మంచి పనిని తప్పనిసరిగా నెరవేర్చాలా, వద్దా అన్న విషయంలో భేదాభిప్రాయముంది. కొంతమంది ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం దాన్ని తప్పనిసరిగా నెరవేర్చాలి, మరికొంతమంది అభిప్రాయంలో తప్పనిసరి కాదు. అయితే దాన్ని నెరవేర్చే విషయంలో అనుమతి ఉంది. స్వయంగా **"ఫఅవ్ఫి బి నజ్రిక్"** అన్నదానికి కూడా రెండు అర్థాలున్నాయి. ఒక అర్థం "మీరు తప్పక నెరవేర్చండి" అని వస్తే, మరో అర్థం ప్రకారం "మీరు ఆ మొక్కును నెరవేర్చగలిగితే నెరవేర్చండి, కాని అది తప్పనిసరి కాదు" అని వస్తుంది. దీనివలన తెలిసిందేమంటే అజ్ఞాన కాలంలో కూడా ఏతెకాఫ్ చేయటం ప్రసిద్ధరీతిలో ఉంది. ఇంకా దివ్య ఖుర్ఆన్‌లో కూడా ఈ విషయం ప్రస్తావనకు వచ్చింది. బహుదైవారాధకులు తమ విగ్రహాల పేర ఏతెకాఫ్ పాటించేవారు. ఇంకా అల్లాహ్ ఆరాధకులు అల్లాహ్ కొరకు ఏతెకాఫ్ పాటించేవారు. కొన్ని సందర్భాల్లో బహుదైవారాధకులు కూడా అల్లాహ్ పేర మస్జిదె హరామ్‌లో ఏతెకాఫ్ పాటించేందుకు మొక్కుకునేవారని హజ్రత్ ఉమర్ (రజి) గారి ఉల్లేఖనం ద్వారా తెలుస్తోంది. అల్లాహ్ కొరకు మొక్కుకున్నారు కాబట్టే ప్రవక్త (స) గారు దాన్ని నెరవేర్చే విషయంలో ఇబ్నె ఉమర్ (రజి) గారికి అనుమతినిచ్చారు.

## ప్రవక్త (స) ఫజ్ర్ నమాజ్ చేసి తను ఏతెకాఫ్ కూర్చొనే స్థలంలో ప్రవేశించేవారు

١٤٢- عَنْ اَنَسٍ قَالَ كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَعْتَكِفُ فِي الْعَشْرِ الْاَوَاخِرِ مِنْ رَمَضَانَ فَلَمْ يَعْتَكِفْ عَامًا، فَلَمَّا كَانَ الْعَامُ الْمُقْبِلُ اعْتَكَفَ عِشْرِيْنَ.

(رَوَاهُ التِّرْمِذِيُّ وَرَوَاهُ اَبُوْدَاؤُدَ وَابْنُ مَاجَهْ عَنْ اُبَيِّ بْنِ كَعْبٍ)

**142. హజ్రత్ అనస్ (రజి) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) రమజాన్ చివరి పదిరోజులు ఎల్లప్పుడూ ఏతెకాఫ్ పాటించారు – అయితే ఒకసారి ఆయన (స) ఏతెకాఫ్ పాటించలేదు. అయితే మరుసటి సంవత్సరం ఆయన 20 రోజుల పాటు ఏతెకాఫ్ పాటించారు.**

**(తిర్మిజీ, అబూదావూద్, ఇబ్నెమాజా)**

దీనివలన తెలిసిందేమంటే దైవప్రవక్త (స) మదీనాలో వున్న కాలంలో ఒక సంవత్సరం ఏతెకాఫ్ పాటించలేదు. దీనిద్వారా ఏతెకాఫ్ పాటించటం ఫర్జ్ (విధి)

కాదు, ఇంకా తప్పనిసరి కూడా కాదని తెలుస్తోంది. ఒకవేళ విధి లేక తప్పనిసరి అయివుంటే, దైవప్రవక్త (స) ఒక్క సంవత్సరం కూడా దానిని విడిచిపెట్టేవారు కాదు. ఇది విధి లేక వాజిబ్ కాదన్న విషయాన్ని సావధానపరచటానికే ఒక సంవత్సరం ఏతెకాఫ్ పాటించలేదు. అయితే ఏతెకాఫ్ ఒక పుణ్యకార్యం, ప్రవక్త (స) సత్సంప్రదాయం కాబట్టి దానిని పాటించాలి కూడా. (దీనిని సంవత్సరాల తరబడి ఆయన (స) పాటించారు). అయితే ఫర్జ్ (విధి), వాజిబ్ (తప్పనిసరి) ఇంకా సున్నత్ (సంప్రదాయం)ల మధ్య తేడా తెలిసిరావాలనే ఉద్దేశంతో ఆయన (స) ఒక సంవత్సరం ఏతెకాఫ్ పాటించలేదు. ప్రవక్త (స) గారి ఈ ఏతెకాఫ్ ఆచరణ విషయంలో ధర్మవేత్తల మధ్య భేదాభిప్రాయం ఉంది. కొంతమంది దీనిని వాజిబ్‌గా పేర్కొంటారు – ఎందుకంటే ప్రవక్త (స) దీనిని సదా పాటించారు. ఒకవేళ ఏదైనా ఒక సంవత్సరం పాటించకపోతే, మరుసటి సంవత్సరం అదనంగా పది రోజులు ఏతెకాఫ్ పాటించి దానిని పూరించేవారు. మరి కొంతమంది ఇది 'సున్నత్-యె-ముఅక్కదా' అని అంటారు. అంటే విడవకుండా పాటించాల్సిన సత్సంప్రదాయం. ఇంకా కొంతమంది ఇది ముస్తహబ్ (అభిలషణీయం) అని అంటారు. అంటే దీనిని పాటించటం ఉత్తమం అని అభిప్రాయపడ్డారు. ఈ విషయంలో ప్రవక్త (స) గారి వేర్వేరు ఆచరణలను గమనించి ధర్మవేత్తలు తమ తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు. ఇది వారి వారి అభిప్రాయాన్ననుసరించి సరి అయినదే.

రెండవ భాగం

## ప్రవక్త (స) రమజాన్ చివరి దశకంలో సదా ఏతెకాఫ్ పాటించేవారు

١٤٣ - عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا أَرَادَ أَنْ يَعْتَكِفَ صَلَّى الْفَجْرَ ثُمَّ دَخَلَ فِي مُعْتَكَفِهِ. (رَوَاهُ أَبُو دَاوُدَ وَابْنُ مَاجَة)

**143. హజ్రత్ ఆయిషా (ర.అ) గారు ఇలా ఉల్లేఖించారు – దైవప్రవక్త (స) ఏతెకాఫ్ పాటించాలని తలచుకున్నప్పుడు ఫజ్ర్ నమాజ్ పిదప 'మోతకఫ్' (ఏతెకాఫ్ స్థలం)లోకి వెళ్లేవారు. (అబూదావూద్, ఇబ్నెమాజా)**

'మోతకఫ్' అంటే ఏతెకాఫ్ పాటించటానికి మనిషి మస్జిద్‌లో ఏర్పరచుకున్న లేక ఎంచుకున్న స్థలం. మస్జిద్‌లో ఒక పరదాను వ్రేలాడదీసుకొని తన కొరకు

ఏకాంతాన్ని ఏర్పాటు చేసుకోవాలి. దీనిప్రకారం ప్రవక్త (స) ఫజ్ర్ నమాజ్ ఆచరించి తన 'మోతకఫ్'లోకి ప్రవేశించేవారు అని హజ్రత్ ఆయిషా (ర.అ) ఉల్లేఖించారు.

ఇమామ్ ఔజాయి (రహ్మ), ఇమామ్ సౌరీ (రహ్మ) మొదలగువారు ఈ హదీసును ఆధారంగా తీసుకొని ఏతెకాఫ్ ఫజ్ర్‌తో ప్రారంభమవుతుందని పేర్కొన్నారు. మరికొన్ని హదీసుల ద్వారా ఏతెకాఫ్ మగ్‌రిబ్ నమాజ్ నుంచి ప్రారంభమవుతుందని తెలుస్తోంది. అంటే ఒక మనిషి 21వ తేదీ మగ్‌రిబ్ నమాజ్ తరువాత ఏతెకాఫ్ పాటించాలన్నమాట. నలుగురు ఇమాములు కూడా దీని వైపే మొగ్గు చూపారు. దీనికి వారు ఇతర హదీసులను ఆధారంగా పేర్కొన్నారు. అయితే ఏతెకాఫ్ ఫజ్ర్ నమాజ్‌తో ప్రారంభమవుతుందని పేర్కొనే ధర్మవేత్తలు ఈ హదీసునే ఆధారంగా చూపుతారు.

## ఏతెకాఫ్ స్థితిలో ఉన్నప్పుడు రోగిని పరామర్శించే మస్నూన్ పద్ధతి

١٤٤- عَنْ عَائِشَةَ قَالَتْ كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ يَعُوْدُ الْمَرِيْضَ وَهُوَ مُعْتَكِفٌ فَيَمُرُّ
كَمَا هُوَ فَلَا يُعَرِّجُ يَسْأَلُ عَنْهُ ـ (رواه ابوداود)

**144. హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనం ప్రకారం ఏతెకాఫ్ స్థితిలో ఉన్నప్పుడు దైవప్రవక్త (స) రోగిని పరామర్శించేవారు. నేరుగా ఆయన (స) రోగి వద్దకు వెళ్ళి, ఆయన్ని పరామర్శించి తిరిగి వచ్చేవారు. (అబూదావూద్)**

ముమ్ముందు వచ్చే మరో హదీసులో ఏతెకాఫ్ స్థితిలో ఉన్నప్పుడు రోగిని పరామర్శించడానికి వెళ్లరాదని హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ద్వారానే ఉల్లేఖించ బడింది. మరి ఇక్కడయితే హజ్రత్ ఆయిషా (ర.అ) గారి ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (స) రోగుల పరామర్శకు వెళ్లేవారని చెప్పబడింది. దీనివలన తెలిసేదేమంటే పరామర్శలో రెండు స్థితులున్నాయి. ఒకవేళ ఒక వ్యక్తి ఏదైనా సాధారణ వ్యాధికి గురిఅయి, అది ప్రాణాంతకమైనది కాదని తెలిసినప్పుడు ప్రవక్త (స) ఏతెకాఫ్‌లో ఉన్నప్పుడు అలాంటి రోగిని పరామర్శించటానికి వెళ్ళేవారు కాదు. అయితే, ఒకవేళ రోగానవున్న మనిషి స్థితి ప్రమాదకరంగా ఉందని, అతను జీవన్మరణాల్లో కొట్టుమిట్టాడుతున్నాడని తెలిసినప్పుడు ప్రవక్త (స) ఏతెకాఫ్ స్థితిలో కూడా అలాంటి

వ్యక్తిని పరామర్శించటానికి వెళ్లేవారు - అయితే ఇలాంటి సందర్భాల్లో ఆయన (స) మరో పనికోసం వేచివుండేవారు కాదు. దీనివలన రెండు హదీసులూ ఒకచోట చేర్చి చూస్తే వాటి బాహ్యా వైరుధ్యం తొలగిపోతుందని తెలిసివస్తుంది.

## ఏతెకాఫ్ స్థితిలో వారించబడిన పనులు, ఇంకా ఏతెకాఫ్‌కు రెండు షరతులు

١٤٥ - عَنْ عَائِشَةَ قَالَتِ السُّنَّةُ عَلَى الْمُعْتَكِفِ أَنْ لَّا يَعُودَ مَرِيضًا وَلَا يَشْهَدَ وَلَا يَمَسَّ الْمَرْأَةَ وَلَا يُبَاشِرَهَا وَلَا يَخْرُجَ لِحَاجَةٍ إِلَّا لِمَا لَا بُدَّ مِنْهُ وَلَا اعْتِكَافَ إِلَّا بِصَوْمٍ وَلَا اعْتِكَافَ إِلَّا فِي مَسْجِدٍ جَامِعٍ. (رَوَاهُ أَبُودَاوُدَ)

**145. హజ్రత్ ఆయిషా (ర.అ) ఇలా ఉల్లేఖించారు : ఏతెకాఫ్ పాటించేవారు, ఏతెకాఫ్ స్థితిలో ఉన్నప్పుడు, వారు రోగిని పరామర్శించరాదు, జనాజాలో పాల్గొనరాదు, స్త్రీని ముట్టుకోరాదు, ఆమెను ముద్దు పెట్టుకోరాదు, లేదా మరే అవసరం నిమిత్తమూ మస్జిద్ నుంచి బయటికి రాకూడదు - అయితే కాలకృత్యాలు తీర్చుకోవటానికి మరో మార్గంలేని స్థితిలో బయటికి రావచ్చు. ఇంకా రోజా పాటించకుండా ఎలాంటి ఏతెకాఫ్ లేదు, ఇంకా జామా మస్జిద్‌లో తప్ప మరెక్కడా ఏతెకాఫ్ లేదు. (అబూదావూద్)**

ఈ హదీసులో హజ్రత్ ఆయిషా (ర.అ) గారు ఉల్లేఖించిన ఏతెకాఫ్ షరతుల్లో మొట్టమొదటిది మోతకిఫ్ (ఏతెకాఫ్ పాటించేవ్యక్తి) రోగిని పరామర్శించరాదు. ఈ రెండు హదీసుల్ని ఒకచోట చేర్చి చూసినట్లయితే రోగి సాధారణ జబ్బులో వున్న స్థితిలో పరామర్శకు వెళ్లకున్నా ఫర్వాలేదు, అయితే రోగి జీవన్మరణ స్థితిలో ఉంటే అలాంటి స్థితిలో పరామర్శకు వెళ్లవచ్చని తెలుస్తోంది. మోతకిఫ్ కొరకు రెండవ ఆజ్ఞ ఏమంటే అతను జనాజా వెంట వెళ్లరాదు, మూడవ ఆజ్ఞ ఏమంటే అతను తన భార్యవద్దకు వెళ్లరాదు. ఇంతకు ముందు కూడా హజ్రత్ ఆయిషా (ర.అ) గారి హదీసులోనే ఆయన (స) ఏతెకాఫ్‌లో వున్నప్పుడే ఆమె (ర.అ) ప్రవక్త (స) గారి తల వెంట్రుకలను సరిచేసేవారని తెలుపబడింది. హజ్రత్ ఆయిషా (ర.అ) గారికి ప్రవక్త (స) అనుమతించకపోయినా ఆమె తన చేత్తో ప్రవక్త (స)ను తాకారు. అయితే

మరో వ్యక్తి ఆచరణలో ఇది సాధ్యం కాదు. ఎందుకంటే ప్రవక్త (స) గారి పవిత్ర సతీమణుల కుటీరాల్లా మరెవరి కుటీరాలూ మస్జిద్ ప్రాంగణానికి ఆనుకొని లేవు. కాబట్టి ఈ విషయంలో సముచితరీతిలో వున్న కార్యాచరణే శిరోధార్యం.

ఇంకా ఈ హదీసు ద్వారా తెలిసిన మరో విషయమేమంటే రోజా లేకుండా ఏతెకాఫ్ లేదు. అంటే ఒక మనిషి ఉపవాసం పాటించకుండా ఏతెకాఫ్ పాటించటానికి వీల్లేదన్నమాట.

హ(జత్ ఆయిషా (ర.అ) గారి ద్వారా తెలుపబడిన చివరి ఆజ్ఞ ఏమంటే ఏతెకాఫ్ ప్రధానమైన మస్జిద్‌లోనే పాటించాలన్నది. ధర్మవేత్తల మధ్య ఇందులో అభిప్రాయభేదముంది. కొంతమంది ధర్మవేత్తల ప్రకారం జుమా నమాజ్ చేయబడే మస్జిద్‌లో ఏతెకాఫ్ పాటించవచ్చు. దీనిపై అభ్యంతరం తెలిపే ధర్మవేత్తలు ఏమంటారంటే ప్రతి మస్జిద్‌లో ఏతెకాఫ్ పాటించవచ్చు. మొత్తంమీద సామూహికంగా నమాజ్ చేయబడే ప్రతి మస్జిద్ వీరి అభిప్రాయం ప్రకారం జామా మస్జిద్‌యే. అంటే ఎవరైనా ఒక వ్యక్తి నమాజ్ పాటించని నిర్మానుష్య ప్రాంతంలోని మస్జిద్‌లోకి వెళ్లి ఏతెకాఫ్ పాటించరాదు. అలాంటిచోట నమాజ్ చేసే వ్యక్తుల రాకపోకలే వుండవు. ఇంకా సామూహిక నమాజ్ పాటించబడదు. అతను ఏతెకాఫ్ పాటించటానికి పూనుకున్నాడు కాని, సామూహిక నమాజ్‌ను త్యజించాడు. అందువలన జామా మస్జిద్ అంటే సామూహికంగా నమాజ్ పాటించబడే మస్జిద్ అన్న అర్థం తీసుకుంటే ఎలాంటి భేదాభిప్రాయానికీ తావుండదు. ఇక నిర్మానుష్య ప్రదేశంలో ఉన్న మస్జిద్‌లో ఏతెకాఫ్ పాటించే ప్రసక్తే ఉండదు.

మూడవ భాగం

## ప్రవక్త (స) గారి ఏతెకాఫ్ పాటించే స్థల విషయం

١٤٦- عَنِ ابْنِ عُمَرَ عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ اَنَّهُ كَانَ إِذَا اعْتَكَفَ طُرِحَ لَهُ فِرَاشُهُ اَوْ يُوْضَعُ لَهُ سَرِيْرُهُ وَرَاءَ اُسْطُوَانَةِ التَّوْبَةِ

(رواه ابن ماجه)

**146.** హ(జత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖించారు - "దైవప్రవక్త (స)

**ఏతెకాఫ్ పాటించటానికి పూనుకున్నప్పుడు(మస్జిదె నబవీలో) 'పశ్చాత్తాప స్తంభం' వద్ద ఆయన (స) కొరకు మంచం వేయబడేది. (ఇబ్నెమాజా)**

పైన హదీసులో ప్రస్తావించిన 'పశ్చాత్తాప స్తంభం' ఇప్పటికీ మస్జిద్-యె-నబవీలో ఉన్నది. దీనిపై **"ఉస్‌తువానతి త్తౌబహ్"** అన్న అక్షరాలు వ్రాసివున్నవి. దాని కథ ఏమిటంటే, హజ్రత్ అబూ లుబాబ (రజి) అనే సహచరునిచే ఒక తప్పు జరిగిపోయింది. దైవప్రవక్త (స) ఆయన్ని బనీ ఖురైజా తెగవారి వద్దకు రాయబారిగా పంపినప్పుడు, ఆయన రెండు చేతుల్ని మెడ చుట్టూ తిప్పి "ఇక మిమ్మల్ని చంపేయాలని నిర్ణయించబడింద"ని సైగ చేసి చెప్పారు. ఇది ఒక సైనికుని పట్లనో లేక యుద్ధ పిపాసకులైన శత్రువులపైనో ప్రకటించాల్సిన చర్యను సూచిస్తుంది. దీనిపై తీవ్రమైన హెచ్చరిక వచ్చింది. ఆపై హజ్రత్ అబూ లుబాబ (రజి)కు తన తప్పు తెలిసినప్పుడు తనకు తాను మస్జిద్-యె-నబవీలో వున్న ఒక స్తంభానికి కట్టిపడేసుకుని 'నేను క్షమించబడేవరకు కట్లు విప్పుకోను, ఇంకా ఏమీ తినను, త్రాగను' అని ప్రతినబూనారు. ఆయన అలా కట్టిపడేసుకున్న కారణంగా స్పృహ కోల్పోయి క్రిందపడిపోయారు. దీని తరువాత అల్లాహ్ తరఫున ఆయన క్షమాపణ వెలువడిన తరువాత ఆయన కట్లు విప్పారు. ఇప్పటికీ ఈ స్తంభం మస్జిద్-యె-నబవీలో భద్రంగా ఉంచబడింది. దీని సమీపానే దైవప్రవక్త (స) ఏతెకాఫ్ పాటించేవారు.

## మోతకిఫ్ ఖాతాలో వ్రాయబడే పుణ్యాలు

١٤٧ - عَنِ ابْنِ عَبَّاسٍ أَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ فِي الْمُعْتَكِفِ، هُوَ يَعْتَكِفُ الذُّنُوْبَ وَيُجْرٰى لَهٗ مِنَ الْحَسَنَاتِ كَعَامِلِ الْحَسَنَاتِ كُلِّهَا۔ (رَوَاهُ ابْنُ مَاجَه)

**147. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజి) ఉల్లేఖనం : దైవప్రవక్త (స) మోతకిఫ్ (ఏతెకాఫ్ పాటించే వ్యక్తి) విషయంలో ఇలా సెలవిచ్చారు : ఏతెకాఫ్ పాటించేవ్యక్తి (ఆ కాలంలో) పాపాలకు దూరంగా ఉంటాడు. అందువలన అతను ఆచరించగలిగే పుణ్యాలన్నీ అతని ఖాతాలో వ్రాయటం జరుగుతుంది. (ఇబ్నెమాజా)**

ఏతెకాఫ్ పాటించే వ్యక్తి ఏతెకాఫ్ కారణంగా పాపాలకైతే దూరంగా వుంటాడు. అయితే అల్లాహ్ కరుణానుగ్రహాలు, మేలైన వ్యవహారం ఎలా వుంటుందంటే అతను

మస్జిద్ నుంచి బయటికి వచ్చి నెరవేర్చగలిగే మంచి పనుల పుణ్యాలు కూడా అతని ఖాతాలో వ్రాయటం జరుగుతుంది. కాని అతను మస్జిద్ నుంచి బయటికి వచ్చి చేసే చెడు పనుల పాపాలు వ్రాయబడవు, అయితే అతను బయటికి వచ్చి చేయగలిగే మంచి పనుల పుణ్యాలు అతని ఖాతాలో వ్రాయబడతాయన్నమాట. ఇది సృష్టిరాశుల పట్ల అల్లాహ్ ప్రసాదించే దాక్షిణ్యానికి, దాతృత్వానికి, పరిపాలనా దర్పానికి నిదర్శనం. మనిషి పాపం చేయనంత వరకు ఆ చెడును అతని ఖాతాలో వ్రాయటం జరగదు. అది కూడా ఏ మేరకు చెడు జరుగుతుందో అంత మేరకే వ్రాయబడుతుంది. ఒక విశ్వసించిన దాసుని ఖాతాలో అతను చేసిన పుణ్యం మాత్రమే వ్రాయబడదు, అతనికి అవకాశం లభిస్తే అతను చేయగలిగిన పుణ్యకార్య ప్రతిఫలం కూడా అతని ఖాతాలో వ్రాయటం జరుగుతుంది. అదేవిధంగా అతని హృదయంలో పుణ్యఫల సంపాదన కొరకు ఆలోచన వచ్చి ఏదైనా కారణంగా దాన్ని అతను నెరవేర్చలేక పోయినా అప్పుడు కూడా ఆ పుణ్యం అతని ఖాతాలో వ్రాయబడుతుంది. అయితే ఒక చెడు పని చేయాలన్న తలంపు వచ్చినా, దాన్ని నెరవేర్చేవరకు దాని చెడు ఫలాన్ని అతని ఖాతాలో వ్రాయటం జరగదు. ఈ ప్రత్యేకమైన వ్యవహారంతో అల్లాహ్ తన పుణ్యాత్ములైన దాసుల పట్ల దయజూపుతాడు. ఎందుకంటే ఆయన ఎంతో దాతృగుణం కలవాడు – ఎంతగా తాను ప్రసాదించగోర్తాడో అంతగా ప్రదానం చేస్తాడు. కొంతమంది దీనిపై తమ ఆక్షేపణ తెలుపుతారు. ఎందుకంటే పుణ్యార్జన లేకుండా ఎవరూ దానికి అర్హులు కాలేరని వారి భావన. అయితే చక్రవర్తి, విశ్వ సామ్రాజ్యాధినేతయే సంతోషంగా ప్రసాదిస్తానంటే దాన్ని కాదనటం ఎంతవరకు సబబు!?

**– : సమాప్తం :–**